# అచ్చతెలుఁగు కోశము

ద్వితీయ సంపుటము



పోతుకుచ్చి సుబ్రహ్మణ్యశాస్త్రి

శ్రీః

# అచ్చతెలుఁగుకోశము

## ద్వితీయసంపుటము



వ్యాకరణవిద్యాప్రవీణ ఉభయభాషాప్రవీణ

సాహిత్యాలఙ్కార సహస్రావధాని

**పోతుకుచ్చి సుబ్రహ్మణ్యశాస్త్రి**

తెనాలి

సర్వస్వామ్యసంకలితము
ప్రథమముద్రణము
సిద్ధార్థి 979






వెల - రూ 100-00




ప్రాప్తిస్థానము
పోతుకుచ్చి సుబ్రహ్మణ్యశాస్త్రి
శ్రీ శ్రీనివాసభవనమ్-No 22-7-7
మోటుపల్లివారివీధి
కొత్తపేట-తెనాలి- AP)

# వర్గసూచిక (ద్వితీయ సంపుటమునకు)

## ద్వితీయకాండము


| | | పుటసంఖ్య |
|---|---|---|
| 6 | సింహాదివర్గము | 327-361 |
| 7 | మనుష్యవర్గము | 362-479 |
| 8 | బ్రహ్మవర్గము | 480-500 |
| 9 | క్షత్త్రియవర్గము | 501-598 |
| 20 | వైశ్యవర్గము | 599-717 |
| 2 | శూద్రవర్గము | 7 8-774 |

# సింహాదివర్గము

క మెకములతేఁ డన దెలవా
మెక మన సింగ మన బొబ్బమెక మన జను జు
మ్మ కరిరిపు నామధేయము
లకలంకదయారసార్ద్రితాంత కరణా ౧

మెకములతేఁ డు తెలవామెకము సింగము బొబ్బమెకము — ఇవి కరిరిపువునకు (సింహమునకు మృగేంద్రమునకు) పేర్లు

తెలవామెకము — (తెలప + వాయి + మెకము) పెద దనోటిమృగము పఞ్చాస్య మనుట సింహో మృగేన్ద్ర పఞ్చాస్య అని (అమ) అమరము వ్యాఖ్యానించుచు సుధ (పచి- విస్తారె అనుధాతువునకంటె అయిన పచాద్యజన్త మిది యని పఞ్చ విస్తృత మాస్య మస్య అని వ్యుత్పత్తి పదర్శించినది తెలనోరు తెలగన్ను మొదలగు వానిలోని తెల (తెలప లోని లుప్త శేషము) ఇది- నిరవలంబంబు గ దిరుగుచు దెలనోరు తెలచుచు జనియె గిన్నరకులంబు (దశా 2 60) మొ తెలనోటి మెకము లో నగు వానికి ఉపలక్షక మిది- పంచముఖసంజ్ఞ పార్వతీంతి- గాక హరి యను శుభాహ్వ యంబు శ్రీహరి- గాక యిట్టి తెలనోటిమెకముల కేల యనుచు గనలి యుగ్రంబు లైన సింగముల గెడపె (రామా 2 56) పఞ్చాస్య మనుదానికి సుధ ముఖం పాదా శ్చ పఞ్చ అస్యా నీవ యస్య (యుద్ధే ముఖ్యత్వాత్) అను రెండవ వ్యాఖ్యానమును (ముఖము పాదములు 4 కలసి మొత్తము 5 యుద్ధ మందు ప్రధానములుగా కలది అను వ్యాఖ్యను) ప్రదర్శించినది అది ప్రతిభామాత్రప్రదర్శక మని ఈ తెలుగు నామములవలన దెలియవచ్చును పైజ కూడ సింహో మృగేన్ద్ర పఞ్చాస్యో వ్యాదీర్ఘాస్యో మహానాద శ్శార్దూల స్తుల్యవిక్రమ (భూమి పశు) అను చున్నది దీనికి (ఆం సం) నామముల ని ట్లిచ్చినది- పెద దమోముమెకంబు జడల మెకం బేసు గులగొంగ మెగముల కొలముసామి తెల్లదాలుమెకంబు తెలనోటి

మెకము సింగంబు నా బొబ్బమెకం బనంగ బరగును మృగరాజు (ఆం సం తిర్య ) కణ్ఠీరవో గజరిపు ఎఙ్గదృష్టి ర్మృగాధిప అని (అమ అధికపారము ) వేంక తెలమొకముమెకింబు నెఱసరి సింగంబు కొండల గుటికాని కూర్మిబిడ్డ మెకిరింత యన నొప్పు మృగరాజు (తిర్య ) అనినది ఇందలి- నెఱసరి ఉనునది సింహనామముగా (నానా వర్గమున) ఆం భా పేర్కొ-ను చున్నది (చూ 3 56 ) ఏను గుల గొంగ లో నగునవి యౌగికములు యోగరూఢములు కావనిపించును సూ ని శ ర లైనను ఆం సంగ్రహమునే ఉదాహరించు చున్నవి ఈనాములకు ప్రమాణములుగా ప్రయోగము లిచ్చుట లేదు

సీ బెబ్బులి యంచన వెలయు మహావ్యాఘ్ర
మల్పశార్దూలాఖ్య యలరు చుండు
జిఱుత చిఱుతపులి చిఱుపులి యంచన
వాలము వేగిఁ నా వ్యాళ మెసగు
జివ్వంగి నాఁగను జెలగు దరక్షువు
చాఱ యంచనఁగను జాటిక యన
వ్యాఘ్రవర్గం బొప్పు నగు గోఁడిరిం పన
వ్యాఘ్రగర్జాధ్వని వాలుమెకము

గీ పంది సలుఁ గేకల మ్మనఁ బరగు ఘృష్టి
దనరు గామిడికాఁ డనఁ దద్గణేశు
డలరుఁ దద్ఘోణ ముట్టె యంచనఁగఁ బుడ్డ
గిం పనఁగఁ దద్దరాఘాతి గేరు నభవ 82

బెబ్బులి—ఇది మహావ్యాఘ్రమునకు (పెద్దపులికి) పేరు

చిఱుత చిఱుతపులి చిఱుపులి— ఇవి అల్పశార్దూలమునకు (చిన్నజాతిపులికి చిత్రకమునకు) పేర్లు

వాలము వేగి—ఇవి వ్యాళమునకు (వేట కుపయోగపడుచిఱుతపులికి సివంగికి) పేర్లు

చివ్వంగి—ఇది తరక్షువునకు (దుముకుచు బోయి మృగముల జంపెడియొక చిన్నపులికి సివంగికి) పేరు

చాఱ చాఱిక—ఇవి వ్యాఘ్రవర్ణమునకు (పులిదేహచ్ఛాయకు) పేర్లు

గోండిరింపు—ఇది వ్యాఘ్రగర్జాధ్వనికి (పులి కూయుకూతకు గాండ్రింపునకు) పేరు

వాలుమెకము పంది సలుగు ఎకలము—ఇవి ఘృష్టికి (వరాహమునకు) పేర్లు

గామిడికాడు—ఇది యూథపమగుఘృష్టికి (పందికదుపునకు మొనగాడైన పందికి) పేరు

ముట్టె—ఇది ఘృష్టిఘోణకు (పందిమోరకు పందియొక్క నిడుపైన ముఖమునకు) పేరు

బుడ్డగింపు—ఇది ఘృష్టధరాఘాతికి (పంది ముట్టెతో నేల కెల్లగించుటకు) పేరు

వ్యాళము—దీనికి పులి అనునర్థమన్నను అది యిట సంగతము కాదు పులికి నామములు వచింపబడినవి అందులకే వేటచిఱుత అని అర్థము వ్రాసితిని వ్యాళమునకు ఈ అర్థము గూడ ఉన్నది (మా సూని)

గోండిరింపు — గోండిరింపు అని (వావి సా) గోండ్రింపు = గోండిరింపు వి (గోండ్రించు)-పులి మున్నగువానికూత (వా) బిలములగుహలందు బెబ్బులుల్ చిఱుతపులులు గోండ్రిలు చుండు (ద్వి నల 3 8)- అని (సూ ని) గోండిరింపు వ్రాయసకాండ్రప్రమాదమున గోందిరింపు ఐనదనిపించినది గోండ్రింపునకు (రూపాం) ఐనను ఇది కావలయును గోందురుకప్ప మొ దృష్టములు గాండ్రు అనునదిగూడ పులికూతకగునను కరణశబ్దము- పాఱమ్ముఱు త్రొమ్ముకెలంకులం గాడ గాండ్రుగాండ్రు మని రొప్పనొప్ప కుప్పరంబుగా వియత్తలంబునకు విల్లెత్తుపొడుగు

గా వెగసి (మనుచ 4 37) ఇచట బ్రౌ శ ర పా కాంద్రు కాంద్రు (అని) (చూ సూ ని)

ఏకలమ్మ —సం పదము గా దీనిని ఒకకవి ప్రయోగించినాడు- చేకొని యాకువీటివిభు శ్రీ పెదవేంకటు జెంది యాత్మలో నేకలసద్గుణంబు మహనెన్న దనేకలసద్గుణాప్తచే గై కొని శేషభోగముల కల్మి దలంప దశేషభోగలీ లాకలనంబుచేత గరులకా గిరులన్ మఱి చెప్ప నేటికిఁ (రాఘవ ఎరి 39) (చూ సూ ని)

బెబ్బులి —(పెద్ద+పులి) దీనిని ఆం భా కిర్త మహావ్యాఘ్ర మను చున్నాడు మహావ్యాఘ్ర మనుట పెద్దపులి యనుటయే అల్పవ్యాఘ్ర మను చున్నాడు చిఱుతపులి ని సం భాషయందును వైజ మొ వ్యాఘ్రో మృగారి శ్శార్దూలో వాం సారు శ్చిత్రకీ మృగాత్ హుణ్డా శ్చాల్పా స్త్వయం ద్వీపి (భూమి పశు) అని చిఱుతను ద్వీపి అనుచు పరిశేషన్యాయమున వ్యాఘ్రము ను పెద్దపులి ఒనినది చిత్రక మనియు చిఱుతకు పేరు చిత్రకస్స్యా త్తరువ్యాఘ్రభేదయో ర్భేషజాన్త రె అని (విశ్వ) పెద్దపులి- పులి- బెబ్బులి- శబ్దములను ఏకార్థముల గానే కవులు వాడు చున్నారు- లాలన గ్రొత్త బెబ్బులికళాసము వెట్టిరి యాసనంబు గా (శృం నై 6 o) పులికళాసంబు గద్దెపై బూనకమున (హర 7 ) వన్నెలు గల యోగపట్టె ధరించి కన్నెబెబ్బులితోలు గాసె ధరించి (సారంగ 6 22) మొ పులి గోల వేసినట్టి ట్టలపురయంబున గడంగుటయు దద్వక్ష స్థలమున గిరీటి రెండ మ్ముల నాట గ నేసె బొమలు ముడివడు చుండన్ (భార విరా 5 88) చలజిహ్వాగ్రవిలీఢవిస్ఫురితదంష్ట్రాభీషణం బైనబె బ్బులి గోలం గొని వ్రేస త్రోసి తొల గం బో వచ్చినఁ వచ్చు గా క (భార ఆర 6 77) పెద్దపులి వెడలి చనె నని గద్దఱితనమునను నక్కకదుపులు పొదలో నుద్దవిడి జొచ్చి ఒఱుతల యొద్దం బడినట్టు లయ్యె నోయమరెంద్రా (దశ 4 4) (చూ సూ ని) అపులికి దుర్వారోద్యము దైనహరియుం దో డగె (భార ఉద్యో 4 258) ఇ క వేదమువారిమాట లి ట్లున్నవి- బెబ్బులి - దీనికి- పెద్ద+పులి అని సీతారామాచార్యులవారివ్యుత్పత్తి బెబ్బులి శబ్దము జాతిమాత్రవాచకము గా దో పదు ఉగ్రవ్యాఘ్రవాచకము గా దో చు చున్నది పులి శబ్దము బహుభాషా సాధారణము ప్రాకృతమునందలిదేశిభాగమునందుం గలదు వగ్ఘ - సీహయా- పుల్లీ హేమ దేశినామమాల పుల్లీ వ్యాఘ్ర

స్సింహ శ్చ తట్టీక ఆఅవమందును తెను గునందును వే డిమి యర్థము గా వెప్పు అను శబ్దము కలదు ఉప్పు వెప్పునుం గలయప్పిళితఖండంబులు (మను) వెప్పులి అని ఉగ్రవ్యాఘ్రవాచకము ఒఅవముసం గలదు అందలి వా కు ఇందు బా ఉండు టయుం గలదు తె బెండకాయ అ వెండక్కా తె బండి అ వండి అల్లే-అ వెప్పులి ఇందు బెప్పులి మై బ సాహచర్యముచేతను ఆంధ్రోచితసారళ్యముచే తను బెబ్బులి మైయుండును (అని) (చూ అము 3 20 వ్యా) మహావ్యాఘ్ర మని అను చున్న ఆం భా కర్త వీరి ధోరణి నంగీకరింప డు బెబ్బులి ఉగ్రవ్యాఘ్ర మనవలసినంతయావశ్యకత యేమో శ్రీ శాస్త్రిగారు తెలుప లేదు పులి సహజము గానే యుగ్రస్వభావము గలది దానిం వెప్పు విశేషణ మావశ్యకము కాదు పులివలె నున్నా డు పెద్దపులివలె నున్నా డు బెబ్బులి అత డు-అనువ్యవహారములు సమానము లుగానే తెలుగువారిలో నడచు చున్నవి బెబ్బులి పెద్దపులి - అను నవియే నామైక దేశన్యాయమున పులి బనవి లేదా పులి ప్రాకృతభవ మనవచ్చును అందులకు పై దేశినామమాల ప్రమాణము ఈదేశినామమాల పులి వ్యాఘ్ర (శార్దూల) వాచక మనుచు న్నది శార్దూలము మహావ్యాఘ్రమే అది పెద్దపులియే బెబ్బులియే ఇట శ్రీ వేదము వారి యాశయమేమో తెలియదు ఆం భా కు (పెద్ద+పులి) అనువ్యుత్పత్తియే బెబ్బులి కడ సమ్మతము అఅవమున వెప్పులి ఉండవచ్చును తెలుగున వెప్పు ఉండవచ్చును అది కా దీ బెబ్బులి తెలుగువారి బెబ్బులి ఇది అ బెప్పులి వేఱు ఇదివేఱు- అనియే ఇట ఆం భా మతము

ముట్టె — మోర కూడ ఏతత్పర్యాయ మని ఆం భా మఱియొకచో అను చున్నది- మోర నా ముట్టె నా ముఖవిశేషములు (చూ 2 42) మోర లాక్షణికము గా ముఖవాచక మైనదియు ప్రయోగదృష్టము దక్షవాటిం జూచి దక్షప్రజాపతి బొగడె నల్మోర్ల నంభోజభవు డు (భీమ 3 30)(మొ) బ్రహ్మ తుష్టావ సంతుష్ట శ్చతుర్భి ర్వదనై రఽ అని ఇట (సం భీమ) (చూ సూ ని)

సీ హనుమ డం చనఁగను హనుమదాఖ్యయుఁ గ్రోతి
తిమ్మ డం చన వానరమ్ము దనరు

22)

గొండము చ్చనఁగను గొండంగి యనఁగ గో
లాంగూల మెసఁగును నింగిలీక
మన మర్కటవిశేష మగు నెలుఁ గం చన
భల్లూకనామ మై ప్రబలు చుండు
గారెనుపో తనఁ గారుదున్న యనంగ
వనమహిషం బొప్పు వఱడు నక్క

గీ నాఁగ జంబుక మౌఁ గొంకనక్క యన గ
క్షుద్రజంబుక మంచు నెంచుకొనఁ దగును
వృకము తోఁదే లనం జను వెలయు శల్య
మేదు నెలపంది యనఁగను వేదవేద్య 83

హనుమఁడు—ఇది హనుమంతునకు (ఆంజనేయునకు) పేరు

క్రోఁతి తిమ్మఁడు—ఇవి వానరమునకు (కోతికి) పేర్లు

కొండముచ్చు కొండంగి—ఇవి గోలాంగూలమునకు (నల్లనిముఖము గలపెద్ద కోఁతికి) పేర్లు

ఇంగిలీకము—ఇది ఒకవిధ మగుకోఁతికి పేరు

ఎలుఁగు—ఇది భల్లూకమునకు (ఎలు గుగొడ్డునకు ఎలు గుబంటికి) పేరు

కారెనుపోతు కారుదున్న—ఇవి వనమహిషమునకు (అడవిదున్నకు) పేర్లు

వఱడు నక్క—ఇవి జంబుకమునకు (వంచకమునకు) పేర్లు

కొంకనక్క—ఇది క్షుద్రజంబుకమునకు (చిన్నజాతినక్కకు) పేరు

తోఁదేలు— ఇది వృకమునకు (అడవికుక్కకు ఈహామృగమునకు) పేరు

ఏదు నెలపంది—ఇవి శల్యమునకు (ముండ్లపందికి) పేర్లు

కొండముచ్చు — కోతి బట్టి తెచ్చి కొత్తపుట్టము గట్టి కొండముచ్చు లెల్ల గొలిచి నట్లు నీతిహీనులొద్ద నిర్భాగ్యు లుందురు (వేమన 2 64) ఇూ ని దీనికి కొండ ముచ్చు (రూపాం) అని నేల యీనినటులు మున్నీరు వెల్లి విరిసన వైఖరి బుట్టయి సుళ్ల కరణి గాకులజొక గొండ్రముచ్చులబాగున (ప్రబంధ 788) ప్రయోగ మిచ్చు చున్నది పైప్రయోగము నిర్ధారకము గా లేదు అందులకే బ్రౌ శ ర దీనివి ఉదాహరింప లే దనిఎంచును ఆం భా అందులకే గ్రహింప లే దేమో దీనిని

కొంకనక్క — కొంకునక్క గూడ బ్రౌ గ్రహించి ఎఱికినక్క అను చున్నది

తోఁడేలు —(రూపాం) తోడెలు అధిపుకై పట్టిరి బెబ్బులి మహిష మెలు గు కిటి దో డెలు మొద లగువాని గొన్నిటిని వే టకరుల్ (మనుచ 4 50)

సీ పిల్లి యం చన గను జెల్లు బిడాలాఖ్య
బావురు బిల్లి నా బావు రన గ
జను మహామార్జాలసంజ్ఞ జాంగలబిడా
లము జంగు బిల్లి నా నమరు బూత
పిల్లి నా గను గమ్మపిల్లి నా గను బుగ్గ
పిల్లి యటం చన జెల్లు గంధ
మార్జాలనామంబు మనును జవ్వాదిపి
ల్లి యన సంకువు గోధిక యగు నుడుము

గీ నాఁగ మృగ మొప్పు నిఱ్ఱి యనంగ మృగియు
జెల గు చుండును లేడి నా జింక యన గ
న్యంకునామంబు దగు పెంటిజింక యన గ
బర గు దత్త్రిసమాఖ్య సప్తర్షి వంద్య 84

పిల్లి—ఇది బిడాలమునకు (మార్జాలమునకు) పేరు

బావురు బిల్లి బావురు—ఇవి మహామార్జాలమునకు (గండుపిల్లికి) పేర్లు

జంగు బిల్లి—ఇది జాంగలబిడాలమునకు (అడవిపిల్లికి) పేరు

బూతపిల్లి కమ్మపిల్లి పునుగుపిల్లి—ఇవి గంధమార్జాలమునకు (పునుఁగు నిచ్చు పిల్లికి) పేర్లు

జవ్వాదిపిల్లి—ఇది సంకువునకు (జవ్వాజి నిచ్చు నొకజాతిపిల్లికి) పేరు

ఉడుము—ఇది గోధికకు (పిల్లియాకారము గలిగి దానికంటె పెద్దదిగా ఉండెడి యొకజాతిజంతువునకు) పేరు

ఇఱ్ఱి—ఇది మృగమునకు (ఆసనాదుల కుపయోగపడుచర్మము గలహరిణజాతి విశేషమునకు మగదానికి) పేరు

లేడి—ఇది మృగికి (ఆడుజింకకు) పేరు

జింక—ఇది న్యంకువునకు (ఒకజాతియిఱ్ఱికి) పేరు

పెంటిజింక—(ఆడుజింకకు) పేరు

లేడి — మనసిజరాగంబున బెన గినయిఱ్ఱిని లేడి జూచి (భార ఆది 5 49) అం భా ఇఱ్ఱికి లేడికి చక్కనిలక్ష్య మిది

న్యఙ్కువు —న్యఙ్కుశబ్దమునకు హేమచంద్రుడు మృగము అని అర్థ మిచ్చినాడు-న్యఙ్కు ర్మృగే మునౌ (అని) మృగవిశేషమే ఇట మృగ మన బడినది గ్రామోద్ధ ఇత్యాదులువోలె

జంగుబిల్లి — జంగపిల్లి (వావి) ఎలికపూసల వీపు లెక్కించుకొని సారె నలవరించు జంగుబిల్లులతుటములు (యయా 2 49) (చి ని పా) (చూ సూ ని) (జంగు విణ అరణ్యమం దైనది అని (చూ జంగుబిల్లి) అనియు (సూ ని)

సీ కొండగొఱియ నా దగును రోహిషాభిధ
గోకర్ణనామం బగును గణంజు
కడ జు నా బృషదాఖ్య యడరు దుప్పి యనంగ
మను బోతు మను బిళ్ల మ న్ననంగ
ఋశ్యము దగు గేసరి యన ఖేచర మగు
సవరపుమెక మన జల్లిమెక మ

నఁ జమరి వెలయు గంధర్వ మౌను గడంతి
కటకర మం చన గాను దుప్పి

గీ యన గ రామంబు చను గవయమ్ము గోవ
నా గ గురుపోతు నా గ దనర్చుఁ జెవుల
పోతు కుందే లనంగను ఖ్యాతి గాంచు
శశసమాఖ్యలు బాలశశాంకమౌళి 85

కొండగొఱియ—ఇది రోహిషకు (కొండలయం దుండెడి యొకజాతిగొఱ్ఱెకు) పేరు

కణంజు కడ జు—ఇవి గోకర్ణమునకు (ఒకజాతిదుప్పికి) పేర్లు

దుప్పి—ఇది పృషత్తునకు (మచ్చలుగలమృగమునకు) పేరు

మను బోతు మనుఁబిళ్లు మన్ను—ఇవి ఋశ్యమునకు (ఒకజాతిమృగమునకు) పేర్లు

కేసరి—ఇది ఖేచరమునకు ((మృగవిశేషమునకు) పేరు

సవరపుమెకము జల్లిమెకము—ఇవి చమరికి (చామరాదుల కుపయోగించు తోక వెంట్రుకలు గలయొకజాతిమృగమునకు) పేర్లు

కడంతి కటకరము—ఇవి గంధర్వమునకు (ఒకజాతిమృగమునకు) పేర్లు

దుప్పి—ఇది రామమునకు (పెద్దదుప్పికి మృగభేదమునకు) పేరు

గోవ గురుపోతు—ఇవి గవయమునకు (ఎద్దువోలె ఉండెడియొకమృగవిశేషమునకు) పేర్లు

చెవులపోతు కుందేలు—ఇవి శశమునకు పేర్లు

కొండగొఱియ —గాడిదవంటిమృగవిశేషము రౌహిషము - అని (శ ర ) కొండగొఱ్ఱె (రూపాం ) కొండగొఱ్ఱెల మన్నిగొనియె గొన్ని (పి శకుం 2 5 ) (బ

కొండగొఱ్ఱెలు) కొండగొర్లు అనియు ఒకకవి ప్రయోగించినాడు- చెండాడెం గొండగొర్లన్ అని (యయా 2 32) (చూ సూ ని)

రోహిషము — కృష్ణసార రురు న్యఙ్కు రఙ్కు శమ్బర రౌహిషా మృగా అని (అమ) రోహిషా అని (పారాం)

మనుబిళ్ల —(ఏ మను బిడి) [వృత్తిని ద్విత్వలోపము మన్నునకు] సూ ని ఈ అం భా ఇచ్చి ఇట్లను చున్నది- మను బిళ్ల అనునది నిత్యబహువచనాంత మని అం భా మతము ప్రపురుషవాచకము లగు మను బిళ్ల మను బోతు అను వానిని ఋశ్యత్వసామాన్య మనుగతము గా నుండుటంబట్టియు పిడి పోతు శబ్దము లు స్త్రీపుంవాచకము లగుట ప్రసిద్ధం బగుటంబట్టియు అం భా కారు దట్టిభేదమును బాటింపక పర్యాయములు గ జెప్పె నని తోచు చున్నది (అని) ఋశ్యము నకు బే శ్లిచ్చుటయే అం భా కర్త ఇట చేయు చున్నాడు ప్రపుంస్త్వవివక్ష యిట పాటింప నక్కఱ లేదు మను బిడి (స్త్రీ యైనమాత్రాన) ఋశ్యము కాక పోదు ఇదియే ఇచ్చటి సమాధానము పై సూ ని అన్నదియు నిదియే ఇక (సూ ని) మను బిళ్ల అని బహువచననిర్దేశమునుబట్టి నిత్యబహువచనాంత మిది యని అం భా అను చున్న దనుట సరి గాదు నిత్యబహువచనాన్త మన దల చినస్థలములందు అం భా బహుత దనరు అనురీతిని గంరోక్తము గానే బహువచనాంత మనును ప్రాయికము గా బహువచనాన్త మిది యగుట ఈ బహువచననిర్దేశము సూచించు నని యనెద మనిన ఇట ననవచ్చును (చూ పులకలు మొ) అం భా శైలిపరామర్శము బాగుగా జరపికొనక పోవుటవలన సూ ని పైవిధమున వ్రాసిన దని తోచు చున్నది

గవయమ్ము —వనవృషభము వనగౌర్గవయ ప్రోక్తో బలభద్రో మహాగవ (రా ని) (చూ సూ ని)

గురుపోతు —[ గొఱపోతు - (వావి పా) బ్రౌ కొఱపోతు అనినది] ప్రయోగము లి ట్లున్నవి- గురుల దాఱ్కొని వక్రవాగురుల దార్చి (భల్లా 3 ఆ) (చూ శ ర) గురుపులు వాతెడి గురుమెకంబులును (నవ 47పొ 6పం) (చూ సూ ని)

సీ ఇప్పుడు చెప్పినయివియును సింగంబు
మొదలు గా నావులు మొదలు గాను

పసు లనఁ దగు వేఱె పలికెద నెలుక నా
మూషకసామాన్యము గ జెలంగు
గల్లెల్క యన గను వెల్లెలుక యనంగ
జిట్టెల్క యనఁగను జెల గు నిట్లు
కొన్ని తద్భేదము లొ్క క్కన గరిమిడి
కొ క్కనంగను బందికొ క్కనంగ

గీ మూషికాభిధ లగు గంధమూషికాఖ్య
చుం చనంగను జుం డన నెంచ దగును
గేరు నకులము ముంగి ముంగిస యనంగ
వెంట్రు వన గను బభ్రువు వెలయు నభవ 86

పసులు—ఇది ఇప్పుడు చెప్పిన కొండగొఱియ-మొద లగువానికి సింగము మొద లిడి యింతవఱకు చెప్పినవానికి ముందు చెప్ప నున్న అవు మొదలు గాఁ గలచతుష్పాత్తులకు (పశువులకు) పేరు [ఇ క వేఱె చెప్పెదను]
ఎలుక—ఇది మూషకసామాన్యముకు (ఎలుక లన్నిటికిని)పేరు
కల్లెల్క వెల్లెలుక చిట్టెల్క—ఇవి (ప్రత్యేకము) ఒకొ్కక్క జాతికిఁ జెందిన యెలుకలకు పేర్లు
కొక్కు గరిమిడికొక్కు పందికొక్కు—ఇవి మూషికమునకు (పందిపలె ఉండు నొకజాతియెలుకకు) పేర్లు
చుంచు చుండు—ఇవి గంధమూషికకు (కంపెలుకకు చుంచెలుకకు)పేర్లు
ముంగి ముంగిస—ఇవి నకులమునకు పేర్లు
వెంట్రువ—ఇది బభ్రువునకు (ఒకజాతిముంగిసకు)పేరు

పసులు — ఇత్యాదయో మృగేన్ద్రాద్యా గవాద్యా పశుజాతయ అని (అమ) ఇచ్చట సుధ - ఇత్యాదయ యే ఉక్తోక్తా యే చ పూర్వోక్తా సింహాదయ వక్ష్యమాణా శ్చ గోమేషహస్త్యశ్వాదయ సర్వే తే పశుజాతయ - పశుశబ్దవాచ్యా అనినది

కల్లెల్క —— పొలములలో గలుగులయం దుండెడియెలుక - అని శ ర

వెల్లెలుక —తెల్లయెలుక వెల్లయెలుక - (రూపాం ) ఉడుము గరిమిడికొక్కు దండడియు వెల్ల యెలుక కల్లెల్కతలచును నేమి చెప్ప (మను 4 20 )

చిట్టెలుక —(చిట్టి-ఎలుక) (చిఱు + ఎలుక)-అని (బాలవ్యా ) ఒకజాతిచిన్నయెలుక గిరిక గిరికా బాలమూషకా అని (అమ )

బభ్రువు —— ఇది నకులసామాన్యవాచక మని ఉషర విశ్వ నిఘంట్వాదు లను చున్నవి- విపులే నకులే విష్ణౌ బభ్రు స్స్యా త్పింగళే త్రిషు (అమ ) (ఇట్లే విశ్వాదులును )

మూషకము మూషికము —ఈరెండును సాధువులే మూష (స్తేయే) ణ్వుల్ భద్రమూషక ఆసన్దీ కున్దు రున్దు రురున్దుర మూషకో వజ్రదశన క్రమ కాణ్డో బిలేశయ (వాచ ) ముష (స్తేయే) ముష్ణాతే ర్దీర్ఘ శ్చ (చూ సుధ )

సీ ఉలుత నా నుడు తన దరుమూషికం బగు
దో చు నూసరవెల్లి తొండ యనగ
సరటంబు నల్లికం చన నలికిరి యన
మిండ యం చన గను మీాలు రక్త
పుచ్చి బల్లి యన నొప్పును గృహగోధిక
జాలకా డు చెల ది సన్నపిల్లి
పాదొ ట్టనగ లూత పర గు దద్రోభేదంబు
దో చు నీ గపులి విందుపురు వనఁగ

గీ బు ర్వనంగను బురు వన బురు గనంగ
గ్రిమి దనర్చును దగు వత్సకీటసంజ్ఞ
చీడపురు వన నత్త నా జెల గు క్షుద్ర
శంఖకీటంబు శ్రీబాలచంద్రచూడ 87

ఉలుత ఉడుత—ఇవి తరుమూషికమునకు (వీపున చాఱలు గలిగినయొకజాతి చెట్లయెలుకకు చిత్రోడమునకు) పేర్లు

ఊసరవెల్లి తొండ—ఇవి సరటమునకు (ఒకజాతిపామునకు కృకలాసమునకు) పేర్లు

నల్లిక నలికిరి మిండ—ఇవి రక్తపుచ్చికి (నలికండ్ల పామునకు బ్రహ్మణికి) పేర్లు

బల్లి—ఇది గృహగోధికకు (ఇండ్లగోడలపై బ్రాకెడియొకజాతిపామునకు) పేరు

జాలకాడు చెలది సన్నపిల్లి పాదొట్టు— ఇవి లూతకు (సాలెపురుగునకు తంతువాయమునకు) పేర్లు

ఈగపులి విందుపురువు—ఇవి లూతవిశేషమునకు (ఒకజాతిసాలెపురుగునకు) పేర్లు

పుర్వు పురువు పురుగు—ఇవి క్రిమికి పేర్లు

చీడపురుగు— ఇది వత్సకీటకమునకు (సస్యాదులకు వ్యాధి కలిగించెడియొక పురుగునకు) పేరు

నత్త—ఇది క్షుద్రశంఖకీటకమునకు (గుల్లలయందుండుపురుగునకు) పేరు

ఊసరవెల్లి —(క ఊసరవల్లి) ఊసువల్లి (యాపాం) -(సా తొండ ముదిరి ఊసర వెల్లి యైనట్లు) మూడురంగులుగల ఒకతొండజాతిభేదముగూడదీని కర్థము(బింబము) వేగ నేతెంచి యూసరవెల్లి తొండ పాదమూలమునుండి తలదాక బ్రాకెనేవి యత డుషణ్మాసముల జూచు యమునిమొగము (కాశీ ౬ ౭౬) ద్రుత మారుహ్య సరట స్త్రివర్ణో యస్య మస్తకమ్ ప్రయాతి యాతి తస్యాయు షణ్మాసే పరిసంక్షయమ్

(సం కాశీ) (చూ సూ ని ఊసరవెల్లి)

బల్లి —ఇది శుభాశుభముల దెలుపును బల్లిపలుకు అని ప్రసిద్ధి ఎల్లెడ శుభములే యెసగు నీ కనుచు బల్లి దీప్తంబుగా బలికె బో చెవికి -(రం రా అర 96పొ 7పం) (చూ సూ ని)

సీ. కాళ్లజెట్టి యనంగ గర్ణజలూకాఖ్య
వెలయు దేలనగను వృశ్చికంబు
ఎనుపతే లనఁ గృష్ణవృశ్చికం బగు మండ్ర
గబ్బ నా బృధువృశ్చికాఖ్య యొప్పు
దత్పుచ్ఛనామమై తనరుఁ గొండి యనంగ
జెలగు పిపీలిక చీమ యనగఁ
జెద లటం చన్నను శిథిలి యౌ నల్లి నా
గాను మత్కుణ మొప్పు బే ననంగ

గీ. నలరు యూకాఖ్య యీరు నా వెలయు లిక్ష
యీపి యన గను లిక్షాండ మెస గు చుండు
బిడుఁ జనంగను బిఱుఁజు నాఁ బిడు దు నా గ
వఱలు గోమారి కైలాసపురవిహారి 88

కాళ్లజెట్టి—ఇది కర్ణజలూకకు (జెట్టివలె ఉండి చాల కాళ్లు గలయొకజంతువునకు శతపదికి) పేరు

తేలు—ఇది వృశ్చికమునకు పేరు

ఎనుపతేలు—ఇది కృష్ణవృశ్చికమునకు (నల్లతేలునకు) పేరు

మండ్రగబ్బ—ఇది పృథువృశ్చికమునకు(నల్లని పెద్దతేలునకు షడ్బిందువునకు) పేరు

కొండి—ఇది తేలుతోకకు పేరు

చీమ—ఇది పిపీలికకు పేరు

చెదలు—ఇది శిథిలికి (పుట్ట పెట్టు చీమకు) పేరు

నల్లి—ఇది మత్కుణమునకు (మంచమునందు పఱుపులందు ఉండి నెత్తురు త్రాగెడి స్వేదజ మగు నొకక్రిమికి) పేరు

పేను—ఇది యూకకు (తలయందు చెమటనుండి పుట్టెడియొకజాతిక్రిమికి) పేరు

ఈరు—ఇది లిక్షకు (అంటుపేనునకు తలను అంటి యుండుచిన్నపేనునకు) పేరు

ఈపి—ఇది లిక్షాండమునకు (ఆపేను పెట్టుగ్రుడ్డునకు) పేరు

పిడుఁజు పిణుజు పిడుదు— ఇవి గోమారికి (పసులకు పట్టి వానిమేని నెత్తురు పీల్చెడి- ఒక జాతిజంతువునకు చెక్కపిణుఁజునకు) పేర్లు

పిపీలిక —స్త్రీత్వ మవి వక్షితము శనై ర్యాతి పిపీలిక అని యీశబ్దము పుంలింగమున గూడ గల దని స్వామి-(చూ సుధ)

శిథిలి — చేకొణుజు పచ్చవర్ణము గల చెదలు -అని (శ ర)

మత్కుణము —స్వేదజములు గొన్నియిట్లు చెప్ప బడినవి- మక్షికా మత్కుణ మశకముల్ చీమలు మిడుతలు స్వేదజములు (శివధ 5 7) (చూ సూ వి)

ఈరు — పేనుగ్రుడ్డు లీక్ష అని (సూ ని శ ర)

ఈపి — పుంటిమీ ద ఈ గ పెట్టిన గ్రుడ్డు అని మాత్రము (సూ ని) ఈరు ఈపి- సమానార్థకము అని శ ర ఎలయుఁతొక్కరములతోడ నీళ్ల గ్రుక్కి యంటు సంటులు పరికించి యంట్ల బొడిచె గోరుముక్కుల దిగ దువ్వి తూరు పెత్తి నెఱుల గలిగినపేల నన్నింటి దిగిచె (పాండు 3 30) మీర లార కుండ రీరు దువ్వ గ బేను వచ్చు ననుట వినరె వనితలార (ప్ర భా 5 78) ఇ ట్లున్నను ఆం భా స్పష్ట ము గా ఈరు -ఈపి అనువానికి భేదము వచించు చున్నందున ఈరు రెండర్థములను గలయది యనుటకు సందియము లేదు

లిక్ష —దీనికి(గురు) పేను అనునర్థమును ఇచ్చు చున్నది ఇది అంటుపే నన వచ్చును

గోమారి —సం నిఘంటువులలో లేదు (మి వి) అని (శ ర) జంతుమారి వంటి దని (సూ ని) ఆం భా సం శబ్దమే యిది అను చున్నది - మారయతీతి మారీ గవాం మారీ-గోమారీ - అని ఇది సాధువు (ఇట్టిదే జంతుమారి)

సీ పారావతం బగుఁ బావురాయి యనంగఁ
బారువ మన గను బావుర మన

దద్భేదములు గాను దనరు చుండును నేల
 పల్లటి యంతరపల్లటి సుర
టి లకోరి జట్టి యొడ్డీ కూకి బకదారి
 దూరబారు లనంగ శారికాఖ్య
గోరింక గోర్వంక గొరవంక గోరంక
 గోరువంక యనంగ మీఱు చుండ

గీ జనును శుకసంజ్ఞ బట్టికాఁ డనఁగ రామ
 తమ్మ యన జిలుక యనఁగ దగును గోకి
 లాభిధానము కోయిల యనఁగ బరగు
 భూరిభవభంగ శ్రీమాతృభూతలింగ 89

పావురాయి పారువము పావురము—ఇవి పారావతమునకు (ఒకజాతిపక్షికి కపోతమునకు) పేర్లు

నేలపల్లటి అంతరపల్లటి సురటి లకోరి జట్టి ఒడ్డీ కూకి బకదారి దూరబారి—ఇవి పారావతవిశేషములకు (ఒకవిధ మగు పావురములకు) పేర్లు

గోరింక గోర్వంక గొఁరవంక గోరంక గోరువంక—ఇవి శారికకు (చిలుక యొక్క సతికి గోరకు) పేర్లు

బట్టికాఁడు రామతమ్మ చిలుక—ఇవి శుకమునకు (రామచిలుకకు కీరమునకు) పేర్లు

కోయిల—ఇది కోకిలకు (పరభృతమునకు ఎకమునకు) పేరు

తద్భేదములు —పారావతభేదములు కపోతవిశేషవాచకము లని ఆం భా అను చున్న
 వీనిని జాలవఱకు సామాన్యవాచకములగానే ఆం సం వేంక ఉదాహరించు చున్నవి-
 పగఁగు నొడ్డీలు కూకీలు పల్లటీలు పావురాలును బకదార్లు పావురములు నాఁగ

గలరవపక్షిబృందముల పేళ్లు (ఆం సం తిర్య 3) కలరవ ములకు బే
ర్లిగు లకోరులు పల్లటీల్పక దారులు సుర టీలు పారువములు రేలపల్లటులు కూకీలు
నొడ్డీలు చే పల్లటీ లంతరపల్లటీలు పావురాలును (వేంక తిర్య 00)
జట్టి — బట్టి -అని (వావి పా) జట్టి పారావతవిశేషము-అని (శ ర)
దూరబారులు — ఈశబ్దమును (సూ ని) (శ ర లు) గ్రహింప లేదు (సూ ని) ఆం ఖా
పారమున దూరబారి చూపినది (జట్టి తప్ప) ఇది మొదలు గా గలనాలుగు పారావత
ము ల కైన నామములు గా గూడ కానవచ్చు చున్నవి మే లైనలకోరీ లొడ్డీలుకా
బిక్కదార్లును గూకీలు ననెడుపేరులం దగిన పార్వములకా (పార 7)
గోరవంక — గోరువంక -అని (వావి పా) గోరువంక కు (రూపాం) గొరువంక
గొరువంకయాసమాటల మరువంక దలంకు గలిగి మగుపకు దమలో వెర వింక
నేమి గల దని యిరువంకల వగల బొగిలి రెంతయు వంతన్ (విక్ర 7 6)
గొరువెంక అని వెరు వింక అని ఇట శ ర పా - అని (సూ ని) (చూ గొరవంక)
వెరవు నకు వెరువు (రూపాం) వెరవు నకు నిర్ధారకప్రయోగము లే దని (శ ర)

సీ సాళ్వము జాలె వేసడము డేగ లగుడు
బైరి కణసరంబు నోరణంబు
జలకట్టె గిద్దు చెంచడ మన శ్యేనభే
దము లిది గాకయు దఱకు బెఱకు
కంచుమిం చన గను గల వందు రన్నిట
స్త్రీజాతి డేగ నా జెల గు చుండు
నది శ్యేనసామాన్య మని కొంద ఱందురు
తోనిగా దన గఁ బుంశ్యేన మొప్పు

గీ నత్తె మన్నను దన్నశాహతికి గేల
దొడిగి యుండినచర్మంబు దో చి యుండు
వానికనుమర్వు దనరు దోపార మన గ
దోరె మన గను దగు వానిదార మభవ 90

సాళ్వము జాలె వేసడము డేగ లగుడు బైరి కణసరము ఓరణము జల కట్టె గిద్దు చెంచడము—ఇవి శ్యేనవిశేషములకు(ఒకజాతిశ్యేనములకు) పేర్లు

తఱకు బెఱకు కంచుమించు—ఇవియును శ్యేనభేదములకు(కొందఱి మతమున) పేర్లు

డేగ—ఇది వీనియన్నిటిలోని ఆడుడేగకు మాత్రము పేరు(అని కొందఱు)

డేగ—ఇది అన్ని శ్యేనములకు(స్త్రీపురుషభేదము లేక అన్నిటికిని) పేరు(అని కొందఱు)

తోనిగాడు—ఇది పుంశ్యేనమునకు(మగడేగకు) పేరు

అత్తెము—ఇది డేగకాలిగోళ్లు గ్రుచ్చుకొనకుండ చేతికి కట్టుకొనెడి చర్మమునకు పేరు

తోపారము—ఇది కనుమఱుపుగా డేగల ముఖమునకు కట్టెడు తోలుగంతకు పేరు

దోరెము—ఇది దోరెపు ద్రాటికి శ్యేనమునకు గట్టెడు దారమునకు పేరు

సాళ్వము—(రూపాం) సాళువము (చూ హరిశ్చ 2 220 మొ)

కణసరము—కడసరము అని (చి ని శ ర లు) (చూ సూ ని)

జలకట్టె—సెలకట్టె కద శ ర ఇట్లను చున్నది కొందఱు ఆధునికకవులు జలకట్టె అని ప్రయోగించినారు ఆ పక్షమున నది యవ్యుత్పన్నపద మగుటమాత్రము గాక యీయుదాహరణమునందలి (మనుచ 4 ప్రయోగమునందలి) వేఱొక యనువిశేషణమునకు ప్రయోజనము లేక పోవుచున్నది (అని) ఆయుదాహరణ మిది- మొలదట్టి చెఱగు జెక్కుచు బలుదిట్ట కిరాతు డొకడు పటు వగు ముష్టిన్ సెలకట్టె బట్టి వేఱొక సెలకట్టెం గొట్టివైచె జెమరుంగాకిన్ (స్వారో 4)(చూ శ ర సెలకట్టె) (యయా) నిర్ధారకము గా జలకట్టె నిట్లు ప్రయోగించు చున్నది- బలు వైనవేసడం బులు జలకట్టెలు నోరణములు సాళ్వంబులు గిద్దులు మొదలుగ గలవిడిపే టలపులు గులు పదనులో మిటారింపంగన్ (2) దీనిని బట్టి జలకట్టె అవశ్యగ్రాహ్యము పై మనుచ ప్రయోగమున కిరాతు డొకడు పటు వగుముష్టిన్ జల

కట్టె బట్టి వేటొక సెలకట్టెం గొట్టి పైచె అనునదియే (బ్రౌ పా) ఈ పాఠమున వేటొక వ్యర్థ మను చున్నది శ ర (చంద్ర)-ప్రయోగ మొకటి యి ట్లున్నది చేత దేగ బట్టి సెలకట్టె గైకొని ప్రొద్దు వోక పొలము వోయెనేని దినము వలసినన్ని తే వచ్చు బులు గుల (చంద్ర 2 2) పక్షుల బట్టుటకు సాధనములు రెండు (వే ట) దేగ ( ) సెలకట్టె (బాణము) (2) ఇందు మొదటిదానితో గాక రెండవ దానితో చెమరు గాకిని బడవేసెనా దని వచించుటయే వేటొక అనువిశేషణమున కైన ప్రయోజన మనిపించును ఆం భా జలకట్టె అనుటకు నిర్ధారకము గా ఉన్నది యయా ఆం భా కు లక్ష్యమే దానిని గా దనదు ఆం భా సెలకట్టె కు (ఈ యర్థమున) నిర్ధారకప్రయోగము కాన రాదు సెలకట్టె కిచ్చినప్రయోగము లన్నియు జలకట్టె అనిన సరిపడునవియే ఇ క (సూ ని) దీనికి (సెలకట్టియ కు) ఈ యర్థ ము చెప్పె సెలకట్టియలు పెక్కు చిక్కులవలలు అనుప్రయోగ మొకటి దీనికి నిర్ధా రక మనున ట్లిచ్చు చున్నది ఈ సెలకట్టియ కు పరిశీలించి చూచిన (వే ట) దేగ అర్థ మనవలసినయావశ్యకత కాన్పింపదు ఇందుచేకే సెలకట్టె ఈయర్థమున (ఆం భా) గ్రహింప లే దనిపించును

శ్యేనభేదములు — ఇవి వే టదేగ లని హరిశ్చంద్ర ఇట్లు వచించు చున్నది- సాళువము గిద్దు లగుడు వేసడము కురుజు బా జు జలకట్టె జాలియ పైల యిఱుజు నోరణంబును నాది గా బేరువడిన వే టదేగల గిఱికొన విడిచి కడిమి (హరిశ్చ 2 220) (చూ సూ ని ఓరణము) ఇట శ ర పా ఇ ట్లున్నది-సాళువము కడుజు బా జు సెలకట్టె బైరి (అని)

కంచుమించు —ఇట బ్రౌ కంచ అని గ్రహించి శ్యేనభేద మర్థ మను చున్నది (చూ అను) దీనిని బట్టి బ్రౌ కంచు మించు-వేఱుపదములు గా ఇట విభజించికొనిన దని పించును అగోచరము -అనునర్థమున కంచుమించు పద మొకటి తెలు గున సుప్ర సిద్ధము గా గానవచ్చు చున్నది మృగంబులు గంచుమించు లై పఱవ (రామా 6 ఆ) మొ (పక్షులను) అగోచరములుగా జేయునది అనువ్యుత్పత్తి తో) దీనినుండి యేర్పడిన దిది యనవచ్చును అందులకే కంచుమించు అని ఏకపదము గానే దీనిని నేను గ్రహించితిని సూ ని కూడ ఇట్లే గ్రహించినది

సీ. గూబ కోట డనంగ ఘూకంబు విలసిల్లుఁ
బరఁగు నేట్రింత నాఁ బసులపోలి
గా డనినను వ్యాఘ్రఘాటాఖ్య యగుచు గా
టుగపిట్ట రువ్వపులు గన దనరు
ఖంజరీటాబిధ కంకణం బన గను
రాపులు గనఁగను బ్రబలు లోహ
పృష్ఠాఖ్య ధూమ్యాట మెస గును గూ కటి
మువ్వ నా గూ కటిమూ గ యన గ

గీ. బాల యం చన గ గికీదివంబు పం గు
వెలయుఁ గనకాక్షి సకినాలపులు గు గుబిలి
పై డికంటి నా జాతకం బలరు వాన
కోయిల యనంగ గైలాసకుధరనిలయ 9

గూబ కోట డు—ఇవి ఘూకమునకు (గ్రుడ్లగూబకు కౌశికమునకు) పేర్లు

ఏట్రింత పసులపోలిగా డు—ఇవి వ్యాఘ్రఘాటమునకు(భరద్వాజపక్షికి) పేర్లు

కాటుగపిట్ట రువ్వపులు గు—ఇవి ఖంజరీటమునకు (ఖంజనమునకు కాటుక పిట్టకు) పేర్లు

కంకణము రాపులు గు—ఇవి లోహపృష్ఠమునకు (రాబందునకు కంకపక్షికి) పేర్లు

కూ కటిమువ్వ కూ కటిమూ గ—ఇవి ధూమ్యాటమునకు (ధూమ్రాటపక్షికి కలింగమునకు) పేర్లు

పాల—ఇది కికీదివమునకు (చాషమునకు పాలపిట్టకు) పేరు

సకినాలపులు గు గుబిలి పై డికంటి—ఇవి కనకాక్షికి (శకునపక్షికి) పేర్లు

వానకోయిల—ఇది చాతకమునకు (సారంగమునకు) పేరు

ఏట్రింత — ఏటిరింత -(రూపాం) ఏటిరింతయు దా పె నెడమదెసకు (ద్వా 23) అని (సూ ని)

వ్యాఘ్రఘాటము — వ్యాఘ్రాట మనియే అమరాదులు దీని నను చున్నవి- వ్యాఘ్రాట స్తు భరద్వాజ (అమ) మొ వ్యాఘ్ర ఇవ అటతి వ్యాఘ్రాట ఐనట్లై వ్యాఘ్ర ఇవ ఘటతే (చేష్టతే) అనురీతిని కర్మోపపదాణ్ణన్తము గా ఇది కర్మణ్యణ్ (3-2) అనుసూత్రమున సాధితము కావచ్చును వ్యాఘ్రాట అనుదానికే ఇది పర్యాయపదము

ఖంజరీటము —ఖంజరీటములు (కాటుకపిట్టలు) సంభోగమునకు వ్రాలినచోట నిధి యుండు నని ప్రసిద్ధి ఒకకవి యిట్లు వర్ణించినాడు- ఖఞ్జరీటమిథున నిధువనసంచారోపజ్ఞాత నిధి గ్రహణకౌతుకితమతి కిరాత ఖన్యమానస్థపుటితాభ్యాశజలాశయా (కాదం) వసు ఇట్లు దీనిని వర్ణించినది- కంజనయనావిలోకన ఖంజనయుగ మెదకు వ్రాల గని వసు వాలో రంజిలుట దెలిసి శంబర భంజను డతినిశితవిశిఖపంక్తి నగల్చెన్ (3 08)

లోహపృష్ఠము — లోహపృష్ఠ స్తు కఙ్కః స్యాత్ అని (అమ) దీనిఱెక్కలు బాణమునకు కట్టుదురు కనుకనే కంకపత్త్రములు బాణములు

కికిదివము — కికిదివము కికిదివి కికిదీవి కికీదివి (రూపాం) (చూ సూ ని)

నకినాలపులుగు —దీనిపలుకులవలన భావిశుభములు తెలియవచ్చును - కౌశికంబు దబ్బ గబ్బులు గు గౌశి కను బెంటి పైడికంటి లో నగుతిర్యక్కులు భావిప్రయోజనసూచకంబు లైయున్నయవి (ఆము-6 66) పైడికంట ఎలుకులరీతులు ప్రశ్నభాగంబులు (హంస 4 47) (చూ సూ ని పైడికంటి)

వానకోయిల —భూమియందు పడునుదకమును త్రావక వాననీరే యిది క్రోలును తొలుమొగుల్నిడుచిన్కు- లెలమి గ్రోల్వానకోయిల బలుమంచుసోనలకు జనునె (నీలా 2 "6)

కాటుగపిట్ట — కాటుకపిట్ట భరద్వాజపక్షి అని వేంకటేశాంధ్ర మనుచున్నది- అగు భరద్వాజవిహంగాఖ్య లేట్రింత కాటుకపిట్ట కూ కటియు బసుల పోలిగా డన (తిర్య 23)

0) ఇచ్చట-అం భా పా కాటు-ఎట్ట అని ఇచ్చినది (సూ ని) యతిభ్రంశమును గమనింప లేదు

ధూమ్యాటము — ధూమ్రాట వావి పా (పారాం) కలిఙ్గ భృఙ్గ ధూమ్యాటా అని (అమ) భృఙ్గ కలిఙ్గో ధూమ్రాట అని (వైజ అన్త ఖగా)

సీ కోడి యనంగను గుక్కుటస్త్రీపుంస
సామాన్యసంజ్ఞ యై చనును గుక్కు
టంబు పుం జన గ నడరు నది పెంటిపో
లిక నున్నఁ బెట్టమారి యన బర గుఁ
గుక్కుటినామ మగును బెట్ట యన గను
నారె బొౕౕెౕ యన దదంఘ్రిజన్య
కంటకాతినిశితాంగం బొప్పు గారుకో
డనఁ జను వనకుక్కుటాహ్వయంబు

గీ సలిలకుక్కుటనామంబు వెలయు నీరు
కోడి యన బుల్లగౌర కన గుండ గి యన
గర్కరేటువు దనరును గక్కెర యన
బిచ్చుక యనంగ జటకంబు వెలయు శర్వ 92

కోడి—ఇది కుక్కుటికిని కుక్కుటమునకును (స్త్రీపురుషసాధారణ మైన) పేరు

పుంజు—ఇది కుక్కుటమునకు (మగకోడికి) పేరు

పెట్టమారి—ఇది ఆడుకోడివలె ఉండెడి పుంజునకు పేరు

పెట్ట—ఇది కుక్కుటికి (ఆడుకోడికి) పేరు

ఆరె బొౕౕెౕ—ఇవి కోడికాలివ్రేళ్లకు వెనుక తట్టు సూదివలె మిక్కిలివాఁడి యై ఉండెడి- ఒంటిగోరికి పేర్లు

కారుకోడి—ఇది వనకుక్కుటమునకు (అడవికోడికి) పేరు

నీరుకోడి పుల్లగొరక గుండ గి—ఇవి సలిలకుక్కుటమునకు (పరిప్లవమునకు) పేర్లు

కక్కెర—ఇది కర్కరేటువునకు (కరేటువునకు పెద్దకొక్కెరకు) పేరు

పిచ్చుక—ఇది చటకమునకు పేరు

ఆరె బొౘె —ఏకపదము గా దీనిని గ్రహించి ఈ ఆం భా ఇచ్చినది (శ ర) ప్రయోగములు వేఱుపదములివి అను చున్నవి చరణములు నేత్రములు గడు నరుణములారె లును ముక్కు నాయతములు (దశకు 9-30) మొ కాల మనుమావటీ డు బింబంబు తోడ సరకుసేయక భీకరతరతమిస్ర వారణము గూల్ప జూచుకటారికోల వెండి బొౘ్టెయుబలె దో చె వేగు జుక్క (పరమ ౧ 277) (చూ సూ ని) బొౘె రూపాం

ఎచ్చుకి —పిచ్చిక-(రూపాం) చలనంబు లేక జాజలి తపోనిష్ఠ నా ఎను దై యుండ బిచ్చికలు గూడు గాపించె దన్మస్తకంబున (భారం శాం 6 224) ఆం భా లోకప్రసిద్ధము లగు సువిదితశబ్దములు ప్రయోగజుష్టము లైనను వదలి విశేషశబ్దము లందే శ్రద్ధ వహించు ననుటకు చక్కనియుదాహరణ మిది

సీ ప్రమానిపోటుపులు గు నా నొప్పు చుండు దా
ర్వాఘాటనామంబు వాయసంబు
కాకి నా దగు మాలకాకి నా గను ద్రోణ
కాకంబు విలసిల్లు గాకభేద
మగును జెమరు గాకి యన నీరుకాకి నా
జలకాకనామ మై చెల గు చుండు
దాత్యూహసంజ్ఞ యై తనరు గూకురుగుండె
నా గ గృధ్రము గ్రద్ద నాఁ దనరుచు

గీ గొంచ కొంగ యనంగను గ్రౌంచ మెస గు
బకము విలసిల్లు నారణపక్కి వక్కు

వ గ్గటం చన నాడెలు బా తనంగ
నగు శరారి పదాంబుజనతకిరీటి 93

క్రౌనిపోటుపులుగు—ఇది దార్వాఘాటమునకు (వడ్రంగిపిట్టకు) పేరు

కాకి—ఇది వాయసమునకు (కాకమునకు చిరజీవికి) పేరు

మాలకాకి— ఇది ద్రోణకాకమునకు (బొంతకాకికి కాకోలమునకు) పేరు

చెమరు గాకి— ఇది కాకభేదమునకు (ఒకజాతికాకికి చెమరు బోతునకు) పేరు

నీరుకాకి—ఇది జలకాకమునకు పేరు

కూకురుగుండె—ఇది దాత్యూహమునకు (కూకురుగుండ గికి ఒకవిధ మైనపక్షికి) పేరు

గ్రద్ద—ఇది గృధ్రమునకు (గద్దకు) పేరు

కొంచ కొంగ—ఇవి క్రౌంచమునకు పేర్లు

నారణపక్కి వక్కు వగ్గు—ఇవి బకమునకు (నారాయణపక్షికి ఒకజాతికొంగకు బకోటమునకు) పేర్లు

ఆడెలు బాతు—ఇవి శరారికి (పక్షివిశేషమునకు) పేర్లు

కొంగ — కొంగ యన బకంబు అని (సాం ని తిర్య 79) గేలుకొంగ గుడికొంగ పివిగలకొంగ పూగొంగ సంకుబుడ్డికొంగ దోసకొంగ- అనునవి దీనిలోని భేదములు అని (క్రొత్త బ్రౌ) అని (సూ ని)

క్రౌంచము — కొక్కెర కొంచయు గొక్కెరాయి యన గ్రౌంచాఖ్య లగు అని (సాం ని తిర్య 79) కొక్కెర - బలాక అని ఆం భా (చూ 2 94)

ఆడెలు —ఆడెలు (రూపాం) (బ ఆడేళ్లు జౌ) (సం ఆడి) బక మై యుండెద వని కౌశికు నత డు శపించె విని వసిష్ఠునకుం గౌశికు డును నాడే లగు మని ప్రకట క్రోధమున నిచ్చె బ్రతిశాపంబున్- (మార్క 2 8)

బాతు — పొట్టిబాతు పెద్దబాతు గూడబాతు చింకుబాతు - అని వీనిభేదము లనినది(బ్రౌ)

బకము — శుక్లవాయసము - అనియు దీనిని వ్యవహరించినది త్రికాణ్డశేషము- దీర్ఘజఙ్ఘో
నిశైద (త ) స్యా ద్బకోట శ్శుక్లవాయస ఽజ్కేరు ర్ధారుబలిభుక్ శిఖీ చన్ద్రవిహఙ్గమ
(చూ సుధ )

సీ కా జన గై జన గా గపింజల మొప్పు
బెగ్గు రుయ్యాలచేరుపిట్ట యుయ్య
లపులు గు నా గ సారస మగు జక్కవ
యన గోక మలరున హంస మంచ
యన దగు రాయంచ యన రాజహంసంబు
పర గు బలాక కొక్కెర యనంగ
గొక్కరాయి యన బెం పెక్కును విలసిల్లు
గోయష్టకము గ్రుడ్డికొక్కెర యన

గీ బ్రబలును జతూక చీకురువాయి యన గ
జీకురాయి యనంగను జీవుక యన
గబ్బిడాయి యనంగను గబ్బిల మన
దైలపాయిక చె న్నొందు దక్షశిక్ష 94

కా జు కై జు— ఇవి కపింజలమునకు పేర్లు
బెగ్గురు ఉయ్యాలచేరుపిట్ట ఉయ్యాలపులు గు—ఇవి సారసమునకు పేర్లు
జక్కవ—ఇది కోకమునకు (చక్రవాకపక్షికి) పేరు
అంచ—ఇది హంసకు పేరు
రాయంచ—ఇది రాజహంసకు (ఎఱ్ఱనికాళ్లను ముక్కును గలయొకజాతిహంసకు) పేరు
కొక్కెర కొక్కరాయి—ఇవి బలాకకు (మహాబకమునకు పెద్దకొంగకు) పేర్లు
గ్రుడ్డికొక్కెర—ఇది కోయష్టికమునకు (గ్రుడ్డికొంగకు) పేరు

చీకురువాయి, చీకురాయి, చీవుక—ఇవి జతూకకు (ఒకజాతి గబ్బిలమునకు) పేర్లు.

గబ్బిడాయి, గబ్బిలము—ఇవి తైలపాయికకు పేర్లు.

కౌఁజు —కముఁజు (రూపాం.). 'కముఁజులఁ జిలుకలఁ గ్రౌంచపక్షులను। బ్రమయించుఁ బూరేళ్లఁ బావురంబులను' (నళ. 3 భా.) (చూ.శ.ర.)

కపింజలము —(శ్యేనాయాం ప్రాచికా) చిత్రపక్షే శరుకపిఞ్జలౌ' అని (వైజ. అన్త.ఖగా.). చిత్రపక్షము- తిత్తిరి తీతువుపిట్ట-అని వాచ. (చూ. సూ ని. చిత్రపక్షము.). చివుక (రూపాం.). 'చివుకపిల్లి-' మొ (చూ.సూ.ని ).

చీకురాయి —ఈశబ్దమును సాధారణవాచకముఁ గానే (గబ్బిలము లన్నిటిని చెప్పుదానినిఁ గానే) సాంబ. ఉదాహరించినది- 'గబ్బిలము గబ్బిడా గబ్బిలాయి చీకు।రా యనంగను దైలపాయికాఖ్యలు చెల్లు ' (తిర్య 81.).

సీ. మక్షిక యీఁగ, నా మను; మధుమక్షిక
తేనీఁగ, జుంటీఁగ, నా నెసంగుఁ;
బెరయీఁగ, నాఁగను బరఁగుఁ బతంగిక,
జోటీఁగ, నాఁగను మిాఱును బశు
మక్షిక; వల్మీకమక్షిక యూసిళ్లు,
నాఁగను బహుతచే నలరి యుండుఁ;
గందురీఁగ, లనంగఁ గణుఁదురు, లనఁగాను
గందోళి దగు, మశకంబు దోమ,

గీ. యనఁగ వెలయును; జిమ్మట, యనఁగ ఝిల్లి
దనరు; మిడు, తన శలభంబు చను, మిణుఁగుఱుఁ
బు, ర్వనంగను ఖద్యోత మొనరుఁ; దేఁటి,
తుమ్మెద, యనంగ భృంగంబు దోఁచు; నభవ! 95

ఈఁగ—ఇది మక్షికకు పేరు.

తేనీఁగ, జుంటీఁగ—ఇవి మధుమక్షికకు (సరఘకు; తేనెటీఁగకు) పేర్లు.

పెరయీఁగ—ఇది పతంగికకు (పుత్తికకు; ఒకజాతితేనెటీఁగకు) పేరు

జోటీఁగ—ఇది పశుమక్షికకు (పశువుల రోమములలో ఉండి తఱచు వాని బాధించు నొకజాతియీఁగకు) పేరు.

ఉసిళ్లు—ఇది వల్మీకమక్షికకు (ఉసుళ్లకు; ఇసుళ్లకు; ఱెక్కచెదలునకు; ముదిరి ఱెక్కలు గలిగి రూపాంతర మందినచెదలునకు) పేరు. [ఇది నిత్యబహువచనము.]

కందురీఁగ. కఱుఁదురు—ఇవి గండోళికి (గంధోళికి; ఎఱ్ఱతుమ్మెదకు) పేర్లు.

దోమ—ఇది మశకమునకు పేరు.

చిమ్మట—ఇది ఝిల్లికి (ఈలపురుగునకు ఇలకోడికి) పేరు.

మిడుత—ఇది శలభమునకు (ఎగిరెడి యొకవిధ మగుపురుగునకు) పేరు.

మిణుఁగుఱుఁగుర్వు—ఇది ఖద్యోతమునకు (తళతళ మెఱయుచు నెగిరెడియొక జాతిపురుగునకు) పేరు.

తేటి, తుమ్మెద—ఇవి భృంగమునకు పేర్లు.

జోరీఁగ —జోఱుటీఁగ,-(రూపాం.). (' బలురోమము లంటిన జోఱుటీఁగలుగా। గూడి నబంధముం గలిగి కూర్కుచు నుం డొకబక్క గుఱ్ఱముగా' (హంస.5.30.) (చూ. సూ. ని.) జోటీఁగనుగూర్చి వేమన యి ట్లను చున్నాఁడు- 'చెప్పులోనిఱాయి చెవిలోని జోటీఁగ। కంటిలోనినలుసు కాలిముల్లు। ఇంటిలోనిపోరు నింతింత గాదయా!' [చాల బాధాకర మిదియనుట దీనిచేఁ దెలియ నగును]

వల్మీకమక్షిక — 'పక్షవల్మికి' -అని వ్యవహరించినది (శ.ర.) (చూ.ఇసుళ్లు).
చిమ్మట —చిమ్మిట, చిమ్మెట (రూపాం). ['చిమ్మిట యనఁగ' (ప్రాఁత.పా.). అని (సూ.ని.).] 'చీమ చిటుకు మన్నఁ జిమ్మెట ఝల్లన్న। నెదుర మూషకముఖు మెదలు

కౌనిన నిదుర లేక భూమినిద్దురుం డాలించు నప్పు డబలకాలిచప్పు డనుచు (వేం పంచ 4 247) (మొ)

సీ అళివిశేషంబు గా నడరును దూనీ గ
నెమిలి న ట్టువపిట్ట నెమ్మి యన గ
గేకి యై తగు గేక కేక యనంగను
దనరు జంద్రకము క న్నన గ బర గు
బురి యన బింఛంబు మెఱయు జుట్టు సిక చుం
చు సిగ కూఁక టన నుల్లసిలును శిఖ
పిట్ట పక్కి పులుఁగు జిట్ట గువ్వ యనంగ
బక్షిసామాన్య మై పర గు చుండు

గీ గృత్రిమవిహంగ మొప్పు సకిన యనంగ
బచ్చపిట్ట యనంగను బసిరిక యన
హారితకం బొప్పు గారండవాఖ్య కన్నె
లేడి యన జను జూడ బాలేందుచూడ 96

తూనీఁగ—ఇది అళివిశేషమునకు (ఒకవిధ మైనతుమ్మెదకు నెనగగింజవంటి తల నిడుదతోక అగినెయాకువంటినాలుగుతెక్కలు గలకీటకమునకు) పేరు

నెమిలి నట్టువపిట్ట నెమ్మి—ఇవి కేకికి (మయూరమునకు బర్హికి) పేర్లు

కేక—ఇది కేకకు (నెమిలికూతకు) పేరు

కన్ను—ఇది చంద్రకమునకు (నెమిలిపురికంటికి) పేరు

పురి—ఇది పింఛమునకు (బర్హమునకు) పేరు

జుట్టు సిక చుంచు సిగ కూకటి—ఇవి శిఖకు (నెమిలిజుట్టునకు) పేర్లు

పిట్ట పక్కి పులు గు జిట్ట గువ్వ —ఇవి పక్షిసామాన్యమునకు (అన్నిపక్షులకును) పేర్లు

సకిన—ఇది కృత్రిమవిహంగమునకు (రతనాలు మొద లగువానితో గల్పించిన పక్షికి) పేరు

పచ్చపిట్ట పసరిక—ఇవి హారితకమునకు (పసుపువన్నెఱెక్కలు గలయొకజాతి పక్షికి) పేర్లు

కన్నెలేడి—ఇది కారండవమునకు (పెద్దఱెక్కలు గలయొకజాతిపక్షికి) పేరు

తూనీ గ —తూని గ- (రూపాం ) సానుస్వార మిది యని (శ ర ) నిరనుస్వార మని (చి ని ) సానుస్వార మిది అని టకు నిర్ధారకములు లేవు- (చూ సూ ని )

జిట్ట —ఒకచిన్నపక్షిజాతియొక్క సాధారణ మైనపేరు ఇది అనేక భేదములు గలది- అని (శ ర ) భేదములకై (చూ సూ ని జిట్ట )

హారితకము —పక్షిసామాన్యమును వచించి తేషాం విశేషా హారీతో వర్తకాదయ అని నది (ఉమ ) (హారీతము-ఒకవిధ మైనపావురము హరితము- పచ్చపిట్ట గిజి గా డు- అని (సూ ని ) (హారీతము హరితము సమానార్థకము లని (హరితము) పచ్చపిట్ట గిజిగా డు అనినది (శ ర )

కారండవము — కారణ్డవో మహాపక్ష ఆని (వై జ అన్త ఖగా )

కేక — కే క (వావి అపముద్రి ) కేకా వాణీ మయూరస్య ఉని (అమ )

సీ తీతువ యన గను దిత్తిరి యగు గుక్క
 భంబు గిబ్బలు గు గంపపులు గన గ
వఱలు లావు కన లావక మొప్పును జక్కోర
 మగును వెన్నెలపిట్ట యనఁగ డిట్టి
భము లకుముకి యన బర గుఁ దద్భేదంబు
 నీర్పిచ్చుకా డన నెగడు చుండు
వెలిచె యనంగను వెలయు వర్తకసంజ్ఞ
 మీాలవల్లకి యన మీాలముచ్చు

గీ నాగవర్తిక చెలగు గోనర్ద మలరు
వలికి యనగను భృంగాహ్వ వెలయు లింగ
రాజనగ వదరనగ నిద్రాహ్వ యెసగు
మాతృభూత నగేంద్రజామాతృభూత 97

తీతువ—ఇది తిత్తిరికి (సన్నని పొడుగుకాళ్లు గలయొకజాతిపక్షికి) పేరు

గబ్బులు గు గంపులు గు—ఇవి కుక్కుభమునకు (అలజమునకు అడవికోడికి) పేర్లు

లావుక—ఇది లావకమునకు (ఒకజాతిపక్షికి) పేరు

వెన్నెలపిట్ట—ఇది చకోరమునకు (వెన్నెల తిని బ్రతుకు నొకజాతిపిట్టకు) పేరు

లకుముకి—ఇది టిట్టిభమునకు (టిటీ యని కూయునొకానొకపక్షికి) పేరు

నీర్చిచ్చుకాఁడు—ఇది టిట్టిభవిశేషమునకు (ఒకవిధ మైనలకుముకిపిట్టకు) పేరు

వెలిచె—ఇది వర్తకమునకు (ఒకానొకపిట్టకు) పేరు

మీలవల్లకి మీలముచ్చు—ఇవి వర్తికకు (నీటి కుతికి చేఁపలఁ బట్టుపక్షివిశేషమునకు) పేర్లు

వలికి— ఇది గోనర్దమునకు (ఒకానొక పక్షికి) పేరు

లింగరాజు—ఇది భృంగమునకు (భృంగరాజుపిట్టకు) పేరు

వదరు—ఇది నిద్రాహ్వకు (ఒకజాతిపక్షికి) పేరు

టిట్టిభము —తెలుగున దీనికి తీతువు అనునర్థమున గొన్నిచోట్ల బ్రయోగము లగపడుచున్నవి - టిట్టిభదంపతుల్ వఱంచి యున్నచో అనినం బ్రియాంగనాలాపంబు హాస్యంబు సేయుచు నాతీతు విట్లనియె (నారా ౦ 4 9 420 )

[గంపపులు గు — గుంపపులు గు (వావి అప ముద్రి )]

మీలవల్లకి — మీలవల్లిక (వావి పా ) శర మీనవల్లిక గ్రహించి దాని కైన విక్ర

మీనవల్లంకి అను చున్నది బ్రౌ మీలవల్లిక మీలవల్లంకి రెండును గ్రహించి ఆం భా పా మీలవల్లంకి అనినది గణభంగమునవరించుటకై మీలవల్లంకి మీలవల్ల కి కావలం యున్నది (సూ ని పా) మీలవల్ల కి అనియే గురు మీలవల్లంకి అనియే దీనిని లను చున్నది అందులకె (ఆం భా పా) మీలవల్ల కియే అగు నని పించినది వల్లికకు విౕృ వల్లంకి అనుట శ ర కును తప్పనిదియే శ ర మిశ్ర గ్రా అన కుండ అవినప్లే పై వి అని అంచయూన వంటి దిది అనినది

[సీల్చిచ్చుకా డు — సీయుఒకా డు అని (వావి ఆపముద్రి)]

వర్త్తకము — ఒమరిము- పక్షివిశెషము లనుచు గొన్నిటని బేర్కొనినది ఆం భా వానినే చాలవలకు దానును ఈసందర్భమున విశేషసంజ్ఞలు గా వచించిన దనవచ్చును తేషాం విశేషా హారీతో మద్గు కారండవ ప్లవ తిత్తిరి కుక్కుభో లావో జీవంజీవ శ్చకోరక కోయష్టిక ష్టట్టిభకో వర్తకో వర్త్తికాదయ (అమ)

వదరు — పక్షివిశేషము ఒకజాతిపిట్ట ఎకిలి నేలనెమిలి పెనుగువ్వ బకదారి పావురాయి ఎవ డు పలువరింత చదలుకోడి గువ్వ వదరు తో కలవే డి యాది యైనపక్షు లత డు దీర్చు (హంస 3 3) (చూ సూ ని) [నిద్రాహ్వ యెన గు అని వావి బ్రౌ (ఆం భా పా) సం నిఘంటువులలో నిద్రాహ్వ కానరా లేదు నేను జూచినం తలో ఇంకను అన్వేషణీయము]

సీ గిజిగా డు పూరేడు కేర్జంబు పొన్నంగి
వెన్నడాయి పరిక బెళవ రివ్వ
వంగపండు పికిలి వామనపాతుకా
డుల్లంకి కాటికా డు పగడంపు
జిట్ట గొబడి డాబ జీనువ వద్రంగి
గున్నంగి పోపిట్ట గూడబాతు
కూ కటికువ్వె కుటాక కళ్కు కరడు
నల్లచ్చికాఁడును జల్లపిట్ట

గీ యన గ ని ట్లని పక్షిభేదాఖ్య లలరు
మొదట నర్థంబు చెప్పనయదియు గాక

గూఁటిగువ్వన నణు జనఁ గురుజనంగ
నీఁక రాల్చినపక్షి యొ౯ నిందుమౌళి 98

గిజిగాఁడు పూరేడు కేర్జము పొన్నంగి వెన్నడాయి పతిక బెళవరివ్వ వంగపండు పికిలి వామనపాతుకాఁడు ఉల్లంకి కాటికాఁడు పగడంపుబిట్ట గొబడిడాబ జీనువ వడ్రంగి గున్నంగి పోపిట్ట గూడబాతు కూఁకటికువ్వె కుటాక కళుకు కరడు నల్లచ్చికాఁడు చల్లపిట్ట—ఇవి ఒక్కొకటి ఒక్కొక్క పక్షివిశేషమునకు పేర్లు
గూఁటిగువ్వ అణుజు కురుజు—ఇవి పక్షిభేదమునకేకాక ఈక రాల్చిన పక్షికి గూడ పేర్లు

కేర్జంబు—కేరజము కేరిజ-(రూపాం) అంచలు నెమిళ్లు కేర్జము ల్పంచవన్నె చిలుకలు పికాదిశకునము ల్గలసి పలుక (హంస 5 43) (చూ సూ వి)
రివ్వ—దీనిని శ ర బ్రౌ గ్రహింపలేదీయర్థమున సూ ని గ్రహించినది మావి పుక్కిటిగాఁడు జీనువ యెల్లంకి డాబ తీతువు వెన్నడాయ రివ్వ (పార్వ 6 77)(చూ సూ ని)
[కూఁకటికువ్వె—కూఁకటిగువ్వ-(ప్రా తప్రతిపా) (చూ సూ వి)]

సీ గఱి యీఁక చట్టుప యెఱక డాఁకన నొప్పు
బక్షంబు ఱెక్క నా బక్షతి యగు
లావు లవిటి నా నలరు బక్షిపుచ్ఛాఖ్య
యెగపు నా గను విహంగగతి దనరు
నండంబు గ్రుడ్డు నా నమరును జెన యన
నండద్రవం బొప్పు చుండు గూఁడు
నాఁ దగు నీడంబు బోదువా యన గను
బోదె యంచన గను బోద నాఁగ

గీ నిసు వనంగను బిల్లన నిసు గనంగ
గూన యన గందు నా గను గొదమ యనఁగ

దిర్యగర్భకములు గాను దెలియవలయు
నౌపచారిక మన్యాఖ్య లౌట శర్వ 99

గఱి ఈక చట్టుప ఎఱక డాక—ఇవి పక్షమునకు (పక్షితెక్కకు పత్త్రము నకు) పేర్లు

తెక్క—ఇది పక్షతికి (ఱెక్కమొదటికి తెక్కగూటికి పక్షమూలమునకు) పేరు

లావు లవిటి—ఇవి పక్షిపుచ్ఛమునకు (పక్షులపింఛమునకు వానితోకకు) పేర్లు

ఎగపు—ఇది విహంగగతికి (పక్షులు ఎగురుటకు ఉడ్డినమునకు) పేరు

జెన—ఇది అండద్రవమునకు (గ్రుడ్డులో ఉండునీటివంటిపదార్థమునకు సొనకు) పేరు

గూడు—ఇది నీడమునకు పేరు

బోదువా బోదె బోద నిసువు పిల్ల నిసుగు కూన కందు కొదమ—ఇవి తిర్యగర్భకములకు (పశుపక్ష్యాదుల పిల్లలకు) పేర్లు

ఔపచారికములు(గా)—ప్రవృత్తి నిమిత్తారోపణము ఉపచారము అది నిమిత్తము గా (లాక్షణికముగా (లక్షణచే నగుట) ఇతరశిశువులను గూడ వచించును రాముడు దనుజులతో సంగ్రామము సేయంగ గల దె కందు గదా (మొ రా బాల 47 )మొ

[విహంగగతి — విహంగతతి -వావి అప పా ]

[జెన — సొన - (ప్రా త ప్రతిపా )]

[బోద — బోదె యంచన గను బోదు నా ౯ అని ప్రా త వ్రా తప్రతి బ్రౌ పా అని (సూ ని ) (చూ బోద ) నిర్ధారకము లేదు ]

[బోదువా —ఇది బ్రౌ పా (చూ అను ) బోదులా - అని (వావి ) సూ ని శర గ్రహింపలేదు (విచార్యము )]

లావు లవిటి —తెక్క మొదలు పక్షతి-వీని కర్థ మనినది శర ఇది అర్థాంతరము గానోపు (ఇట్లే తెక్క కడను గూడ)

సీ గం డన బో తన గాను దిర్యక్పురు
షాఖ్యయౌఁ దత్త్రీసమాఖ్య పెట్ట
యన మీఱు దన్మిధునాభిధ పెంటిపో
తు లనంగ విలసిల్లు దోయి జోడు
జంట జమళి కవ దంట యమడ యన
ద్వంద్వ మై పరగు నత్తమ్ము దిమ్మ
గుబురు గుమురు గుంపు గుమి గమి పిండు మొ
త్తము తెట్టె పైకము దా టు లొద్ద

గీ తుటుము మొల్లము మొల్లమి తుట్టె వర్గ
వన గ వర్గము తగు మూఁ క యన గ సంఘ
మౌను సమజము కదు పన నలరు చుండు
బుంగవతురంగ శ్రీమాతృభూతలింగ 00

గండు పోతు—ఇవి పశుపక్ష్యాదులకు చెందిన పురుషజాతికి పేరు

పెట్ట—ఇది పశుపక్ష్యాదులలోని స్త్రీజాతికి పేరు

పెంటిపోతులు—ఇవి పశుపక్ష్యాదుల మిధునమునకు (జంటకు) పేరు

దోయి జోడు జంట జమళి కవ దంట అమడ—ఇవి ద్వంద్వమునకు (యమళమునకు యుగళమునకు కలసి యుండెడి రెండింటికి) పేర్లు

అత్తము దిమ్మ గుబురు గుమురు గుంపు గుమి గమి పిండు మొత్తము తెట్టె పైకము దా టు లొద్ద తుటుము మొల్లము మొల్లమి తుట్టె వర్గవు—ఇవి వర్గమునకు (సమూహమునకు) పేర్లు

మూఁక—ఇది సంఘమునకు (ప్రాణిసమూహమునకు సమాజమునకు) పేరు

కదుపు—ఇది సమజమునకు (పశుసమూహమునకు పశువుల మందకు) పేరు

అమద — యమళము(సం)

సమజము — సముదో రజ పశుషు (3-3-69) అని పాణినీయము సమజ పశూనామ్ సమాజోఽన్య (అకౌ)

దాటు — దాటె (వావి అపపా) కొన్ని చోట్ల దాటె అని యే అంధ్ర భా ను సూ ని ఉదాహరించినను దాటు అవియే గ్రహించి యీయర్థ మిచ్చి ప్రయోగము లిచ్చినది [దాటు- సందణ్డ) సమూహము భంగములై నగంబులు గుభాఁన ద్రెళ్ల గరళ్లదాటులతో (వరాహ 8 6) (మనుచ 3 6) (చూ సూ ని)]

గీ ప్రోక యన ప్రోవనంగను ప్రోగు నాగఁ
గుప్ప యన రాసి యన గనుగువ్వ యనగ
రాశి యగు మందె యన గను రాశిభేద
మలరు చుండు జగత్త్రయీమాతృభూత 0

ప్రోక ప్రోవు ప్రోగు కుప్ప రాసి కువ్వ—ఇవి రాశికి పేర్లు

మందె — ఇది రాశివిశేషమునకు (కొన్నకంకులు పొగాకు-ము న్నగువానిని అదిమి పొదువు గా పేర్చి పెట్టినప్రోగునకు) పేరు

గీ శ్రీలు వెలయంగ నీపేర జేయుకతన
బరగు చుండును సింహాదివర్గ మిట్లు
గైకొనుము దీని భక్తసంఘాభిమాని
మాతృభూత జగత్త్రయీమాతృభూత 02

[వ్యాఖ్యకై చూ స్వర్గ 68]

ఇది

సింహాదివర్గము

———

# మనుష్యవర్గము

సీ. మానిసి మనిసి నా మనుజసామాన్యంబు
        మంది యంచన నగు మనుజవితతి
    యారె మరాటివా డన మహారాష్ట్రుఁ డౌ
        గుజ్జరివా డన ఘూర్జరు డగు
    గన్నడీ డన గను గర్ణాటకుం డొప్పు
        నఱవ యంచన ద్రావిడాఖ్య వెలయు
    నాంధ్రు డౌఁ దెనుగువా డనఁ దెల్గువా డన
        మగవాఁ డనంగను మగ డనంగ

గీ. బురుషుఁ డన దోఁచుఁ బౌరుషంబు మగతనము
    మగఁటిమి యనంగఁ దిర్యక్పుమర్థమందు
    నౌపచారిక మైన గం డనెడిపల్కు
    భావకర్మంబులనుగూడ బర గు నభవ 03

మానిసి మనిసి—ఇవి మనుజసామాన్యమునకు (మనుష్యునకు మనుష్యస్త్రీకి) పేర్లు

మంది—ఇది మనుష్యసమూహమునకు పేరు

ఆరె మరాటివా డు—ఇవి మహారాష్ట్రునకు (మహారాష్ట్రదేశస్థునకు) పేర్లు

గుజ్జరివాఁడు—ఇది ఘూర్జరునకు (గుజరాతిదేశమువానికి) పేరు

కన్నడీఁడు—ఇది కర్ణాటకునకు (కన్నడదేశమువానికి) పేరు

అఱవ—ఇది ద్రావిడునకు (ద్రవిడదేశస్థునకు) పేరు

తెనుగువా డు తెల్గువా డు—ఇవి ఆంధ్రునకు (తెలుగుదేశమువానికి) పేర్లు

మగవాడు మగడు—ఇవి పురుషునకు పేర్లు

మగతనము మగటిమి—ఇవి పౌరుషమునకు పేర్లు

గండు—ఇది భావమునకు (పురుష) ధర్మమునకు పుంస్త్వమునకు) కర్మము నకు (పురుష) ప్రయత్నమునకు పురుషకారమునకు పౌరుషమునకు) పేరు

మానిస —(సం మానుష క మానిస) (మనుష్యుడు)- నానాదేశంబులబలు మాను సులం గూర్చి నీవు మగధేశ్వర యే పూనిక నిట వచ్చితి చెప్పుమా నిక్కము నిర్వ హింతు మప్పని యేమఱ (హరి ఉ 28) మొ (మనుష్యుడు) - పగవాడట దేవేంద్రుడు మగువా నీ ఎలనికొలువు మానిస వట నిం దగవు సెడి ఎలువ బను చట మగతనమే యిట్టలంజమాటలు గలవే (ఉ హరి 70) మొ (చూ సూ వి) మాన్సి అనియు ఒకకవి- ఇసుమంత మాన్సివంశసమువాలల కిన్నె రలమ్రో తలకు హాఱు వలుకుగవులు (ప్రబం 59)

మనిస — ఎలపు రూపెఱుగదు ఏసుధ మర్త్యులకు సూకర మైన మనిస గా గాను ఎంచు (వేణు 60) (మా సూ ని) (ఇట మనుష్యుడు మనుష్యుడు- ఇద్దఱును మనిసకి అర్థము)

మంది —అంతమంది వేయిమంది-మొ వ్యవహారదృష్టములు మంది యెక్కు వైన మజ్జిగ పలుచన అని సామెత ప్రయోగము లిట్లున్నవి- ఇరులు గవియుచు నేరాళ మెట్టమెదుర నల్లనల్లన నేతెంచె నల్లమంది గరిమ నా నాకపతుల కాకాళవీథి గదలి యెదురుగ నెచ్చెనో కాక యనగ (శృం నై 7 39) (చూ సూ ని)

తెల్గువాడు — తెలుగులు అనునది కూడ లాక్షణికము గా) తెలుగువారిని జెప్పును ఒకకవి ఇట్లను చున్నాడు- ఆరెలు గన్నడీ లఱవలుం దెఱగుఱు దన బిరుదంది యం దగిలి కొలువ (ద్వా 42) (చూ సూ ని)

గండు — మగతనం బన గం డన మగటిమి యన బౌరుషంబున కాఖ్య లై పరగు చుండు (ఆం సం మాన 57) కిడిమి బీరంబు మగంటిమి గిం డన విక్రమాహ్వ యము లై వెలయు చుండు (ఆం శే 6) మొ పశుపక్ష్యాదులలోని మగజాతిని ప్రవృత్తినిమిత్తారోపణమున (లక్షణచే) ఇది వచించును (ఆం భా 2 00)

సీ॥ బోటి చేడియ చేడె ప్రోయాలు పైదలి
బాలతుక పొల్తుక పొలతి పొల్తి
యతివ తొయ్యలి కొమ యన్ను సకి తెఱవ
నెలతుక పడతుక నెలత పడతి
యెలనాగ కోమలి యింతి చెలువ చెలి
వెలదుక మెలతుక వెలది మెలత
నవలా మగువ నాతి నాతుక యాడుది
లేమ గోల యువిద చామ చాన

గీ॥ గోతి బిత్తరి యుగ్మలి కొమ్మ కల్కి
మడతి జోటిక ముద్దుగుమ్మ యన స్త్రీస
మాఖ్య లంచన గాను జెన్నలరు చుండు
భూరిభవభంగ శ్రీమాతృభూతలింగ 104

బోటి చేడియ చేడె ప్రోయాలు పైదలి పొలతుక పొల్తుక బాలతి పొల్తి అతివ తొయ్యలి కొమ అన్ను సకి తెఱవ నెలతుక పడతుక నెలత పడతి ఎలనాగ కోమలి ఇంతి చెలువ చెలి వెలదుక మెలతుక వెలది మెలత నవలా మగువ నాతి నాతుక ఆడుది లేమ గోల ఉవిద చామ చాన గొతి బిత్తరి ఉగ్మలి కొమ్మ కల్కి మడతి జోటిక ముద్దుగుమ్మ—ఇవి స్త్రీకి పేర్లు

ఆడుది —ఆటది (రూపాం) ఏటికి నీరాచతీకం బా టది మొఱవెట్ట బళువు లాతురపడ (భాగ 9 408) (చూ సూ ని)

జోటిక — (సం యోషత్ ప్రా జోషత్) స్వార్థమున ఇట క ప్రత్యయము జోటి (రూపాం) మాటలు వేయు నేమిటికి మంగళలక్షణలక్ష్మి యైనయ జ్జోటికి భర్త కాగలడు సోమకిరీటుడు (హర 3 26)

కోమలి —(సం కోమలా క కోమలె ) యయాతిచరిత్ర కోమలి శబ్దము నుదాహరించు చున్నది- తామరకెంపు లంతటను దా చినముక్కలిం టమీ దటన్ గోమలు లంత బెండ్లికొడుకుం దగ నుంచిన (యయా 4 04 ) (నీలా ) కూడ దీనిని గా దనక ప్రయోగించినది- ఇత్తెఱ గున బలించిన నాలకించి కోమలి మిగులన్ (2 95 ) కోమలికము అనునది ప్రయోగదృష్టము వ్యాకరణానుశిష్టము- మెఱు గాఱుముంజియు మేనికోమలికంబు గడుదిట్టగుణము గుల్కెడు మొగంబు (కిలా 4 4 ) మొ చిన్నయసూరి - మగ టిమ్యాదిగణపరితము గా దీనిని జేసి మగ టిమ్యాదులు యథాప్రయోగంబు గ గ్రాహ్యంబులు (బాలవ్యా తద్ధి 8 ) అనుచున్నా డు (కోమలాశబ్దమున కైనతద్భవము కోమలి దాని కైనభావార్థకము కోమలికము అను చున్నారు కొందఱు (చూ బాలవ్యాకరణోద్ద్యోతము) శ ర సూ ని ఇట్లే అభిప్రాయపడినవి తిక్కనయెఱ్ఱాప్రగ్గడలు సం సమాసమధ్యగతము గా దీనిని ( కోమలి శబ్దమును) ప్రయోగించు చున్నారు- తె మ్మని చెప్ప నాత డును దెచ్చె బ్రియంబున బుష్పకోమలిన్ (విరా 64 ) అక్కుసుమకోమలి సని యమ్మ లేఁటికొని వచ్చి యిచ్చు చుండు (అను 3 255 ) పైతిక్కనను జూచి ఎఱ్ఱాప్రెగ్గడయు పైపుష్పకోమలి కుసుమకోమలి శబ్దములను దానును గా దనక ప్రయోగించినా డు- (పుష్పకోమలి)- మునిపత్నులరూపులు గై కొని వరుసన్ వచ్చి పుష్పకోమలి ప్రియు ప్రీ తుని జేయుచు (అర 6 203 ) (కుసుమకోమలి) కుడిచనపమ్మటం గుసుమకోమలి విస్తృతసంస్తరంబు గా నొడికపుసెజ్జ జేసి (అర 5 ) నన్నయ కోమలి శబ్దమును భారతమున ఇట్లు ప్రయోగించినా డు- అమలచరిత్ర నిట్లు దమయంతి బతివ్రత బల్కుదే నృపోత్తమ విను దీనియందు విదితం బగుశీలనిధిన్ సుధాంశు డుం గమలహితుండు నేను నయి కాచితి మొక్కట మూ డువర్షముల్ గొమరు గ దీని జేకొనుము కోమలి నీ కనురక్త నావుడున్ (భార అర 2 2 6 ) జలధివిలోలవీచివిలసత్కలకాంచిసమంచితావనీ తలవహనక్షమం బయిన దక్షిణహస్తమునం దదున్నమ ద్గలదురుఘర్మవారికణక్రమకరాబ్జము వట్టి నూతిలో వెలువడ గోమలిం దిగిచె విశ్రుతకీర్తి యయాతి ప్రీతితోన్ (భార ఆది 3 44 ) నన్నయ ప్రయోగించిన ఈ (తెలు గు) కోమలిశబ్దము చూచి సంస్కృత మని భ్రమించి సంస్కృతసమాసగతము చేసినారు పైవారు దీని ననిపించును ( కోమల శబ్దమును సంస్కృతవ్యాకరణము (ఉణాది) ఇట్లు సాధించు చున్నది- కుటి

కశి కౌతిభ్య ప్రత్యయస్య ముట్ బాహులకా ద్గుణ - కోమలమ్ (ఉ) [బాహులకా దితి - కోమలం మృదులం మృదు బాహులకా దన్య త్రాఽపి కొశల కొసలో వా దేశవిశేష అని (తత్త్వ వ్యా)] సుకుమారం తు కోమలం మృదులం మృదు అను- (అమ)ను వ్యాఖ్యానించుచు సుధ- బాహులకా దలచ్ అత ఉత్త్వం చ అనినది ఈ రెండువిధము లగునిష్పత్తులయందును అర్శఆద్యజన్త మిది యయి టాబన్తమే (కొమలా-అనియే) కావలయును అతిప్రయుక్తం దేశభాషాపదమ్ (౦ 3) అనువామనుని యనుశాసనపద్ధతిని పై తిక్కనాదులసమాసప్రయోగములు సాధువు లనవలయును ఇం ను వీనిచర్చకై చూ (నారబించిన నన్నయయడ.గుణాడలలోనితిక్కనార్యుడు) కొందఱు పాణినీయమునుబట్టి దీనిని సాధింప యత్నించిరి ప్రామాణిక మార్గమున దీనిని (కోమలి ని) సాధు వనదు పాణినీయము కోమలీ శబ్దము స్త్రీపర్యాయము గా సంస్కృతమున గాన బడలేదు కాముకుని కోమలాంతసంగంబుపగిది (భీమ 4 40)

సీ చిగురు బోఁడి మిటారి చిలుకలకొల్కి వా
ల్గంటి మెఱుఁగు బోఁడి కలువకంటి
యన నిట్లు స్త్రీవిశేషాఖ్యలు చె న్నొందు
ముద్దరా లుమ్మద్దియ ముగుద యనఁగ
ముగ్ధ యొప్పును బ్రౌఢ ప్రోఁడ యంచన మీఱు
గొంతి యంచనగను గుంతి తోఁచు
ద్రౌపది ద్రోవది ద్రోపది యన జను
గైకేయి వెలయును గైక యనఁగ

గీ మహిషి దేవేరి యనఁగను మనును గేస్తు
రా లనఁ గరిత యనఁగ నిల్లా లనంగ
గృహిణి చెలగును భార్యపే రెసఁగుచుండు
నాలు పెండ్లాము నాఁగ దేహధృతనాగ 105

చిగురు బోఁడి మిటారి చిలుకలకొల్కి వాల్గంటి మెఱుగు బోఁడి

కలువకంటి— ఇవి స్త్రీవిశేషమునకు (సౌందర్య సౌకుమార్యాది గుణవిశేష ముల బట్టి యాయాయా డువాం(డకు అన్వర్థ మగు) పేర్లు

ముద్దరాలు ముద్దియ ముగుద—ఇవి ముగ్ధకు పేర్లు

ప్రోడ—ఇది ప్రౌఢకు పేరు

గొంతి—ఇది కుంతికి పేరు

ద్రోవది ద్రోపది—ఇవి ద్రౌపదికి పేర్లు

కైక—ఇది కైకేయికి పేరు

దేవేరి—ఇది మహిషికి (పట్టపురాణికి) పేరు

గేస్తురాలు గరిత ఇల్లాలు—ఇవి గృహిణికి పేర్లు

ఆలు పెండ్లాము—ఇవి భార్యకు పేర్లు

ముద్దరాలు —ముద్దురాలు-అనుట గూడ సాధు వని అహోబలపతి (చూ దారార్థె ఉత ఉ దపిక (సంధి 34) అను సూ వ్యా )

ముగ్ధ — ఉదయద్యౌవనా ముగ్ధా లజ్జావిజితమన్మథా అని ముగ్ధకు లక్షణము లే బ్రాయము గలయా డుది

ప్రౌఢ — స్మరమన్దీకృతవ్రీడా ప్రౌఢా సంపూర్ణయౌవనా -ని ప్రౌఢకు లక్షణము నిండు జవ్వనము గలస్త్రీ

ద్రోపది —బ్రౌ గ్రహించినది ప్రయోగము చూపలేదు

స్త్రీవిశేషాఖ్యలు —వీనిని స్త్రీనామముల గానే ఆం సంగ్రహాదులు వచించినవి ఇట్లు స్త్రీ-విశేషాఖ్యలు అని ఆం భా పూ బోణి మచ్చెకంటి సొగసుకత్తె -మొ సంగ్రహించినది ఆం సం సాంబ వేంక నిఘంటువులు వీని నిట్లు వచించినవి- నెలతుక క్రాల్గంటి పొలతుక ముద్దియ వాలు గంటి మగువ పడతి మదతి చెలి మచ్చెకంటి యుగ్మలి యింతి తొయ్యలి నవలా కలువకంటి నాతి గోతి పూబోడి చిగురాకు బోడి పైదలి మించుబోడి ముద్దులగుమ్మ పొలతి కొమ్మ ప్రోయాలు విద తీగెబోడి

వేడియ యించుబోఁడి యన్ను వెలంది బోటి జోటి చాన తెఱవ వెలందుక వామ లేమ చెలువ మెలనాఁగ చిలుకలకొలికి కలికి తలిరుబోఁడి యలరుబోఁడి నెలఁత పొల్తి గరిత యతివ నాఁ స్త్రీసమాఖ్యలు (అం సం 9) చెలి ముద్దుగుమ్మ యుగ్మలి నవలా చాన కన్నె బిత్తరి గోతి కలికి మగువ జవరాలు చేడియ జవ్వని తొయ్యలి నాతి పైదలి మెలనాఁగ లేమ సకియ జక్కవచంటి చామ చిల్కలకొల్కి గుబ్బెత ప్రోయాలు కొమ్మ పడఁతి పొలఁతి ముద్దియ ననబోఁడి యింతి మిటారి నెలఁతుక వాల్గంటి నెలఁత తెఱవ యన్ను లతకూన యొయ్యారి యతివ వెలఁది చెలియ సకి బోటి కొమరిత చిగురుబోఁడి ముగుద ఎగలాఁడి బంగారి ముదిత యువిద గరిత యన భామినీసమాఖ్యలగు (సాంబ- 20) కలికి చిల్కలకొల్కి మెలఁతుక క్రాల్గంటి నెలఁత ముద్దులగుమ్మ యలరుబోఁడి పొలఁతి యుగ్మలి యింతి ప్రోయాలు పైదలి వామ జక్కవచంటి లేమ తెఱవ మెలనాఁగ జోటి తొయ్యలి యన్ను జవ్వని నాతి చేడియ పొల్తి గోతి మగువ జవరాలు బిత్తరి చాన నవల చెలి చెలువ బోటి సకియ వెలఁది పడఁతి చిగురుబోఁడి గుబ్బెత కొమ్మ సొగసుకత్తె కన్నె లతకూన యువిద బంగారుబొమ్మ ముగుద కొమరిత యొయ్యారి ముద్దియ యన బొంకమగువ యింతకీపేళ్లు (వేంకమాన 35) సంస్కృతమున (అమ) గూడ సుందరీ వామలోచనా ఇత్యాదులు అంగనావిశేషవాచకము లగుచున్నది- విశేషాస్తు- అఙ్గనా భీరు కామినీ వామలోచనా ప్రమదా మానినీ కాన్తా లలనా చ నితమ్బినీ సుందరీ రమణీ రామా (లని) విశేష వివక్ష లేక తరువాత స్త్రీపర్యాయములుగా ఐన విని అట్టివే తెలుగునను పైవాలు గంటి - మొ

సీ కన్యాభిధానంబు కన్నె కన్నియ కన్య
యన మూఁడుపేళ్లచే నమరి యుండు
గన్నెతికం బన గన్యాత్వ మొప్పును
గొమిరె నాఁగ గుమారి యమరి యుండు
జవరాలు గుబ్బెత జవ్వని యన గను
యువతి సమాఖ్యలై యొప్పుఁ దగుఁ జి
రంటికి బేరు పేరంటా లనంగ జి
రంటిత్వ మెసఁగు బేరంట మనఁగ

గీ అంకులాడి వా జెడిపె నా అంకుటాలు
నా గులట యౌ ననాధ యన దన దగును
బేదరా లన గ దరిద్ర వెలయు వంధ్య
యొనరు గొడ్రా లనంగ విధూత్తమాంగ 06

కన్నె కన్నియ కన్య—ఇవి కన్యకు (పెండ్లి కానిస్త్రీకి) పేర్లు

కన్నెతికము—ఇది కన్యాత్వమునకు (కన్యాధర్మమునకు) పేరు

కొమిరె—ఇది కుమారికి (యౌవనమునకు ముం దున్నవయస్సున (కౌమార మున) ఉన్న స్త్రీకి) పేరు

జవరాలు గుబ్బెత జవ్వని—ఇవి యువతికి (యౌవనము గలస్త్రీకి) పేర్లు

పేరంటాలు— ఇది చిరంటికి (సువాసినికి యౌవనమునం దుండియు భర్తృ గృహము వదలి పితృగృహవాసము చేయుస్త్రీకి స్వవాసినికి) పేరు

పేరంటము— ఇది చిరంటీత్వమునకు (సువాసినీత్వమునకు స్వవాసినీత్వమునకు) పేరు

అంకులాడి చెడిపె అంకుటాలు—ఇవి కులటకు (జారిణికి అసతికి వ్యభిచారిణికి) పేర్లు

అనద—ఇది అనాధకు (దిక్కు లేనిదానికి) పేరు

పేదరాలు—ఇది దరిద్రకు (బీదదానికి) పేరు

గొడ్రాలు—ఇది వంధ్యకు (సంతతి లేనిస్త్రీకి) పేరు

పేదరాలు —పేదరాలిపెద్దమ్మ యనుటకు- పేదరాసపెద్దమ్మ -అని లోకవ్యవహారము గొడ్డురాలు (రూపాం ) గొడ్డురాలి కిల నెక్కడి మోహము లెంచి చూడ గా (సారం 3 50 ) చిరణ్టీ — చిరణ్టీ సువాసినీ శబ్దములను సుధ ఇట్లు వ్యాఖ్యానించినది- చిరేణ అటతి పితృగేహా ద్భర్తృగేహమ్ అచ్(3 4 ) పృషోదరాది (6 3 09 ) వయ స్యచరమే (వా 4 20 ) ఇతిజీప్ సు-అతీవ వసతి పితృగేహే

తచ్ఛీలా సు ప్యజాతౌ ణిని స్తాచ్ఛీల్యే (3 2 78) ఇతి ణిని స్వవాసినీ ఇత్యప
పార స్వేషు ఎత్రాదిషు వస్తుం శీల మస్యా స్వవాసన్యాం చిరణ్టీ స్యా ద్వితీయవ
యస్త్రియామ్ ఇతి రుద్ర వ్వదే ప్రాప్తయౌవనాయా ఎతృగేహస్థాయా (అని)
గురు గూడ ఇట్లే ప్రాప్తయౌవన యై పుట్టినింట నున్న స్త్రీ పేరంటాలు అను చున్నది
మగనాలు (పతివత్ని) వేఱు గా వచింప బడినది (ఆం భా 2 07)

దరిద్ర — దరిద్రి పెలయు (వావి పా)- దరిద్ర శబ్దము పచాద్యజన్తము దరిద్ర
అనుటయే సాధువు

సీ సకి సకియ యనంగ సఖి యొప్పు బోటి నా
బోటికత్తియ యన బోలు దూతి
పతివత్ని యది పల్కబడు మగనాలు నా
నైదువరా లన నైదువ యన
నది వృద్ధ యైన ముత్తైదువ యను కొండ్రు
తెలివికత్తె యనంగ దేఱు బ్రాజ్ఞి
దొరసాని రాణి నా దోచు చుండును రాజ్ఞి
ప్రెగ్గడసాని నా వెలయు మంత్రి

గీ భార్య దనరు నుపాధ్యాయభార్య యొజ్జ
సాని యన సోమిదమ సోమిసాని యజ్వ
పత్నికిని నామధేయ మై పరగు చుండు
భూరిభవభంగ శ్రీమాతృభూతలింగ 07

సకి సకియ—ఇవి సఖికి (చెలికత్తెకు) పేర్లు

బోటి బోటికత్తియ—ఇవి దూతికి పేర్లు

మగనాలు ఐదవరాలు ఐదువ—ఇవి పతివత్నికి (జీవద్భర్తృకకు భర్త గల
స్త్రీకి) పేర్లు

హనువు —(గణ్డౌ కపోలౌ) తత్పరో హను (అమ) అమరవ్యాఖ్యాసందర్భమున సుధ-(టీకం) కపోలాధోభాగస్య అని వివరించినది చెక్కిలిమీది భాగము అనునర్థమునే చాలవ్యాఖ్యానములు వచించు చున్నవి గురు - వెలిదౌడ కటమరలు-అని వ్రాసినది

గోళకము — కంబళే చేన్ద్రియస్థానే పూగకోశే చ గోళక అని (నానా)

సీ పర పొర యన గను బటలంబు విలసిల్లు
గన్ను నా లోచనాఖ్య దనరారు
జూపు చూడ్కి యనంగ దోప బడును దృష్టి
వాలుచూ పన బొల్చు వక్రదృష్టి
యశ్రువు కన్నీ రటం చన రాజిలు
బక్ష్మంబు వెలయు ఱె ప్పం చనంగ
ఘనపక్ష్మసంజ్ఞ దొంగలిఱెప్ప లన మీఱు
గడక న్ననంగఁ గ్రే గ న్ననంగ

గీ నగు నపాంగంబు చెవి వీ నననంగ శ్రవణ
మొప్పు గూ బన గాఁ గర్ణమూల మెన గు
సిరసు తల నెత్తి యన దగు శిరము జను గ
డంత యనఁగ శిర పార్శ్వ మంతకారి 44

పర పొర—ఇవి పటలమునకు (నేత్రరోగమునకు చూపునకు అడ్డు కలిగించెడి యొకవిధ మైన ఆవరణము పొర దానిని గలిగించెడికంటిజబ్బునకు) పేర్లు

కన్ను—ఇది లోచనమునకు (నేత్రమునకు నయనమునకు) పేరు

చూపు చూడ్కి—ఇవి దృష్టికి (వీక్షణమునకు విలోకనమునకు) పేర్లు

వాలుచూపు—ఇది వక్రదృష్టికి (వంకరచూపునకు ఓరచూపునకు సాచీకృతవీక్షణమునకు) పేరు

కన్నీరు—ఇది అశ్రువునకు (బాష్పమునకు దుఃఖాదులవలన గలుగుకంటి నీటికి) పేరు

తెప్ప—ఇది పక్ష్మమునకు (నేత్రచ్ఛదమునకు కంటితెప్పకు) పేరు

తొంగలితెప్ప—ఇది ఘనపక్ష్మమునకు (దట్టమగువెండ్రుకలు గలకంటితెప్పకు) పేరు

కడకన్ను క్రేగన్ను—ఇవి అపాంగమునకు (నేత్రాంతమునకు కంటికొనకు కటాక్షమునకు) పేర్లు

చెవి వీను—ఇవి శ్రవణమునకు (కర్ణమునకు శ్రోత్రమునకు) పేర్లు

గూబ—ఇది కర్ణమూలమునకు (కర్ణజాహమునకు చెవిమొదటికి) పేరు

సిరసు తల నెత్తి—ఇవి శిరమునకు (ఉత్తమాంగమునకు శీర్షమునకు మస్తకమునకు) పేర్లు

కడత—ఇది శిరపార్శ్వమునకు (కణతకు కడకంటికి ప్రక్కగా ఉండు చోటికి) పేరు

కన్ను—కను (రూపాం) తెలచినకను మూయ కినునిదెస చూచుచు (ఉ రా 2 66) [చూ బాలవ్యా ప్రకీ 7]

పక్ష్మంబు — పక్ష్మాక్షిలోమ్ని అని అమ - పక్ష్మ శబ్దమునకు తెప్పవెండ్రుకయే అర్థమను చున్నది ఐనను- అర్శఆదిభ్యో ఽచ్ (5 2 27) అనుసూత్రమున మత్వర్థీయాజన్తమయియో లేక లాక్షణికముగనో తెప్ప అనునర్థమునుగూడ ఇది వచించును ఈ యాశయముతోనే (బ్రౌ) ఈ శబ్దమునకు తెప్ప అనునర్థ మిచ్చినది ఇచ్చటి పక్ష్మ శబ్దమునకు తెప్ప యే అర్థము

తొంగలితెప్పలు —(తొంగలి-వాలునది) తొంగలి తెప్పలు-వాలెడితెప్పలు-అనునట్లు శర) నిడు పైనతెప్పలు - అనునట్లు బ్రౌ తొంగలితెప్పలం దొలగ ద్రోయుచు -అని మనుచ (2ఆ 32 ప) పరిశీలింపగా తొలగ ద్రోయుచు అను చుండుటనుబట్టి(సూ వి) అర్థమే (దట్టమగువెండ్రుకలు గలకంటితెప్ప అనునదియే) ఉచిత మనిపించును

అపాంగము — అపాఙ్గౌ నేత్రయో రన్తౌ (అమ) అపాఙ్గ మఙ్గహీనే స్యా న్నేత్రాన్తే తిలకే ఽపిచ (విశ్వ) అపాఙ్గదృష్టి-కడకంటిచూపు వీని వీక్షింపు కడగంటవీక్షణమున (శృం నై 5 40)

సీ. ఔదల ముందల యన శిరోగ్రము మీఁఁదు
జను పెడతల యన బశ్చాచ్ఛిరంబు
బ్రహ్మరంధ్రాభిధ పరఁగు నుచ్చన వెంట్రు
క నెఱి నెఱిక నాఁగ దనరు కేశ
మలకలు కురు లన నలరును బహుతచే
వఱలు ముంగురు లన భ్రమరకములు
కూఁకటి యన జిప్పకూఁకటి యన గాక
పక్షంబు చెలఁగు గబరికి దఱుము

గీ. కొప్పు క్రొవ్వేద మూల నా నొప్పు బేళ్లు
కేశబంధవిశేషాఖ్య గేరుఁ గ్రొమ్ము
డి యన వెద యన నూనెముడి యన గొండె
యనఁగ గీల్గంటనఁగ జొల్లె మనఁగ నభవ 145

ఔదల ముందల—ఇవి శిరోఽగ్రమునకు (తలముందుభాగమునకు) పేర్లు

పెడతల—ఇది పశ్చాచ్ఛిరమునకు (తలవెనుకభాగమునకు ముచ్చిలిగుంటకు అవటువునకు) పేరు

ఉచ్చి—ఇది బ్రహ్మరంధ్రమునకు (మాడుపట్టునకు నడినెత్తికి సోడునకు) పేరు

వెంట్రుక నెఱి నెఱిక—ఇవి కేశములకు (తలవెంట్రుకలకు) పేర్లు

కురులు—ఇది (నిత్యబహువచనాంతము) అలకలకు (చూర్ణకుంతలములకు కుటిలకేశములకు వంకరలు తిరిగినవెంట్రుకలకు) పేరు

ముంగురులు—ఇది భ్రమరకములకు (నొసటియందు గునిసియాడెడి ఉంగరపు వెంట్రుకలకు) పేరు

కూకటి చిప్పకూకటి—ఇవి కాకపక్షమునకు (పిల్లలజుట్టునకు శిఖండమునకు) పేర్లు

తుఱుము కొప్పు క్రొవ్వెద మూల—ఇవి కబరికి (కేశసంనివేశమునకు తలయందు దోపెడి వెంట్రుకలముడికి) పేర్లు

క్రొమ్ముడి వెద నూనెముడి కొండె కీల్గంటు చొల్లెము— ఇవి కేశబంధవిశేషములకు (కేశరచనావిన్యాసభేదములకు) పేర్లు

[ఉచ్చన — ఉచ్చెన - వావి పా (అప పా) (సం ఉచ్చైతక ఉచ్చి)- (సూ ని) ]

బ్రహ్మరంధ్రము —ఈ శిరోరంధ్రమునుండి యోగులు యోగమార్గమున హంసనిష్క్రమణ మొనరించి బ్రహ్మభావ మందుదురు అందులకే దీనికీపేరు కలిగినది

కేశము — చికుర కున్తలో వాల శ్చక కేశ శ్శిరోరుహ (అమ) తనూరుహం రోమ లోమ కేశా శ్శిరసిజా కచా (వైజ పాతా భూతా) ఇవి కేశ శబ్దము నిరుపపదమైనపుడు తలవెంట్రుకలనే చెప్పనను చున్నవి

అలకలు —చరిత్రాదులవలన మువర్ణకలోపము అలకా శ్చూర్ణకున్తలా తే లలాటే భ్రమరకా అని (అమ) చూర్ణ క్షోదే చ కుటిలే అని రభసుడు ఇచ్చట (అలకా శ్చూర్ణకున్తలా అనుచోట) సుధ ద్వే కుటిలకేశానామ్ అని తే లలాటే భ్రమరకా అనుచో- లలాటగతకేశానామ్ అని వ్యాఖ్యానించినది శర అలకలు-నెఱికురులు ముంగురులు-నొసటిపై గునుసు యాడెడు ఉంగరపువెంట్రుకలు -అనినది

కాకపక్షము — శిఖా బాలానాం సా కాకపక్ష శ్శిఖణ్డ శ్చ శిఖణ్డక అని (వైజ పాతా భూతా) బాలానాం తు శిర కార్యం త్రిశిఖం ముణ్డ మేవ వా అని విధి (చూ సుధ) శర త్రౌ లు ఎల్లజుట్టు-అని అర్థము చెప్పనవి (వాచ)- కాకితెక్కవలె ఉండెడి కర్ణపార్శ్వస్థకేశభేదము జుల్ఫా -అర్థ మను చున్నది (చూ సూ ని)

క్రొవ్వెద — ఇది కొప్పునకు పే రనినది సాంబ కొప్పు వేనలి మూల క్రొవ్వెద తుఱుమన గబరి యా (మాన ర) (వేనలి కి- జడ కొప్పు -రెం డర్థములు గలవు)

చుంచు అనుదానికి గూడ వేంక గొప్పుక్రొవ్వెద తుఱుము మూల చుంచు వేనలి యన రాణించు గబరి (మాన 38) అని కబరికి కొప్పు అర్థమనినది

కీల్గంటు — కేశబంధసామాన్యమునుగానే జడ కీలుగంటు క్రొమ్ముడి నూనెముడి యన దనరారు గేశబంధమ్ము (మాన 39) అనినది (వేంక) ఇది చుంచు అనుదానికి ఎగయు అర్థ మనినిది జుంచు తూ కటి ఎక జు ట్టన శిఖ కొప్పు (మాన 39)

కబరి — కబరి ధమ్మిల్లము పర్యాయము లనినది వైజ కేశకూట స్తు ధమ్మిల్ల కబరీ కర్వరీ సమే (పాతా భూతా) (అని) అమర మీరెండింటికి భేదము పచించు చున్నది కబరీ కేశవేశో౽థ ధమ్మిల్ల స్సంయతా కచా (అని)

[కేశబంధ విశేషముల గొన్నిటని నిఘంటువు లిట్లు విశదపఱచినవి(నూనెముడి జాఱుముడి దూముడి కీల్గంటు- నూనెముడి చొళ్లెము (చొళ్లయము)- జడతో చుట్టినచుట్ట కొండె-తలకు ముందుభాగమున వేసికొనెడుఎగ ముందుఎగ) అని]

సీ పాపట యన గను బరగు సీమంతంబు
జుంజుఱు సిక జుట్టు చుం చనంగ
శిఖ యొప్పు జడ యన జెల గును జటపేరు
వేనలి యన గను వేణి దనరు
రోమము బొ చ్చన ద్రుప్పుడు నా మీఱు
నారు నూగారు నా నలరు రోమ
రాజి శ్మశ్రుసమాఖ్య రాజిలు మీస మీ
సము నా గను జుబుకశ్మశ్రు వడరు

గీ గడ్డ మన వేష మగు వాలకమ్ము నా గ
వేస మన బారిసము నా గ వెలయును బస
దనము కైసేత యన ప్రసాధనము భక్త
పోషకాపాంగ శ్రీమాతృభూతలింగ 46

పాపట—ఇది సీమంతమునకు (కేశపద్ధతికి కేశవీథికి రెండుపాయలుగా కేశములను దువ్వి నడుమ ఎర్పఱచినతిన్ననిరేఖకు) పేరు

జుంజుఱు సిక జుట్టు చుంచు—ఇవి శిఖకు (తలనడుమ ఉండుజుట్టునకు) పేర్లు

జడ—ఇది జటకు (అంటుకొని పోయినఋష్యాదులజుట్టునకు) పేరు

వేనలి—ఇది వేణికి (ప్రవేణికి (అల్లిన) జడకు) పేరు

బొచ్చు త్రుప్పుడు—ఇవి రోమమునకు (లోమమునకు తనూరుహమునకు ముఖమున శిరమున గాక తక్కినదేహమునందు ఉండు వెంట్రుకలకు) పేర్లు

ఆరు నూగారు—ఇవి రోమరాజికి (రోమలతకు నాభిపై ఉండురోమపంక్తికి) పేర్లు

మీస మీసము—ఇవి శ్మశ్రువునకు (పైపెదవిమీఁది వెంట్రుకలవరుసకు) పేర్లు

గడ్డము—ఇది చుబుకశ్మశ్రువునకు (గడ్డము (చిబుకము) మీఁది నిడు పైన వెంట్రుకల గుంపునకు) పేరు

వాలకము వేసము బారిసము—ఇవి వేషమునకు (మాఱువేషమునకు) పేర్లు

పసదనము కైసేత—ఇవి ప్రసాధనమునకు (అలంకరణమునకు) పేర్లు

చుంచు — చిన్నజుట్టు అర్థ మని క్రిందిప్రయోగ ముదాహరించినది (సూని) చుంచెదుగు బాలు త్రావు ము దంచితము గ ననుడు బాలు ద్రావి జననితో జుంచెదుగ దనుచు లీలా చుంచుం డై యత డు చుంచు జూపు నరేంద్రా (భాగ 0పూ 49) ఇట జుట్టు అని (చుంచునకు) అర్థము చెప్పినను పై (భాగ) సరిపడునదియే ఆంధ్రా కు లక్ష్య మన దగినదే

వేనలి — ఆననలీల సుధాకరబింబనవాంబురుహంబులవె ల్వగుటకా వేనలి కృష్ణభుజంగకలాపినవిస్తరభాసుర మై చనుటకా (కు సం 7 840) వేనలికి పర్యాయముగా వేసరి కూడ ఉన్న దని చెలరేగి చెమటలు చెక్కిళ్ల జాఱ జిన్న బోయినమోము చెదరిన

బొట్టు వెన్నున దూగాడువేసరితోడ బంగారుముడి వీడి సడిపోయినట్టు లంగనామణి చింత నందుచు నుండె (అభి ద్వి 6) ఉదాహరించినది వేనలి అనియే ఇట అన వచ్చును

వేణి — వేణీ కచస్య బన్ధే స్యా న్నదీనాం మేళకె౽ఒ చ ఒని (విశ్వ)

అరు — ఒకకవి ఇట్లు వర్ణించినాడు- కొమిరెపొక్కిలిబంగారుకుందెనందు రతియు శృంగార మనుధాన్యరాశి నించి దంచ నిడినట్టిరో కలిసంచు మీఱి రోమరాజి దనర్చె నారూఢి గాగ (హంస 2 00)

సీ అదరు భూషణసంజ్ఞ తొడగు తొడవు మిన్న
సొమ్మనంగను గిరీటమ్ము వెలయు
దలకట్టు నాగను దనరును వాలపా
శ్యావిశేషములు సూసక తురాయి
ముత్యాలకుచ్చు కొప్పువల పాపటబొట్టు
జిలిబిలి జల్లియుఁ జేరుచుక్క
యనగ లలాటిక యగు బొంకం బన
గర్ణిక దుద్దన గా శెలంగు

గీ విచ్చుటాకు చెవ్వాకు నా వెలయు గర్ణ
పత్త్రనామంబు తాటంకవాచక మగు
గమ్మ యన గాను బంజులకమ్మ యనగ
రత్నతాటంక మెసగు జంద్రార్ధచూడ 47

తొడగు తొడవు మిన్న సొమ్ము — ఇవి భూషణమునకు (విభూషణమునకు అలంకారమునకు ఆభరణమునకు నగకు) పేర్లు

తలకట్టు — ఇది కిరీటమునకు (మకుటమునకు బొమిదికమునకు ఒకవిధ మైన రాజాదులతలపాగాకు) పేరు

సూసక తురాయి ముత్యాలకుచ్చు కొప్పువల పాపటబొట్టు జిలిబిలి జల్లి చేరుచుక్క—ఇవి వాలపాశ్యావిశేషములకు (స్త్రీలు తలను ధరించుకేశాభరణములలోని భేదములకు) పేర్లు

బాసికము—ఇది లలాటికకు (నొసట గట్టెడిముత్యాలబాసికమునకు లలాటాలంకారవిశేషమునకు పత్త్రపాశ్యకు) పేరు

దుద్దు—ఇది కర్ణికకు (కర్ణభూషణమునకు ఒకవిధ మగుచెవికమ్మకు) పేరు

విచ్చుటాకు చెవ్వాకు—ఇవి కర్ణపత్త్రమునకు (లక్కాకునకు స్త్రీలు చెవులందు ధరించెడి లక్క పూసినతాటాకునకు) పేర్లు

కమ్మ—ఇది తాటంకమునకు (దంతాదులతో చేసిన స్త్రీలు ధరించుకర్ణభూషణమునకు) పేరు

పంజులకమ్మ—ఇది రత్నతాటంకమునకు (రత్నములు పొదిగినతాటంకమునకు కమ్మపంజునకు) పేరు

భూషణసంజ్ఞ —[భూషణవిశేషములు గొన్ని (హంస) అచ్చటచ్చట ఇట్లుదాహరించినది- సూసకము తీగె మెడనూలు సొబగునాను (2 4౮) కుప్పె రాగ (గి) డిబిళ్ల కుంకుమరెఖ పాపటబొట్టు కమ్మలు బావిలీలు లలి సూర్యచంద్రవంకలు సూసకము కెంపు రవలపల్లెరపూలు రావిరెక (2 2 0) బేగడ కుతికంట్లు సూసకము ఘల్లను మెట్టెలు పూని (4 0) (చూ బ్రౌ సూసకము)]

తొడగు —(త తొడై) తొడుగు తొడువు (రూపాం) కొంతని కాదు చాల దొడగు ల్మడు గుల్ సువర్ణముల్ దొంతి గ నుప్పుతో గలుగుతొమ్మిదియుం గొని యే టికేటి కీ వంతు గ నాపెచే మననివారలు లేరు (ఘటికా 43) (చూ సూ ని)

వాలపాశ్యావిశేషములు —ఇందు కొన్నిటిని నిఘంటువు లిట్లు వివరించినవి - (సూసకము) స్త్రీలు తలయందు ధరించెడితిరుగుడుబిళ్ల ఎగపువ్వు తురాయి- స్త్రీలు వేణిపై అలంకరించుకొనెడిభూషావిశేష మిది- కళుకుకడానివాయ మెయి గన్పడ గా మెఱుగుందు రాయిలొ విలసత మైననీలఘనవేణికచే జెలు వొందుకోటకొమ్మల గని చంద్రు డుక్క

రవియు మాపును రేపును రక్తి మీఱ గా మెల గుచు (తారా 2 ) (కొప్పు వల) - తలవెండ్రుకలను బంధించునట్టిముత్యాలసరము (చేరుచుక్క) పాపటకు సరి గా నుదుట వ్రేలెడి అలంకారవిశేషము ముత్యాలబొట్టు అవి (బ్రౌ) పాపటబొట్టు అని (శ ర) పాపటయందు బెట్టుకొనెడిరత్నభూషా విశేషము ఒని (సూ ని) చేర్చుక్క (రూపాం) - ఎమంతపథమున జేర్చుక్కసవరించి (కాశీ 7 48) పాపటబొట్టు చేర్చుక్క లలాటిక సమానార్థకము లని కొన్నినిఘంటువు లను చున్నవి ఆం భా ఇవి వేఱు వే అర్థములు గల వను చున్నది [ఫాలపాశ్యా (వావి అపపా) వాలపాశ్యా పారితథ్యా అని (అమ వైజ)

ముత్యాలకుచ్చు —దీని నొక (ప్రత్యేక) పదము గా సూ ని శ ర బ్రౌ గ్రహింప లేదు ఇది యొక కేశాభరణవిశేష మని ఆం భా అను చున్నది ముత్యాలతో ఏర్పఱచినపూల గుత్తివంటి దిది కావచ్చును

జిలిబిలి జల్లి — జిలిబిలి జల్లి అని ఏకపదము గానే దీనిని గ్రహించి పాపటబొట్టు లలాటిక అనుఅర్థ మిచ్చినది (శ ర) గగనలక్ష్మీలతాతన్వికబరిమీ ద సంతరించిన ముత్యాలజల్లివోలె (కాశీ 4 86) మొ ప్రయోగములు వేఱుపదము లివి యనుచు కబరీభూషణ మిది యను చున్నవి

తాటంకము — తాడఙ్గము అని వైజ తాలపత్త్రం తు తాలకమ్ కర్ణపూర స్తు పుష్పాద్యై స్తాడఙ్గో దన్తకాదిభి (అవి) (సూ ని తాడంకము సం తాటంకము) అనుచున్న ది) ప్రయోగము లి ట్లున్నవి- జేవురించినలే తచెక్కుటద్దంబుల దాటంకయుగ ళంబు దన్ని యాడ (హర 3 92) (మొ) తాటంకము నకు (రూపాం) తాడ ఙ్గ మనిఎంచును దీని కైన - అపభ్రంశము తాడంకము కావచ్చును తాలపత్త్రం స్యాత్ అను - అమ వ్యాఖ్యానించుచు సుధ- తాటఙ్క అవ్యత్ర సువర్ణరచితస్యా ఎద మేవ నామ అని లాక్షణికము గా సువర్ణకర్ణభూషణమునుగూడ ఇది చెప్పు నని తెలి పినది

కమ్మ — దుద్దుకమ్మ పెద్దకమ్మ బందరుకమ్మ అని వీనిభేదము లుదాహరించినది (బ్రౌ)

సీ చెవులపువ్వు బొగడ బవిరె రారేక కుం
పెన రావిరేక ము ర్వన గ గర్ణ

భూషావిశేషము లొప్పెలుచ్చు ప్రోగన గర్ణ
వేష్టనసంజ్ఞ యై వెలయు దద్వి
శేషాభిధాన మై చెలగు గంటీ లొంట్లు
పోగులు చౌకట్లు నాగ నాసి
కావిభూషణము ముక్కఱ ముంగఱ యనంగ
జను చుండుఁ గంఠభూషావిశేష

గీ మౌను గుతికంటు మెడనూలు నాను తీగె
కంటసరి కంటె యంచన గాను బుస్తె
యన గ మాంగల్యసూత్రాఖ్య యలరు చుండు
బొట్టన దదంతరసువర్ణభూష యాళ 148

చెవులపువ్వు బొగడ బవిరె రారేక కుంపెన రావిరేక ముర్వు—ఇవి కర్ణభూషావిశేషములకు (కర్ణాలంకారములలోని భేదములకు) పేర్లు

ప్రోగు—ఇది కర్ణవేష్టనమునకు (కుండలమునకు) పేరు

కంటీలు ఒంట్లు పోగులు చౌకట్లు—ఇవి కర్ణవేష్టనవిశేషములకు (కుండలములలోని (చెవిప్రోగులలోని) భేదములకు) పేర్లు

ముక్కఱ ముంగఱ—ఇవి నాసికాభూషణమునకు (నాసామణికి అడ్డబాసకు (బులాకికి) పేర్లు

కుతికంటు మెడనూలు నాను తీగె కంటసరి కంటె—ఇవి కంఠభూషావిశేషమునకు (చక్రాకార మగు కంఠాభరణభేదమునకు) పేర్లు

పుస్తె—ఇది మాంగల్యసూత్రమునకు (మంగళసూత్రమునకు తాళికి) పేరు

బొట్టు—ఇది తదంతరసువర్ణభూషకు (మంగళసూత్రమున గ్రుచ్చెడిబంగారు నగకు తాళిబొట్టునకు) పేరు

రారేక — శిరోభూషావిశేషము అనునది దీనికి (అర్థాం) చెక్కడంపు బని హెచ్చుల్ దెచ్చురారెకతో గురు లల్లాడ నిటాల మెత్తుకొని యుగ్గల్ వేద (మిత్ర ప ? 28) (చూ ట్రౌ)

టొగడ — బుగడ (రూపాం) ఆడువారు కొనచెవిని ధరించెడిభూషావిశేషము

బవిరె — బవిర (రూపాం) చెవికి బెట్టుకొను గుండ్రవినగ

ప్రోగు — పోగు (రూపాం) బోగు నా దంతువును గర్ణభూష మీఱు (ఆం భా 3 56) చెవిసొమ్మునకును దంతువునకు బొ గన జెల్లు (సాంబ నానా 88) ఆం భా ఇచ్చట ప్రోగు పొగు సామాన్యవిశేషభావముతో వే అనియే వచించు చున్నది ఈవిశేష వాచకశబ్దమునే (నానా లో) ఆం భా సామాన్య వివక్షతో వచించినది

కర్ణవేష్టనము — కుణ్డలం కర్ణవేష్టనమ్ అని (అమ) ద్వే కుణ్డలస్య అని (సుధ) స్త్రీ పురుషులు పెట్టుకొను కర్ణభూషణములపేళ్లు పోగులు- అని (గురు) కమ్మ దుద్దు- వేఱు గా వచించినది (ఆం భా) (చూ 2 47) ఇవి మగవారికర్ణభూష ణము లనియే (ఆం భా) అభిప్రాయపడు చున్న దనిఎంచును

కంటీలు —చెవులకు పెట్టుకొనెడి పోగులు

ఒంట్లు — ఒంటీలు (రూపాం)- చిన్నారిచెలువంపు జికిలియొంటీలపొం కము రీవి గా భుజాగ్రముల నెరయ (ముకుంద 60 6 పం) (చూ సూ ని)

చొకట్లు —చొకటులు (రూపాం) ముత్యములు మొద లగునవి నాలుగు చేర్చి కట్టినపోగులు

కుతికం బ — కుత్తికకంటు (రూపాం) బంగారుతీకుతో బట్టె గా మెడ కంటి యుండు నట్లు చేసి యుంచుకొనెడు స్త్రీ భూషణవిశేషము- (అని) (శ ర) నాగవల్లినాడు పెండ్లికొమార్తెకు మెడను గట్టెడియాభరణవిశేషము - అని (సూ ని)

నాను —స్త్రీలు ధరించెడికంఠాలంకారము పులిచేరునాను (మొ) దీనిభేదములు

తీగె —తీగ (రూపాం) స్త్రీలు మెడను ధరించెడిబంగారుపట్టెడ అని (శ ర) స్త్రీలు మెడను ధరించెడు ఒకవిధ మైన బంగారునగ-అని (సూ ని) కంఠభూషాలతికలు దో చు దీగ నా అని (ఆం భా 3 55)

కంటసరి — కంటసరము (రూపాం) (సం కణ్ఠసర) లాయంబు గంచంబు నై యుల్లసల్లు నే దంట వేల్పునకును గంఎసరము (చం రా 3 23) (చూ సూ ని)

సీ పదకము తాళి నేవళము లంబెస సరి
పెన సరిపణి గొలు సన లలంతి
కావిశేషం బగు దావడం బన దండ
యన గ్రోవ యన సరి యన గ బే ర
నంగ జే రన గ జెలంగు సరము త్రిస
రంబు ముప్పేటపే రనఁగ వెలయు
సంవిశేషంబు లుత్తరిగె యుత్తుండంబు
బన్నసరంబు నా బం గు చుండు

గీ గడెము కడియము బొ ద్దొత్తు గాజు సూడి
గంబు చేకట్టు గో టు ముంగాముఱు వన
హస్తభూషావిశేషంబు లలరు చుండు
భూరిభవభంగ శ్రీ మాతృభూతలింగ 49

పదకము తాళి నేవళము లంబెస సరిపెన శరిపణి గొలుసు—ఇవి లలంతి కావిశేషమునకు (లంబన భేదమునకు మెడను వ్రేలాడు హారము లో నగు దానికి) పేర్లు

తావడము దండ క్రోవ సరి పేరు చేరు—ఇవి సరమునకు (ఒకపేటహారము నకు రుద్రాక్షమాల రత్నమాల-మొద లగువానికి) పేర్లు

ముప్పేటపేరు— ఇది త్రిసరమునకు (మూ డు పేటలు గలకంఠహారమునకు) పేరు

ఉత్తరిగె ఉత్తుండము బన్నసరము—ఇవి సంవిశేషమునకు (అ దువారికంఠ హారములలోని భేదములకు) పేర్లు

కడెము కడియము బొద్దు ఒత్తు గాజు సూడిగము చేకట్టు గోటు ముంగా మురువు—ఇవి హస్తభూషావిశేషములకు (చేతులకు ధరించెడి ఒకవిధమైన సొమ్ములకు) పేర్లు

సరిసెన — సరిపెణ - సంధిని వర్ణవికారము -అని (శర) సరిపెన అనియే (బ్రౌ పా) నునువెడందయురంబునను జీవిసరిపెనల్ మిన్నజన్నిదముతో మెలిగొనంగ (దశావతార 7 34) దీనిని (సన్నపుపని గల్గిన సరిపెన అనేటిహారవిశేషము - అని టీకతో గూడ) బ్రౌ ఉదాహరించుచున్నది (చూ అను)

సరిపణి — సరపణి -(వావి అపముద్రి) పచ్చలకడెంబులును సరిపణులు పూని (కవి 3 ఆ) సరిపణీ (రూపాం)- హురుముంజిముత్తెంపుసరిపణీలు (చంద్రా 2 ఆ) (చూ శర) సరిపణి - వెండిగొలుసు అని (బ్రౌ)

సరము —హారము (హారవిశేషము) హారో ముక్తావలీ త్రిస్యాత్తద్భేదా యష్టిసంఖ్యయా హార స్స్యా దేకయష్టిక యష్టి ర్నక్షత్రమా లైకా సప్తవింశతిమౌక్తికా అని (వైజ పాతా పురా)

బన్నసరము —(పఞ్చపరమ్) నానావిధములైనమణులు గ్రుచ్చినహారము హారవిశేషము- అని రెండర్థముల నిచ్చి రెండవయర్థమునకు (అం భా) ప్రమాణ మను చున్నది సూ ని మొదటియర్థము గూడ హారవిశేషములోనిదే వేఱుపఱపవలసిన యావశ్యకత కాన్పింపదు ముత్యాలపేరు అని ఆము (5 06 వ్యా)

ముంగామురువు — (ముంగామురము ముంగమురము ముంగామురుగు ముంగామురారి ముంగైమురారి (రూపాం) ముంజేత ధరించెడి కంకణము) (చేతికడెము)

[ చేకట్లు గోటు - అని (వావి పా) కరినవిద్రుమము చేకట్ల బడియె (వసు 2 45) (చేకట్టు (ఏ) చేకట్లు-బ) ]

[( సరవిశేషంబు) ఉత్తరిగె ముత్తెండంబు (వావి అపముద్రి)] ఉత్తరిగె-బన్నసరము -అని (బ్రౌ) ఉత్తరిగె ఉత్తండము బన్నసరము పర్యాయములుకావు- సరిగె ముక్కర బన్నసరము నుత్తండాలు కంకణబులు కట్లు కడియములును అని (హంస 2 90) (చూ సూ ని ఉత్తండము) ]

[ లంబెన (వావి సూ ని పా ) లొబ్బెన అని (బ్రౌ పా ) శ ర కూడ లొబ్బెన అనియే అను చున్నది ]

గొలుసు —గొలుసువలె ఉండి మెడ చేతులు ము న్నగువానియందు ధరింప బడెడి ఆభరణ విశేషము అని (సూ ని ) పగడములు గుండ్లు గుచ్చిన పేరు అని (బ్రౌ )

లలంతికావిశేషము —(లలంతిక) లమ్బనం స్యా ల్లలన్తికా (అమ ) కించిల్లమ్బమానక ణ్ఠభూషణస్య అని (సుధ ) మెడను వ్రేలాడు హారము లో నగునది- అని (శ ర ) పొడు పైనకంఠహారము అని (సూ ని ) సాతులడీ మొదలైనకంఠాభరణము - అని (బ్రౌ ) మెడయందు కొంచెము గా వ్రేలు చున్న పేరు -అని (గురు )

హస్తభూషావిశేషములు —(కొన్నిటికి వివరణము) (కడెము) (కటకము వలయము) స్త్రీపురుషులు చేత ధరించుగుండ్రని యొకనగ (బత్తు) మురుగులవంటియొకవిధ మగు చేతినగ (చూ సూ ని ) బిడ్డలచేతి ఒకదినుసుబంగారుసొమ్ము-అని (శ ర ) (గాజు) గాజుమట్టితో చేసిన వలయము (సూడిగములు)పైని ముద్దెలు (దుద్దులు) గలచేతికడియములు (చూ బ్రౌ )

సీ కేయూరనామంబు తాయె తనంగను
సందిదండ యనంగ సందికడియ
మన బాహుపురి యన నలరు నొడ్డాణంబు
కమరి యొడ్డణ మన గాంచి వెలయు
మొలనూ లనంగ నొప్పును గటిసూత్రాఖ్య
యంగుళీయం బగు నుంగర మన
ముద్దుటుంగర మన ముద్రాంగుళీయ మౌ
నంగుళీయవిశేష మలరు బటువు

గీ నా గ బాదాంగదం బొప్పు నందె యన గ
బెండె మన బెండియం బన బెండెర మన

గాను బెండేర మనఁగఁ దద్గతవిశేష
మెసఁగుఁ బాడగ మనఁగ బాలేందుమౌళి 150

తాయెతు, సందిదండ, సందికడియము బాహుపురి—ఇవి కేయూరమునకు (భుజకీర్తికి, అంగదమునకు సందిలి = దండచేయి దానియందు కట్టుకొనుభూషణమునకు దండకడియమునకు) పేర్లు

ఒడ్డాణము, కమరి ఒడ్డణము—ఇవి కాంచికి (ఆఁడువారియొంటిపేటమొలనూలునకు, బంగారు లో నగువానిపట్టెకు) పేర్లు

మొలనూలు—ఇది కటిసూత్రమునకు (రశనకు మేఖలకు స్త్రీలు అలంకారముగా ధరించెడి బంగారు లో నగువాని మొలత్రాటికి) పేరు

ఉంగరము—ఇది అంగుళీయకమునకు (ఉంగ్రమునకు, చేతివ్రేలికి పెట్టుకొను నగకు) పేరు.

ముద్దుటుంగరము—ఇది ముద్రాంగుళీయకమునకు (ముద్రికకు సికాయుంగరమునకు, ముద్దుటుంగరమునకు, అక్షరములు చెక్కిన ఉంగరము నకు) పేరు

బటువు—ఇది అంగుళీయవిశేషమునకు (గుండ్రనితాటయుంగరమునకు) పేరు

అందె పెండెము పెండియము పెండెరము పెండేరము—ఇవి పాదాంగదమునకు (అందెకు నూపురమునకు స్త్రీలు కాళ్లయందు ధరించెడినగకు) పేర్లు

పాడగము—ఇది పాదాంగదవిశేషమునకు (ఒకవిధ మగుస్త్రీలకాలినగకు) పేరు

కేయూరము — కేయూర మఙ్గదం భూషా దోర్మూలే (వై జ పాతా పురా)

తాయెతు — (క తాయిత్తు త తాయెత్తు) తాయి+ఎత్తు=తల్లి రక్షణార్థము బిడ్డలకుఁ గట్టు-ఎత్తు-సరి. తల్లి కాపునకై కట్టఁ దగినసరులు తేలఁ బల్కఁగ దేశ్యము ల్దెలు గునను' (అప్ప 2 86) అని (సూ ని) అహోబలపతి దోలాభూషోత్తరీయాణి వినైత్వం నాస్తిమధ్యయే' అను (అథ కా) ఉదహరించి అప్పకవివ్యుత్పత్తి అప్రమాణమనినాఁడు తాయెత్తు', తాయెత-' (రూపాం) (తాయెత్తు) మందులతాయెత్తులు

గట్టనకా శబరపుత్రు ల్గాడి యాడం బురిన్' (కాశ 3 32) (తాయెత) తలఁపున నిది గాంధ మని తలఁపుమ మాసింగఁ దల్లితరిగొందదరికా దల మోచి తెచ్చినవి యివి తల యంచుము పసిఁడితాయెతల నుంచి నృపా (శుక 99) మొ

ఒడ్డాణము —[సం ఓడ్యాణము క ఒడ్యాణ (ఒడ్డణ) త ఒడ్డియాణం) స్త్రీలు యోగులు మొద లైనవారు నడుమున ధరించెడిస్వర్ణాదిమయ మగుపట్ట- అని (సూ ని) ఒడ్డియాణము (రూపాం). 'కత్తెరల నొడ్డియాణము లత్తిరించి (ప్రబంధ 769)

కమరి — కమరు (రూపాం)- లజ్ఞ యెఱుఁగనికటిమండలంబుమీఁద వలఁదవజ్రాల కమరు గర్వంబు సూప (కాశీ 3 241)

కాంచి — స్త్రీకట్యాం సప్తకీ కాఞ్చీ' అని (వై జ పాతా పురా) స్త్రీలమొలనూళ్లు ఐదు విధము లైనవి గా వచింపఁబడినవి- ఏకయష్టి ర్భవే త్కాఞ్చీ మేఖలా త్వష్టయష్టికా సప్తకీ సప్తయష్టి స్స్యా త్త్రిభి స్సారసనం స్మరైః' (అని) ఈవిశేషవివక్ష చేయక సాధారణము గా స్త్రీకట్యాం మేఖలా కాఞ్చీ సప్తకీ రశనా తథా క్లీబే సారసనం చ అనినది (అమ)

కటిసూత్రము — కటిసూత్రం సారసనం మేఖలా రశనా' అని (వై జ పాతా పురా) స్త్రీలు మొలత్రాడు ధరించుట పూర్వము గలదు- పురా కల్పే హి నారీణాం మౌఞ్జీ బన్ధన మిష్యతే అధ్యాపనం చ వేదానాం ' అని (స్మృతి) అదియే అలంకారార్థమై సువర్ణ మయము లగు-ఈ మొలనూళ్లు గా అయి యుండ వచ్చును

ముద్రాంగుళీయకము — సాక్షరా ఽఙ్గులిముద్రా సా' అని (వై జ పాతా పురా)

పెందేరము —ఇది దీనిపర్యాయములు అందెనే (స్త్రీలపాదభూషావిశేషమునే) మొదటఁ జెప్పుచు ఏతత్సదృశ మగుటచే లాక్షణికము గా శూరులకాలిబిరుదునగను జెప్పి, తరువాత వానియం దివి రూఢము లైన వనిపించును నెరిమి డాకాలఁ బెందేరంబుఁ బెట్టి ' (ద్వి సార 52) (మొ) (చూ బ్రౌ) కనుకనే, గండపెందేరము గండపెండియము' అనురీతినిఁగూడ ఇవి ప్రయోగదృష్టము లగు చున్నవి

[బాదగ — బాడిగ' (వావి అపముద్రి)]

సీ. గంట యం చనఁగను ఘంట యౌను, బురుజు,
చిఱుగంట మువ్వ గజ్జె, యన క్షుద్ర
ఘంటావిశేషంబు గన్పట్టు చుండును
మను వీరమద్దె నా మట్టె యనఁగ
బిబ్బిలికాయ, నాఁ బిల్లాణి యనఁ జిటి
బొద్దు, నాఁగను గ్రమంబు గఁ బదాంగు
ళీవిభూషలు, మట్టె లీవల రానీని
తాకుపే ర్మ్రోం చనఁ దనరు చుండు,

గీ. సేల యనఁ బుట్ట మనఁగను జీర యనఁగఁ
గప్పడ మనంగఁ గోక నాఁ గట్టన మన
వస్త్రనామంబు చెలఁగును, వలువ వలువు
వలిప మన సూక్ష్మవస్త్రంబు వఱలు, నీశ 151

గంట—ఇది ఘంటకు (గణగణ మ్రోయుగంటకు ఎద్దుమెడపట్టెడ లో నగువాని లోనిగంటకు) పేరు

బురుజు, చిఱుగంట మువ్వ, గజ్జె—ఇవి క్షుద్రఘంటావిశేషమునకు (కింకిణికి, అలంకారముగా మొలనూలు మొద లగువానిలో గ్రుచ్చెడిచిన్నగంటకు గలగల మ్రోయుచిన్నగజ్జెకు) పేర్లు

(వీరమద్దె—మొదలుకొని చెప్పఁబడినవి ఐదు క్రమముగా పదాంగుళీభూషలకు (కాలివ్రేళ్లకు ధరించుసొమ్ములకు) పేర్లు.)

వీరమద్దె—ఇది మొదటివ్రేలికి (బొటనవ్రేలికి) ధరించునగకు పేరు

మట్టె—ఇది రెండవవ్రేలికి ధరించెడినగకు పేరు

బిబ్బిలికాయ—ఇది మూఁడవవ్రేలికి ధరించునగకు పేరు

పిల్లాణి—ఇది నాల్గవవ్రేలికి ధరించునగకు పేరు

చిటిబొద్దు—ఇది ఐదవ్రేలికి (చిటికెనవ్రేలికి) ధరించెడినగకు పేరు

మించు—ఇది తాకునకు (టాకునకు, మట్టె యీవలికి రానీయ కుండఁ జేయు సాదామట్టెకు) పేరు

నేల పుట్టము చీర కప్పడము కోక కట్టనము—ఇవి వస్త్రమునకు (వసనమునకు) పేర్లు

వలువ వలువు వలిపము—ఇవి సూక్ష్మవస్త్రమునకు (సన్ననివస్త్రమునకు, వల్వకు) పేర్లు

గంట — కనకాచలేంద్రంబు గళమునఁ గట్టినకమనీయ మగుపై డిగంట గాఁగ' (కు సం 8 22) (నందికేశ్వరవర్ణన) (చూ సూ ని)

బురుజు — బురజ' అని (శ ర) బురుజు బురజ' రెండును గ్రహించినది (బ్రౌ)

మువ్వ —'మువ్వలు గంటలు న్మొరయ ముందటికూఁకటిరావిరేకతో నవ్వనజాక్షుఁ డాడు' (హరి పూ 6 94)

క్షుద్రఘంట — క్షుద్రఘణ్టా తు కిఙ్కిణీ అని (వై జ పాతా. పురా)

వీరమద్దె —(సం వీరమధ్యము)-అని శ ర) (సం వీరముద్రికలు') పాదమధ్యాంగుళియం దుండే వీరముద్రికలు- (అని) (బ్రౌ) వీరముద్దె' (రూపాం.)

మట్టె — అందెలుఁగా మట్టెలు దిట్టమై చెలఁగ మందగతిం జని యవ్వనంబునఁగా' (భో 3అ) (చూ.శ ర). మెట్టె' మెట్టియ' (రూపాం). అందపుజాఱుకొప్పు నసియాడెడుకొనును లేఁతవెన్నెలల్ సిందెడునవ్వు నబ్బురపుసిబ్బెపుఁగుబ్బ సగంబు గానరాఁ గ్రిందను జీరుపయ్యెదయు గిల్కు గిలు క్కని మ్రోయుమెట్టియల్ చందమరంగ నిందుముఖి చందురుముందఱ నిల్చెఁ గుల్కుచుఁగా' (తారా 2 79)

బిబ్బిలికాయ — బిబ్బిలికాయ' అని (వావి అపముద్రి) తళుకుఁబిల్లాండ్లు బిబ్బిలికాయలును మట్టి యలు వీరముద్దెలు నందియలును' (కలా 7.66) బుబ్బిలికాయ' అనికూడ (బ్రౌ.)

చిటిబొద్దు — చిటికెనబొద్దు- (రూపాం) [చిటిబొట్టు' బ్రౌ వ్రాఁతప్రతిపా అని (సూ ని)]

మించు — పురుషతర్జన్యాభరణము' అని (శ ర) కాలిచుట్టు' అని (బ్రౌ) స్త్రీలు కాలిరెండవ వ్రేలికిఁ బెట్టుకొను ఆభరణవిశేషము' అవి (సూ వి)

సీ విరళవస్త్రముపేరు వెలయు నుడుగర. నా
        నడరు గడితము సుగ్గడిత మనఁగ
    సాంద్రవస్త్రాభిధ, చనుఁ బట్టుచీర, నాఁ
        బట్టాంశుకము సూర్యపటము దనరు
    సూరెపుటంబు నా మీఱు నెల్లా నేలు
        సాలు, వనంగను శాటికాఖ్య
    వస్త్రభారముపేరు వఱలు లుంగ యనంగ
        నిడుపు చాఁ, పనఁగను నెగడు దైర్ఘ్యి

గీ మడరుఁ బరిణాహము తనర్పు వెడలు పనఁగ,
    నంశుకాంతంబు చెఱఁగు కొం గనఁగ వెలయు,
    నంచలంబు విరాజిల్లు నం చనంగ,
    భూరిభవభంగ శ్రీమాతృభూతలింగ 152

ఉడుగర—ఇది విరళవస్త్రమునకు (పలుచనినేఁత గలిగి బహుమతి గా ఈయఁదగిననన్నివస్త్రమునకు) పేరు

గడితము, సుగ్గడితము—ఇవి సాంద్రవస్త్రమునకు (దట్ట మైన (చిక్క నైన) నేఁత గలవస్త్రమునకు) పేర్లు

పట్టుచీర—ఇది పట్టాంశుకమునకు (కౌశేయమునకు, పట్టుబట్టకు, పట్టుతో నేసిన వస్త్రమునకు) పేరు

సూరెపుటము—ఇది సూర్యపటమునకు మేలుజాతిపట్టుతో (మేల్తరమైన మొకమాలు'తో) (నేసిన ఒకవిధ మగువస్త్రమునకు) పేరు

నెల్లా నేలు సాలువ—ఇవి శాటికకు (అంచు లేనివస్త్రమునకు సంన్యాసులశాటి లో నగువానికి) పేర్లు.

లుంగ—ఇది వస్త్రభారమునకు (గుడ్డలమోఁతకు, వస్త్రములయొక్క యెక్కువ బరువునకు) పేరు

నిడువు చాఁపు—ఇవి దైర్ఘ్యమునకు (వస్త్రము మొద లగువాని - ఆయామము' నకు - పొడుగునకు) పేర్లు

తనర్పు, వెడల్పు—ఇవి పరిణాహమునకు (వస్త్రము మొద లగువాని - విరివికి-వైశాల్యమునకు) పేర్లు

చెఱఁగు, కొంగు — ఇవి అంశుకాంతమునకు (చేలాంచలమునకు వస్త్రముకొనకు) పేర్లు.

అంచు—ఇది అంచలమునకు (అగ్రమునకు, కొనకు) పేరు

సూరెపుటంబు —(సం సూర్యపటము) (చూ శ ర ) సూరిపుటము'గూడ (రూపాం ) అనినది (బ్రౌ ) వస్త్రవిశేషము' దీనికి అర్థ మని మొకమాలులును సూర్యపుటములు బనాతులు' (హంస 5 148 ) అనినదికూడ (బ్రౌ ) సూరెపుటములు' అని (శ ర.పా )

అంచలము — వస్త్ర స్యాన్తో మతో ఒఞ్చలః' అని (హలా ) ఐనను ఉగ్రార్థకము గాఁగూడ దృగంచలము ఇత్యాదులయందు ఇది సుప్రసిద్ధము ఈ అంచు'నకు కత్తి యంచు' మొ. ఉదాహరణములు కమ్మి' మొద లగునవి ఆం ఛా దీనికి అర్థములు గా వచించినది (2 163 మొ )

సీ బద్దె, యం చనఁగను వత్తి, యనంగను
 చేక, మం చనఁగను జెలఁగు దశలు,
కమ్మి, యం చన నంశుకాగ్రావయవవిశే
 ష మ్మొప్పుఁ, దద్విశేషమ్ము చిట్టె,
యన మీఱుఁ గచ్ఛభేదాభిధాన మెసంగుఁ
 గాసె కుచ్చెల కుచ్చె కచ్చె పింజె,

చుంగు, రింగు, నెఱిక, చింగు నెఱి యనంగ
నీవి పోఁకముడి నా నెసఁగు చుండు

గీ వస్త్రపుటి దగు నొడి యనఁ, బటము దనరుఁ
బడ మనఁగ, ధౌతవస్త్రంబు పరఁగు మడుఁగు
మడత మడి చలువ యనఁగ మనుసు వింత
వన్నె గలకోకపేర్వ్హారవలి యన భవ 53

బద్దె, వత్తి చేకము—ఇవి దశలకు (వస్త్రాంతావయవమునకు ఒకవిధ మగువస్త్రపుచివరియంచునకు) పేర్లు

కమ్మి అంచు—ఇవి అంశుకాగ్రావయవవిశేషమునకు (వస్త్రమునకు ముందుండు నిలువుటంచునకు పట్టుఁగమ్మి - రుద్రాక్షయంచు మొద లగువానికి) పేర్లు

చిట్టె— ఇది తద్విశేషమునకు (వస్త్రములయంచులందు నేసెడిచిన్నకమ్మికి) పేరు

కాసె, కుచ్చెల కుచ్చె కచ్చె పింజె చుంగు రింగు నెఱిక చింగు నెఱి—ఇవి కచ్ఛభేదమునకు (వస్త్రభంగమునకు ఒకవిధ మైనబట్టమడతకు) పేర్లు

పోఁకముడి—ఇది నీవికి (నీవీబంధమునకు కటివస్త్రగ్రంథికి, ఉచ్ఛ్రయమునకు స్త్రీలు ముందుపైపు వేసికొనుకోకముడికి) పేరు

ఒడి—ఇది వస్త్రపుటికి (అంకమునకు బుట్టవలె ఏర్పడినతొడమీఁదివస్త్రమునకు) పేరు

పడము—ఇది పటమునకు (సుచేలకమునకు అంద మైనవస్త్రమునకు) పేరు

మడుఁగు, మడత, మడి చలువ—ఇవి ధౌతవస్త్రమునకు (ఉదికినవస్త్రమునకు) పేర్లు

హేరవళి—ఇది వింతవన్నె గల కోకకు (పలురంగులు గలిగినవలువకు) పేరు.

దశలు — స్త్రియాం బహుత్వే వస్త్రస్య దశా స్స్యుర్వస్తయో ర్ద్వయోః' (అమ) దశా వర్త్యా మవస్థాయాం వస్త్రాన్తే భూమ్ని పుంస్త్రియోః' (రభసుఁడు) వస్త్రాన్త స్త్వఞ్చలో వస్తి స్త్వక్లీ భూమ్ని దశా (వైజ పాతా పురా) వస్త్రాన్తావయవము వస్తి దానినిఁ జెప్పునప్పుడు దశా' శబ్దము నిత్యబహువచనాన్తము- అని పైనిఘంటువు లను చున్నవి అందులకే దశలు' అనఁబడినది.

పటము — సుచేలకః పటో ఽస్త్రీ స్యాత్' అని (అమ)

హేరవళి — హేరావళి (రూపాం) పొడవన్నెకోక'-అని (శర) వన్నెకోక- అని (బ్రౌ) హారవళి-అనికూడ (బ్రౌ.) పొడవన్నెకోక-అనునది ఒరంగలువ్యవహార మునందలి యర్థము (చూ బ్రౌ)

సీ. కావి యం చనఁగను గాషాయ మై యొప్పుఁ
జందురకావి, నాఁ జనును రక్త
వస్త్రము, చెంద్రికవన్నె నాఁ జెంగావి,
యనఁగఁ గౌసుంభ మై యలరు చుండు,
నరుణవస్త్రంబు తోఁ పనఁ దోఁచు చుండును,
నీలవస్త్రం బగు నీలి యనఁగ
సిక్థపువస్త్రంబు చెలఁగు న త్తనఁగను
మాంజిష్ఠ మెసఁగును మంజిడి యనఁ

గీ. బప్పళి బవంతి కరకంచు పట్టెమార్పు,
మాదళంబులు, దళ్లు బొమ్మంచు, లుడుత
చాలు లేనుఁగడుగు లన మీఱు నిట్లు
చిత్రవస్త్రవిశేషము, ల్చిత్స్వరూప 154

కావి—ఇది కాషాయమునకు (ఇటికజాతివంటి యెఱుపువన్నె గల వస్త్రమునకు) పేరు.

చందురకావి—ఇది రక్తవస్త్రమునకు (సిందూరమువంటి (కుంకుమపూవువంటి)

లేఁతయెఱుపు (ఎఱుపు తెలుపు వన్నె) గులాబివర్ణము కలవస్త్రమునకు) పేరు

చెంద్రికవన్నె చెంగావి—ఇవి కౌసుంభమునకు (కుసుంభరాగము (కుసుమపువ్వు యొక్కయెఱుపు) ఎఱ్ఱనియెఱుపు (అగ్నిజ్వాలవంటిప్రకాశము) కెంపువన్నె గల వస్త్రమునకు) పేర్లు

తోఁపు— ఇది అరుణవస్త్రమునకు (నలుపు మించినయెఱుపువన్నె గల వస్త్రమునకు) పేరు

అత్తు—ఇది సిక్థపువస్త్రమునకు (మైనపుగుడ్డకు) పేరు

మంజిడి—ఇది మాంజిష్ఠమునకు (రాగివంటి) ఎఱుపు (గులాముపొడివంటి యెఱ్ఱనిరంగు) కలవస్త్రమునకు) పేరు

ఎప్పళి బవంతి కరకంచు పట్టెమార్పు మాదిళములు తళ్లు బొమ్మంచులు ఉడుతచాఱలు ఎనుఁగడుగులు—ఇవి చిత్రవస్త్రవిశేషములకు (పలురంగులు గలవస్త్రములలోని భేదములకు) పేర్లు

చందురకావి —చంద్రకావి (రూపాం) ప్రౌ చంద్రకావి' అనుదానికి గులాబిపూవు వంటివర్ణము'- అనునర్థము నిచ్చినది విజ వి ప్రయోగ మిట్లున్నది కలయఁగఁ జెంద్రకావిఱవికంబలెఁ గుంకుమ పూసి చూడు మో పొలఁతుక నాదునే ర్పనిన' (2. 92.)

రక్తివస్త్రము —రక్తశబ్దమునకు కుంకుమపువ్వు (రాగద్రవ్యవిశేషము) అనునర్థము గూడఁ గలదు కుఙ్కుమం ఘుసృణంవర్ణ్యం రక్తం లోహితచన్దనమ్' (వైజ భూ వైశ్యా) నాగోద్భవా తు సిన్దూరం కుఙ్కుమేన సమప్రభమ్- అనియు (భూ వైశ్యా) వైజ

అరుణమ — అవ్యక్తరాగ స్త్వరుణః'- అని (అమ) అరుణః కృష్ణలోహితః అని (అమరమాల)

అత్తు — దీనిని (ప్రౌ మాత్ర మిచ్చినది (చూ లను) చిత్రవస్త్రవిశేపముల్' అని (వ్రాఁతప్ర పా) చిత్రవర్ణవిశేషముల్ (ముద్రి పా) నిఘంటువులు రెండుపాఠములు గ్రహించి రెండువిధము లగు వ్యాఖ్యానములు చేసినవా' అనునట్లు రెండర్థములకు

ప్రయోగము లిచ్చి దీనినే (ఈ అం భా నే) ప్రమాణీకరించు చున్నవి (మా బ్రౌ శ ర మొ)

మాంజిష్ఠ —కాషాయము మాంజిష్ఠము కౌసుంభము నీలి'- వీనినిఁ బాణినీయము (ప్రత్యేకము గా) సాధించినది తేన రక్తం రాగత్ (4 2 ) అనుసూత్రముచే అణ్ణంతము లు గా సాధితములు మొదటిమూఁడు ఇఁక నాల్గవది (నీలి) నీల్యా అ న్వక్తవ్యః' నీలా దోషధౌ అనువార్తి కములచే సాధితము. (కషాయము, మంజిష్ఠ కుసుంభము నీలి- అనునవి రాగద్రవ్యములు (రంగులు) వానిచే రంగువేయఁబడినవస్త్రములు క్రమము గా వీని కర్థములు మాంజిష్ఠమునుగుఱించిన వివరణ మి ట్లున్నది మంజిష్ఠలతనుండి తీసినయెఱుపుతో రంగు వేసిన వస్త్రము ఈయెఱుపురంగు మాయదు చాల మనోహ రము గా ఉండును మంజిష్ఠ' యనుట సార్థకము ఇది చాల విలువ గలవస్త్రము- ఏడఁ బోయెనొకదా పేటులమాంజిష్ఠి పెనుబండుపున బైటఁ బెట్టఁ జాల - (కాశీ. 4 08 నా పరిష్కరించిన ప్రతిపా) ఇట పేడలో'(ముద్రి అపపా) (సూ ని)- మాంజి ష్ఠమును మంజిష్ఠము'- (చిరువేరువంటిచాయవేరు) (దాని) తో రంగువేయఁబడినది' అని వివరించినది

మంజిడి —మంజిటి- మాంజిష్ఠవస్త్రము- అని (బ్రౌ అను) మంజిడి-చిత్రవర్ణవస్త్రము'- అని (శ ర)

కరకంచు — కరయంచు (వావి పా) ప్రయోగము లి ట్లున్నవి ముత్తెలపందిళ్ల నుత్త రగోగ్రహ ణంబులు కరకంచు నాఁచువన్నె నిండువన్నెయు మొదలు గా వల్వలు ధరించి ముదితలపుడు' (ప్రబంధ 272) కదంబకావులును గరకంచులును బొమ్మంచు లును ముడుఁగుబొమ్మంచులును మయ్యంచులును (ద్వా 3 188) (సూ సూ ని.).

మాదళములు — మాదావళము మాదవళము- (రూపాం) కపిలవర్ణము (గోరొచన వర్ణము) గలచీర వస్త్రవిశేషము- (అని) (సూ ని.)

తళ్ల —ఈయర్థమున దీనిని గ్రహింప లేదు (శ ర సూ ని మొ)

సీ జంబాజు నేరాజు, బురుసా తగటి యనఁ
గలదౌతవస్త్రము ల్చెలఁగు చుండు

నవి నల్లచాయచే నలరు చున్నను గసీ
సం బనఁగాఁ దగు, సరి గనంగ
నీవస్త్రముల నేయ నెసఁగుదారం బగుఁ
గంచెల అవిక తైక, యన నడరుఁ
గంచుళీనామంబు కాంతోత్తరీయంబు
పయ్యెద. పయంట పైఁట పయిఁట

గీ. పైయెద పయంట నాఁగను బరఁగు చుండుఁ
బ్రజలు వస్త్రమకుటము కుళ్లా కుళాయి
యనఁగఁ, దద్భేదము తపార మనఁగఁ దెక్కి
యనఁగఁ జౌ తనఁ దోపి నా నలరు నభవ 155

జరబాజు నేరాజు బురుసా తగటి—ఇవి కలధౌతవస్త్రములకు (జరిబట్టలకు) పేర్లు

కసీసము—ఇది నల్లనిచాయ గలకలధౌతవస్త్రమునకు పేరు

సరిగ—ఇది ఈవస్త్రముల నేయ నగు దారమునకు (జరీపోఁగునకు, వెండి-మొద లగువానితో (మొలాము) చేసిననూలిపోఁగునకు) పేరు

కంచెల అవిక తైక—ఇవి కంచుళికకు (స్తనావరణమునకు చనుఁగప్పునకు ఆఁడువారి అయికకు) పేర్లు

పయ్యెద పయ్యఁట పైఁట పయిఁట పైయెద పయఁట—ఇవి కాంతోత్తరీయమునకు (ఆఁడువారిపైబట్టకు పైరకు) పేర్లు

కుల్లా, కుళాయి—ఇవి వస్త్రమకుటమునకు (వస్త్రముతో నిర్మించినకిరీటమునకు) పేర్లు

తపారము టెక్కి చౌతు టోపి—ఇవి తద్భేదమునకు (కుళ్లాయలలోని భేదములకు) పేర్లు

బురుసా —( బురసా'-పావి పా ) (హిం బురుసా) బురుసా అని (బ్రౌ సూ ని.) శ ర సూ ని ఇందులకు ప్రయోగము లిచ్చినవి కువల ప్రయోగ మొకటి ఇట్లున్నది- గజాంబు ధిరాజపుత్త్రి కారాత్రికంబు సవరింపం బరంపర లై బావుదీరు ప్రతాపాంకురంబు లనం బరఁగుబురుసలతో' (5 4) ఇచ్చటి యనుప్రాసమునుబట్టి చూచిన బురస' ఇది అనిపించును బురుస కు ఉదాహరించిన ప్రయోగము లన్నియు బురస' అనిన సరిపడు నవియే ఐనను భాషాంతరసంవాదమునుబట్టి ప్రయోగబాహుళ్యమునుబట్టి బురుసా ' ఇది అగు ననిపించినది

కుళ్లా — కుళాయ కుళ్లాయ కుళ్లాయి'-(రూపాం ) చిన్నటోపి' (అని) (సూ ని )

తపారము — తవారు -(రూపాం )-అనినది శ ర. తపాళము (రూపాం ) అని బ్రౌ - మూఁ పునం బడిశమును జుంజురుందలతపాళము' (పం 2 9 ) అని ప్రయోగ మిచ్చినది (చూ అను )

టెక్కి — దాసరికుళ్లాయ'-అని గౌదకట్టుక సెచేరులటెక్కియు' (ఆము 6 8 ) ప్రయోగ మిదాహరించినది (శ ర ) [ఇట-బ్రౌ పా గౌదకట్టు గలచేరులటెక్కియు' (అని ) (చూ గౌదకట్టు-బ్రౌ అను ) ]

చౌతు — జౌత అని గ్రహించి కుళ్లాయి'-అర్థమని బూడి బ్రుంగిన మొకంబున గౌద కట్టు మై నపుమైల ప్రాజౌతనా వెలుంగ (ఆము 7 8) ప్రయోగ మిచ్చుచున్నది ఇట ప్రాఁజౌత' అనియే (శ ర పా )

టోపి —(తు టొప్పి హిం టోపి ) టొప్పి' (రూపాం ) హరిగదావిహార మల్లంత దోఁచిన వరము మిమ్ముఁ గావ వలఁతి యగునె? పెట్టివార పిడుగు వ్రేసినఁ దలటొప్పి యాఁగునే వివేక మైన వలదె?' (ఉ హరి 4 166 ) (చూ సూ ని ) తోపి' యొక్క మొదటిరూపము తొప్పి'అని' తొప్పి'గాఉదాహరించు చున్నది (ఉ హరి ) ప్రయోగ మును (శ ర ) తోపి' (బ్రౌ ) గ్రహించినది

సీ పాగ యం చనఁగను బరఁగు నుష్ణీషంబు
దద్భేదసంజ్ఞ యై తగు రుమాల
యనఁగఁ గూర్పాసాఖ్య యలరును దుత్తాయి
యరచట్ట కుప్పసం బంగి కుబుస,

మనఁగఁ గంచుకభేద మలరారుఁ జోలా చొ
కాయ, చొక్కాయ చొక్కా చొకా చొ
గా నఁగ దుప్పటి యౌను హసావళి
దువ్వల్వ వీణము దుప్పట మన

గీ నవియె కూర్పనిచో తేఁకు లనఁగ వెలయు
జంటపోఁగులవలువ యౌ గింటె మనఁగఁ
బ్రచ్ఛదపటంబు వెలయును బచ్చడ మనఁ,
బోరువ యనంగఁ దద్భేదము దగు నభవ 56

పాగ—ఇది ఉష్ణీషమునకు (శిరోవేష్టనమునకు తలపాగకు తలగుడ్డకు) పేరు

రుమాల—ఇది ఉష్ణీషవిశేషమునకు (ఒకవిధ మగుతలపాగకు) పేరు

దుత్తాయి అరచట్ట కుప్పసము అంగి కుబుసము—ఇవి కూర్పాసమునకు (చిన్నచొక్కాకు, మొలవఱకు వచ్చుచొక్కాకు) పేర్లు

చోలా చొకాయ చొక్కాయ చొక్కా చొకా, చొగా—ఇవి కంచుకవిశేషమునకు (ఒకవిధ మగుచొక్కాకు) పేర్లు

దుప్పటి దువ్వల్వ వీణము దుప్పటము—ఇవి హసావళికి (ద్విపటికి రెండు బట్టలు కలపి కుట్టిన (కప్పుకొను) ముతకబట్టకు) పేర్లు

తేఁకులు—ఇది కూర్పనిదుప్పటికి (కలపనిదుప్పటికి దుప్పటిలోని సగమునకు) పేరు

గింటెము—ఇది జంటపోఁగుల వలువకు(జమిలిపోఁగునేఁతబట్టకు) పేరు

పచ్చడము—ఇది ప్రచ్ఛదపటమునకు (కప్పుకొనుటకు పఱచుకొనుటకు ఉపయోగించెడి దుప్పటికి నిచోళమునకు) పేరు

పోరువ—ఇది ప్రచ్ఛదపటవిశేషమునకు (ఒకవిధ మైనపచ్చడమునకు) పేరు

రుమాల — రుమాలు రుమాలువు. (రూపాం.) ఈరూపములనే గ్రహించినవి (సూ ని శ ర లు) తనకెంజడలచిన్నె తళుకు చంద్రికవన్నె పూలసైకపురుమాల్ పొలుపు గాఁగ' (ఇందు 17). చిటిలినగందముం దళుకుచెంపను వ్రేలురుమాలు జాఱుదుప్పటియును నిద్ర దేఱుముఖపద్మము' (శుక 155) రుమాలుగుడ్డ- (చేరుమాలు) దీనినుండి ఏర్పడినదియే అలకముల్ మాటి యొదలఁ బాగఁ జుట్టి పై నద్దకట్టురుమాలు గుడ్డ కట్టి (వై జ 247)

కూర్పాసము — కూర్పాస స్త్వర్ధచోళకః అని (హారావలి). చోళః కూర్పాసకో ఒఽస్త్రియామ్ అని (అమ) (చూ గురు) కొందఱు వీనిని స్త్రీలకు సంబంధించినవానిఁ గాసమన్వయించు చున్నారు (చూ. సుధ)

[అరచట్ట — అరదట్టీ-(వావి అపపా)]

అంగి — ఇది మీఁగాళ్లదాక వ్రేలాడుచొక్కాను గూడ వచించును తనయుద్గ్రసమగ్రతర విగ్రహమునకు నింగిదట్టపునీలి యంగి గాఁగ'- (సమీర 74) (చూ సూ ని అంగి)

[చొకాయ — చొకాయి చొక్కాయి' (ముద్రి పా ప్రౌ పా)]

దుప్పటము — దీనికి అం సం సాంబ- (అర్థాం) ఇ ట్లిచ్చినవి- మైమర్వై కమరు జోడు దగళా జిరాయి బొందళము దుప్పటమును జిలుకత్తు బం దనఁ జెలఁగుఁ గవచము' (సాంబ మాన 45) తనరుఁ బేళ్ల తనుత్రాణమునకును గత్త ళంబు జోడు జిరా దుప్పటంబు బొంద ళం బనంగ నాఖ్య లగు' (అం సం స్థా 26)

వీణము — వీణాము- అని ప్రౌ పా (పారాం) (చూ అపు) దీనికి సన్ననివస్త్రము వలిపము' అనునర్థ మిచ్చు చున్నవి సూ ని శ ర లు- పన్నీట జలక మాడెను సన్ననివీణాము గట్టె విరులం దుఱిమెగా సన్నము గ నలఁదెఁ గస్తురిఁ జన్నుల ముత్యాల బన్నసరములఁ దాల్చెగా' (జై 31) (చూ సూ ని)

ప్రచ్ఛదపటము — గవిసెన'-అని (గురు)

సీ దోవతి యం చనఁ దోఁచుఁ గటీపట

మొల్లె పంచె, యనంగ నొప్పు నూర్ధ్వ

వస్త్రంబు గుడ్డ, నా బట్ట నాఁ జెలు వొందు

వస్త్రఖండము, వస్తి పరఁగుఁ బొత్తిక

యనఁగను బొల్చు బాలాచ్ఛాదనాభిధ
తడు, పంచు నాఁగ నార్ద్రపట మొప్పు,
చింపి చీరిక యన జీర్ణవస్త్రము మీఱుఁ,
ప్రేలిక, యం చనఁ బేలిక యన

గీ. జీర్ణవస్త్రైకదేశంబు చెలఁగు చుండుఁ
గోఁచి యనఁగఁ గచ్చడ మన గోణ మనఁగ
బొట్ట మం చనఁ గౌపీనము దనరారు
మాతృభూతేశ సంతతాత్మప్రకాశ 157

దోవతి—ఇది కటీపటమునకు (పరిధానమునకు అంతరీయమునకు, మగవారికట్టుబట్టకు) పేరు

ఒల్లె పంచె—ఇవి ఊర్ధ్వవస్త్రమునకు (ఉత్తరీయమునకు, బైరవాసమునకు, కండువాకు, మగవారిపైబట్టకు) పేర్లు

గుడ్డ, బట్ట—ఇవి వస్త్రఖండమునకు (వస్త్రపుతునుకకు వస్త్రమునుండి చింపిన ముక్కకు, చేతిగుడ్డ తలబట్ట-మొద లగువానికి) పేర్లు

పొత్తి వస్తి— ఇవి బాలాచ్ఛాదనమునకు (శిశువులకు కప్పుట కది ఉపయోగించుమెత్తని సన్నని గుడ్డముక్కలకు) పేర్లు

తడుపు— ఇది ఆర్ద్రపటమునకు (నీళ్లచే బాగుగా తడిసిన దగు వస్త్రమునకు) పేరు

చింపి చీరిక—ఇవి జీర్ణవస్త్రమునకు (చిరిఁగిన వస్త్రమునకు) పేర్లు

ప్రేలిక, పేలిక— ఇవి జీర్ణవస్త్రైకదేశమునకు (చిరిఁగినవస్త్రములోనికొలఁది భాగమునకు పీలికకు) పేర్లు

గోఁచి కచ్చడము గోణము బొట్టము—ఇవి కౌపీనమునకు(కక్ష్యపటమునకు) పేర్లు

[ నూర్ధ్వవస్త్రంబు —నర్ధవస్త్రంబు- (వావి అపపా ]

బట్ట —వస్త్రమాత్రవాచకముగూడ ఇది- బట్ట వలువ కోక పుట్టంబు గింటెంబు, చీర నా వసనంబు చెలఁగు' (మాన 18 ) ఇందు వలువ గింటెము' విశేషార్థకములు గా పూర్వ ముక్తములు [చూ ఆం భా 2 156 )

[ స్వప్రకాశ - వావి అపపా ]

[తడు పంచు తడుపంచె'- క్రొత్త ప్రతిపా (చూ సూ ని తడుపు )]

సీ చల్లాడ మనఁగను జల్లడ, మనఁగఁ జె
న్నలరుఁ బుమంతరీయంబు లుంగి,
యన నంగదట్ట, మం చనఁ బావడ యనంగ
యోషాంతరీయ మై యొప్పు చుండు
గొప్పగాఁ గొన లుంచి కూర్చినపావడ
కంగోరుపావ డనంగ వెలయు,
నస్తరు నతుకు నా నలరు సంధానవ
సనఖండనామంబు చనును గంబ

గీ ళంబు గొంగడి, యనఁగను గంబళి, యన
గోరుపడ మనఁగా గంధ మీఱు బొంత
గం తన వితాన మగు మేలుకట్టు లుల్ల
బమ్మ, లుల్లడ లనఁ జందువ, లన, నభవ 158

చల్లాడము, చల్లడము—ఇవి పుమంతరీయమునకు (మగవారు ధరించెడి వస్త్ర కవచమునకు, మొలనుండి చీలమండలవఱకు తొడిగికొనెడిలాఁగునకు) పేర్లు

లుంగి, అంగదట్టము— ఇవి యోషాంతరీయమునకు (స్త్రీలు మొలను గట్టు కొనెడి వస్త్రవిశేషమునకు, గాగరకు (పరికిణీకి) పేర్లు

కంగోరుపావడ—ఇది పొడుగుగా కొన లుంచి కూర్చిన (కుట్టిన) పావడకు పేరు

అస్తరు అతుకు—ఇవి సంధానవసనఖండమునకు (చిరిఁగినవస్త్రమును గలుపుటకు వేసి కుట్టెడుగుడ్డముక్కకు మాసికకు) పేర్లు

గొంగళి కంబలి గోరుపడము—ఇవి కంబలమునకు (రల్లకమునకు గొర్రెబొచ్చులో నగువానితో నేసెడియొకవిధ మగు ఉన్నిపచ్చడము నకు) పేర్లు

బొంత గంత—ఇవి కంధకు (కంధటికకు కప్పుకొనుటకు పఱచుకొనుటకు ఉపయోగపడునట్లు చింపిగుడ్డలతో దట్టముగా కుట్టినవస్త్రభారమునకు) పేర్లు

మేలుకట్టులు ఉల్లబమ్మలు ఉల్లాడలు చందువలు— ఇవి వితానమునకు (ఉల్లెడకు చందువాకు పందిరి లో నగువానిలోపల మీఁద చుట్టు ఏర్పఱచిన-ఒకవిధ మగువస్త్రసంనివేశమునకు చాందినికి) పేర్లు

చల్లాడము —సగముతొడవఱకు ఉండులాఁగు అర్ధోరుకము-అని (సూ ని ) శ ర గూడ ఇల్లే సగముతొడవఱకు తొడిగినగుడిగ (సెడ్డి) అనినది బ్రౌ ఇజారు దీనికి అర్థ మనినది ఇజారు'కు పైని నాచెప్పినదియే అర్థము (చూ బ్రౌ మిశ్రనిఘంటువు)]

గోరుపడము —గోర్పడము గొఱుపడము-(రూపాం ) గద్దెకంబళ్ల కప్పడికంబళ్ల గోర్పడంబులు ' (సందితా పర్వ 34పొ ) వఱదఁ బోవునెలుఁగు గొఱుపడం బనుచు నెఱుఁగక యీఁతకాఁ దేఁగి పట్టుడును' (బస పు 3 1137పం ) (చూ సూ ని )

బొంత — చలికప్పునకును, పఱపునకు ఉపయోగము గా దూది లో నగువానిఁ జేర్చి దట్టము గా కుట్టినగంత'-అని (శ ర )

కంబలము —సమౌ రల్లకకంబలౌ విశాల స్త్వావికౌరర్భౌ అని (వై జ పాతా పురా )

సీ కొఱలు గుడారము, గూడారము గుడారు
గూడా రనఁగను నాల్గు పటగేహ
నామధేయంబులు, నవగోజ యనఁగను
గొప్పగుడార మై యొప్పు చుండుఁ

బనిబడిగూడారు పరఁగు గొల్లెన యన
వాహనాద్యాచ్ఛాద్యవస్త్రసంజ్ఞ
తనరుఁ గువాళ, మం చనఁగఁ, బ్రావరణ మౌఁ
బరదా యనంగను బాడు నాఁగఁ

గీ జనుఁ దిరస్కరణి తెం నా జవనిక యన
రంజిలుఁ గనాతిగోడ, సరాతి యనఁగ
వసననిర్మితకుడ్యభావంబు గాను,
భూషితభుజంగ శ్రీమాతృభూతలింగ 159

గుడాంము, గూడారము గుడారు, గూడారు—ఇవి పటగేహమునకు (పటవాసమునకు, వస్త్రముతో ఏర్పఱచినయింటికి డేరాకు) పేర్లు

నవగోజ—ఇది గొప్పగుడారమునకు (పెద్దడేరాకు) పేరు.

గొల్లెన—ఇది పనిబడిగూడారునకు (ఒకవిధ మైనడేరాకు) పేరు

కువాళము—ఇది వాహనాద్యాచ్ఛాద్యవస్త్రమునకు- (వాహనము లో నగువాని-గానెనకు-కప్పుడుగుడ్డకు) పేరు

పరదా బాడు—ఇవి ప్రావరణమునకు (అంతను మూసి వేయుపెద్దముసుఁగునకు (బుంకాకు) పేర్లు

తెం జవనిక—ఇవి తిరస్కరిణికి (ప్రతిసీరకు మఱుఁగుచీరకు) పేర్లు

కనాతిగోడ సరాతి—ఇవి వసననిర్మితకుడ్యభావమునకు(గోడవలె గుడారముచుట్టు ఎర్పఱచినతెరకు) పేర్లు

పటగేహము — దూష్యాద్యం పటవేశ్మని' అని (అమ)-( ఆద్యేన కుటంకుటీపటవాసాది గ్రహః' అని (సుధ)

పరదా — దుప్పటము' అని (సూ ని) తెర'-అని (శ ర) బురకా -అని (బ్రౌ.)-
(చూ అను)

జవనిక — సంస్కృతమును గలదు- నర స్సంసారాన్తే విశతి యమధానీజవనికామ్'
(సం భర్తృ. 3 112)

కనాతిగోడ — బట్టతో నేర్పఱచినగోడ'-అని (సూ ని)

['కుడ్యభావంబు గాను — కుడ్యనామంబు గాను అని (వావి పా)]

సీ తలయం, టనంగను దలగడు, గవినను
 నభ్యంగనామ మై యతిశయిల్లుఁ
దోముడు ప్రాముఁడు, తుడుపు రుద్దుడు, పులు
 ము, డన మార్జనసంజ్ఞ బొలుచు చుండు,
నలుఁ గన నుద్వర్తనంబు రాజిలుఁ జిక్క
 సంబు, సున్ని యనఁ జూర్ణంబు దనరు,
స్నానంబు వెలయును దానంబు మునుక బు
 డుక, మజ్జన మనఁ దిలక మెసంగు

గీ. బొ ట్టనఁగఁ జు క్కనఁగఁ జుక్కబొ ట్టనంగఁ,
బొలుచుఁ, జాతిక, పత్త్రిరిబొ, ట్టనంగఁ
దద్విశేషాఖ్య ఘుసృణంబు దనరు చుండుఁ
గుంకుమ యనంగ బాలశశాంకచూడ 160

తలయంటు, తలగడుగు—ఇవి అభ్యంగనమునకు (అభ్యంజనమునకు తలంటు నకు, తలకుతైలము అంటికొని చేయుస్నానమునకు) పేర్లు.

తోముడు, ప్రాముడు తుడుపు రుద్దుడు పులుముడు—ఇవి మార్జనమునకు (మురికి పోవునట్లు రుద్ది దేహాదులను శుభ్రపఱచుటకు) పేర్లు

నలుఁగు—ఇది ఉద్వర్తనమునకు (త లంటుకొనునప్పుడు నూనె మొద లగునవి

పోవుటకై దేహమునకు ఎండి పట్టించుకొనునొక సంస్కార విశేషమునకు) పేరు

చిక్కసము సున్ని—ఇవి చూర్ణమునకు (ఉద్వర్తనక్షోదమునకు గాత్రాను లేపనికి సున్నిఎండికి) పేర్లు

తానము మునుక బుడుక మజ్జనము—ఇవి స్నానమునకు (తీర్థమాటకు నీళ్లాటకు) పేర్లు

బొట్టు చుక్క చుక్కబొట్టు—ఇవి తిలకమునకు (చిత్రకమునకు విశేషకమునకు) పేర్లు

చాటిక పత్తిరిబొట్టు—ఇవి తద్విశేషమునకు (తిలకవిశేషమునకు) పేర్లు

[చాటిక = నిలువుగీ తయట్లు దిద్దిన నిలువుబొట్టు అన వచ్చును పత్తిరిబొట్టు = ఒకవిధ మగుచాటికబొట్టు గుమ్మడిగింజబొట్టు అన నగును ]

కుంకుమ— ఇది ఘుసృణమునకు (కుంకుమమునకు ఒకలేపద్రవ్యమునకు బొట్టుపెట్టుకొను ఒక రాగద్రవ్యమునకు) పేరు

మార్జని — స్యా న్మార్ష్టి ర్మార్జనామృజా (అమ)

చిక్కసంబు — ఈశబ్దము సంస్కృతమునందును గలదు చిక్కసము (సం వి న) యవలఎండి (వాచ) అని (సూ ని)

ఉద్వర్తనము — ఉద్వర్తనోత్సాదనే సమే (అమ) నలుగుపేళ్లు అని (గురు) ఉద్వర్తనద్రవ్యేణ అఙ్గనిర్మలీకరణస్య అని (సుధ)

మజ్జనము —ఆంధ్ర దీనిని దెలుగుపదము గా ఉదాహరించు చున్నది ఇట్టివి పూర్వము ఉదాహృతములు (చూ చండి 4 మొ)

చుక్కబొట్టు —మండలాకార మైనతిలకము (గుండ్రనిబొట్టు) అని శ ర

పత్తిరిబొట్టు — చాటికవిశేషము అని (బ్రౌ)

కుంకుమ — కుఙ్కుమం ఘుసృణం వర్ణం రక్తం లోహితచన్దనమ్ అని (వై జ భూ వై శ్యా) పూర్వ మీకుంకుమపువ్వునుండి యే ర్పడినరాగద్రవ్యముతో బొట్టు పెట్టుకొను

చుండెడివారు కావుననే కుంకుమబొట్టు అని వ్యవహారము నే టిరాగద్రవ్యమును (రంగును) కుంకుమ అనుట ఔపచారికము

సీ చెందిర మన గను సిందూరము చెలంగు
 లక్క యంచన గను లాక్ష వెలయు
లాక్షారస మెసంగు లత్తుక యంచన
 గుంకుమపూ వన గుంకుమ మగు
గుసుమపూ వన గ దగును గుసుంభాభిధ
 జాజికా యన మీఱు జాతిఫలము
జాపత్రి యన గను జాతిపత్త్ర మ్మొప్పు
 గసగస లన మస్తు గానిపించు

గీ విత్తు లెస గును జా దన వెలయు జాష
మలరు సాంబ్రాణి సామ్రాణి యన గ బూతి
పును గు తట్టుపునుం గన దనరు బిల్లి
గడ్డ చట్ట మన బిడాలక మగు శర్వ 6

చెందిరము—ఇది సిందూరమునకు(చెంద్రమునకు సీసమునుండి యేర్పడి కుంకుమ పూవుతో సమాన మైనవర్ణము కలయెఱ్ఱనిచూర్ణమునకు రక్తచూర్ణమునకు) పేరు

లక్క— ఇది లాక్షకు (యావకమునకు జతువునకు లాక్షావృక్షమునుండి యేర్పడినబొంకకు ఎఱ్ఱని యొక-రంజనద్రవ్యమునకు—రంగునకు) పేరు

లత్తుక— ఇది లాక్షారసమునకు (లాక్షాద్రవమునకు కర గినపలుచనిలక్కకు అలక్తకమునకు) పేరు

కుంకుమపూవు—ఇది కుంకుమమునకు (కాశ్మీరజన్మమునకు ఘుసృణమునకు ఎఱ్ఱనియొకసువాసనద్రవ్యమునకు) పేరు

కుసుమపూవు—ఇది కుసుంభమునకు (మహారజనమునకు (కుసుంబాపూవునకు) ఒకరాగద్రవ్యమునకు) పేరు

జాజికాయ—ఇది జాతిఫలమునకు (జాతీఫలమునకు జాదికాయకు తాంబూలాదులయం దుపయోగపడు నొకకాయకు) పేరు

జాపత్రి— ఇది జాతిపత్త్రమునకు (జాతిపత్త్రికి జాపత్త్రికి జాజిపత్రికి జాతికోశికి తాంబూలాదులయం దుపయోగపడునొకపత్త్రికి) పేరు

గసగసలు— ఇది మస్తు గానిఎంచువిత్తులకు (మదము గలిగించువిత్తులకు అహిఫేనబీజములకు నల్లమందువిత్తులకు) పేరు

చా దు—ఇది జాషమునకు (జాయకమునకు బొట్టు పెట్టుకొనుటకు పూయుటకు ఉపయోగించునల్లనిసుగంధద్రవ్యవిశేషమునకు) పేరు

సాంబ్రాణి—ఇది సాంబ్రాణికి (సంబరేనుచెట్టువలన కలిగెడియొకధూపద్రవ్యవిశేషమునకు) పేరు

తట్టుపును గు—ఇది పూతిపును గునకు (కర గి బెత్తికలు కట్టిన ప్రశస్తమైన పునుఁగునకు) పేరు

ఎల్లిగడ్డ చట్టము—ఇవి బిడాలకమునకు (కోశమునకు పును గుఎల్లిచట్టమునకు పును గుఎల్లిశరీరమునందు పును గు అన పరిమళద్రవ్య ముండుతిత్తికి) పేర్లు

[గంధమార్జారమునుండి (పును గుఎల్లినుండి (బూతఎల్లినుండి) కలుగు నొకవిధమగు సుగంధద్రవ్యము పును గు]

సిందూరము —ఇది రెండువిధములు గా ఉన్నది గంగసిందూరము 2 సిందూర భస్మము శుద్ధి చేయనిసీసమునుండి యేర్పడునది గంగసిందూరము ఇది రాగద్రవ్యము గా బొట్టుపెట్టుకొనుట కది ఉపయోగపడును (ఐదువ - సిందూరతిలక పీను గు-సిందూరతిలకము ) శుద్ధి చేసినసీసమునుండి కలుగునది రెండవది ఇది ఔషధము గా ఉపయోగపడు చుండును ఈరెండును రక్తచూర్ణకములు ఇవి రెండును ఒకజాతికి చెందినవే

అయినను ప్రక్రియాభేదముచే వే ఱయి వేఱు వేఱు ప్రయోజనముల సంపాదించినవి వీనివర్ణము కుంకుమపూవువర్ణము కుంకుమ పాటలవర్ణము(ఎఱుపు తెలుపు కలసినరంగు గులాబిరంగు) కలది ఘుసృణకుసుమలీలాకోటిపాటల్యలీలన్ అని శ్రీనాథుడు (చూ కాశీ 4ఆ 6) శ్వేతరక్త స్తు పాటల అని (అమ) నాగోద్భవం తు సిన్దూరం కుఙ్కుమేన సమప్రభమ్ అని (వైజ భూ వైశ్యా) సిన్దూర స్తరుభేదే స్యాత్ సిన్దూరం రక్తచూర్ణకే (మేదిని)

గసగసలు —ఒకదినుసువిత్తులు అవి (శ ర) మాదకద్రివ్యములు గొన్ని యిట్లు వచింప బడినవి- జాజికాయలు జాపత్రి చాఱపప్పు సెనగ లసుమలు గసగసల్ మునగపువ్వు మదనవిత్తులు కొబ్బెర మందపాల నూఱి త్రాగిన మద ముబ్బు జేరువేళ (హంస 0 )

చాదు —దీనితో బొట్టుపెట్టుకొనుట యిట్లు వర్ణింప బడినది పయ్యెదమాఱు గా బాఱు టాకు లమర్చి చాదున దిలకంబు సంతరించి (హర 38) పూయుసకు (చూ వసు 5 7) (చూ సూ ని)

పునుగు —కొన్నిసుగంధద్రవ్యము లిట్లు పేర్కొన బడినవి పుగ్గు జవ్వాజి కస్తూరి యుం గుంకుమ సర్వవస్తువులు భృత్యు ల్గొంచు వెన్వెంట రా (ఉత్త హరిశ్చం 4 28) (చూ సూ ని) జవ్వాజిపిల్లినుండి(సంకువునుండి) కలుగునది జవ్వాజి సంకుమదము పునుగుపిల్లినుండి (మార్జారి నుండి) యేర్పడునది పునుగు

కుసుమపూవు — కుసుమవన్నె అనుదానికి గులాబిరంగు అని (బ్రౌ) అర్థ మిచ్చినది *చంద్రకావి అనుదానికి గూడ ఇట్టియర్థమే యిచ్చినది* (బ్రౌ)

సాంబ్రాణి — దీనికి దేవధూపము అనునది సంస్కృతనామ మను చున్నది (బ్రౌ గుగ్గులౌ కాలనిర్యాసో దేవధూపో మహేశ్వర (భూ వనా) అని (వైజ) గుగ్గులును దేవధూప మను చున్నది

ఎ చను జవాది జవాజి జవ్వాది జవ్వాజి
యన గ సంకుమదాఖ్య దనరు చుండు
గోరోజన మనంగ గోరోచనాభిధ
కపురము కప్రము కప్పురమ్ము

సిరము గంబూర గంబుర గంబురా గంబు
 రమ్ము గంబూర మ్మన మ్మను ఘన
సారము సజ్జరస మ్మన సర్జర
 సమ్ము చెలంగు గంద మ్మనంగ

గీ గంధ మొప్పు మలాక నా గను దనర్చు
చుండు శ్రీఖండ మగురు నా నొనరు నగరు
గంధచూర్ణంబు చెల గు బుక్కా మనంగ
గందవొడి యన గాను బుక్కా యన భవ 62

జవాది జవాజి జవ్వాది జవ్వాజి—ఇవి సంకుమదమునకు (గంధరాజమునకు జవ్వాజిపిల్లియొక్క అండకోశమునుండి యేర్పడెడి ఒకసుగంధద్రవ్యమునకు) పేర్లు

గోరోజనము—ఇది గోరోచనమునకు (రోచనకు పచ్చనివన్నె కలిగి గోవుతలయందు ఎండి ఉండెడిపిత్తరసమునకు) పేరు

కపురము కప్రము కప్పురము సిరము గంబూర గంబుర గంబురా గంబురము గంబూరము— ఇవి ఘనసారమునకు (హిమవాలుకకు చంద్రసంజ్ఞకు చలియిసుకకు కర్పూరమునకు) పేర్లు

సజ్జరసము—ఇది సర్జరసమునకు(యక్షధూపమునకు సాల(మద్ది)వృక్షముయొక్క బొంకతో ఎర్పడు ఒకధూపద్రవ్యము నకు) పేరు

గందము— ఇది గంధమునకు (అఱుగ దీసి రాచుకొనులేపనద్రవ్యమునకు మంచిగందము - మొద లగుదానికి) పేరు

మలాక—ఇది శ్రీఖండమునకు (గంధసారమునకు చందనమునకు మంచిగంద మునకు పేరు

అగురు—ఇది అగరువునకు (అగురువునకు అగులునకు రాజార్హమునకు అగురుచెట్టుకఱ్ఱనుండి తీసినయొకపరిమళద్రవ్యమునకు) పేరు

బుక్కాము గందవొడి బుక్కాయ—ఇవి గంధచూర్ణమునకు (పిష్టాతకమునకు పటవాసచూర్ణమునకు వస్త్రములకు పరిమలము గలిగించుసుగంధద్రవ్యమునకు) పేర్లు

గోరోజనము—దీనిని గూర్చి నిఘంటువు లిట్లను చున్నవి పశువులపిత్తరసమునుండి తీయబడిన యొకానొక పసుపుపచ్చని పదార్థము (విల్యమ్సు) పీతవర్ణము గలగోమస్తకస్థశుష్కపిత్తము (కల్ప) (చూ సూ ని) ఆవుల కడుపులోనుండి యెత్తెడి ఒకపదార్థము అని (శ ర)

పరము—పచ్చకర్పూరము అని దీని కర్థ మిచ్చినది (బ్రౌ) సాధారణము గా కర్పూర వాచకమే యిది యనినది క్రమము పరంబు గంబూర కప్పుర మన వెలయు జంద్రంబు అని సాంబ (మాన 30) సంస్కృతమున పచ్చకప్పురమునకు గూడ కర్పూరాదులే వాచకములు కర్పూరవీటీసౌరభ్య కల్లోలితకకుప్తటా (లలి త్రి)మొ తెలుగునను ఇట్లే కప్పురము మొద లగునవి రెండిటికి వాచకములు (కప్పురపు బాగాలు కప్పురపు టారతి మొ)

సజ్జరసము—గుగ్గులు అని (సూ ని) గుగ్గులునామమును వేఱు గా వచించనది (ఆం భా) (చూ 2 40)

అగురు—చందనవిశేష మని (బ్రౌ) ఇట్లు వివరించినది దీనిని అగరు (లేక) అగురు విశేష మైనపరిమలము గలయెఱ్ఱదాళువు (డాలు) గా ఉండేగంధపు చెక్క (అవి) అగురువునుగూర్చి ఒకకవి యిట్లు చమత్కరించినాడు అగురు రితి వదతు లోకో గౌరవ మ త్రైవ పున రహం మన్యే దర్శితగు ణైవ వృత్తి ర్యస్య జనే జనిత దాహే ౨౫ (సు ర) సంస్కృతమునను అగరు అగురు శబ్దములు రెండును కలవు అగు ర్వగరు రాజార్హమ్ అని (హైమ) (చూ సుధ) కృష్ణాగరు విందలి యొక భేదము ఇది చాలసువాసన గలది నల్లయగులు అని దీనికి తెలుగున వ్యవహారము (అగురువత్తులు అగురునుండి యేర్పడినవే) పూర్వము నోటిసువాసనకై గొప్పవారు

గంధపు పొడి మొదలగువానిచే వర్త్యాకారముగా అగురువత్తులను జేసి పొగ త్రాగెడివారు వర్తిధూపము అని దీనికి పేరు ధూపవర్తులు అనియు వీనికి పేరు పరిఎత ధూపవర్తి అని (కాదం) (చూ ఊ దువత్తులు- సూ ని) [సం భాషయందువలెనే అగురు అగరు రెండును తెలుగునందు కల వనిపించును అగరున కైన రూపాంతరమే అగలు అగరు=అగురు అగలు వి (సం అగరు అగురు ప్రా అగరు అగలు పా ఆగరు క అగళు ఒగుళు అగిలు త అగల్ తు అగెల్ అగెల) అని (సూ ని)]

సీ యక్షకర్దమసంజ్ఞ యలరు గదంబమ్ము
కలపము నా గను వెలయు నేస
యన గ బుష్పాంజలి తనరు దోమాలె నా
మాలిక పువుబెత్తు పూలపొట్ల
మన గ మాల్యగ్రంథి యగు నెఱతన మన
నాభోగసంజ్ఞ యై యడరును దల
గడ తలాడ తలాపి తలయంపి యొరగు నా
నుపధానసంజ్ఞ యై యొప్పుచుండు

గీ దద్వి శేషాభిధానంబు తగును బటువు
బిల్లదిం డన శయ్యాఖ్య చెల్లు సెజ్జ
పఱపు తలివము తిడిబము పాన్పు మెత్త
యనం దదాచ్ఛాది రెఁన గు లే పనఁగ శర్ప  163

కదంబము కలపము—ఇవి యక్షకర్దమమునకు (మహాసుగంధమునకు పరిమల ద్రవ్యములు కొన్ని కలప గా ఏర్పడిన యొకానొకలేపనద్రవ్యమునకు) పేర్లు

నేస—ఇది పుష్పాంజలికి (సుమాంజలికి దోసిలితో పట్టినపూలకు) పేరు

దోమాలె—ఇది మాలికకు (తోటమాలెకు వనమాలకు పాదములదాఁక వ్రేలెడి పొడు గైనపూలదండకు) పేరు

పువుబెత్తు పూలపొట్లము—ఇవి మాల్యగ్రంథికి (పుష్పసరమునకు ఒకవిధమగుపూలదండకు పుష్పము లుంచి వానికి ముళ్లు వేయుచు కట్టినదండకు) పేర్లు

నెఱతనము—ఇది ఆభోగమునకు(పరిపూర్ణతకు వస్త్రమాల్యాదులతోడి అలంకారము యొక్క సమృద్ధికి(ఆధిక్యమునకు) పేరు

తలగడ తలాడ తలాపి తలయంపి ఒరగు—ఇవి ఉపధానమునకు (ఉపబర్హమునకు ఉచ్ఛీర్షమునకు దిండునకు) పేర్లు

బటువు బిల్లదిండు—ఇవి ఉపధానవిశేషమునకు (గుండ్రనితలగడకు) పేర్లు

సెజ్జ పఱపు తలిమము తడిబము పాన్పు మెత్త—ఇవి శయ్యకు (తల్పమునకు తలిమమునకు పక్కకు పడుకకు దూది మొదలగువానితో ఏర్పఱచిన పఱుపు మొదలగువానికి) పేర్లు

లేపు—ఇది తదాచ్ఛాదినికి (పఱుపుపై బఱచెడిదుప్పటికి) పేరు

యక్షకర్దమము — కర్పూ రాగరు కస్తూరీ కక్కోలై ర్యక్షకర్దమ అని (లమ) కర్పూరము అగరువు కస్తూరి కక్కోలము (తక్కోలపువిత్తనములనుండి తీసిన పరిమళద్రవ్యము) ఇవి సమభాగములుగా చేసి కలిపి చేసినగంధము(ఇట తక్కోలై అని (గురుపా) కుంకుమపూవుగూడ ఇందు చెరును అని వ్యాడి- కర్పూరాగరు కస్తూరీ ౘక్కోలఘుసృణాని చ ఏ ఏత మిదం సర్వం యక్షకర్దమ ఇష్యతే ధన్వంతరి కక్కోలము వదలి చందనము చేర్చినాడు కుఙ్కుమాగరుకస్తూరీ కర్పూరం చన్దనం తథా మహాసుగన్ధ మిత్యుక్తం నామతో యక్షకర్దమ (చూ సుధ) వైజ వ్యాడిని ఒనుసరించిన దిట- అథ తక్కోలకుఙ్కుమై కస్తూర్యగరుకర్పూరా స్సుగన్ధో యక్షకర్దమ (పాతా పురా)

సేస౨—మంగలాక్షతలు-తలబ్రాలు-ఒనెడి అర్థముగూడ దీని గలదు అతివ సతీకరో న్నమిత మై విభునౌదల సేస జల్లె-(వసు 28) మొ మంత్రాక్షతలు (దీవనబ్రాలు) గూడ దీని కర్థ మను చున్నది (ఆం శే 4

తోమాలె —ఆకులు పువ్వులు కూర్చి కట్టినదండ వనమాల-అని (శర) వనమాలకు లక్షణ మి ట్లున్నది- ఆపాదపద్మం యా మాలా వనమా లేతి సా మతా (కలిఙ్గ)

(చూ గురు) వనమాలా శబ్దమునకు అర్థాంతరము గా తులసి కుంద మన్దార పారిజాత సరోరుహై ఏభ్చిః (వనమాలాసు) పుష్పై రేతై ప్రకీర్తితా అనినది- (స త ఎ ల సం) (సూ ని)-ఎల్లఋతువుల పుష్పములతో గూర్పబడి మోకాళ్లవఱకును వ్రేలుచు నడిమిభాగమున నించుక స్థూలము గా ఉండుపూలదండ-అని దీని స్వరూపమును వివరించినది

ఆభోగము — ఆభోగః పరిపూర్ణతా అని (అమ) ఇట- సర్వోపచారపరిపూర్ణతాయా అని (సుధ) [ఉపచారశబ్దమునకు- అలంకారము అను అర్థము గలదు (చూ సూ ని)]

బిల్లదిండు — బిల్ల దిండు అని పెఱుపదము లివి-అని (సూ ని శ ర లు) శర దిండు అనుదానికి నిడుపాటగుంద్రనితలగడ అని అర్థము చెప్పు చున్నది బిల్లదిండు (బిళ్ల దిండు) అని ఏ పదమే ఇది అని ద్రౌ (చూ అను) ఏకపద మనుటయే యిట నాకు యుక్త మనిపించినది బటువు నకు ప్రయోగ మి ట్లున్నది పసిడికుందకరణి బచ్చనికేడంబు భాతి నెఱ్ఱపట్టుబటువురీతి గాఢరక్తరుచులు గ్రమ్మ నిమ్మగుప్రభల్ తఱి గి యస్తమించె దరుణి యంత (సురా) (మూ శ ర)

[ఒరగు — ఒరుగు (వావి ద్రౌ పా) ప్రయోగ మొ టి ఇ ట్లున్నది రతిదేవిజిగిమించు రారాపు జనుదోయి నొఱగుది దులు సేయునొఱపులాడ (సుద 6-90) (చూ సూ ని)]

తలివము — తలిమము దడిబము అని (ముద్రి అపపా) తలిమం కుట్టిమే తల్పే అని (వైజ త్రయ్య సిపుం) (మా వివరణమునకైనా తొలిపలుకు)

లేపు —దీనికి పఱపు అర్థ మను చున్నది సాంబ- పానుపు తలిమ్మంబు ( ) పఱపు లేపన పెత్త సెజ్జ యన గ శయ్య చెల గు చుండు (మాన 23)

ఖట్వాఖ్య రాజిల్లు గంకటి యం చన
బట్టెమంచం బన బరగు మృదుల
ఖట్వ రాజిలు నల్పఖట్వ కుక్కి యనంగ
నలరు గొ డన గ ఖట్వాంగ మెసగ
బట్టె యం చన దగుఁ బట్టిక కుఱు కాచ
మన బట్టికాగ్ర మై యలరు చుండు

చి[త్రాలపట్టిక చెల గు నవా రన
గటసంజ్ఞ ఛా షన గా జెలంగు

గీ గందుకము చెండు బంతి నా గను దనర్చు
దివ్వె దివ్వియ దివె దీవె దివియ దీవి
యన గ దీపాహ్వయంబు గా నలరు చుండు
మాతృభూత జగ[త్త్రయీమాతృభూత 84

కంకటి—ఇది ఖట్వకు (పర్యంకమునకు పల్యంకమునకు మంచమునకు) పేరు
పట్టెమంచము— ఇది మృదులఖట్వకు (పట్టికామంచమునకు నవారు అల్లిన (నవారు) మంచమునకు) పేరు
కుక్కి—ఇది అల్పఖట్వకు (చిన్నమంచమునకు మంచపుకుక్కికి త్రాళ్లు వదులై పల్లము పడ్డమంచమునకు కుక్కిమంచమునకు) పేరు
కోడు—ఇది ఖట్వాంగమునకు (కంగటికాలికి మంచపు గంబమునకు) పేరు
పట్టె—ఇది పట్టికకు (మంచపు బట్టియకు) పేరు
కుసి కూఛము—ఇవి పట్టికాగ్రమునకు (మంచపు బట్టెయొక్క సన్నని చివరకు) పేర్లు
నవారు—ఇది చిత్రాలపట్టికకు (నవారుపట్టెకు) పేరు
చాప—ఇది కటమునకు (తుంగ లో నగువానితో నేసినతుంగచాప మొద లగు వానికి) పేరు
చెండు బంతి—ఇవి కందుకమునకు (గేందుకమునకు ఆడుకొనెడి బంతికి) పేర్లు
దివ్వె దివ్వియ దివె దీవె దివియ దీవియ—ఇవి దీపమునకు (దీపికకు ప్రదీపమునకు దిబ్బెమునకు జోతికి) పేర్లు

[చిత్రాలపట్టిక — చిత్రాల్పపట్టిక అని (ప్రౌ వావి పా) చిత్రీ ఝిల్లాం నపుంసకమ్ గోస్తనే వస్త్రభేదే చ రేఖాలిస్వనభేదయో అని (మేదిని)]

కందుకము — కందుకము (రూపాం) కందుకకేళి సల్పెడు ప్రకారమునన్ పామర భామ లేత యీ రెండప్రభాతవేళ రచియించె (క్రీడా 82) అప్పకవి అప్రశస్త ప్రాసమున కిది ఉదాహరించి (ఇది) కందుక మనియే అనినాడు కాని హేమగర్భాంఢభాండంబు లొండొండ నీరోమకూపంబులం దండతండంబులై కందుకంబు ల్వలెన్ విండి యాడన్ అని రఘునాథరాయ డనుచున్నాడు (చూ వాల్మీ 82) (చూ సూ ని) ఇచ్చటి యనుప్రాసము నిర్ధారక మనవచ్చును దండక మిది విరాడ్రూపము వర్ణ్యము సంస్కృత నిఘంటువలలో కందుకశబ్దము కానరాదు అని (సూ ని) వైజ కన్దుకో గణ్డుక స్సమౌ (పాఠా పురా అను చున్నది ఇట- గణ్డుక అనుట ప్రమాదము కణ్డుక అని ఇట ఉండును (గ కారము అపముద్రితము కావచ్చును ఇట్టిముద్రణప్రమాదములు ఇందు చాల గలవు సుప్రసిద్ధ మగుసంస్కృత నిఘంటువు ఈ (వైజ) ఇందు కానవచ్చు చున్న దనవచ్చును

దివ్వె —సాంబ - దీపపర్యాయములను ఇట్లుదాహరించినది దీపంబుపేళ్లు వఱలు చుండును జ్యోతి తిర్వాళిక దివ్వె యనగ (దేవ 2) (సూ ని)- తిర్లిక గ్రహించి (క తిర్వాళక) వి (త తిరువిళక్కు) దేవతాసన్నిధిని పెట్టుదీపము 2 దీపము (బ్రౌ) అను చున్నది ప్రయోగము లేదు జ్యోతి సుప్రసిద్ధము అందులకే ఆం భా వదలిన దనిపించును

[బట్టిక — దట్టిక—(వావి అపముద్రి)

[రాజిలు — రాజులు - (వావి అపముద్రి)]

సీ దీవటీ దివ్వటి దివటి పం జన గను
 గరదీపకాఖ్య యై పర గు చుండు
జుంజుఱు దుందుఱు సురుడు దివ్వెనకోల
 యన గ్గాష్ఠదీపకాహ్వయము చెల గు
నీరాజనాభిధ నెగడు నివాళి యా
 రతి నా గ వత్తి నా బ్రబలు వర్తి
ద్విముఖదీపక గడిదేరు నీలాలి నా
 ద్విముఖదీపకపేరు తేజరిల్లు

గీ దక్కటి యనంగఁ బీరంబు దనరు చుండు
గద్దె గద్దియ ఎట నాఁగను గటాస
నమ్మ చదిరిక యనఁగ జర్మళ మన దనరు
నాసనార్థంబు సరస నా నలరు చుండు
మాతృభూత నిజాశ్రితమాతృభూత 65

దీవటీ దివ్వటి దివటి పంజు—ఇవి కరదీపికకు (కరదివ్వెకు కాగడాకు ఇనుపకమ్మికి గుడ్డలు చుట్టి వెలిగించి పట్టుకొను చేతి దీపమునకు) పేర్లు

జుంజుఱు దుందుఱు సురుడు దివ్వెనకోల—ఇవి కాష్ఠదీపికకు (దివ్వెకోలకు దివటీకి మాఱుగా వెలుతురుకై వెణుతురుపుల్లలు లో నగువాని గాల్చి పట్టుకొనెడిదీపమునకు జుంజుఱుకట్టకు) పేర్లు

నివాళి ఆరతి— ఇవి నీరాజనమునకు (హారతికి ఆరాత్రికమునకు నివ్వాళికి కర్పూరదీపాదులతో దేవతావిగ్రహాదులకు ఇచ్చుమంగలారతికి) పేర్లు

వత్తి—ఇది వర్తికి (దీపము వెలుగుటకై దూది మొదలగువానితో చేసెడి దీపపువత్తికి) పేరు

నీలాలి—ఇది ద్విముఖదీపికకు (రెండు వత్తులు వెలిగించుటకు ఉపయోగపడునట్లు రెండు ముఖభాగములు (ముందటిప్రదేశములు) కలదీపభాజనమునకు (ప్రమిద కుంది-లో నగువానికి) పేరు

తక్కటి—ఇది మూడువత్తులు వెలిగించుటకు వీ లగునట్లు మూడు ముఖభాగములుగల దీపపాత్రకు (కుంది లో నగువానికి) పేరు

గద్దె గద్దియ ఎట—ఇవి ఎరమునకు (ఉన్నతాసనమునకు ఎత్తైనఎటకు) పేర్లు

చదిరిక చర్మళము—ఇవి కటాసనమునకు (సమచతురశ్రమై కూర్చుండుటకు ఉపయోగించెడి చిన్నచాపకు) పేర్లు

సరస—ఇది ఆసనార్ధమునకు (అర్ధాసనమునకు సింహాసనము పీట మొదలగు వాని సగభాగమునకు) పేరు

దీవటీ ‒‒దీవటి (రూపాం) దీవట్లు పంజులు దివ్వటీ ల్దివటీలు దివియ లనం గరదీపిక లగు (సాన 46) సని (సాంబ)

సరస — సమీపము అనునర్థము దీనికి లాక్షణికము

[ ఆసనార్థంబు (వావి సపముద్రి )]

వ పలక యనంగను ఫలక యౌ శయ్యార్థ
ఫలక మొప్పును వినపలక యన గ
ముక్కాలిపీ టన బోలు త్రిపాత్పీఠి
భరణి మీఱును తార్పు బరణి డబ్బి
శీర్ణకరండంబు చెల గు గరాటంబు
కరవటం బన గను బర గు చుండు
దాంబూలపాత్రంబు తబు కం చనంగను
గంపె యంచన గను గుంపె యన గ

గీ జాలవల్లిక యన గను సంపుటంబు
పొలుచు సంబెల యన గ దాంబూలధాని
యడప మన మీఱు దములపాకులను బదిల
పఱచునది పదర మన గ బర గు నభవ 66

పలక—ఇది ఫలకకు (దారుఫలకమునకు బల్లకు కూర్చుండుటకై యమ ర్చిన-యె త్తగు కొయ్యపీ టకు) పేరు

వినపలక—ఇది శయ్యార్థఫలకమునకు (పరుండెడిపెద్దబల్లకు) పేరు

ముక్కాలిపీ ట—ఇది త్రిపాత్పీఠికి (ముక్కాలిపీ టకు మూడుకా ళ్లమర్చిన యెత్తుబల్లకు) పేరు

తార్పు, బరణి, డబ్బి—ఇవి భరణికి (వరహాలు లో నగునవి వేసి యుంచుకొను పాత్రమునకు; సంపుటమునకు) పేర్లు.

కరాటము, కరవటము—ఇవి శీర్ణకరండమునకు (చిన్నబరణికి; (కాటుక యది ఉంచుకొను) కాటుకకాయ మొద లగువానికి) పేర్లు.

తబుకు, కంపె, జాలవల్లిక—ఇవి తాంబూలపాత్రమునకు (తములపాకులపళ్లెమునకు) పేర్లు.

సంబెల—ఇది సంపుటమునకు (తములపాకులు వక్క లవి ఉంచుకొనుబరణికి; (చిన్నపెట్టెకు) తాంబూలపేటికకు; వీటీకరండమునకు) పేరు.

అడపము—ఇది తాంబూలధానికి (వక్క లాకు లవి ఉంచుకొనుతిత్తికి) పేరు.

పదరము—ఇది తములపాకులను పదిలపఱచుదానికి (తములపుటాకులను భద్రముగా ఉంచెడిబంగారాకు మొద లగువానికి) పేరు.

ఫలక —చర్మిత్రాదులవలని మువర్ణకలోపము. 'ఫలకీ, చన్దనే ఒష్ఠీ న త్రీ దార్వాసన చర్మణోః' అని (వై జ.నానా.). 'శిలాఫలకము' ఇత్యాదులందు 'ఫలక' శబ్దము ఆసనమాత్రవాచకము.

పదరము —ఆకు లుండే అడపము. (O.G) - అని (బ్రౌ.). 'రక మగుపైఁడియాకు పదరంబున నుంచినపండుటాకులు' అని (చంద్ర.1.92.).

తార్పు.—డబ్బి. మాళ్లతార్పులు నూబపాఁతఅలఁ గొలుచు' (వేం. పంచ. 4.4116.) 'వరహాలు వేసి దాచిపెట్టే పాత్రలున్ను' అని బ్రౌ. (టీ.) (చూ.అను.). 'ధనమునిచి నీట విడురాగితార్పుఁ బోలె' అని (రామా. 2ఆ.) (చూ. శ.ర.). ['తార్పు, కరండము, బరణి, పౌణక' అని (సూ.ని.).]

కరవటము —బరణి-అని (శ. ర.). చిన్నబరిణి-(O G.) అని (బ్రౌ.). బరణి, శీర్ణకరండము:-ఒకవిధ మగు బరణి' అని (సూ ని ). 'బరణియుఁ గరాట మనుపేళ్ల భరణి యమరు' అని (సాం.ని.స్థా.84.). 'భరణిపే రొఁ గరాటము బరణి యనఁగ' అని (వేంక.అం.స్థా.89.).

సంబెల — సంబళిక (రూపాం.). (హంస.1.207.) 'సంబెలపెట్టె' అనియును (బ్రౌ.). (సంబెళ) 'వక్కలాకులతిత్తి, అడపము' అని (శ.ర.). 'సంబెల విదిలించి తాంబూల దళపూగ, నివహంబు చాలంగ నించుచుబ్బ' (ఆము. 77.) (బ్రౌ. పా.). 'ఒడ్డెధాత్రీనాథుఁ డుపద పుత్తెంచినబింబాధరోష్ఠి సంబెల వహించు' (కాశీ.1.35.). ఇట, వీటీకరండము, తాంబూలకరండము, తాంబూలపేటిక (సంబెల పెట్టె) అనుటయే ఉచితము.

సీ. పూగభాగమ్ములు పొలుచు బాగా, లన
నెలవత్తి, యనఁగను; వెలయు ఖాది
రమ్ము కాఁ, చన; ఖాదిరవట మొప్పును గైర
వడి, యనఁ; బర్ణస్తబకము చెలఁగు
నాకుఁజుట్ట, యనంగ; నడరును వృత్తప
ర్ణం బాకుమడు, పన; రహి వహించు
సున్నపుఁగాయ, నాఁ జూర్ణకరండ; మొఁ
బోఁకొత్తు, నాఁగను బూగదళిని;

గీ. దనరుఁ దాంబూలనామంబు తమ్ములమ, మన
వీడె, మన వీడియ, మ్మన వీడ్య, మనఁగ
విడియ, మన విడ్య మనఁగను విడె, మనంగ;
భూరిభవభంగ. శ్రీమాతృభూతలింగ. 167

బాగాలు, నెలవత్తి — ఇవి పూగభాగములకు (పూగఖండములకు; పోఁకపలుకులకు; వక్కముక్కలకు) పేర్లు.

కాఁచు — ఇది ఖాదిరమునకు (ఖదిరసారమునకు; కవిరికి; చండ్రచెట్టునుండి యేర్పడుసారమునకు; తాంబూలమునం దుపయోగించెడి యొకదినుసువస్తువునకు) పేరు.

కైరవడి—ఇది ఖాదిరవటమునకు ఖాదిరఘుటికకు; కాఁచువడియమునకు; తాంబూలముతో వేసికొనుటకు కాఁచు లో నగువస్తువులు చేర్చి చేసినతావియుండకు) పేరు.

ఆకుఁజుట్ట—ఇది పర్ణస్తబకమునకు (స్తబకీకృత మగుతములపాకునకు; గుత్తివలె చుట్టినతములపాకుచుట్టకు; మడుపునకు) పేరు.

ఆకుమడుపు—ఇది వృత్తపర్ణమునకు (మడిచి గుండ్రము గా చుట్టినతములపాకునకు; తములపాకుచుట్టకు) పేరు.

సున్నపుఁగాయ—ఇది చూర్ణకరండమునకు (సున్న ముంచుకొనెడి బరణికి; చిన్నపెట్టెకు) పేరు.

పోఁకొత్తు—ఇది పూగదళినికి (అడకత్తెరకు; అడకొత్తునకు; పోఁకలు కత్తిరించు కత్తెరకు) పేరు.

తమ్ములము, వీడెము, వీడియము వీడ్యము, విడియము, విడ్యము, విడెము—ఇవి తాంబూలమునకు (వక్కలు సున్నము మొద లగునవి గల తములపాకులకు; వీటికి) పేర్లు.

నెలవత్తి —నెలవత్తిబాగాలు అనగా వాసనఃట్లు (౦.౭) వాసనవక్కలు, నెలవతి, నెలవత్తి-పూగభాగములు ఆం. భా. అనియు (బ్రౌ.). 'నెలవత్తి-పచ్చకప్పురపుఁబలుకు'-'మంచి వాసనల వాసించిన నెలవత్తిబాగాలు రాసులు పడఁగఁ బోసి' అని (కలా. 7. 60.). (నెలవత్తి బాగాలు-కప్పురబాగాలు ) 'నెలవత్తికి' ఇది రెండవయర్థ మనవలయును. అట్లే అనినది (సూ ని.). ['నెలవతి' శావి. పా. పారాం 'ఎవ్వరు దెచ్చిరొ కస్తురి దువ్వట మీఁఅవికె నెలవతులు సవరం బీ జవ్వాది యన్న ' (బహు. 6.119.) (చూ. సూ .ని.)]

కైరవడి — 'తాంబూలముతోఁ గూడ నుపయోగించుకొనుటకుఁ గాఁచు లో నగువస్తువులు చేర్చి చేసినయుండ,'ఖాదిరము' అని. (శ.ర.). దీనిసంవిధాన మిట్లు వచింపఁబడినది-'గీ. 'ఖదిర కర్పూర కస్తూరికా పటీర వల్కముల చూర్ణములు సమభాగములు గఁ గూర్చి పద నిడి చేసినఘుటిక లొప్పఁ గవిరియుండలు నా వీటికలను గూర్ప' (చి.ని.) (చూ సూ. ని. కవిరియుండ.).

ఆకు జొట్ట —ఇదియే మడుపు గా తో చు చున్నది- ఒకకవి యిట్లు వర్ణించు చున్నా డు-
కెమ్మోవులపచ్చిగంటు మాటుటకు హవణించినరవికసరవి మణు చు మడుపులు సగము మువిపంట గొఱికి నొక్కు-టెక్కు-లును (ప్రబం- 78 ) [ఇదియే- ఆకుమడుపు అనుటకు- వృత్తపర్ణము అనుట ప్రతిబంధకము గా ఉన్నది (వృత్తము-గుండ్రనిది- అని అర్థము ) ఈ ఆకుమడుపు - మన మిప్పుడు (కిల్లి ) అని వ్యవహరించు చున్న దానిని జెప్ప ననిపించు చున్నది రవికసరవి మణు చుమడుపు లనుటచే-ఇవి గుండ్ర నివి కా వని స్పష్ట మగు చున్నది ఆకు జొట్టలకే- ఆకుబుట్ట లనియు వ్యవహారము వ్రేళ్ల కది చుట్టి మట్టుతములపాక చుట్ట లివి యనిపించు చున్నవి పర్ణస్తబకము (స్తబ కము- పూలగుత్తి) ఈ చుట్టిన చుట్టలలో ఒక టొకటి వరుస గా ఉంచి నిడుపు గా ఒన ర్తురు-కావున గుత్తితో సామ్యము సుగమము ]

బాగాలు — వీడ్యమ్ము వీడెమ్ము విడెము తమ్మలము బా గాలు నా నలరు దాంబూలమునకు - అని (వేంక మాన ౬8 ) వీడియము వక్క- లాకులు విడెము తమ్మ (మ్మ ) లంబు వీడెంబు వీడ్య మనం బుదారి (ఆంధ్ర నం మాన ౬౦ ) ఇది అర్థాంతర మున దగినది

సీ చర్వితతాంబూలసంజ్ఞ యౌ దమ్మ నా
        బర గు గళాచిక పడిగ మన గ
గాళాంజి యన బతద్గ్రాహిణి దగు గూఁడు
        చౌట పంజర మన జను వ్యజనము
విసనకఱ్ఱ సుర టి పీవన యం చన
        నవి యెండమఱు గిడ నాలవట్ట
మన విరాజిలును దువ్వెన యన గేశప్ర
        సాధని వెలయును జనును గంక

గీ తికయుఁ జిక్కంటి యం చన దెలియఁ దగుచు
వెలయు లీక్షవికర్షి యీర్పెన యనంగ
నద్ద మన ముకురాఖ్య గా నతిశయిల్లు
వసుమతికృతళతాంగ చెవ్వందిలింగ

తమ్మ— ఇది చర్వితతాంబూలమునకు (నమలినతాంబూలమునకు తమ్ములము నకు) పేరు

కళాచిక పడిగము కాళాంజి—ఇవి పతద్గ్రాహిణికి (పతద్గ్రహమునకు తమ్మ పడిగమునకు తమ్మ ఉమిసెడి పాత్రమునకు కళాంజికి) పేర్లు

గూడు చొట—ఇవి పంజరమునకు (పెంపుడు చిలుకలు మొదలగువానిని ఉంచెడి గూటికి పంజరమునకు) పేర్లు

విసనకఱ్ఱ సురటి వీవన— ఇవి వ్యజనమునకు (తాలవృంతమునకు గాలికై విసరుకొనువీవనకు) పేర్లు

ఆలవట్టము— ఇది ఎండమఱుగునకై యిడెడు వీవనకు (రాజాదులకు ఎండ తగులకుండ పట్టెడి సాధనవిశేషమునకు సూరెపానునకు) పేరు

దువ్వెన—ఇది కేశప్రసాధనికి (తలవెండ్రుకలు దువ్వుట కుపయోగపడుసాధన మునకు) పేరు

చిక్కంటి—ఇది కంకతికకు (తలచిక్కు తీసికొనెడి నిడుపుదువ్వెనకు చిక్కం టునకు చిక్కంటెకు) పేరు

ఈర్పెన—ఇది లిక్షవికర్షికి (ఈళ్లను (పేలను) ఈర్చెడి దువ్వెనకు ఈరుపె నకు) పేరు

అద్దము—ఇది ముకురమునకు (ఆదర్శమునకు దర్పణమునకు ముఖ మది చూచుకొనుటకై గాజు లోహము మున్నగువానితో ఏర్పఱచిన వస్తువునకు) పేరు

యౌ దమన నా -(వావి అపముద్రి )]

ఆలవట్టము — గుండ్రనివిసనకఱ్ఱ అని మాత్రము (శ ర ) ఇది రెండవయర్థ మనినది (సూ ని ) ఇట్లనుటయే యుక్తము ఇది గుండ్రనిది- (చూ విజ వి 43 ) ఆలవట్టము వీవన-అనునవి వేఱు- ఆచ్చరవిరిబోడు లాలవట్టము లూన వినుబెంకి చెలులు వీవనలు వైవ (అచ్చ రా సుం 34 ) (చూ సూ ని )

వ్యజనము — వ్యజనాదులు ఇట్లు విశదపఱప బడినవి వ్యజనం తాలవృన్తం స్యాత్ ధవిత్రం చర్మణా కృతమ్ ఆలావర్త స్తు వస్త్రేణ చామరంతు ప్రకీర్ణకమ్ అని (వైజ పాతా పురా) ఆలవట్టము (సం ఆలావర్తము) ఇది వస్త్రముతో ఏర్పఱప బడునది

[ప్రసాధని — ప్రసాధని-(వావి అపముద్రి) ప్రసాధనీ కఙ్కతికా అని(అమ) ప్రసాధనీ తు కఙ్కత్యాం సద్ధౌ వేశే ప్రసాధనమ్ అని(విశ్వమేదినులు) (సాధ సంసద్ధౌ-ల్యుట్) (చూ సుధ) సు ప్యజాతౌ ణిని స్తాచ్ఛీల్యే (3 2 78) అని ణిని ప్రత్యయము అజాతివాచకశబ్దముకే విహితము

కంకతిక — సాధారణవాచకము గానే దీనిని ఉమరాదులు వచించినవి- కఙ్కత స్తు ప్రసాధన (వైజ పాతా పురా) కఙ్కతం కు ప్రసాధనమ్ (ఆమరమాల క్లీ కాం)

గీ శ్రీలు వెలయంగ నీపేరఁ జేయుకతన
బరఁగు శాశ్వతము గ నంవర్గ మిట్లు
గైకొనుము దీని భక్తసంఘాభిమాని
మాతృభూత జగత్త్రయీమాతృభూత 69

[చూ వ్యాఖ్యకై స్వర్గ 68)

ఇది

మనుష్యవర్గము

---

# బ్రహ్మవర్గము

సీ. సంతు కొౌలము వంగసము వంగడము పదు
గన వంశసంజ్ఞ యై యలరు చుండు
బరగు జతుర్వర్ణి బాపన రాచ కో
మటి రెడ్డి నా గను మనుచు నుండు
వన్నె యంచన గను వర్ణాభిధాన మౌ
మంచివాఁడు సనువు మంచి సాదు
వన సజ్జనుం డొప్పు నమరును విప్రుండు
పాఱుఁడు బాపడు బాపనుండు

గీ. పుడమివేల్పన బ్రాహ్మణ్యము దనరార
బాఁపఱిక మన దనరును బండితాభి
ధాన మగు దెల్వికాఁడు పెద్ద చదువరి యె
ఱుక గలుగువాఁడు నాగ మేచకశిరోధి 70

సంతు కొౌలము వంగసము వంగడము పదుగు—ఇవి వంశమునకు (అన్వయమునకు కులమునకు శరీర మొసగిన తండ్రి తాత-మొద లగువారివరుసకు) పేర్లు

బాపన రాచ కోమటి రెడ్డి—ఇవి చతుర్వర్ణికి (నాలుగుజాతులకు వరుస గా) పేర్లు

వన్నె—ఇది వర్ణమునకు (జాతికి) పేరు

మంచివాఁడు సనువు మంచి సాదువు—ఇవి సజ్జనునకు (యోగ్యునకు అర్హునకు మంచిస్వభావము కలవానికి) పేర్లు

పాఱుడు బాపడు బాపనుడు పుడమివేల్పు—ఇవి విప్రునకు (భూదేవునకు జన్నిగట్టునకు బ్రాహ్మణునకు) పేర్లు

బాపతికము—ఇది బ్రాహ్మణ్యమునకు (బ్రాహ్మణత్వమునకు బ్రాహ్మణధర్మమునకు బ్రాహ్మణకర్మమునకు) పేరు

తెల్వికాడు పెద్ద చదువరి ఎఱుకగలుగువాడు—ఇవి పండితునకు (విద్వాంసునకు చదువులయ్యకు తెలివరికి విద్యావంతునకు) పేర్లు

వన్నె—ఏనిఘంటువులును ఈపదమును ఈయర్థమునందు గ్రహింప లేదు వర్ణము జాతివాచకము దానికైన (వికృ)ఇది వన్నెయు వాసియుం దొలగి ఇత్యాదులలో- వన్నె జాతి అనుట యుక్తమనిపించును జాతి-నీతి తొలగి అందుము దానికిది భంగ్యంతర మన నగును

సజ్జనుడు — మహాకుల కులీ నార్య సభ్య సజ్జన సాధవ (అమ)

విప్రుడు—విప్రపర్యాయము గా వాడు అనుశబ్దమును ఒకచో కానవచ్చు చున్నది

తే డగ బోయెడిం గరణదేశపుజాణ డు గా గ బోలు నీ బాడు పణోపహార పరిపాటి యెఱుంగ గ వచ్చు వీనిచేత (క్రీడా 69) (చూ సూ ని)

సీ ఒప్పు నుపాధ్యాయుఁ డొజ్జ యనంగను
జన్న మనంగ యజ్ఞంబు చెలఁగు
జదువు నా బ్రహ్మయజ్ఞము దగు వేలిమి
యన దేవయజ్ఞంబు దనరు విందు
నా గ మనుష్యయజ్ఞము పొల్చు దనుపు నాఁ
గను బిత్రుయజ్ఞాఖ్యయొనరు బడిమి
యన భూతయజ్ఞ మౌ నైదుయజ్ఞము లివి
యాస్థానసంజ్ఞ యై యలరు నోల

గీ గమ్మ కొలు వన నది మించి కానుపింప
బోలు బేరోలగమ్మ నొడ్డోలగ మన

పరుస యన దైర్థికసభాఖ్య పరగు చుండు
బుంగవతురంగ శ్రీమాతృభూతలింగ 71

ఒజ్జ—ఇది ఉపాధ్యాయునకు (అధ్యాపకునకు వేదములోని కొంతభాగమునుగాని వేదాఙ్గములఁగాని చదివించువానికి అయ్యవారికి పంతులవారికి) పేర్లు

జన్నము—ఇది యజ్ఞమునకు (యాగమునకు అధ్వరమునకు వేదవిహిత మగు కర్మవిశేషమునకు) పేర్లు

చదువు—ఇది బ్రహ్మయజ్ఞమునకు (స్వాధ్యాయమునకు వేదపారమునకు) పేరు

వేలిమి—ఇది దేవయజ్ఞమునకు (గృహస్థు చేయు నిత్యాగ్నిహోత్రమునకు) పేరు

విందు—ఇది మనుష్యయజ్ఞమునకు (గృహస్థు నిత్యము చేయవలసిన అతిథి పూజకు) పేరు

తనుపు—ఇది పితృయజ్ఞమునకు (నిత్యపితృతర్పణమునకు) పేరు

బడిమి—ఇది భూతయజ్ఞమునకు (భూతబలికి వైశ్వదేవబలికి గృహస్థు వైశ్వదేవహోమమునకు అఙ్గముగా అగ్నిపితృగోశునకకాకాదులకు మన్త్రవిశేషముతో నిత్యము ఒసగు అన్నాదికమునకు) పేరు [(చదువు- మొదలు) ఇవి యైదు (పంచ) యజ్ఞములు ]

ఓలగము కొలువు—ఇవి ఆస్థానమునకు (ఆస్థానికి సభకు పరిషత్తునకు) పేర్లు

పేరోలగము ఒడ్డోలగము—ఇవి మించి కానిపించుసభకు (మహాసభకు నిండోలగమునకు సర్వాంగసంపూర్ణ మగుసభకు (కవీశ్వరులు బట్టురా (భట్రా) జులు గాయకులు పరిహాసకులు ఐతిహాసికులు పౌరాణికులు అను సప్తాంగములతో కూడినసభకు) పేర్లు

పరుస—ఇది తైర్థికసభకు (తీర్థయాత్రలకై తిరిగెడి జనసమూహమునకు) పేరు

ఉపాధ్యాయుడు — ఏకదేశం తు వేదస్య వేదాఙ్గాన్యపి వా పునః యోఽధ్యాపయతి వృత్త్యర్థ ముపాధ్యాయ స్స ఉచ్యతే అనినాడు మనువు ఉపాధ్యాయునకు ఆచార్యునకు (వై జ) భేదమును ఇట్లు వచించు చున్నది- మన్త్రవ్యాఖ్యాదినా ఽఽచార్య ఉపాధ్యాయ స్తు పాఠనాత్ (భూ బ్రా) ఉపనీయ తు య శ్శిష్యం వేద మధ్యాపయే ద్ద్విజ సాఙ్గం చ సరహస్యం చ త మాచార్యం ప్రచక్షతే అని మనువు వేదపాఠనాదులు లేనివారియందు ఈశబ్దములు లాక్షణికములు

ఐదు యజ్ఞములు —పాఠో హోమ శ్చాతిథీనాం సపర్యా తర్పణం బలి ఏతే పఞ్చ మహాయ జ్ఞా బ్రహ్మయజ్ఞాదినామకా అని (వ్యా) మను విట్లు వీనిని వివరించినా డు- అధ్యా పనం బ్రహ్మయజ్ఞ పితృయజ్ఞ స్తు తర్పణమ్ హోమో దైవో బలి ర్భౌతో నృయజ్ఞో ఽతిథిపూజనమ్ వేదము వీనిని గూర్చి యిట్లు వచించు చున్నది- య దగ్నౌ జుహో త్యపి సమిధం త ద్దేవయజ్ఞ స్సంతిష్ఠతే య త్పితృభ్య స్స్వధాకరో త్యప స్త త్పితృయజ్ఞ స్సంతిష్ఠతే య ద్భూతేభ్యో బలిం(ం)హరతి త ద్భూతయజ్ఞ స్సంతిష్ఠతే య ద్బ్రాహ్మ ణేభ్యో ఽన్నం దదాతి త న్మనుష్యయజ్ఞ స్సంతిష్ఠతే య త్స్వాధ్యాయ మధీయీ తైకా మ ప్యృచం యజు స్సామ వా త ద్బ్రహ్మయజ్ఞ స్సంతిష్ఠతే (యజు బ్రా) వీని యావశ్యకతను శ్రుతి యిట్లు తెలిపినది- త్రిభి రృణవాన్ జాయతే బ్రహ్మచ ర్యేణ ఋషిభ్యో యజ్ఞేన దేవేభ్య ప్రజయా పితృభ్య (భారతము)- ఋణై శ్చతుర్భి స్సంయుక్తా జాయన్తే మానవా భువి పితృ దేవర్షి మనుజై ర్దేయం తేభ్య శ్చ ధర్మ త (ఆది అధ్యా 20)

పరుస —బాటసారులసమూహము-అనిమాత్రము (శ ర)

ఆస్థానము —ఇందరిసభ్యులనుగూర్చి శాస్త్రము ఇట్లు వచించినది- ధర్మశాస్త్రార్థకుశలా కులీనా స్సత్యవాదిన సమా శ్శత్రౌ చ మిత్రే చ నృపతే స్స్యు స్సభాసద (స త వ ఎ ల సం)

సీ అగ్నిసాధనవిశేషాభిధ చెకుముకి
యన దనరును హవిష్యంబు చెల గు
నిగిరిక యం చన నిగిరికె యం చన
నామిషసంజ్ఞ యై యలరు గూకు

పాలవిఱుగు నాఁగ బరఁగును బొంగలి
యనఁగను బాయసం బలరుఁ బులగ
మన గృసరాన్నాఖ్య యొనరను దాన మొఁ
జాగము పెట్టొసఁగీగి యీవి

గీ. పుడుకురింత పుడిగ తేగము పుడుకనఁగ
యాచ్ఞ చెలువొందు వేఁడుట యడుగుట యన
విందనఁ నతిథినామమై వెలయుచుండు
భూరిభవభంగ శ్రీమాతృభూతలింగ 72

చెకుముకి—ఇది అగ్నిసాధనవిశేషమునకు(నిప్పు కలుగుటకై ఒకజాతిఱాతితో తాకించెడియుక్కుతునుకకు) పేరు

ఇగిరిక ఇగిరికె—ఇవి హవిష్యమునకు (హవిస్సునకు హోతవ్యమునకు అత్తెసరన్నమునకు బియ్యము వేచి కడుగ కుండ వండినయన్నమునకు) పేర్లు

కూకు పాలవిఱుగు—ఇవి ఆమిక్షకు(పెరుగుతో కూడినవేఁడిపాలకు) పేర్లు

పొంగలి—ఇది పాయసమునకు (పాలు చేర్చి పొంగించునట్టి-అన్నమునకు పరమాన్నమునకు) పేరు

పులగము—ఇది కృసరాన్నమునకు (పప్పు చేర్చి వండినయన్నమునకు) పేరు

చాగము పెట్టు ఒసగు ఈగి ఈవి పుడుకురింత పుడిగ తేగము పుడుకు—ఇవి దానమునకు (త్యాగమునకు వితరణమునకు పాత్రులగువారికి కోరినయర్థములను ఇచ్చుటకు) పేర్లు

వేఁడుట అడుగుట—ఇవి యాచ్ఞకు (యాచనకు పరులను ఆయావస్తువులు తనకిమ్మని దైన్యముతో అడుగుటకు) పేర్లు

విందు—ఇది అతిథికి (గృహాగతునకు మధ్యాహ్నాదిసమయములందు క్షుత్తృష్ణాద్యుపశమనమునకై తిథివిశేష మపేక్షింపక వచ్చువానికి) పేరు

చెకుముకి —పరస్పరము చెకుముకుతాలతా కిడివలన నిప్పు పుట్టుట ప్రత్యక్ష దృష్టము ఆ తాయియే యిట చెకుముకి అన బడిన దనిపించును పైరీతిని ఉక్కుముక్క అను చున్నవి (సూ ని శ ర మొ) [నామిషసంజ్ఞ మై (వావి పా) (అపపా)]

పులగము — దీనిని సాధారణము గా పెసరు బప్పుతో చేర్చి వండుదురు గ్రహగ్రస్తుల కది పెట్టునప్పుడు మినుపపప్పుతో గలం వండుదురు అతిథికి అభ్యాగతునకు భేద మిట్లు వచింప బడినది- తిథిపర్వోత్సవా స్సర్వే త్యక్తా యేన మహాత్మనా సో ఽతిథి స్సర్వ భూతానాం శేషా నభ్యాగతాన్ విదు (పరా 42) మన్వాదియుగాదిప్రభృతిషు తిథివిశేషేషు ద్రవ్యలాభ ముద్దిశ్య యే అభ్యాగచ్ఛన్తి తే ఽభ్యాగతా తాదృశం తిథి విశేష మనపేక్ష్య యదా కదాచిత్ క్షుత్తృష్ణాదిపరిఐద యోపగతో ఽతిథి (పరా అ 42శ్లో వ్యాఖ్య) (చూ సూ ని) మతొకలక్షణము దీని కిట్లున్నది- ఒజ్ఞాతకులగోత్రో వా మధ్యాహ్నదిసమాగత అన్నార్థ్యర్థీ మానవో య స్సో ఽతిథి పరికీర్తిత (స త సి ప సం) అతిథిశబ్దమునకు హరదత్తుడు పథ్యతిథి (4 4 04) వ్యాఖ్యాసందర్భమున వ్యుత్పత్తి ఇట్లు వచించినాడు (అతతి సతతం గచ్ఛ తీ త్యతిథి న విద్యతే తిథి ర్యస్య సో ఽప్యతిథి ఏక మం దిన మత్రా ఽస్థిత ఇ త్యర్థ (అని)

పుడుకురింత — పుడుకుడింత అని (బ్రౌ) (చూ అను) పుడికిరింత పుణికిరింత కొంచెము గా ఇచ్చుట-అను చున్నది (శ ర) ఇది రెండవయర్థ మన దగినది

౨ వెదకుడు తడవుడు వెనకుడు రోయుడు
నెమకు డనంగ నన్వేషణ మగు
నుజ్జన మన గను నుజ్జగిం పన గను
విడి యన విడు పన విడుదల యన
విడుట మానుట యన వీడుకో లన గను
నొదలుట ద క్కన వదలుట యన
నఱుట యనంగను దొఱ గు టనంగను
నలరు విసర్జనాహ్వయము లెదురు

గి కొనుట యెదురేగుట యెదురుకో లనంగ
నభిగమన మొప్పు గౌరవ మ్మలరు చుండు
గారవిం పన గారము గా౦వ మన
సెస (వ) యనంగను శుశ్రూష చెలఁగు నభవ 73

వెదకుడు తడవుడు వెనకుడు రోయుడు నెమకుడు—ఇవి అన్వేషణమునకు (మార్గణమునకు వెతకుటకు) పేర్లు

ఉజ్జనము ఉజ్జగింపు విడి విడుపు విడుదల విడుట మానుట వేడుకోలు ఒదలుట తక్కు వదలుట అఱుట తొఱగుట—ఇవి విసర్జనమునకు (వర్జనమునకు విడుగడకు వదలిపెట్టుటకు) పేర్లు

ఎదురుకొనుట ఎదురేగుట ఎదురుకోలు—ఇవి అభిగమనమునకు (పెద్దలను గౌరవించుటకై లేచి ఎదురుగా వెళ్లుటకు) పేర్లు

గారవింపు గారము గా౦వము— ఇవి గౌరవమునకు (ఆదరమునకు మన్ననకు) పేర్లు

సెస (వ)—ఇది శుశ్రూషకు (పరిచర్యకు వరివస్యకు గుర్వాదులసేవకు) పేరు

[వెదకుడు —వెనుకుడు-(వావి అపముద్రి) వెనకుడు-వెదకుడుయొక్క (రూపాం) తనకు బగ యగుప్రొద్దును వెనకి కనక (యయా 2) (చూ శ ర)]

[నొదలుట —నెదు దన అని (వావి పా) ఏడుడు దే వి విడుపు (ఇట్లు ఒకానొక నిఘంటుకారుడు వ్రాసియున్నాడు అది విచారింప దగినది-అని (శ ర) ఇదియే గణప్రాసయతులకు ఎదుడు గా అయి (వావి పా) గా రూపొంది యుండును (శ ర పా) ఇట ఎట్టిదో తెలియదు (బ్రౌ)- ఏదుడు-విసర్జనము ఆం భా అని ఇది ఏదుడు అనియే అనినది (చూ అను బ్రౌ) నొదలుట ద క్కన అని (ప్రాత ప్రతిపా) అనినది (సూ ని) (చూ తక్కు) అనినదేకాని ఈయర్థమును ఒదలు నకు ఈయ లేదు బ్రౌ వదలు నకు (రూపాం) గా ఒదలు గ్రహించినది ఐనను

అం భా పా ఏదుడు ఆనియే అను చున్న దిది సేవ నుండి ఏర్పడిన (వికృ)
సెవ ఇది ఆగు ననిఎంచు చున్నది

సెన — ఇది ఏనిఘంటువులు గ్రహింప లేదు

సీ త్రిమ్మట త్రిప్పట తిరుగుడు తిరుగు నా
బర్యటనాఖ్య యై పర గు చుండు
నాచమనీయాఖ్య యలరు వా ర్పన గను
మౌనంబు పలుకమి నా నెసంగు
వరుస యనంగను బరువడి యన గను
గ్రమనామ మొప్పను రాజిలు దడ
బాటు పీడ్పాటు నా వ్యత్యయ మగు నెడ
బా టనంగను నతిపాత మొప్పు

గీ నియమ మలరారు నేమంబు నేమకంబు
కట్టడ యనంగ దేవతాకార్యనియమ
సంజ్ఞ గా బల్కు బడు జన్నె జన్నియ యన
బత మన గ వ్రతము వెలయు బార్వతీశ 74

త్రిమ్మట త్రిప్పట తిరుగుడు తిరుగు—ఇవి పర్యటనమునకు (సంచారమునకు భిక్షాదులకై తిరుగుటకు) పేర్లు

వార్పు—ఇది ఆచమనీయమునకు (ఉపస్పర్శనీయమునకు ఆచమించుటకు అర్హమైన) జలమునకు పేరు

పలుకమి—ఇది మౌనమునకు (అభాషణమునకు మిన్నకుండుటకు మాట లాడకుండుటకు) పేరు

వరుస పరువడి—ఇవి క్రమమునకు (అనుపూర్వికి పరిపాటికి పూర్వాపార్వము

గా (మొదటిది దానితరువాతిది దానితరువాతిది-అనురీతిగా) అనుసరింప బడువిధ మునకు) పేర్లు

తడబాటు పీడ్పాటు—ఇవి వ్యత్యయమునకు (వ్యత్యాసమునకు వైపరీత్యమునకు తాఱుమాఱునకు మాఱుపాటునకు) పేర్లు

ఎడఁబాటు—ఇది అతిపాతమునకు (పర్యయమునకు విడివడుటకు క్రమము తప్పి వర్తించుటకు) పేరు

నేమము నేమకము కట్టడ— ఇవి నియమమునకు (కట్టుపాటునకు వ్యవస్థకు ఏర్పాటునకు) పేర్లు

జన్నె జన్నియ—ఇవి దేవతాకార్యనియమమునకు (దేవతాప్రార్థనకు దేవతా కార్యమున కగునిశ్చయమునకు మ్రొక్కుబడికి) పేర్లు

బతము—ఇది వ్రతమునకు (పుణ్యకమునకు ధర్మసాధన మగు ఉపవాసాది పుణ్యకర్మము నకు) పేరు

వ్రతము — నియయో వ్రత మస్త్రీ త చోపవాసాది పుణ్యకమ్ అని (అమ) నియమో యన్త్రణాయాం చ ప్రతిజ్ఞానిశ్చయే వ్రతే అని (మేదిని)

వార్పు — ఆచమనము -అని(శ ర) ఉపస్పర్శ స్త్వాచమనమ్ అని (అమ) దీనిని బట్టి అర్థ మిట్లు నిర్ణయింప బడి యుండును కాని ఆచమనము ఆచమనీయము భిన్నా ర్థకములు (శ్రుతిస్మృతులు విధించినరీతిని మూ డుసారులు జలపాన మొనర్చుట ఆచ మనము అందుల కగుజలము-ఆచమనీయము (ఆఙ్పూర్వకమగు చము ధాతువునకు అర్థా ర్థమున అనీయర్ ప్రత్యయమున-ఆచమనీయము ఆఙ్పూర్వక చము ధాతువు నకు భావా ర్థమున ల్యుట్ ప్రత్యయమున- (ఆచమనము) ఉపచారములందు ఆచమ నీయం సమర్పయామి అను చున్నాము ఆచమనార్హ మగుజలమే యిట సమర్పింప బడునది

ఎడబాటు —ఈపదమును ఈయర్థమున ఏనిఘంటువులు గ్రహింప లేదు

అతిపాతము — అతిపాత స్తు స్యా త్పర్యయ ఉపాత్యయ (అమ)

[తడబాటు — తడపాటు వావి (అపముద్రి) నలువు గిలువు దంపతుల కొకప్పుడు దడం బడుసుగాని యెట్టిమెడల నట్లు జగతి నాడు దనము మగతనముసు దడం బఱచు కొనుట యెందు నెఱగ బడదు (కలా 592)]

ప స్తిల్లి నుంకు నిప్పప్తు ని ట్రన గను
నుపవాససంజ్ఞ యై యొప్పు చుండు
బ్రహ్మబిందువు మీఱు ద్రస్స యనంగను
ప్రొక్కు దండము కేలుమో డ్పెర గుడు
నా గ జె న్నొందును నతి తద్విశేషము
ల్చేవిప్పు వెన్నెల చిన్నిపువ్వు
జోహారును జొహారు జోడాలు చెంగనాల్
డింగిల్లు గొబ్బిళ్లు డెంకనాలు

గీ నల్లొనేరేళ్లు జోదిల్లు నన గ దనరు
వే డికో లన బ్రార్థన వెలయు చుండు
భిక్ష తిరిపము బికిరము బిచ్చ మాయ
వారమును జోగు నా గను వఱలు నభవ 175

పస్తు ఇల్లి నుంకు నిప్పప్తు నిట్రు— ఇవి ఉపవాసమునకు (ఉపాసమునకు ఒక్కప్రొద్దునకు భోజనము లేమికి) పేర్లు

త్రస్స—ఇది బ్రహ్మబిందువునకు (వేదమును అధ్యయనించునప్పుడు నోటినుండి రాలుతుంపరకు) పేరు

మ్రొక్కు దండము కేలుమోడ్పు ఎర గుడు—ఇవి నతికి (ప్రణతికి ప్రణామమునకు కేలుమొగ్గకు నమస్కారమునకు) పేర్లు

చేవిప్పు వెన్నెల చిన్నిపువ్వు జోహారు జొహారు జోడాలు చెంగనాలు

డింగిళ్లు గొబ్బిళ్లు టెంకనాలు అల్లొనేరేళ్లు జోదిళ్లు—ఇవి నతివిశేషమునకు (నమస్కారములలోని భేదములకు) పేర్లు

వేడికోలు—ఇది ప్రార్థనకు (అభ్యర్థనకు తనకోర్కి తీర్పు మని పెద్దవారిని వినయముతో అడుగుటకు) పేరు

తిరిపము బికిరము బిచ్చము ఆయవారము జోగు—ఇవి భిక్షకు (యాయావరమునకు భిక్షుకవృత్తికి ఇల్లిల్లు దిరుగుచు భిక్ష అడుగుటకు) పేర్లు

బ్రహ్మబిందువు — పారే విప్రుషో బ్రహ్మబిన్దవ (అమ)

[త్రస్స — త్రప్స-అని (వ్రా తప్ర బ్రౌ పా) చి ని శ ర (త్రప్సా సం)-అను చున్నవి (చూ సూ వి త్రస్స)]

డింగిళ్లు —గిడిగిళ్లు-అని (చి ని శ ర బ్రౌ పా) (చూ సూ వి)

అల్లొనేరెళ్లు — అల్లునేరెళ్లు జోదిళ్లు - అని వ్రా తప్ర పా) ఇట జొబిళ్లు (ముద్రిపా) (చూ సూ వి జొదిళ్లు)

జొదిళ్లు —జోడిళ్లు (యాపాం) టెంకణాలుగొబ్బిళ్లు జొడిళ్లన గిడి గిళ్లు జొహారు (ఆంధ్రపదాకరము- గుణవర్గు) [(సాంబ ని)- సామాన్యవాచకముల గానే ఇందు కొన్నిటని వచించనది- జొత చా గిలి కొల్పు జొహారు గిడిగిడి మోడుపు చేకూర్పు మ్రొక్కు మొగుపు చిన్నిపూ చేమోడ్పు జేజ వెన్నెల చెంగ నాలు గొబ్బులు టంక ణాలు నేరెడల్లొల్ నూ మన సమరు దండముపేళ్లు (మాన ౨౦)

సీ అవిరక్తభిక్షుకు డలరును బికిరాల
మారి బికాసి బికారి తిట్టి
గొట్టు తిట్టి తిరిపగొట్టు నా వటు డొప్పు
వడుగు బొమ్మచారి తడుపుదాల్పు
నా గృహస్థాభిధానం బిలుదొర గేస్తు
నా వనసంవాసినామ మెస గు

నడవినెలవరి నాజడదారి యన గను
గనుపట్టు సంన్యాసి కావిగొ చి

గీ దారి బోడ తబిసి నా గ దనరు యోగి
జోగి నా దగు జడదారి నా గ దపసి
నా గ ఋషిసంజ్ఞ జందెంబు నా గ జన్ని
దం బన గ యజ్ఞసూత్ర మౌ నంబరకచ 76

బికిరాలమారి బికాసి బికారి తిట్టిగొట్టు తిట్టి తిరిపగొట్టు—ఇవి అవిరక్తభిక్షుకునకు (వైరాగ్యము కలుగక ఆహారాదులకై డంబము గా భిక్షుధర్మములు (ధ్యాన మౌనాదులు) ఆచరించుచు బిచ్చ మెత్తు భిక్షుకునకు టక్కరిసంన్యాసికి) పేర్లు

వడుగు బొమ్మాచారి తడుపుదాల్పు— ఇవి వటునకు (వర్ణికి బొమ్మచారికి బ్రహ్మచారికి వేదాధ్యయనమున కైనవ్రతమును (బ్రహ్మచర్యమును) ఆచరించు మొదటి ఆశ్రమము వానికి) పేర్లు

ఇలుదొర గేస్తు—ఇవి గృహస్థునకు (గృహికి గృహమేధికి ఇంటికా పునకు రెండవ ఆశ్రమము వానికి) పేర్లు

అడవినెలవరి జడదారి—ఇవి వనసంవాసికి (వైఖానసునకు వానప్రస్థునకు మూడవ ఆశ్రమము వానికి) పేర్లు

కావిగొచిదారి బోడ తబిసి— ఇవి సంన్యాసికి (పరివ్రాట్టునకు భిక్షువునకు నాల్గవ ఆశ్రమము వానికి) పేర్లు

జోగి—ఇది యోగికి (యోగనిష్ఠునకు యోగాభ్యాస మొనర్చువానికి) పేరు

జడదారి తపసి—ఇవి ఋషికి (అమోఘవాక్కునకు సత్యవాక్కునకు) పేర్లు

జందెము జన్నిదము — ఇవి యజ్ఞసూత్రమునకు (బ్రహ్మసూత్రమునకు యజ్ఞోపవీతమునకు) పేర్లు

బ్రహ్మచారి —(సం బ్రహ్మచారీ ) బ్రహ్మచర్య మిట్లు వివరింప బడినది- కాయేన మనసా వాచా సర్వావస్థాసు సర్వదా సర్వత్ర మైథునత్యాగం బ్రహ్మచర్యం ప్రచక్షతే- (స త సి ప ల సం )

గృహస్థుడు — గృహస్థశబ్దవివరణ మి ట్లున్నది- వైవాహికేన విధినా కృతపత్నీపరిగ్రహ (స త స ప ల సం )

వనసంవాస — వనసంవాసశబ్దము వానప్రస్థశబ్దమునకు పర్యాయము వనస్య ప్రస్థ ప్రదేశ తత్ర భవ వానప్రస్థ అని (సుధ ) వైఖానసో వనేవాస వానప్రస్థ శ్చ తాపస అని (వైజ భూ వనా ) [ శయ వాస వాస ష్వకాలత్ (6 3 8 అని సప్తమికి అలుక్కు వికల్పము వనేవాస వనవా.- రెండును సాధువులు వనవాస యే వనసంవాస

[ సన్యాస అనియే యిచ్చటిపాఠము (చూ తబిస సూ ని ) బ్రౌ శ ర )- సన్యాస అని గ్రహించినవి సన్యాసము - కామ్యకర్మత్యాగము ఆది కలవాడు అనుచున్నది (శ ర ) సంన్యాసమునుగూర్చి శాస్త్ర మి ట్లను చున్నది- కర్మత్యాగా న్న సంన్యాసో న ప్రైషోచ్చారణేన తు సన్ధౌ జీవాత్మనో రైక్యం సంన్యాస పరికీర్తిత దేహన్యాసో వా సంన్యాసో నైవ కాషాయవాసనా నా ఒహం దేహో ఒహ మా త్మేతి నిశ్చయో న్యాస లక్షణమ్ (స త స ప ల సం )( నేను దేహము కాను పరమాత్మను అను నిశ్చయము న్యాసము) సంన్యాస అనుటకు సన్యాస అనుట (శ ర )కు ఎట నైన కానవచ్చియుండును సంన్యాస లేక సన్న్యాస అనుటయే ఇట యుక్తమనిపించి నది సన్యాస శబ్దసాధుత్వము పరిశీలనీయము

యోగి — యోగ శ్చిత్తవృత్తినిరోధ అని పతంజలి తదుపాయము లగు (యోగ) విశేషములు ఎనిమిది యమము 2 నియమము 3 ఆసనము 4 ప్రాణాయామము 5 ప్రత్యాహారము 6 ధారణ 7 ధ్యానము 8 సమాధి (ఇవి కలవాడు )

యజ్ఞసూత్రము —యజ్ఞార్థంసూత్రమ్-యజ్ఞసూత్రమ్- అని (సుధ ) యజ్ఞోపవీతోత్తరీయే బ్రహ్మసూత్రోత్తరీయయో -అని (వైజ శేష నపుం )

ఋషి — ఋషయ స్సత్యవచస అని (అమ ) ఈఋషులు- మహర్షి దేవర్షి బ్రహ్మర్షి

పరమస్థాయ కాణ్ణర్షి శ్చ శ్రుతర్షి శ్చ క్రమావరా ఇతి రత్నకోష - అని (సుధ) వీరిలోని భేదములు వచించినది

[తదపునాల్చ్రు-నావి అపముద్రి]

సీ పొసగు గమండలు బుడిగ యనంగను
బుడ్డిగ యన గను బుడ్డి యన గ
బోలె నా గను గకిపాల నా గను గక్ష
పాలాహ్వయంబు గా బం గు ధార్య
చర్మనామము కళానము కళవస మన
యోగివేత్రాభిధ యొప్పు లాత
మన గ ముండనసంజ్ఞ యలరుచు నుండును
గో గుట బోడింపు గొఱుగుట యన

గీ నుపనయన మగు వడుగు నా నొ ప్పగును వి
వాహనామంబు పెండ్లి చేపట్టు కాలు
ద్రొక్కు పెండిలి యనఁగ బెం పెక్కు నే గు
పెం డ్లనఁ దదంతవీథికావిహృతి యభవ 77

బుడిగ బుడ్డిగ బోలె—ఇవి కమండలువునకు (కరకమునకు కుండికి గిండికి సంన్యాసులు గాని బ్రహ్మచారులు గాని నీరు త్రాగుటకై ఉపయోగించెడి పాత్ర విశేషమునకు) పేర్లు

కకపాల—ఇది కక్షపాలకు (కక్కపాలకు యోగులు లో నగువారు చంకను బెట్టుకొనెడియొకవిధ మగుసంచికి) పేరు

కళానము కళవసము—ఇవి ధార్యచర్మమునకు (యోగులు ధరించు (మృగ) చర్మమునకు కడవసమునకు) పేర్లు

లాతము—ఇది యోగివేత్రమునకు (యోగులచేతికఱ్ఱకు) పేరు

గోగుట బోడింపు గొఱుగుట—ఇవి ముండనమునకు (వపనమునకు క్షౌరకర్మమునకు మంగలిపనికి) పేర్లు

వడుగు—ఇది ఉపనయనమునకు (వేదాధ్యయనార్థము గురుసమీపగమనమునకై ద్విజులకు జరిపెడియొకసంస్కారమునకు) పేరు

పెండ్లి చేపట్టు కాలుద్రొక్కు పెండిలి—ఇవి వివాహమునకు (పరిణయమునకు పాణిగ్రహణమునకు గార్హస్థ్యమున కగు- ఒకసంస్కారమునకు) పేర్లు

ఎగుపెండ్లి—ఇది తదన్తవీధికావిహృతికి (పెండ్లిచివర జరపువధూవరుల ఊరేగింపునకు) పేరు

బోలె—(సూ ని) దీనికి కకపాల యోగులసంచి- అను అర్థమిచ్చినది బోలె త్రాగుపాత్రము కమండలువు అనునర్థమే దీనికి యుక్తము పూర్వాన్వయి ఇది నాకు త్రాగేటందుకు ఒకబోలె లేదు - అని (బ్రౌ) (చూ బోలె)

కకపాల—మడిసంచి-అని (బ్రౌ)

ధార్యచర్మనామము — ధార్య మగుచర్మమునకు నామ మిది అని (ఆం భా) ఉను చున్నది కళవసం బూడ జలకమండలువు వీడ అని (కువ 2 35) సాధారణము గా చర్మమాత్రము అర్థ మను చున్నవి చాలనిఘంటువులు (శ ర) ఇట చర్మమాత్రము దీని కర్థ మగుటకు ప్రమాణము గా ఈ ఆం భా నే (ధార్యశబ్దము వదలి) చర్మనామము కళాసము కళవస మన అని ఉదాహరించినది ఇట (శ ర కారులు) గ్రహించినపాఠము ఎట్టిదో తెలియుట లేదు సాంబ స్పష్టముగా చట్టతో లన గళాసంబు నా గ జర్మమమరు (ఖాన 7) ఉను చున్నది ఇది లాక్షణికార్థ మగుట సముచితము

గోగుట — గోకు -అనుక్రియనే నిఘంటువులు గ్రహించినవి (సూ ని) బోడింపు అనుపదముక్రింద (ఆం భా పా) గోగుట గానే ఉదాహరించినది గోకుట కైన (రూపాం) ఇది కావచ్చును

సీ వడుగుపెండిండ్లలోపల ద్రుతీయదినంబు
పాకెన్న యన గను బర గు చుండు

నారెంటికిని వేఱె యగుచు నంత్యదినంబు
లవును గంబవలి నాగవలి యనఁగఁ
బెండ్లికూతు ఠనంగ బెండ్లికొడు కనంగఁ
గ్రమము గాను వధూవరాఖ్యలు దగు
జిమ్మనగ్రోవి నా శృంగ మొఁ దద్భేద
మండె బుఱ్ఱటకొమ్ము నన గ వెలయు

గీ గొఱలు గవయుట కూడిక కూటమి కల
యిక యన రతి యహిరతి యెన గు మనక
మన గ బళుమృగరతము చెన్నలరు దొక్కు-
డన గ బొర్లుట యన గ దేవాధిదేవ 78

పాకెన్న—ఇది వడుగుపెండ్లిండ్లలోపలి తృతీయదినమునకు (వివాహమునందలి మూడవదినమునకు వడుగునందలి మూడవదినమునకు ప్రాకెన్నకు) పేరు

కంబవలి—ఇది వడుగులోనికడపటిదినమునకు (స్తంభపూజాదిసంస్కారవిశేషము జరగు నాల్గవదినమునకు) పేరు

నాగవలి—ఇది పెండ్లిలోని చివరిదినమునకు (నాగవల్లికి వివాహమున కంగముగా నాకబలి (దేవతాపూజ- సంస్కారవిశేషము) జరపు-ఐదవ దినమునకు)పేరు

పెండ్లికూఁతురు—ఇది వధువునకు (పెండ్లికొమార్తెకు) పేరు

పెండ్లికొడుకు—ఇది వరునకు (పెండ్లికొమరునకు) పేరు

చిమ్మనగ్రోవి—ఇది శృంగమునకు (జలక్రీడాదులందు నీరు ము న్నగునవి చిమ్ముగొట్టమునకు చిమ్మనపు గ్రోవికి) పేరు

అండె బుఱ్ఱటకొమ్ము—ఇవి శృంగవిశేషమునకు (బూఱటకొమ్మునకు ఒకవిధమైన చిమ్మనగ్రోవికి) పేర్లు

కవయుట కూడిక కూటమి కలయిక—ఇవి రతికి (సురతమునకు సంభోగము నకు మిధునకర్మమునకు) పేర్లు

మసకము—ఇది అహిరతికి (సర్పముల సురతమునకు) పేరు

త్రొక్కుడు పొర్లుట—ఇవి పశుమిధునములయు మృగమిధునములయు-కూటమికి (రతికి) పేర్లు

పాకెన్న — సదస్సు పెండ్లిమూడవనాటి ఉత్సవము-అని (బ్రౌ) పెండ్లియందలి మూడవనాటి ఋవ్వము-అని (శర) (సం పాకాన్నమ్ ప్రా పాకన్న) ప్రాకెన్న పాకెన (రూపాం) ప్రాకెన్న జేసరి బ్రహ్మదు లెల్ల బ్రాకటాశీర్వాదఫణుతులు మీఱ (మృ వి 3 68) (మొ) (చూ సూ ని)

కంబవలి — కంబవల్లి (రూపాం) (కంబవల్లి)- ఉపనయమునందు కడపటిదినము చేయుస్తంభపూజలో లగునది అని (శర) (సూ ని) వివాహముకడపటిదినము జరపుసంస్కారవిశేషముగూడ దీనికి అర్థమని యాజ్ఞికుల్ దక్షిణ లర్పింప రాజులై రుల్లసద్గతి గంబవల్లినాడు (రా వి 5 80) ప్రయోగము నుదాహరించినది

అండె బుఱ్ఱటకొమ్ము —దేశ్యమాల సామాన్యవాచకము లివి యను చున్నది కువలయంబున బుఱ్ఱటకొమ్ము నాగ నండె యనగ వసంతంబు లాడునట్టి కొమ్మునకు బేళ్ల (దేశ్య) (చూ సూ ని అండె) [దీనిని బట్టి అండె బుఱ్ఱటకొమ్ము వసంతము లాడుటకు ఉపయోగపడునవి జలాదులు చిమ్ముట కుపయోగపడునది చిమ్మనగ్రోవి అని ఆకారమునందు గూడ దీనికిని దానికిని గొంచె మేదో భేద ముపయోగమునుబట్టి తదనుకూలము గా ఉండవచ్చు నని తోచు చున్నది ]

నాగవలి —(సం నాకబలి ప్రా నాగవెల్లీ క నాగవలి) నాగబలి=నాగపూజ వివాహసంస్కారవిశేషము (అప గృహ్య సూ 2 ၈) (చూ సూ ని నాకబలి) ఐదవనాడు కొందఱు నాల్గవనాడు కొందఱు దీనిని జరుపుదురు - అని క్రిందిప్రయోగములు చెప్పుచున్నవి- తగ బ్రాకెనయుపు దీఱిచి నగవులపను లైనవెనుక నాలవనాడొప్పుగ నాగవల్లి సేయగ (యయా 4 4) అటుల దినచతుష్టయంబైనయంత నాగవలియు నొనర్చె క్ష్మావరుండు (ఇందు 6 66)

సీ. పొత్తన గ సజగ్ధి పొలుచు బువ్వ మనంగ
స్వజనవివాహసజగ్ధి దనరు
హరిబువ్వ మన వివాహచతుర్థ దినరాత్రి
బంధుజనసజగ్ధి పర గు చుండు
పాలిక జాజాలపాలిక నా గను
నంకురార్పణశరావాఖ్య దనరుఁ
ప్రథమవధూవరభవనప్రవేశాఖ్య
యిలు నింపడ మనంగ నెస గు చుండు

గీ. సుంకు వన నోలి యన గను సం కనంగ
బైఁడి యన గన్యకాశుల్కవాచక మగు
నరణ మన పితృదత్తకన్యాధనంబు
పొలుచును వినంగ శ్రీమాతృభూతలింగ 79

పొత్తు—ఇది సజగ్ధికి (సహభోజనమునకు సగ్ధికి బంతికుడుపునకు చాలమందితో కలసి చేయుపంక్తిభోజనమునకు) పేరు

బువ్వము—ఇది స్వజనవివాహసజగ్ధికి (వివాహసమయమున బంధువు లందఱు కలసి వేడుక గా భుజించుటకు పెండ్లివారితోడి సహభోజనమునకు) పేరు

హరిబువ్వము—ఇది వివాహచతుర్థ దినరాత్రిబంధుజన సగ్ధికి (పెండ్లినాల్గవ దినము రాత్రి మగవారు ఆఁడువారు బంధువు లందఱు కలసి పరిహాసము లాడుకొనుచు ఎగతాళిపాటలు పాడుకొనుచు చేయు పెండ్లిభోజనమునకు) పేరు

పాలిక జాజాలపాలిక—ఇవి అంకురార్పణశరావమునకు (వివాహాదులందు నవధాన్యములు మొలపించెడి మట్టిమూఁకుటికి జాజాలపాలెకు) పేర్లు

ఇలునింపడము—ఇది వధూవరుల ప్రథమగృహప్రవేశమునకు (వివాహ మైన నూత్నదంపతుల నూతనగృహప్రవేశమునకు) పేరు

ఉంకువ ఓలి సంకు పై డి—ఇవి కన్యాశుల్కమునకు (కన్యార్థముమామకు గాని కన్యకు గాని అల్లు డిచ్చుద్రవ్యమునకు) పేర్లు

అరణము—ఇది పితృదత్తకన్యాధనమునకు (పెండ్లికొమార్తెకు తండ్రి యిచ్చు ద్రవ్యమునకు) పేరు

బువ్వము —ఇది తొలిబువ్వము హరిబువ్వము- అని రెండువిధములు పెండ్లికి ముందు రాత్రి పెండ్లివారితోడి సహభోజనము తొలిబువ్వము [ జాదారపాలిక (వావి పా ) జాదార=అంకురార్పణశరావము అని (బ్రౌ ) (జాజాలు)-శుభకర్మములందు అంకురోత్పత్తికై మూకుడులయందు పోసిన నవధాన్యములు శర్వరీచంద్రపరిణయ సముచితాంకురార్పణక్రియ గలయ వియద్విభాగ పాలికల దో చుకొత్త జాజాల మొలక లన గ దారక లొండొండ యంకురించె (కవిక 4 83 ) (సూ ని )

పాలిక — ఇది సంస్కృతశబ్దము అనుటయే యుక్తము అని (శ ర ) పాలకు లెత్తుట అని తెలుగువారి వ్యవహారము పాలికలకే- (పాలకులు) అపభ్రంశ మనవచ్చును సంస్కృతము లయియు తెలుగువారివ్యవహారముచే ఒకవిశిష్టత వహించి తెలుగులైనవానిలో ఇదియు ఒకటి

ఇలువింపడము —ఇది సూ ని గ్రహింప లేదు (శ ర బ్రౌ) గ్రహించినవి

అరణము.—ఈయర్థమునందు (సూ ని శ ర లు ) దీనిని గ్రహింప లేదు (బ్రౌ ) గ్రహించినది.

సీ. ఉపరిసురతసంజ్ఞ యొప్పును ముగపోల్కి-
కూటమి యన గ బైకూటమి యన
మణితవాచకము లై మనుc బావురాపల్కు-
లనcగc గూకీపల్కు- లన గ నవియె
లోగ్రుక్క- వెలిగ్రుక్క- నా గc జెలంగును
దంతక్షతాభిధ తనరు చుండు
బలుగంటు, పలునొక్కు- పలుకెంపు లన గను
గరరుహక్షతములు మెఱయు చుండు

గీ గోరువంకలు చందురుకూన లన గ
ముద్దు నా గను జుంబనం బొప్పు చుండు
బొల్చు చుండును దొంతరము ద్దనంగ
దద్విశేషంబు మాతృభూతాభిధాన 80

మగపోల్కి కూటమి పైకూటమి—ఇవి ఉపరిసురతమునకు (పురుషాయితమునకు ఉపరతికి మగపాడికి పుంభావముతో స్త్రీ సలుపు సురతమునకు) పేర్లు

పావురాపల్కులు కూకీపల్కులు కోగ్రుక్క వెలిగ్రుక్క—ఇవి మణితమునకు (రతికూజితమునకు రతికాలమున స్త్రీ చేసెడి యొకవిధ మగు అవ్యక్త ధ్వని కి) పేర్లు

పలుగంటు పలునొక్కు పలుకెంపు—ఇవి దంతక్షతమునకు (పల్లొత్తునకు పెదవికెంపునకు పల్గంటునకు మోవి కఱచుటవలన ఐనగాయమునకు) పేర్లు

గోరువంకలు చందురుకూనలు—ఇవి కరరుహక్షతమునకు (నఖక్షతమునకు గోటిచెనకునకు గోటినా టునకు స్తనాదులయందు గోటితో చేయుగాయమునకు) పేర్లు

ముద్దు—ఇది చుంబనమునకు (ణిసధాత్వర్థమునకు ప్రేమముతోడి వక్త్రసంయోగమునకు) పేరు

దొంతరముద్దు—ఇది చుంబనవిశేషమునకు (ఒకవిధ మగుముద్దునకు) పేరు

కరరుహాక్షతములు — వీని కగుస్థానములు వానిపేర్లు ఇట్లు వివరించినది (వేంక)-
సరవినఖక్షతస్థానము ల్వివరింతు సందిట గలయవి సందువంక లన బొల్చు
మెడ నున్నయవియె మొగలిరెకు లన దగు జనుగుబ్బలను నెలకొను
నవియె లెస్స నెమలియడుగు లన గ నొప్పు వెన్నున గన బడు చున్నయవియు
నమ్ము లనంగ దనరును బిఱుందుపై గానుపించినయవి కల్వపురేకు లన గ నెస
గు మీ జెయి జెక్కుటను దొడకడ నిలుచునవి క్రొన్నెల లనంగ జెల గు చుండు

మఱియు దంతక్షతముల నామములు సెలగు బెదవికెంపు పల్గంటు నా (వేంకటేశ)
(వేంక మాన 77)

దొంతరముద్దు — ముద్దుమీదిముద్దు అని (బ్రౌ)

గీ శ్రీలు వెలయంగ నీపేర జేయుకతన
బరగు శాశ్వతము గ బ్రహ్మవర్గ మిట్లు
గైకొనుము దీని భక్తసంఘాభిమాని
మాతృభూత జగత్త్రయీమాతృభూత

[చూ వ్యాఖ్యకై సర్గ 68]

ఇది

బ్రహ్మవర్గము

# క్షత్త్రియవర్గము

సీ రాచవా డన గను రా జన క్షత్త్రియు
డొప్పు నేలిక సామి యొడయ డు దొర
రాయఁడు రా తే డు రా జెకిమా డన
నరపాలసంజ్ఞ లై పర గు చుండు
రాచటి కమ్మన రాయటిక మ్మన
రాజరా డ్భావకర్మములు వెలయు
లక్కుము డన దగు లక్ష్మణు డనిలజు
డలరును వడముడి వలిమొల కన

గీ బార్థుఁ డెస గును గట్టి కవ్వడి యనంగ
నకులసహదేవు లలరుదురు కవ లనఁగ
జెల గు దుశ్శాసను డు దుస్సేను డన గ
బ్రబలు దుర్యోధనుండు రారా జన భవ 82

రాచవాఁడు రాజు—ఇవి క్షత్త్రియునకు (రాజన్యునకు బాహుజునకు బుజము పుట్టువునకు రాచపుట్టువునకు క్షత్త్రియునకు క్షత్త్రియస్త్రీయందు పుట్టినవానికి) పేర్లు

ఎలిక సామి ఒడయఁడు దొర రాయ డు రా తే డు రాజు ఎకిమా డు— ఇవి నరపాలునకు (భూపతికి పార్థివునకు క్షత్త్రియు లైనను గా కున్నను భూమిని ఏలువారి కందఱకు) పేర్లు

రాచటికము రాయటికము—ఇవి రాజభావమునకు రాట్కర్మమునకు (వరుసగా) రాజధర్మమునకు (రాచపాడికి) రాజకృత్యమునకు (రాజు లొనర్చుపరిపాలనాది కార్యమునకు)-రాజత్వమునకు రాచతనమునకు) పేర్లు

లక్కుమ డు—ఇది లక్ష్మణునకు(సౌమిత్రికి లక్కుమనునికి) పేరు

వడముడి వలిమొలక—ఇవి అనిలజునకు (వృకోదరునకు భీమసేనునకు భీమునకు) పేర్లు

కట్టి కవ్వడి—ఇవి పార్థునకు (సవ్యసాచికి గాండివికి వివ్వచ్చునికి అర్జునునికి) పేర్లు

కవలు—ఇది నకులసహదేవులకు (మాద్రియులకు మాద్రికొడుకులకు) పేరు

దుస్ససేను డు—ఇది దుశ్శాసనునకు (దుర్యోధనునితమ్మునకు) పేరు

రారాజు—ఇది దుర్యోధనునకు (సుయోధనునకు ధృతరాష్ట్రుని పెద్దకొడుకునకు) పేరు

రా తే డు —(అని) భిన్నపదములు గా గ్రహించుట యుక్తమనిపించు చున్నది రా-శబ్దము రాచ శబ్దమునకు లుప్తశేషము సమాసమందే యిది ప్రయోగార్హము పూవునకు పర్యాయ మగుపూశబ్దమువంటి దిది ఐనను రారేడు అని ఏకపదము గా (బ్రౌ) దీనిని గ్రహించి భూపాలు డు అను-అర్థ మిచ్చె (O g) ఇందులకు ప్రమాణ మను చున్నది కాని పూ శబ్దము నిత్య సమాస (లుప్త) శేషము నీత డు గ్రహించినా డు (చూ 2 40) పూ వి పూ శబ్దమునకు (ప్రత్యేక) ప్రయోగమును కల దనునట్లు- ఆనందకాననాభ్యంతరంబులయందు ఎందువారమున బూ శిథిలపడ గ (భీమ 2 46) అనుప్రయోగమును ఉదాహరించినది ఇదిప్రమాదము ఎందువారమునపూ శిథిల పడ గ అనుటయే యిట సముచితము ఎలజవ్వనంబునవిలసనము వంటి దిది సమాస గతమే ఇచ్చటి పూ ఇచ్చటి వు లోపము సమాసాంత మన దగినది (బ్రౌ్రౌ పాత్ మొ వానియందువలె) రా తే డు సాంబ కూడ ఉదాహరించినవి ఈ ఆం బా ను జూచి ఎకిమీ డు పాదుసా యేలిక మన్నీ డు సాహేబు రాయ డు సామి పబువు జియ్య తుపాస వజీరుండు రాయలు దునెదారి రా తే డు దొర యొడయ డు తే డన వర్తిలు నృపుపేళ్లు (మాన )

లక్కుమ డు —(సం లక్ష్మణ క లకుమణ) లక్కుమను డు (రూపాం) లక్కు-

మను డు అనియే సూ ని శ ర లు గ్రహించి లక్కమను డు ఎంగాణియు
నక్కజపుందొనలు పూని (అచ్చ రా అయో 8 ) అని ఉదాహరించు చున్నవి

[వడముడి — వరముడి అని (బ్రౌ పా ) (చూ అను )

సీ విరటు డనంగను వెలయు విరాటుండు
మండలేశ్వరు డొప్పు మన్నెవా డు
మన్నీ డనంగను మండలేశత్వంబు
మన్నెతికం బన మనుచు నుండు
గుత్తకా డన గను గుప్తికారు డెసంగు
మంతు నా గను ద్యూతమంత్రి యెస గు
బ్రెగడ ప్రెగ్గడ యన దగు బ్రధానుండు తీ
ర్పరి తగవ రన ధర్మజ్ఞు డలరు

గీ మీఱు నా రక్షకాభిధ యారెకు డు త
లారి తలవరి యన గ శుల్కాధికారి
చనును సుంకరి యన గను షండు డొప్ప
నెగ్గడి యనంగ గంచుకి యెస గు చుండు
బొందడీ డన శ్రీమాతృభూతలింగ 83

విరటు డు—ఇది విరాటునకు (మత్స్యదేశప్రభు వగువిరాటరాజునకు) పేరు

మన్నెవా డు మన్నీ డు—ఇవి మండలేశ్వరునకు (అధీశ్వరునకు కొంతభూ ఖండమును (నాలుగువందలయోజనములపరిమితి గలదానిని) ఎలు సామంతరాజునకు) పేర్లు

మన్నెతికము—ఇది మండలేశత్వమునకు (మన్నెపుదొరతనమునకు) పేరు

గుత్తకా డు—ఇది గుప్తికారునకు (ఇతరులభూమ్యాదులను దగినఫలము ఇచ్చ

టకు ఒప్పుకొని కొంతకాలము తన యనుభవమున ఉంచుకొని కాపాడువానికి గుత్తకు తీసికొనువానికి) పేరు

మంతు—ఇది ద్యూతమంత్రికి (రాజునకు జూదమునందు వినోదము కలిగించు మంతిరికి) పేరు

ప్రెగడ ప్రెగ్గడ—ఇవి ప్రధానునకు (అమాత్యునకు ధీసచివునకు ప్రెవడకు) పేర్లు

తగవరి తీర్పరి—ఇవి ధర్మజ్ఞునకు (ధర్మాధికారికి ప్రాడ్వివాకునకు న్యాయాధిపతికి న్యాయము విచారించునధికారికి) పేర్లు

ఆరెకుడు తలారి తలవరి—ఇవి ఆరక్షకునకు (యామికునకు-రాత్రులయందు కావలి కాయుచు రాజాజ్ఞచే తల నఱకుట మున్నగు దండనములు చేయు రాజభటునకు) పేర్లు

సుంకరి—ఇది శుల్కాధికారికి (కొని అమ్మెడుసరకులపై రాజునకు ఈయవలసినపన్ను సుంకము) సుంకము దీసికొనెడియధికారికి) పేరు

ఎగ్గడి—ఇది షండునకు (వర్షవరునకు వర్షధరునకు అంతఃపురములోపలికావలివానికి పెగ్గడికి) పేరు

బొందడీడు—ఇది కంచుకికి (అంతఃపురమువెలుపలిరక్ష యొనర్చునధికారికి) పేరు

మండలేశ్వరుడు — రాజా తు ప్రణతాశేషసామన్తస్స్యాదధీశ్వర చక్రవర్తీ సార్వభౌమ నృపొ౽న్యో మణ్డలేశ్వర ౽ని (అమ) మణ్డలేశ్వరుడు-చత్వారింశద్యోజనభూపాలక లక్షగ్రామాధిపతి-అని (బ్రొ) చతుశ్శతయోజనకదేశాధీశ్వర మణ్డలేశ్వర) అని (స త ఎ ప ల సం)

మన్నెవారు—సామంతులు తెలగాణభూముల గలమన్నెవారిచే బలవంతమునను గప్పములు గొనియె (వి పు 44) మనవి సనవుల కేతెంచి మన్నెవారు వేళ యెప్పుడౌనొకో యని వేడుచుండ (సారం 62) (చూ సూ ని)

ప్రధాను డు — మహామాత్రా ప్రధానాని అని మన్త్రీధీసచివో ఽమాత్య అని వేఱుగా మన్త్రికి పేర్లు వచించినది(అమ) కనుక అచ్చటి ప్రధాన శబ్దము మధ్యమాధికారము లయందు నియుక్తులైన దళవాయి మున్నగువారిని జెప్పును (చూ గురు) ఇచ్చట వేఱుగా మంత్రినామములు చెప్ప బడనందున ఈ ప్రధాన శబ్దము మంత్రివాచకము (మంత్రాలోచన కిగువానిని వచించునది)కా దగినది మహామాత్ర శబ్దము అమాత్యవాచకము మంత్రివాచకము గూడ కలదు మహామాత్ర స్సమృద్ధే చాఽమాత్యే హస్తిపకాధిపే అని (మేదిని) పై యమ - మహామాత్ర ప్రధాన శబ్దములు పర్యాయము లనుచున్నది కావున ప్రధాన శబ్దము అమాత్య వాచక మనుట ఇట యుక్తమే ప్రధాన శబ్దము నపుంసక మని అమ మనుచున్నను మహామాత్ర ప్రధానస్స్యాత్ అని పుంస్కాణ్డమున వోపాలితుడు (చూ సుధ)

షండు డు — షణ్డో వర్షవర స్తుల్యౌ అని (అమ) ఈవర్షవరులే ఎగ్గళ్లు వర్షవరులకు లక్షణ మిట్లున్నది యే త్వల్పసత్త్వా ప్రథమా క్లీబా శ్చ స్త్రీస్వభావిన జాత్యా న దుష్టా కార్యేషు తే వై వర్షవరా స్మృతా (అని) వర్షవరు నకే వర్షధరు డు అనునది పర్యాయము

కంచుకి — అన్తఃపురచరో వృద్ధో విప్రో గుణగణాన్విత సర్వకార్యార్థకుశల కఞ్చుకీ త్యభిధీయతే అని(కఞ్చు-లక్షణము) చత్వారి రాజ్ఞాం స్త్ర్యగారే ఒహారక్షాధికృతస్య అనినది (సుధ) సౌవిదల్లా కఞ్చుకిన స్థాపత్యా స్సౌవిదా శ్చతే అనెడి అమర వ్యాఖ్యాసందర్భమున) అన్తర్వంశికులు వర్షవరులు కఞ్చుకులు అనువారు అన్తఃపురరక్షకులలోనియధికారవిశేషములకు చెందిన వేఱువేఱుతెగలవారు (చూ సుధ)

ఆరక్షకు డు —( సామన్తా రాజ్యసన్దిస్థా ) ఆఽఙ్ఞ పురరక్షిణ (వై జ భూ క్షత్రి)

తగవరి —(త తహవరి) తగవరి యగుతా నొంచిన దగుదండము రాజు వాని దండింప దగుణా మొగ మోడి విడిచెనేనియు నగు బాటగు బాప మొందు నరనాథునకుణా విజ్ఞా (ప్రా 22)

తలవరి — తలవారి (రూపాం) ముందటను గంచుకొమ్ము మి న్నందిమొరయ జార చోరులగుండియల్ ఝల్లనంగ వెడలి కోలాహలంబు గా వేశవాటి జేరి యప్పట్టణము తలవారి గాంచె (వై జ వి 4 78)

[ బ్రభాను డు దగ వరి తీర్పరి యన ధర్మజ్ఞు డలరు (వావి అపపా )]

సీ కటికవాం డనఁగను గట్టిక లన గను
బణిహారు లన గను బర గు చుండు
వేత్రహస్తాభిధ వెలయు జారసమాఖ్య
వేగులవా రన వేగరు లన
బహువచనమ్మున బడవా ళ్లనంగను
దళపతినామము ల్దగు బడాలు
దళవాయి పడవాలు దణి యనంగను నల్ప
సైన్యాధిపతి యొప్పు జంగిలి గమి

గీ కా డనంగను సేవకాఖ్య లగు జీత
గా డు కొలువ్వాడుగాఁ డన గాను భటు డు
పరఁగు జో దన లెం కన బం టనంగ
భూరిభవభంగ శ్రీమాతృభూతలింగ 84

కటికవాండ్రు కట్టికలు పణిహారులు—ఇవి వేత్రహస్తులకు (వేత్రధరులకు ప్రతీహారులకు దౌవారికులకు పడిహారులకు ద్వాఃపాలకులకు) పేర్లు

వేగులవారు వేగరులు—ఇవి చారులకు (ప్రణిధులకు కోటికాండ్రకు కొట్టికాండ్రకు వేగులకు పరరాజులసమాచారములు తెలుపు గూఢపురుషులకు) పేర్లు

పడవాళ్లు (బ) పడాలు దళవాయి పడవాలు దణి—ఇవి దళపతికి (దండనాయకునకు సేనానికి దణాపెద్దకు సేనాధిపతికి) పేర్లు

జంగిలి గమికాఁడు—ఇవి అల్పసైన్యాధిపతికి (అల్పసైన్యమునకు నాయకుడగువానికి)పేర్లు

జీతగా డు కొలువ్వాడుగా డు—ఇవి సేవకునకు (ఉపజీవికి అనుజీవికి వైతనికునకు పనివానికి) పేర్లు

జోదు లెంక బంటు—ఇవి భటునకు (యోధునకు యుద్ధము చేయుబంటునకు) పేర్లు

వేత్రహస్తుడు — ద్వాస్థతో వేత్రధారః ఉని (త్రికా శే) (చూ సుధ ప్రతీహారి) దౌవారికో వేత్రధర ద్వార్థ్స క్షత్తా చ దర్శకః అని (వై జ భూ క్షత్త్రి) వేత్రధరుడే వేత్రహస్తుడు

దణి — ప్రభువు జే డు-ఉని (శ ర)

జంగిలి — ఈశబ్దమునకు గోసమూహము పశుసమూహము అనెడి అర్థములను ఇచ్చి శర జంగిలి అనగ స్వల్పసేనాధిపతి ఉని ఒకనిఘంటుకారుడు వ్రాసియున్నాడు అనినది (సూ ని)(ఆం భా) ఇచ్చిన యర్థమునకు ప్రయోగమును చూపినది- సుర టవీచుల బుట్టుదొర మెక్కురానేస్త జంగిలియెుుక మాసంగడీడు (ప్రబం 60) (శర) ఆం భా ను చాలచోట్ల ప్రయోగముల బాగుగా పరిశీలించకొనక ఇట్లే అనినది గమికానిఁని (అచ్చ రా అర 4) ప్రయోగమును (సూ ని) ఉదాహరించినది

[పణిహారులు — ఫణిహారులన వాని అపముద్రి ]

సీ చుఱుకరి యనగ దెంపరి యన శూరాభి
ధానంబు గా గను దనరు చుండు
నొంటరి యొక్కటీ డొంటరీ డొంట్రింపు
నా నేకభటునకు నామము లగు
గాల్బ్వరు నా గను గాల్బంటు నా గ బ
దాతినామంబు గా దనరు చుండు
శపథాయుధనిషేవి చనును గై జీత మం
చన గను మాసి యం చన గ వైరి

గీ మనును నొంటనివా డన మార్తు డనగ
బగతు డన బగ జన బగవా డనంగ
గంటనగ గొంగ యన సూడుకా డనంగ
భూషతభుజంగ శ్రీమాతృభూతలింగ 85

చుఱుకరి తెంపరి——ఇవి శూరునకు (పోటుకానికి పోటుమానిసికి వీరునకు) పేర్లు

ఒంటరి ఒక్కటీడు ఒంటరీడు ఒంట్రింపు——ఇవి ఏకభటునకు (ఒంటరికానికి అసహాయశూరు డగుబంటునకు) పేర్లు

కాల్బ్వారు కాల్బంటు ——ఇవి పదాతికి (పదగునకు పాదాతికునకు పద్గునకు నడజోదునకు కాలుమానిసికి కాలిబంటునకు) పేర్లు

కైజీతము మాా——ఇవి శపథాయుధనిషేవికి (సంశప్తకునకు వెనుకకు తిరుగనని ఒట్టుపెట్టుకొని యుద్ధము చేయువానికి) పేర్లు

ఒంటనివాడు మార్తుడు పగతుడు పగవాఁడు కంటు గొంగ సూడుకాఁడు ——ఇవి వైరికి (ప్రత్యర్థికి దాయకు మాఱుతునకు విరోధికి శత్రువునకు) పేర్లు

ఒంటరీడు —— అసహాయుడైనబంటు లని (శర)

కాల్వ్బరు —— ఇది ఆంభా మతమున ఏకవచనాంతమే అయి బహువచనమున వచ ధాతువునకు సంస్కృతమునం ద ట్లనభిధానము చెప్పవలసినది గా కాన్పించును బహుత దనరు అనురీతిని వచించుట లేదిట (ఆంభా) వేవిళ్లు గూడ ఇట్టిదే పూర్వము వివరింపబడినది లేదా ఆంభా కు పైనియమము ప్రాయిక మని యైన అంగీకరింపవలయును (శర హూ ని మొ (బ) అనియే అను చున్నవి దీనిని) సూ ని ప్రయోగము గూడ ఇచ్చుచున్నది

కైజీతము —— గుంపు ల్గాడి కైజీతము ల్ధఱుమఁగా (ప్రబం 797) ఎప్పటి కప్పు

డిచ్చు జీతము అనునది రెండవయర్థము గా దీనికి ఇచ్చినది ప్రయోగములతో (సూ ని) (శ ర) బత్తెము మాత్రమ దీని కర్థ మనినది

[ నామ మగును (వావి పా సూ ని పా) (పారాం) పైగ్రహించినది (శ ర పా) (చూ ఒంటరీ డు)

సీ చుట్టఁము పక్కము చుట్ట నెచ్చెలి చెలి
కాడు నెయ్యుడు సంగడీఁడు పొందు
కాఁడంటు చెలి నేస్తకాడు సంగడికాఁడు
నా గను మిత్త్రునినామము లగు
బగ సూడు కంటు నా బరగు విద్వేషంబు
చెలిమి చుట్టఱికంబు చెల్మి నెమ్మి
నెయ్యము నేస్తము నెయ్యమి సంగడి
యొద్దిక యొమ్మిక యొండొరిమిక

గీ పొం దొరిమ పొత్తు గారము పొందిక యన
నరగు చుండును మిత్త్రభావంబు బట్లు
క్రిక్క లన బారకాఖ్యలు గేరు చుండు
భూరిభవభంగ శ్రీమాతృభూతలింగ 186

చుట్టము పక్కము చుట్ట నెచ్చెలి చెలికాడు నెయ్యుఁడు సంగడీడు పొందుకాఁడు అంటు చెలి నేస్తకాడు సంగడికాడు—ఇవి మిత్త్రునకు (సుహృత్తునకు సకునకు స్నేహితునకు) పేర్లు

పగ సూడు కంటు—ఇవి విద్వేషమునకు (వైరమునకు ద్వేషమునకు వేరమునకు విరోధమునకు) పేర్లు

చెలిమి చుట్టఱికము చెల్మి నెమ్మి నెయ్యము నేస్తము నెయ్యమి సంగడి

ఒద్దిక ఒమ్మిక ఒండొరిమిక పొందు ఒరిమ పొత్తు గాఁము పొందిక—ఇవి మిత్త్రభావమునకు (మైత్త్రికి సఖ్యమునకు సావాసమునకు సౌహార్దమునకు సౌహృదమునకు స్నేహమునకు) పేర్లు

బట్లు క్రిక్కులు—ఇవి పాఠకులకు (బట్టువారికి బట్టులకు వందులకు రాజులో నగువారికడ స్తుతిపాఠము ఒనర్చి జీవించెడిఒకజాతివారికి) పేర్లు

ఒరిమ —ఒరిమె-(ముద్రి పా) (ప్రౌ పా) ఎడంత మనుటకు నిర్ధారకప్రయోగము లేదు-అని (సూ ని)

పాఠకులు — వన్దిన స్తుతిపాఠకా అని (అమ) నామైకదేశన్యాయమున స్తుతిపాఠకులే పాఠకు లన బడినారు శూద్రక్షత్త్రులయందు క్షత్త్రియునకు పుట్టిన ఒకజాతివారు వీరు ఇఁదు రాజులవంశావలిని స్తుతించువారు మాగధుఁడు రాజుల స్వవృత్తమును నుతించు వారు వందులు సూతా పౌరాణికా ప్రోక్తా మాగధా వంశశంసకా వన్దిన స్త్వమల ప్రజ్ఞా ప్రస్తావసదృశోక్త్తయ అని వీరిభేదములు వివరింప బడినవి

ఒండొరిమిక —ఈపదమును ఈయర్థమున (సూ ని శ ౨ ప్రౌ ౫) గ్రహింప లేదు ఒరిమిక అను రూపమును మాత్రము గ్రహించినవి ఒండొరు శబ్దము అన్యోన్యార్థకము గలదు దానిమీద భావార్థమున మగటిమ్యాదులు యథాప్రయోగంబు గ గ్రాహ్యంబులు (బాల వ్యా తద్ధి 8సూ) అనియో మఱియొకవిధముననో ఇది సాధు వనుట కవకాశ మున్నది ఒకనిఘంటువు (శుద్ధాంధ్రపదపారిజాతము)- ఒండొరుమిక గ్రహించ యిచ్చటి పాఠ మని దీని కీయర్థ మిచ్చు చున్నది

సీ నమ్మినవా డన నచ్చినవా డన
జనవరి యన గను దనరు నాప్తు
డలరును గరణ మం చన లెక్కవా డన
గణకాభిధానంబు కరణిక మన
గణకునిభావంబు కర్మంబు వెలయును
లిపికారకుం డొప్పు లేకరి యన

వ్రాతకాఁడన గను వ్రాలు నా వ్రాత నా
లిపి యొప్పు నక్షరాల్ వెలయుచుండు

గీ నక్కరము లచ్చరమ్ముల౦ చనగ గ్రాఁ
గిలక యన రేఫ మెసగును గియ్య యనగ
నడరును యకారనామంబు సుడి యనంగ
వట్రువ యన ఋకార మై వఱలు నభవ 87

నమ్మినవాఁడు నచ్చినవాఁడు చనవరి—ఇవి ఆప్తునకు (విశ్వసనీయుఁడగు పురుషునకు) పేర్లు

కరణము లెక్కవాఁడు—ఇవి గణకునకు (గ్రామపు లెక్కలు వ్రాయువానికి) పేర్లు

కరణికము—ఇది గణకత్వమునకు (కరణపువృత్తికి అతని ధర్మమునకు-(గుణమునకు) పేరు

లేకరి వ్రాతకాఁడు—ఇవి లిపికారునకు (వ్రాయసకానికి చక్కగా వ్రాత వ్రాయువానికి) పేర్లు

వ్రాలు వ్రాత—ఇవి లిపికి (లిబికి వ్రాయికి రేఖారూప మైన అక్షరవిన్యాసమునకు) పేర్లు

అక్కరములు అచ్చరములు—ఇవి అక్షరములకు (వర్ణములకు) పేర్లు

గ్రాగిలక—ఇవి రేఫమునకు (గ్రాకారవడికి గ్రాకారకు జడ్డ యై (సంయుక్త మై) ఒక అక్షరము తో కలసిన రేఫకు ( ్ర కు) పేర్లు

కియ్య—ఇది యకారమునకు (కియ్యవడికి అక్షరముక్రింద వ్రాయు యకారమునకు ( ్య కు) పేరు

సుడి వ్రట్టువ — ఇవి ఋకారమునకు (వ్రట్టువసుడికి హల్లుతో కూడిన ఋకారమునకు) పేర్లు

ఆప్తుడు — ఆప్తప్రత్యయితౌ సమౌ (అమ)

కరణము — ఇది సంస్కృతముగా గూడ ఈయర్థమున గలదు కరణం సాధన క్షేత్రే కాయ కాయస్థకర్మసు అని (విశ్వ)

గణకుడు — ఈసందర్భమున (అమ) సాంవత్సరో జ్యౌతిషకో దైవజ్ఞగణకా వపి అని జ్యౌతిష్కుని పేర్కొనుచున్నది గణకశబ్దమునకు ఇట్టియర్థమునే (వైజ మొ) ఇచ్చుచున్నవి ఐనను (ఆం భా) అమరముతో అచ్చటచ్చట వేఱుపడుట జరగుచున్నదియే అట్టిదే ఇట జరగిన దనవలయు ననిపించుచున్నది

లిపికారకుడు — లిపికారో ఒక్షరచణ ఒని (అమ) (గురు పా) ఆం భా దీనినే గ్రహించి స్వార్థిక క ప్రత్యయముతో లిపికారకు డను చున్నది దివావిభానిశా (3 2 2) సూత్రము హేత్వాదివివక్షయందు ట ప్రత్యయమును విధించి లిపికరు డను చున్నను తదవివక్షయందు అణ్ణన్తము గా కుమ్భకార శబ్దమట్లు లిపికార శబ్దముగుడ సాధువే ఇట లిపంకరో ఒక్షరచణ అని (అమ సుధా పా) ఇట ము మాగమమునకు సూత్ర మన్వేషణీయము గురు పా లిపంకర లిపికార లిపికర - అను చున్నది ఇట వైజ కాయస్థ స్స్యాల్లిపికర కరణో ఒక్షరజీవన లేఖకో ఒక్షరచుఞ్చుశ్చ (భూ శూద్రా) అనినది

లేకరి — లేకరి యే లేఖకుడు లెఖకుని గూర్చిన వివరణ మి ట్లున్నది- శీర్షోపేతాన్ సుసంపూర్ణాన్ సమశ్రేణిగతాన్ సమాన్ అక్షరాన్ విలిఖేద్య స్తు స లేఖక ఇతి స్మృత చక్కనివ్రాత తాటియాకుపై గంటముతో వ్రాయుట అందఱకు సాధ్యము కాదు అది కొందఱకే శక్యము అది యొకగొప్పవిదగ్ధతకు చెందినది కావుననే శ్రీనాధాదిమహాకవులు తమకృతిభర్తలయందు ఇది యొకఘనత గా వర్ణించుట జరగినది (చూ భీమ 74) (చూ పాండు 7)- మొ

రెఫము — రాదిఫ అని వార్త్తికము రకారాదీని నామాని ఒని అర్ష మన దగుప్రయోగము లేవో క్వాచిత్కము గా ఉన్నను ఒకార మనుట యుక్తము కాదు తత్త్వబోధిని కారప్రత్యయాంతమును సయితము కా దనవెదు (చూ రాదిఫ తత్త్వ వ్యా)

వట్రువ — వట్రుసుడి- అని ఏఁపదము గా మాత్రము గ్రహించినది (శ ర) సుడి గ్రహించినది (బ్రౌ) వట్రువ ను ఈయర్థమున (బ్రౌ శ ర లు) రెండును గ్రహింప లేదు ప్రయోగము లి ట్లున్నవి కొమ్ము క్రారలు మఱి ద్వివర్ణమ్ము లగుట వాని యెడమవి గురువులు వట్రుసుడులు (అప్ప 4 9) వట్రువయు ద్విత్వమును గలవ్యం జనంబు (అప్ప 3 293) పట్టె వట్రువయును బరిపుష్ట తలకట్టు గుడి సున్న కియ్యయు సుడియు ముడియు (పాండు 7)

సీ బొ ట్టన సు న్నన బొలు పొందు బిందువు
నిడు దన దీర్ఘంబు నెగడు చుండు
జడ్డ యం చన గను సంయుక్త మొప్పును
గణితంబు లెక్క- నా గను దనర్చు
గమ్మ యనంగ లేఖ యగు రాయస మన
రాజలేఖ దగు గిల్లాకు చీటి
యన ఖండపత్త్రిక యలరును గౌ లన
నభయపత్త్రాభిధ యలరు చుండు

గి ఘట్టితపటంబు వెలయును గడిత మన గ
వెలయుఁ గాకిత మన గ దద్భేదసంజ్ఞ
యాడె యన గ దదేకదేశాహ్వయ మగు
బుస్తకము పొత్త మన మీఱు భుజగభూష 88

బొట్టు సున్న—ఇవి బిందువునకు (అనుస్వారమునకు) పేర్లు

నిడుద—ఇది దీర్ఘమునకు (పొడువునకు చా పునకు రెండుమాత్రలకాలమున ఉచ్చరింప బడెడి అచ్చు నకు) పేరు

జడ్డ—ఇది సంయుక్తమునకు (అచ్చులతో వ్యవధానము లే కుండ హల్లుతో కలసినహల్లునకు) పేరు

లెక్క—ఇది గణితమునకు (సంఖ్యలను ఆధారముగా కొని చేసెడిలెక్కకు) పేరు

కమ్మ—ఇది లేఖకు (పత్త్రికకు ఉత్తరమునకు జాబునకు) పేరు

రాయసము—ఇది రాజలేఖకు (రాజులు వ్రాయు ఉత్తరమునకు) పేరు

కిల్లాకు చీటి—ఇవి ఖండపత్త్రికకు (అల్పలిఖితపత్త్రమునకు అల్పముగా వ్రాసినచిన్నకాగితపుముక్కకు రుక్కకు) పేర్లు

కౌలు—ఇది అభయపత్త్రమునకు (కవులునకు రాజాదులు రైతులకిచ్చు ఒడంబడికకు) పేరు

కడితము—ఇది ఘట్టితపటమునకు (సాంద్రవస్త్రమునకు పద్దులు వ్రాసికొనెడి బొగ్గు పూసినముతకబట్టకు) పేరు

కాకితము—ఇది ఘట్టితపటవిశేషమునకు (ఒకవిధమగుకడితమునకు వ్రాయుటకు ఉపయోగించుపత్త్రమునకు కాగదమునకు కాగితమునకు) పేరు

ఆడె—ఇది ఘట్టితపటైకదేశమునకు (కడితమునందలి ఒకభాగమునకు) పేరు

పొత్తము—ఇది పుస్తకమునకు (వ్రాసినపత్రముల సంపుటికి) పేరు

సున్న —అరసున్న నెఱసున్న (నిండుసున్న) అని తెలుగున ఇది రెండువిధములు ఆరెండింటిని ఇది చెప్పును

రాయసము — (శ ర) వ్రాయసమునకు జాబు అను అర్థమిచ్చి వాడుకయందు రాయస మందురు అనినది ప్రయోగమిట్లున్నది జనకసృపునుత్తరం బని జనపతికిం దెలిప రాయసము వ్రాయ నియోగిని బిలిచి (దశా ~ 224) మొ (చూ సూ ని) నిర్ధారకప్రయోగము లేదు

కడితము — దీనిని (శ ర) ఇట్లు వచించినది- ఘట్టించిననీలపటపులెక్కపుస్తకము (అని) (సూ ని) దీనిని ఇట్లు విశదపఱచినది- గుడ్డమీద జిగురుతో గలిపినమసి పూసి నల్లపఱిచి అట్టలుగా జేసి వానితో నేర్పఱచినలెక్కలపుస్తకము (పలకమీదవ

లెనే యీయట్టలమీ ద బలపముతో వ్రాయుదురు (అని) పద్దుఱు వ్రాసుకొనేబొగ్గు పూసనమతకబట్ట - అని (బ్రౌ) (చూ అను)

కాకితము —(సం కాగదమ్ క కాగదత కాకితం వా కాగజ్) (చూ సూ ని) భూర్జె వా వసనే రక్తే క్షౌమే వా తాలపత్త్రకె కాగద వా ఉష్ణగన్దేన విలిఖ్య ధారయే న్నర (మన్త్రకల్పద్రుమము) (చూ సూ ని కాగదము)

సి గంట మనంగను గనుపట్టు లేఖిని
కలమము కలము నాఁగను దనర్చు
రాయబారి యనంగ రాజదూత యగు ద
ద్భావంబు తగు రాయబారం మన గఁ
బథికు డు దగు దెరువరి యన మార్గజ్ఞ
సంజ్ఞ యౌ జొప్పరి జాడకాడు
నా బలుపట్టడ నాఁగ బౌంక్రేణి
పొలుచును రాజ్యాంగములు దనర్చు

గీ సామి ప్రెగ్గడ చెలి బొక్కసము తిరస్తు
కోట పౌ జన గాను షడ్గుణము లగుచు
బేరకొన గాను దగు సంది పోరు పోక
యునికి రెం టన నం డన నుగ్రమూర్తి 89

గంటము—ఇది లేఖినికి (ఉక్కు మొద లగువానితో చేయ బడి తాటాకులపై వ్రాయుటకు ఉపయోగపడెడి సాధనము నకు) పేరు

కలము—ఇది కలమమునకు(వ్రా త కుపయోగించు సాధనవిశేషమునకు)పేరు

రాయబారి—ఇది రాజదూతకు (రాజసందేశహరునకు రాజులసందేశములు పర రాజులకు అందించువానికి) పేరు

రాయబారము—ఇది రాజదౌత్యమునకు (రాయబారితనమునకు రాజదూతలు

నడుపుసంధ్యాదులకు) పేరు

తెరువరి—ఇది పథికునకు (అధ్వనీనునకు అధ్వగునకు పాంథునకు బాటసారికి మార్గస్థునకు దారిని బయనించువానికి) పేరు

చొప్పరి జాడకాఁడు—ఇవి మార్గజ్ఞునకు (పదవీజ్ఞునకు త్రోవలు తెలిసినవానికి) పేర్లు

పలుపట్టడ—ఇది పౌరశ్రేణికి (పురజనమునకు ప్రజకు) పేరు

సామి ప్రెగ్గడ చెలి బొక్కసము తిఁస్తు కోట పౌజు—ఇవి రాజ్యాంగములకు (రాజు మంత్రి చెలికాఁడు భండారము(ధనగృహము ఖజానా) రాష్ట్రము దుర్గము సైన్యము-అనువానికి (వరుసగా) పేర్లు

సంది పోర పోక ఉనికి రెంట అండ—ఇవి షడ్గుణములకు (సంధి విగ్రహము యానము ఆసనము ద్వైధము ఆశ్రయము-అనువానికి (వరుసగా) పేర్లు

రాయబారి — రాయభారి అని లహోబలపతి కలికంఠముఖా వాతా ఇత్యథర్వణోక్తమ్ ముఖశబ్దేన దినవెచ్చము ఇత్యాద్యా గృహ్యన్త ఇత్యుక్తమ్ దినవెచ్చము రాయభారము ఇత్యాదౌ ప్రాకృతసమత్వేనా ఽపి రూపం సువచమ్ రాయభారులు ఇత్యత్రా ఽథర్వణోక్తమిత్త్వమ్ (కవిశిహల) రాయభారి సంధిచేయఁకై పోవ (నా ఎంచ 3 35) అని ఒకరు ఇట రాయబారి అనియే వార మగఁడు చున్నది (చూ సూ ని)]

తద్భావము —ఇఁ భావశబ్దము క్రియార్థకము (తద్భావము) ఆదూతకృత్యము దౌత్యము- అనుట భావో లీలా క్రియా చేష్టా భూ త్యభిప్రాయ జన్తుషు అని (వైజ ద్వ్య పుం)

పలుపట్టడ — సంకరజాతిజనము అని అర్థమిచ్చినది (శ ర) ఊరిజనము సామాన్యులు అనినది (బ్రౌ) (చూ అను)

పౌరశ్రేణి — రాజ్యము- అష్టాంగములు కలది అని కొందఱిమతము అప్పుడు పౌర శ్రేణియు ఒక రాజ్యాంగము స్వామ్యమాత్య సుహృత్కోశ రాష్ట్ర దుర్గ బలాని చ రాజ్యాఙ్గాని ప్రకృతయ పౌరాణాం శ్రేణయో ఽపి చ అని (అమ) ఇచ్చట

(సుధ)- పౌరశ్రేణిభిస్సహాష్టాఙ్గమపి రాజ్యమితి దర్శితమ్ అనినది అమాత్యాశ్చైవ పౌరాశ్చ షడ్వి ప్రకృతయ స్మృతా అని కౌటిల్యుడు-(అని గురు)

కోట —(దుర్గము) దుర్గములు ఆఱువిధములుగా ఉన్నవి- ధన్వదుర్గం మహాదుర్గ మబ్దుర్గం వార్క్షమేవ వా నృదుర్గం గిరిదుర్గం వా సమాశ్రిత్య వసేత్పురమ్ (మను 7అ 70 శ్లో) వీనిని (సూని) ఇట్లు వివరించినది- (ధన్వదుర్గము)నలుప్రక్కలను అయిదామడలమరుభూమి గలకోట (మహాదుర్గము) చుట్టును మట్టిదిబ్బలు గలకోట (వార్క్షదుర్గము) చుట్టును వృక్షములు గలకోట (జలదుర్గము) చుట్టును నీరు గలకోట (నరదుర్గము) చుట్టును చతురంగబలములు గలకోట (గిరిదుర్గము) చుట్టును కొండలు గలకోట

షడ్గుణములు — సన్ధిర్నామ విగ్రహో యాన మాసనం ద్వైధ మాశ్రయ షడ్గుణా అని (అమ) సంధి) స్వర్ణాదిదానేన పరబుద్ధిభి ప్రత్యుత్పాదనా మిత్త్రీకరణమ్ శత్రురాజులకు వారి బంధువులద్వారమున సువర్ణాదులు ఒసగి మైత్త్రి సంపాదించుకొనుట) (విగ్రహము) పరమణ్డలే దాహలుణ్ఠనచ్ఛేదాది (శత్రురాష్ట్రమందు అగ్నిదాహము దోపిడి లోనగు ఉపద్రవములు కలిగించుట) (యానము) ఉపచితశక్తేః కృతమణ్డలరాష్ట్రరక్షకస్య శత్రో రవస్కన్దనాయ యాత్రా (తాను బలవంతుడై యుండి తన దేశమునకు రాష్ట్రమునకు తగినరక్షణ యేర్పఱచికొని శత్రువులపై బడి వారిని ఆక్రమించుటకై బయలుదేఱుట) (ఆసనము) నాఽహ మిదానీం యోద్ధుం సమర్థ ఇతి కాలాదిప్రతీక్షయా విజిగీషోః స్థితి - (శత్రువును జయింప గోరి సమయము నిరీక్షించుచు తగినసమయ మిప్పుడు కాదని ఉండుట) సంధివిగ్రహముల గూర్చి యానాసనములనుగూర్చి నీతి యిట్లను చున్నది సమజ్యాయోభ్యాం సందధీత హీనేన విగృహ్ణీయాత్ (కౌటల్యుడు) యదా మన్యేత భావేన హృష్టం పుష్టం బలం స్వకమ్ పరస్య విపరీతం చ తదా యాయా దరీన్ప్రతి యదా తు స్యాత్పరిక్షీణో వాహనేన బలేన చ తదాఽఽసీత ప్రయత్నేన శనకైస్సాన్త్వయ న్నరీన్ (మనువు) (ద్వైధము) శత్రుషు విషయే (అన్త శ్శత్రుత్వేన బహిర్మిత్త్రత్వేన చ) ద్విధా వర్తనమ్ (శత్రువులయెడ పైకి మిత్త్రుడట్లుగన బడుచు లోపల శత్రుత్వము వహించి ఉండుట) (ఆశ్రయము) బలవతాఽరిణా ఉచ్ఛిద్యమానస్య హీనశక్తే ర్యద్బలవద్ధర్మవిజయిసమాశ్రయణమ్ (బలవంతుడగు శత్రురాజుచే బాధింప బడుచు శక్తిహీనుడై బలవంతుడగు ధార్మికప్రభునియందు జేరుట) (ఇంకను వీని

వివరణమునకై చూ. అమ. సుధావివృతి)

[రెంటన — ఠం టన నొం డన ఒవి (వావి అపపా ]

సీ. మను వాడి జతనము మంతనం బనునట్టి
యివి మూఁడు శక్తులై యెసగుచుండు
దగు త్రివర్గాభిధ తగ్గు నిల్కడ పెరు
గుడు ననునివి మూడు గొఱలు నవల
జతురుపాయంబుల సంజ్ఞయై మంచీగి
వేఱు కొట్టన నాల్గు వేఱువేఱు
వేడిమి యనగను వాడిమి యనగ బ్ర
తాపాభిధానంబు తనరుచుండు

గీ. దండు వర దండు గన గను దండమునకు
బ్రతినిధిగ దీయు ద్రవ్యంబు పరగు విజన
మొంటిపాటేకతం బన నొప్పుచుండు
భూరిభవభంగ శ్రీమాతృభూతలింగ 190

వాడి జతనము మంతనము—ఇవి శక్తిత్రయమునకు (ప్రభావము ప్రభుశక్తి) ఉత్సాహశక్తి మంత్రశక్తి- అనువానికి మూడిటికి (వరుసగా) పేర్లు

తగ్గు నిల్కడ పెరుగుడు— ఇవి త్రివర్గమునకు (క్షయము స్థానము (స్థితి) వృద్ధి- అను మూడిటికి (వరుసగా) పేర్లు

మంచి ఈగి వేఱు కొట్టు—ఇవి చతురుపాయములకు(సామము దానము భేదము దండము-అను (శత్రువశమున కగు) నాలుగు ఉపాయములకు (వరుసగా) పేర్లు

వేడిమి వాడిమి—ఇవి ప్రతాపమునకు (ధనమువలన దండమువలన (సేనవలన దండనమువలన) కలిగిన తేజమునకు (ప్రభావమునకు) పేర్లు

దండువు దండుగు—ఇవి దండమునకు (ప్రతినిధి గ తీయుద్రవ్యమునకు ఆపరాధివలన అపరాధమునకై అధికారి పుచ్చుకొనుద్రవ్యమునకు) పేర్లు

ఒంటిపాటు ఎకతము—ఇవి విజనమునకు (ఎకాంతమునకు నిర్జనస్థలమునకు) పేర్లు

శక్తులు — శక్తయ స్త్రిస్ర ప్రభావోత్సాహమన్త్రజా అని (అమ) ప్రభావాదులవలన కలుగుశక్తులే ఈశక్తులు వీనిసంక్షేప మిది కోశదండములబలము ప్రభావము కర్తవ్యము అగుకార్యములయెడ జరపుదృఢతరప్రయత్నము ఉత్సాహము (విక్రమబలము-ఉత్సాహము అని కొందఱు) సంధివిగ్రహాదు లగుషడ్గుణములను (సామాదిచతురుపాయములతో) యథోచితము గా ప్రయోగించు ఆలోచనము మన్త్రము (చూ శిశు 2స 26శ్లో మల్లి వ్యా)

త్రివర్గము — క్షయ స్థానం చ వృద్ధి శ్చ త్రివర్గో నీతివేదినామ్ అని (అమ) శత్రువుల ప్రయత్నాధిక్యము కారణము గా సంభవించు తన యపచయము (హైన్యము) క్షయము తన వృద్ధికి నిమిత్తము గా సంభవించు శత్రువులయపచయము వృద్ధి ఇద్దఱ ప్రయత్నము ఫలము సమానము గ ఉండెడిస్థితి స్థానము పరకర్మోదయే నేతు క్షయో వృద్ధి ర్విపర్యయే తుల్యకర్మఫలే స్థానం కర్మను జ్ఞేయ మాత్మన అని (నీతివచనము)

చతురుపాయములు — భేదో దణ్డ స్సామ దాన మి త్యుపాయచతుష్టయమ్ అని (అమ) వీనిని గూర్చిన సంక్షేప మిది- ప్రియవచనాదులచే శత్రుక్రోధము ఉపశమింప జేయుట సామము తనధనమును శత్రువున కర్పించి ఆతని ప్రతి పడయుట దానము శత్రువుకడ ఉండెడిమంత్రులు లో నగువారిని ఉపాయముతో వారినుండి వేఱుచేసి వారిని దనవారి గా చేసికొనుట భేదము వధాదులచే శత్రువులను సాధించుట దండము

విజనము — వివిక్త విజన చ్ఛన్న నిశ్శలాకా స్తథా రహ (రహ శ్చోపాంశు చాలి లిఙ్గే) (అమ) నిర్జనే స్థాన ఏకాన్తం వివిక్తం విజనం తథా (అని)(వైజ సామా అర్థ)

[మను వా డిమి - వా డిమి జతనంబు మంతనం బనునట్టి (వావి పా) (అపపా)]

సీ. నమ్మిక నా గను నచ్చిక నా గను
విశ్వాససంజ్ఞ యై వెలయు చుండు
నిమ్మళం బన గను నిష్కలంకత యొప్పు
నిశ్చింత దనరును నెమ్మది యన
దగ వన బాడి నా దగు న్యాయనామంబు
మనును జాలిక నా సమర్థతాఖ్య
యానతి యన గను నాన యనంగను
సెలవు నా ముదల నా జెల గు నాజ్ఞ

గీ. గడు వన గ మేర యనఁగ నుగ్గడి యనంగ
నడరు మర్యాద తప్పిదం బాగడంబు
దుడుకు నేరము నేరమి దుండగంబు
త ప్పన గ నపరాధము తనరు నభవ 19

నమ్మిక నచ్చిక——ఇవి విశ్వాసమునకు (విస్రంభమునకు నమ్మిగకు నచ్చకకు నమ్మకమునకు) పేర్లు

నిమ్మళము——ఇది నిష్కలంకతకు (నిర్దోషతకు తప్పు లేమికి) పేరు

నెమ్మది——ఇది నిశ్చింతకు (నిర్విచారమునకు స్వస్థతకు ఎవిచారము (ఎట్టిబాధ) లేక ఉండుటకు) పేరు

తగవు పాడి——ఇవి న్యాయమునకు (నయమునకు నీతికి ఉచితమునకు) పేర్లు

చాలిక——ఇది సమర్థతకు (సామర్థ్యమునకు నేరిుకి శక్తతకు శక్తి కలిగి ఉండుటకు) పేరు

ఆనతి ఆన సెలవు ముదల——ఇవి ఆజ్ఞకు (అనుజ్ఞకు ఆదేశమునకు పనుపునకు ఉత్తరువునకు) పేర్లు

గడువు మేర ఉగ్గడి —— ఇవి మర్యాదకు (అవధికి కాలనిర్ణయము

నకు) పేర్లు

తప్పిదము ఆగడము దుడుకు నేము నేరమి దుండగము తప్పు—ఇవి అప రాధమునకు పేర్లు

తగవు — పాడి పంతంబు వైభవప్రాభవములు తగవు ధర్మంబు గలిగి యుత్తమవణి జులు (హర 34) చేటుగాల మైన జెట్టమాటలు నెటి గాని తెరువు వట్టుకష్టములను దగవులట్లు తోచు దగియొడునవి యవి నీతు లని మనమున నిశ్చయించు (భార ఉద్యో 2 64) ఇట సం భార అనయో నయసంకాశ అనినది (చూ శ ర)

ఉగ్గడి —ఉగ్గుడు-అని (శ ర) గడు వన గ పెర యన గ నుగ్గడటనంగ నడరు మర్యాద అని యిట (శ ర బ్రౌ పా) ఉగ్గడి-అని (సూ ని)

[సమర్థతాఖ్య — సమస్థానాఖ్య (వావి లపపా)]

సీ అరిబడి యప్పన మప్పన పంగము
పంజి ప న్నాడికో ల్పగిది బెడిగ
కో రన గా జెల గును భాగధేయంబు
గృహభాగధేయ మౌ నిల్లరి యన
బుల్లరి నా గ నొప్పును దృణభాగధే
యంబు కాలరి నా గ నన్ను నా గ
నభిగంతృభాగధేయము చెలంగును నెల
పన ధాన్యపరిమాతృభాగధేయ

గీ మలరు చుండును వట్ట మం చన గ వెలయు
హేయదీనాదిముఖభాగధేయసంజ్ఞ
సుంక మన దాణ మన గను శుల్క మెన గు
లంచ మన గను నుపద యై మించు నభవ 192

అరి బడి అప్పనము అప్పన పంగము పంజి పన్ను ఆడికోలు పగిడి

బెడిగ కోరు—ఇవి భాగధేయమునకు (కంమునకు కప్పమునకు సిస్తునకు ప్రజలు రాజునకు చెల్లింపవలసిన-ధనాదిభాగమునకు) పేర్లు

ఇల్లరి—ఇది గృహభాగధేయమునకు (ఇంటిపన్నునకు) పేరు

పుల్లరి—ఇది తృణభాగధేయమునకు (పశువులు కసవు (గడ్డి) మేయుటకై యిచ్చెడిపన్నునకు) పేరు

కాలరి అనుపు—ఇవి అభిగన్తృభాగధేయమునకు (బాటసారులు ఇచ్చుదారిపన్నునకు) పేర్లు

నెలపు—ఇది ధాన్యపరిమాతృభాగధేయమునకు (ధాన్యము కొలిచెడివారు ఇచ్చుకొనెడిపన్నునకు) పేరు

వట్టము—ఇది హేయదీనారమునకు (చెల్లనినాణెములు రోనగువాని జెల్లించుటకై యిచ్చెడిధనమునకు (తఱుగునకు నష్టమునకు) పేరు

సుంకము దాణము—ఇవి శుల్కమునకు (మార్గమున నియమిత స్థలములందు చెల్లింపవలసినపన్నునకు) పేర్లు

లంచము—ఇది ఉపదకు (కార్యార్థము ఇచ్చుసొమ్మునకు ఒకవిధ మగుపారితోషికమునకు) పేరు

పంగము —దేవబ్రాహ్మణుల వృత్తులమీద సర్కారువారు తీసేచతుర్థాంశము -ఒని (బ్రౌ)

ఆడికోలు —ఈయర్థమున దీనిని (సూ ని శ ర లు) గ్రహింప లేదు (బ్రౌ) గ్రహించినది (చూ అను)

పగిది — పగిడి - అనికూడ (బ్రౌ) పగిదికి (రూపాం) పగిడి - అన వలయును నిర్ధారకము లేదు- (శ త పగది)

బెడిగ — బేడిగ (రూపాం) బేడిగె-బెడిగ వి (సం భాటక కి బాడిగె) పన్ను భాగధేయము బేడిగ అని (చి ని శ ర బ్రౌ) అనినది (సూ ని)

కోరు — రాజాదుల కిచ్చుధనేతరవస్తురూప మైనకప్పము అని (సూ ని)

కాలరి — కాలాఠి గ్రహించి జనహాసము అనెడి యర్థ మిచ్చినది (బ్రౌ) కాలరి లని కూడ గ్రహించినది (చూ అను)

భాగధేయము — భాగధేయ కరో బలి అని (అమ)

శుల్కము — ఘట్టాదిదేయం శుల్కో ఒస్త్రీ అని (అమ) పథి దేయే శుల్క మస్త్రీ- అని (వైజ ద్వ్యి నానా)

లంచము — లంచశబ్దము (సంస్కృతమున)- బహుమతి కానుక - అనునర్థము గలది కలదు దానినుండి యేర్పడినతెలుగుశబ్ద మిది ఈయర్థమున దీనిని (శ ర బ్రౌ సూ ని) ఏవియు గ్రహింప లేదు ఉపద కు లంచము (అని) రెండవయర్థము గా ఇచ్చినది (సూ ని)

ఉపద — (ప్రాభృతం తు ప్రదేశనమ్) ఉపాయన ముపగ్రాహ్య ముపహార స్తథోపదా - అని (అమ) ఉపదా తూపహార స్స్యా దుపగ్రాహ్య ముపాయనమ్ ప్రదేశనం ప్రాభృతం చ లమ్బా (లఞ్చా) తూ త్కోచ ఆమిష అని (వైజ భూ క్షత్రి) ఇది ఉత్కోచార్థక మగు లఞ్చ శబ్దము ఉపదా శబ్దము భిన్నార్థకము లవు చున్నది లంబా అనుట (పై వైజయన్తియందు) ముద్రణప్రమాద మనిపించినది

సీ కానుక కానిక కప్పము సూడిద
యులుపా యుపారంబు నులుప యన గఁ
జను నుపాయనసంజ్ఞ చామరం బొప్పు విం
జామర యన గను సౌర మన గఁ
దద్భేదసంజ్ఞ యై తనరారు గొడు గన
గొడు వన ఛత్రాఖ్య యడరు చుండు
జగజం పనంగను జల్లి నా జం పన
ఝల్లరీనామ మై యుల్లసిల్లు

గీ వర్షవారణనామ మై వఱలు గిడుగు
జిడు గన గ జర్మఫలకంబు చెల గు నరిగె

యనఁగ భృంగారు గిండి నా జను బిరుదము
బిరు దనఁ బవాడ మన గను బర గు నభవ 193

కానుక కానిక కప్పము సూడిద ఉలుపా ఉపారము ఉలుప——ఇవి ఉపాయనమునకు (ఉపహారమునకు చేదరిసెనమునకు చేకానుకకు రాజదర్శనార్థము వచ్చి యిచ్చుకాన్కకు) పేర్లు

వింజామర——ఇది చామరమునకు (వాలవ్యజనమునకు రోమగుచ్ఛకమునకు వీచోపునకు రాజునకు వీచువీవనకు తెల్లచామరమునకు) పేరు

సౌరము——ఇది చామరభేదమునకు (ఒకవిధ మగువింజామరకు) పేరు

గొడుగు గొడువు——ఇవి ఛత్రమునకు (ఆతపత్రమునకు ఎల్లికి ఎండమఱువునకు) పేర్లు

జగజంపు జల్లి జంపు——ఇవి ఝల్లరికి (జాలరునకు గొడుగుకొనకు చుట్టు ఉండుముత్యాలకుచ్చు లో నగుదానికి) పేర్లు

గిడుగు జిడుగు——ఇవి వర్షవారణమునకు(వారిత్రమునకు వర్షము నివారించుఒకవిధ మగుగొడుగునకు కామ లేనిగొడుగునకు) పేర్లు

అరిగె——ఇది చర్మఫలకమునకు (రాజులయెదుట వారిగౌరవార్థము పట్టుకొనబడెడి డాలువంటి (చర్మనిర్మిత మగు) ఒకయుపకరణమునకు) పేరు

గిండి——ఇది భృంగారువునకు (బంగారుగిండికి హేమకరకమునకు సన్నని మెడగలబంగారునీటిపాత్రమునకు జారీచెంబు బిందె-మొద లగువానికి) పేరు

బిరుదు పవాడము——ఇవి బిరుదమునకు (రాజాదుల సామర్థ్య చిహ్నమునకు) పేర్లు

ఉపాయనము ——ఈశబ్దమునకు- ఉపఢౌకనము అర్థ మనినది సుధ ( ఉపఢౌకనము నకు

కానుక ఉడుగర 2 కానుక ముచ్చట) అని సూ ని రాజదర్శనార్థమై తెచ్చుకానుక అర్థ మని (గురు )

అరిగె —సారంగధరప్రయోగ మి ట్లున్నది- కదలపొ జలరొాద లిరుగడల జెల గ దొరల నందఱమన్ననల్ దొరల ననిచి వడి నిగుడ దేజి గొల్వుచావడిన డిగ్గి యరిగె న త్తఱి మహాభర్త యరిగె లెత్త (2 90 ) ఇట- అరిగ కిది (రూపాం) అని అరిగ కడ (సూ ని ) (క అరిగె పరిగె హరిగె ) డాలు ఖేటకమ పలక 2 ఎండ మొద లగువాని కడ్డు గా ఎట్టుకేదెమువంటిసాధనవిశేషము అనినది ఈరెండర్థములలో ఏదో యొకయర్థ మిట చెప్పవలయు ననునట్లు ప్రయోగము చూం స్పష్టము గా ఇద మిత్థ మ్మనక వదలినది ఇట జితకాశివ్యాఖ్య ఇ ట్లను చున్నది- అరిగె లెత్త గా=పరి జనులు బిరుదుచిహ్నము లయినగుంద్రనిధ్వజముల పట్ట గా (అని ) ప్రమాణ మేమియు చూప లేదు దీనికి ధ్వజము లనునర్థము చెప్పన దనుట స్పష్టము అరిగె కు (బ్రౌ ) ఇ ట్లర్థవివరణ మొనర్చినది ప్రయోగ మిచ్చి డాలువలె బ్ర హ్మాండము గా ఉండేటిది దీన్ని రాజులయెదట పట్టుకొని వస్తారు తేరులు కలముల తెఱ గున దిరుగ గా గరులు మైనాకాదిగిరుల బోల అరిగెబిళ్లలు కమలాకృతి మెఱయ గా నడిదంబులును మీల ననుకరింప (G 22 ) (అని ) అరిగ కు సూ ని పై చెప్పనయర్థములు ప్రయోగములు కా దనుట లేదు అరిగె కుమాత్రము (బ్రౌ ) చెప్పినదే అర్థము ఈ అరిగె-చర్మముతో చేయ బడి డాలు వోలె ఉండుటనుబట్టి చర్మ ఫలక మన బడినది వేంకనార్యునిచే రాజులగౌరవార్థము (రాజచిహ్నము గా వారి యెదుట పట్ట బడెడిది యిది ఇచ్చటి ఆం ఖా ప్రకరణముగూడ అట్టిదే వింజామ రము ల కది పేర్లు వచించు చున్నసందర్భ మిది డాలు నకు పేర్లు వేఱు గా వచింప బడినవి (చూ 2 22 ) డాలు కా దిది ఒకవిధము గా బ్రౌ చెప్పినయర్థమే (సూ ని ) చెప్పనరెండవయర్థ మనవచ్చును బ్రౌ ఇచ్చిన-ఉదాహరణమునకంటెను (బ్రౌ ) దీనికి చెప్పనయర్థమునకు సారం ప్రయోగము చక్కని యుదాహరణము ఆం ఖా దీనిని లక్ష్యీకరించియే ఈయర్థము దీనికి నిర్ణయించి యుండును ( జిత కా వ్యా ) ధ్వజము దీని కర్థ మని ( ధ్వజ మెత్తిరి) ధ్వజము పట్టిరి అనుట ఉచిత మనిపించుట లేదు

పవాడము — సాహాతీనృత్యగీతప్రసంగావధానంబులం దనకు నెదురు లేక యుండం బెరస రసికతావిశేషంబులం గురు కుకురు కరూశ మగధ మాళవ చోళప్రముఖ దేశాధినాయకులచేత వాదంబులం బవాడంబులు గొనుచు (విప్ర 2 48)

[ జగ్గు, గొడుగనగ (వావిపా) ఇట (వర్షవారణనామ మైవలలు) గిడుగు జిడుగనగ చెలగు అని (ప్రాతప్రతిపా) ఇదియే సాధుపార మన వచ్చును ఆంధ్రప్రదాకర మిట్లను చున్నది- జిడుగు గిడు గనెడిపేరుల నడరును భువి వర్షవారణాఖ్యలు (పరికరవర్గము 6) (చూ సూ ని) పైప్రాతప్రతిపారము గిడుగు జిడు గనగ అనిమాత్ర ముదాహరించినది సూ ని (చూ జిడుగు) యతిభంగము గలుగకుండ చెలగు అని నే నంటిని

సీ వేలము పాళెము వీడుపట్టు బిడారు
విడిది యం చనగ నివేశ మొప్పు
జదల మం చన గను స్కంధవారము మిాఱు
నేనుంగు హత్తి గౌ రేను గేన్గు
నాగ దంతావళ నామమౌ మొక్కడీ
డన నల్పదంతగజాఖ్య దనరుఁ
గలభంబు గున్న నా గను జెలు వొందును
బెంటియేను గనంగ వెలయు గరిణి

గీ తొండ మనఁగను దుండాఖ్య తోచు జాల
పొగరుపొడ యన బద్మము ల్దగును గీక
యనఁగ ఘీంకారనామధేయంబు చెలగు
భూషితభుజంగ శ్రీమాతృభూతలింగ 94

వేలము పాళెము వీడుపట్టు బిడారు విడిది—ఇవి నివేశమునకు(శిబిరమునకు సేన దిగి యుండుచోటికి) పేర్లు

చదలము—ఇది స్కంధవారమునకు (పదాతిసేనలకు కాల్బలములకు) పేరు

ఏనుంగు హత్తి గౌరు ఏనుగు ఎన్గు—ఇవి దంతావళమునకు (మహామృగమునకు గజమునకు కరికి వెల్లగొమ్ముల మెకమునకు ఏనికకు) పేర్లు

మొక్కడీడు—ఇది అల్పదంతగజమునకు (మొక్కడికి చిన్నదంతములు (కొమ్ములు) గలయేనుగునకు) పేరు

గున్న—ఇది కలభమునకు (ఏనుగు గున్నకు పిల్లయేనుగునకు) పేరు

పెంటియేనుగు—ఇది కరిణికి (వశకు కరేణువునకు ఆడేనుగునకు) పేరు

తొండము—ఇది తుండమునకు (శుండమునకు కరమునకు ఏనుగు తొండమునకు) పేరు

జాల పొగరుపొడ—ఇవి పద్మములకు (బిందుజాలమునకు ఏనుఁగు ముఖమందు యౌవనమదముచే పుట్టుపద్మములవంటి మచ్చలకు) పేర్లు

గీక—ఇది ఘీంకారమునకు (బృంహితమునకు ఏనుగు వేయు కీచుమను కూతకు) పేరు

బిడారు —(సాధారణముగ) నివాసము అనునర్థము దీనికి లాక్షణికము ఈ వెలంది యొడల్ పైడిలో వెలంది యీ వెలంతలలాటంబు లేనెలంత యీసుపాణిచంద్రశేణియే సుపాణి యూబిడారు మృగీమదశ్రీబిడారు (విజ 30) మొ

నివేశము — నివేశశ్శిబిరం షణ్డే అని (అమ)

స్కంధవారము — స్కంధశబ్దమునకు సేనాంశము అనునర్థమును వార శబ్దమునకు సమూహము అనునర్థమును నిఘంటువు లిచ్చుచున్నవి. స్కన్ధ ప్రకాణ్డే సేనాంశే అని వార స్సూర్యాదిదివసే వారో ఽవసరబృన్దయో అని (విశ్వ) దీనిని బట్టి కాల్బలము అనెడియర్థము ఇచ్చటి స్కన్ధవార శబ్దమునకు యుక్తమనిపించుచున్నది చతురంగబలములు వచింపబడుచున్నవి. చదలమునకు కాల్బలము అను అర్థము ప్రయోగదృష్టము. మదకరులు ముందరుగ మది నెదుగువేగములు

గదుర హయముల్ నడలయుదుటు గనిఎంపక జదలములు నలుగడల టొదివికొన దేరుగము లుదిరిమలలో యన గ జెదర కరుదేరగ (ఉ రా 7 77) మొ (చూ సూ ని) ఇచ్చటి ఆం భా కు పరస్పర విరుద్ధము గా ఒర్థ మొస గినవి (ఆం భా ప్రమాణ మనుచు) (బ్రౌ మొ) చదలము-స్కంధావారము-శిబిరము- అన గా దండు ఓగినస్థలము (ఆం భా) అని (బ్రౌ) (వేలమకడ-) వేలము- శిబిరము పాళెము అనగా దండు దిగి యుండెచోటు (ఆం భా) అనియు (బ్రౌ) ఎట్లు సమన్వయము? బిడారు గృహము నివేశము- ఆం భా (పవ్వళింపుబిడారు) మొ అనియు (బ్రౌ) బిడారు-వేలము పర్యాయము లని కదా ఆం భా అను చున్నది భిన్నార్థకము లనుచు విరుద్ధము గా ఆ వ్యాఖ్య లేమి

దంతావళనామము — దంతావళనామములు మఱికొన్నిటని (సాంబ) ఇ ట్లుదాహరించినది

నబ్బిపేనిమె ంబు గిబ్బిచెంబుమెకంబు గొప్పయిజ్జమెక మెక్కుడుమెకంబు గౌరు చెయ్యి గల మెకము రెంట ద్రాగు దె ను గు పలుగొమ్ములు దగినమెకము హత్తి బల్తల మెకం బన దంతిపే ళ్లగు (తిర్య 2)

కలభము — కలభమునుగూర్చి వైజ ఇ ట్లను చున్నది- పఞ్చవర్షో గజో బాల పోత స్తు దశవర్షక వికో్క వింశతివర్ష స్తు కలభ స్త్రింశవర్షక ఉని

పద్మము — పద్మకం బిన్దుజాలకమ్ (పద్మ మివ పద్మకమ్- ఇవార్థమున కప్రత్యయము పద్మకమే పద్మము)

సీ మదము రాజిలు మస్తు మత్తు మత్తా యన
నాలానసంజ్ఞ యై యలరు గట్టు
కంబ మనంగ దోత్రంబు బరి యన గ
నారెగోల యనంగ నలరు చుండు
శృంఖలనామంబు చెల గు సంకెల యన
నంకుశనామ మౌ నంకుసమ్ము
సిడి యన నౌరి జన నడరుఁ గక్ష్యాభిధ
కుధము జూల్ లే పన గొఱలు చుండు

గీ నొప్పు జొడో లనంగ దంత్యు పరిడోల
వారి పంగెన యనఁగను పంగిడి యన
నోద మన మూ డు పేళ్లచే నుల్లసిల్లు
భూరిభవభంగ శ్రీమాతృభూతలింగ 95

మస్తు మత్తు మత్తా—ఇవి మదమునకు (దానమునకు ఏను గుమదమ నకు) పేర్లు

కట్టుకంబము—ఇది ఆలానమునకు (బన్ధనస్తంభమునకు ఎను గులను కట్టెడి స్తంభమునకు) పేరు

బరి ఆరెగోల—ఇవి తోత్త్రమునకు (వైణుకమునకు బరిగోలకు తోదనదండ మునకు ఎను గును తోలుటకు-దాని ప్రక్కలు పొడుచుటకై ఉపయోగించు అర్ధ చంద్రాకార మైన అలుఁగు కల వేణు దండమునకు (వెదురుకఱ్ఱకు) పేర్లు

అంకుసము సిడి—ఇవి అంకుశమునకు (సృణికి ఎను గు కుంభస్థలము పొడిచె డి ఆయుధము నకు) పేర్లు

ఒరిజ—ఇది కక్ష్యకు (వరత్రకు ఎను గునడుమునకు కట్టెడితోలు లో నగువాని మోకునకు) పేరు

జూల్ లేపు—ఇవి కుథమునకు (ఆస్తరణమునకు (ఎను గుపీ పుపై పఱచెడి కంబళికి) పేర్లు

చౌడోలు—ఇది దంత్యుపరిడోలకు (అంబారికి ఎను గుపీపుమీ ద కూర్చుండు టకై అమర్చిన తొట్టికి) పేరు

పంగెన పంగిడి ఓదము—ఇవి వారికి (గజబన్ధనికి ఎనుఁగును పట్టుటకు చేయఁ బడినగోయి-లో నగువానికి) పేర్లు

మదము — మదో దానమ్ అని (అమ) ఇట మదశబ్దము ప్రకరణమునుబట్టి ఏను గు మదమును వచించునదిగానే ఉన్నది ఆమరమల్లే ఇ క పారవశ్యము అనునది మత్తు

మొదలగువాని ప్రయోగ జుష్టమైనను సుప్రసిద్ధార్థమని (ప్రత్యేకముగా) ఆం భా దీనిని వచింపక మస్తువాడు గ్రహించి (ఉపలక్షణవిధితో) వీనికి ఈ (అర్థాం) సంగ్రహించన దనిఎంచును (మస్తు) మస్తు మీటినను హస్తమస్తకంబు కుస్తరించిన మామకహస్తములకు రాయి గా నీనితంబంబు లంట నీపెంటు నామీద నేలవాల్గంటి నీకు (అహ 3 44)(మా సూ ని) (ఆం భా లోని మదశబ్దము సాధారణవాచ మని సూ ని (చూ మత్తు ఏను గున కైనమదస్థానములు విశేష సంజ్ఞలతో ఇట్లు వచింప బడినవి దానం కపోలయో స్సధు రక్ష్ణో ర్ముత్యో స్తు సాగర ంరాగ్రే శీకర శ్శీకర్యం స్తనాగ్రే మేహనే మద హృదయే ఘర్మసలిలం మేషు స్తు చరణప్రజే సంజ్ఞయా ఉష్టమదా హ్యేతే జాయన్తే భద్రదన్తినామ్ అని (అమ శేష) (ఆం భా మదశబ్దము) (గజ) మదముల నన్నింటని జెప్పసాధారణవాచకమే - మాకమందువలె)

ఒరిజ —ఏను గు మెడగొలుసు కలాపకము లని (శ ర) (సూ ని) ఆం భా దీనిని కక్ష్య అను చున్నది కక్ష్యా బృహతికాయాం స్యా త్కాఞ్చ్యాం మధ్యేభబన్ధనే వార్మ్యాదీనాం ప్రకోష్ఠే చ అని (విశ్వ) పయోగము లిట్లున్నవి- వనుల నోదాల ద్రోవక దేవకరి బట్టి యొరిజ పైవకి యెక్కుసుదుటు దనము (రా వి 3 46) గళలిప్తకస్తూరికారెఖ లొరిజలు మను జెక్కుల జవాదిమొనపుమదము అంగసంభవుమదపు టేనుంగు లన గ వఱలుదురు వీ బణ్యాలావణ్యవతులు (చంద్రా 32)మొ ఇందు రెండవప్రయోగమునుబట్టి దీని కీయర్థమును గల దనక తప్పదు (అర్థాం) ఆది

ఎళ్లు — ఎళ్లు-ఏను గును బొడిచెడి బరిగోల లని (శ ర) ఎడి-కక్ష్య (ఆం భా)- అని (బ్రౌ) (మా అప) ఉన్వయమున (బ్రౌ) ప్రమాదపడిన దనిఎంచును ఎడి-బ ఎళ్లు (లేక)ఎడులు ఎళ్లు-లనా మొద్దీపెలు D M VII 2 20 - ఎళ్లుహావనగంధసంధురంబును అను చున్నది (ఎడికడ) (బ్రౌ)

చౌడోలు —చప్పరము og హౌదా-లని (బ్రౌ)

జూల్ —జూలు (రూ ం) జూలు లేపలు గోర్పరాలు నా కథము అని (వేంక)

వారి — వారీ తు గజబన్ధనీ అని(అమ) గజబన్ధనశాల లని సుధ వారిశబ్దమునుగూర్చిన వివరణమునకై- (చూ నామధురావిజయపరికిలోని కొన్నిశబ్దములు- అర్థనిర్ణయము అను శీర్షకము)

కిట్టుకంబము — కట్టు గంబము అని (సూ ని శ ర) కట్టుకంబము అని (ప్రౌ పా) సమాసమునందలి తద్ధర్మార్థకోకారమునకు నుగాగమ ప్రయోగములం దొక్కొక్కచో దృష్టము- గగుర్పొడిచెఁ జమక ట్టొకయిసుమంత వీడె గట్టుంగొంగుఱా (విజ వి 2 78) పొల్పగుంజవికె (స్వా 5 76)మొ ఇట్టివి అన్యవ్యవహారంబుల దృష్టంబులు గ్రాహ్యంబులు (బాలవ్యా సంజ్ఞా 23) అనురీతిని నిర్ధారకప్రయోగము లున్నప్పుడు సాధువు లన దగినవి కట్టుంగంబము అనురీతి నిర్ధారకప్రయోగ మున్నపుడె యిట్టిది సాధు వన వలయును

సీ తనరు నశ్వంబు తత్తడి మావు జక్కి బా
బా వావురము వారువంబు గుఱ్ఱ
మన దేశభేదహయాభిధలు హరబ్బి
తురికి కచ్చి యనంగ దోఁచు చుండు
బాగా యన గ నశ్వపంక్తి విరాజిల్లు
బాజ్యాశ్వసంజ్ఞ యొప్పు బడివాగె
తేజి నా వర్మితవాజి యౌ గత్తలా
ని యనంగ గత్తలాన యన గాను

గీ ఘోటకవిశేష మెస గును గూబు నా గ
మూఢకహయంబు వెలయును మోటు నా గ
దట్టు వన నీచతురంగంబు దనరు చుండు
భూరిభవభంగ శ్రీమాతృభూతలింగ 96

తత్తడి మావు జక్కి బాబా వావురము వారువము గుఱ్ఱము—ఇవి అశ్వమునకు (తురగమునకు తురంగమునకు హయమునకు పటాణికి తుక్ఖారమునకు) పేర్లు

హరబ్బి తురికి కచ్చి—ఇవి ఆయా దేశభేదములకు చెందినహయములకు (హర

బ్బి-హరబ్బిదేశపుగుఱ్ఱమునకు (తురికి తుఽకదేశపుగుఱ్ఱమునకు) (కచ్ఛి-కచ్ఛిదేశపుగుఱ్ఱమునకు) పేర్లు

పాగా—ఇది అశ్వపంక్తికి (గుఱ్ఱములగుంపునకు) పేరు

పడివాగె తేజి—ఇవి పూజ్యాశ్వమునకు (ఉత్తమాశ్వమునకు ఆజానేయమునకు మేలుజాతిగుఱ్ఱమునకు) పేర్లు

కత్తలాని కత్తలాన—ఇవి వర్మితవాజికి (కవచము తొడిగినగుఱ్ఱమునకు) పేర్లు

గూబు—ఇది అశ్వవిశేషమునకు (ఒకవిధమైనగుఱ్ఱమునకు) పేరు

మోటు—ఇది ముూఢకహయమునకు (మోటుగుఱ్ఱమునకు మొద్దుగుఱ్ఱమునకు) పేరు

తట్టువ—ఇది నీచతురగమునకు (తక్కువజాతిగుఱ్ఱమునకు) పేరు

దేశభేదహయాభిధలు —గుఱ్ఱములయుత్పత్తికి అగుదేశవిశేషములఘుబట్టి ఏర్పడిన అశ్వనామములను (ఉమ) గూడ ఇట్లు తెలుపుచున్నది వనాయుజా పారసకా కామ్బోజా బాహ్లికా హయా (అని) వైజ గూడ వీని నిట్లు వివరించినది- ఆజానేయా కులీనా స్స్యు పారసకాదయశ్చ తే పారసీకాఽసంజ్ఞాస్తు పారసకాదిదేశజా యే తు కామ్బోజ బాహ్లిక వనాయుజముఖా హయా తే విహానకుూః కిఞ్చిత్పశ్చిమోత్తరదేశజా (భూ క్షత్రి)

తేజి — అరబ్బుదేశపుగుఱ్ఱము - అని (బ్రౌ) (ఆం భా) విశేషవాచకములు అనిన తేజి తట్టువ కత్తలాని తురికి - అనువానిని తిక్కననిఘంటువులు సామాన్యవాచకము లన్నట్లుగా విశేషవివక్ష చేయక (మావిని- చెట్టనునట్లుగా) ఉదాహరించినవి వావురము పటాణి వారువంబు జక్కి మావు గుఱ్ఱము తేజి యెక్కిరింత తత్తడి రవాలు నడగడు కత్తలాని తురికి బాబా యనగ నొప్పు దురగమునకు (తిర్య 7) అని (సాంబ) వాజికి సమాఖ్య లగు దేజి వారువంబు మావు గుఱ్ఱంబు తట్టువ వావురంబు కత్తలాని బాబా జక్కి తత్తడి యన (ఆం సం తిర్య 3)

గూబు —(ఆం భా కంబె) ప్రమాణాంతరము లేదు-అని (సూ ని)

మోటు —మగగుఱ్ఱము-అని (బ్రౌ) తట్టువగుఱ్ఱము-అని (శ ర)

తట్టువ — కుత్సితాశ్వము అని (శ ర)

[ పం గు నశ్వంబు బాబా వావురము వారువముజంక్క తత్తడి మావు గుఱ్ఱ మన
(ముద్రి అపపా) ]

సీ తేజి నా నున్నతవాజి యై విలసిల్లు
బడబ గోడిగ నా గ బర గు చుండు
బడబాఋతుసమాఖ్య యడరు నత్తడి యన
సొబను నా గ బడబచూలు వెలయు
సకిలిం పనంగను సకిరింత యన గను
హేషాభిధాన మై యెస గు చుండు
గంద మనంగను స్కంధంబు దగు దో క
లవిటి నా గను బుచ్ఛము విలసిల్లు

గీ గౌన యన గ గేసరం బొప్పు గొరిజ డెక్క
గిట్ట యన ఖురనామంబు గేరు చుండు
నడ పనంగను నడ యన నడరును గతి
భూరిభవభంగ శ్రీమాతృభూతలింగ 97

తేజి—ఇది ఉన్నతవాజికి (ఉన్నతాశ్వమునకు ఎత్తైనగుఱ్ఱమునకు) పేరు

గోడిగ— ఇది బడబకు (ఘోటికకు అశ్వకు ఆడుగుఱ్ఱమునకు) పేరు

అత్తడి—ఇది బడబాఋతువునకు (ఆడుగుఱ్ఱమునకు కలిగెడు ఎదకు గర్భధారణమునకు తగినకాలమునకు) పేరు

సొబను— ఇది బడబచూలునకు (బడబాగర్భమునకు) పేరు

సకిలింపు సకిరింత—ఇవి హేషకు (హ్రేషకు హేషారవమునకు గుఱ్ఱపు-ధ్వనికి- కూంతకు) పేర్లు

కందము — ఇది స్కంధమునకు (అశ్వాదులమూపునకు) పేరు

తోక లవిటి — ఇవి పుచ్ఛమునకు అశ్వాదులతోఁకకు) పేర్లు

కొాన — ఇది కేసరమునకు (జూలునకు గుఱ్ఱపుజూలునకు) పేరు

గొరిజ డెక్క గిట్ట — ఇవి ఖురమునకు (శఫమునకు అశ్వాదులకాలిగిట్టకు గొరిసెకు) పేర్లు

నడపు నడ — ఇవి గతికి (గమనమునకు అశ్వాదులనడకకు) పేర్లు

అత్తడి — అడుగుఱ్ఱపు ముట్టురక్తము-అని (బ్రౌ)

సకిరింత — ఇది సకిలింతకు-(ఆమ్రేడి) అని కాబోలు ప్రామాణికనిఘంటువు లన్నియు సకిలింత ఁనియే అను చున్నవి ఇట్టివి యిందు చాల గలవు సకిలింతకు (రూపాం) ఇది కావచ్చును శుద్ధాంధ్రపదపారిజాతము-సకిరింత అని యను చున్నది విశేషరూపముల నిట్టివానిని ఉదాహరించుట ఆం భా కు చాలయిష్టము [చూ కాటుగపట్ల-మొ]

కందము — ఇదియు పైవానివలెనే పశువు లన్నిటిమూపును వచించునది గానే ప్రయోగదృష్ట మగు చున్నది- కప్పువెట్టి వెన్ను కందంబు సమము గా బొదలి ప్రొళ్లగట్టి పోరు చుండి మలయు గాని పోవుమానిం బొద గన్న (మనుచ 4 23) మొ (ఇట్టిపోతుల వర్ణన ఇది) [స్కంధము భుజశిరస్సు అని (బ్రౌ)]

లవిటి గుఱ్ఱపుతోఁక-అనినది ఈ (ఆం భా)ను మాత్రము ఉదాహరించి (సూ ని) ఇట్టివి ఒక్కొకచో సామాన్యవాచకములును ఒక్కొకచో విశేషవాచకములును అగు చున్నవి సందర్భమునుబట్టి విశేషవాచకములే యిట్టివి కావలెఁ యున్నను నిఘంటు కర్తలయు తద్వ్యాఖ్యాతలయు సంప్రదాయమునుబట్టి సామాన్యవాచకములు గా గానవచ్చు చున్నవి కొన్నిచోట్ల విశేషవాచకము లగుటయు కలదు మఱికొన్నిచోట్ల ఉభయవాచకము లగుటయు కొన్నిచోట్ల అగపడును, ఇట్టివి లక్ష్యానుసరణమున సముచితములు గా వ్యాఖ్యాతము లగు చున్న వనిఎంచు చున్నవి వ్యాఖ్యాతలచే సంస్కృతనిఘంటువుల సంప్రదాయ మిట్టిదే శఫం క్లీబే ఖుర పుమాన్ పుచ్ఛో౽స్త్రీ లూమలాఙ్గూలే వాలహస్తశ్చ వాలధి ఌని (అమ) సందర్భము గుఱ్ఱమునుగూర్చినదియే ఐనను పశుమాత్రమునకు సంబంధించనవి గానే యివి వ్యాఖ్యాతములు (చూ పద మొ) శఫం మూలే తరూ

ణాం న్యా ద్గవాదీనాం ఖురె ఉపి చ పుచ్ఛ పశ్చా ద్ర్పదేశ సాన్య ల్లాఙ్గూలే పుచ్ఛ మిష్యతే అని ఇతరనిఘంటుసంవాదము కొన్ని ఉభయవాచకములు- వాలౌ పుచ్ఛా శ్వపుచ్ఛౌ చ -అని (వైజ ద్వ్య పుం) పై వైజమొ వానిని బట్టి ఇవి సామాన్యవాచకము లనుట దోషము కాకపోయినను లవిటి అనుదానికి పక్షిపుచ్ఛము అనునర్థమును ఇది వేఱు గా (299)లో వచించి యుండుటనుబట్టి ఇది విశేషవాచక మనుటయే యుక్త మనిపించును ఇక వీనికి సాధారణము గా (పశువుల) తోక అనునర్థము లాక్షణికము గా ఏర్పడిన (అర్థాం) అని వదలినది ఆం భా (అని) తోచును తోక వేఱు గా మఱి ఇది గ్రహింప లేదు సుప్రసిద్ధ మని వదలిన దేమో ప్రయోగపరామర్శము తగునంతగా జరపిన గాని ఇట్టివానికిడ ఇదమిత్థ మ్మన లేము నా వ్యాఖ్యవ్యాఖ్యాతల సంప్రదాయమును గా దనక యిట నడచినది

సీ జంగనడపు నా గ జంఘాలగతియొప్పు
 జను నులు క్కన గ నీచగతిపేరు
రవగా ల్రవాలు నా రాజిల్లు నాస్కంది
 తము జోడన యనంగ ధౌరితకము
వెలయును బేరెము వేడెము జాళెము
 బవిరి నా రేచితంబు విలసిల్లు
జౌకళిం పన గను దూకు డనంగను
 వల్గిత మ్మగును దువాళ మన దు

గీ వాళి యన గను బ్లుతము గా వఱలు చుండు
 బొలుచు నాస్కందితవిశేషము మొనగా ల
 నంగ బ్లుతగతిభేదంబు జంగ గంతు
 దాటు పల్లటీ దుముకు నా( దనరు నభవ 198

జంగనడపు—ఇది జంఘాలగతికి (కాలు చా చిపెట్టి నడచుగుఱ్ఱపునడకకు) పేరు

ఉలుకు—ఇది నీచగతికి (మందగతికి ఒకవిధ మగుమెల్లనిగుఱ్ఱపునడకకు) పేరు

రవగాలు రవాలు—ఇవి అస్కందితమునకు (ఒకవిధ మగు అశ్వధారకు కాళ్లన్నిటితో అతివేగము గా ఎగి రెగిరి పరుగెత్తు అశ్వము యొక్క గమనమునకు) పేర్లు

జోడన—ఇది ధౌరితకమునకు (ధోరితమునకు దౌడునకు ఒకవిధ మగు అశ్వధారకు అస్కందితమునకంటె అధిక మై చతుర మైన (నెమిలి లో నగువాని వంటి) గుఱ్ఱపునడకకు) పేరు

పేరెము వేడెము జాశెము బవిరి— ఇవి రేచితమునకు (ఉత్తేజితమునకు ఒకవిధ మగు అశ్వధారకు అంతతక్కువ అంతయెక్కువ కాని మధ్యవేగముతో ఋజువు గా నడుచు గుఱ్ఱముయొక్క నడకకు) పేర్లు

చౌకళింపు దూకుడు—ఇవి వల్గితమునకు (వలితమునకు ఒకవిధ మగు అశ్వధారకు మేనిముందుభాగము చాచి మొగము సంకుచించి పృష్ఠభాగము వంచుకొని (గుఱ్ఱము) నడుచునడకకు) పేర్లు

దువాళము దువాళి—ఇవి ప్లుతమునకు (ప్లుతికి లంఘనమునకు ఒకవిధ మగు అశ్వధారకు నిబ్బరమునకు అంతమేరయు సమము గా ఎకధాటిని దూకి దూకి పశ్వాదులయట్లు పరుగెత్తుగుఱ్ఱముయొక్క పరువునకు) పేరు

మొనగాలు—ఇది అస్కందితవిశేషమునకు (ఒకవిధ మగు అస్కందిత గమనమునకు) పేరు

జంగ గంతు పల్లటీ దుముకు—ఇవి ప్లుతగతివిశేషమునకు (ప్లుతగతిలోని-ఒక భేదమునకు) పేర్లు

జంఘాలగతి — హరి ణైణ కుర ఙ్గర్ష్య పృషత న్యఙ్కు శమ్బరా రాజీవ శ్చ తథా ముణ్డీ జఙ్ఘాలా పరికీర్తితా (వాచ)

ఉలుక్కు —ఇచ్చట లుక్కు అని పదవిభాగ మని (సారం -82) ను ప్రమాణ మిచ్చి (సూ వి శ ర) ఉలుక్కు గా గ్రహించి పొరపడిన వని (సారం జితకాశివాక్య)

(సారం) పద్యములోని ఉక్కు ఈయర్థము గలది కాదు అది వల్గితము అను అర్థము గలది అది వేఱుపదము దీనికి దానికి సంబంధము లేదు ఈపద్యమున వరుసగా పేర్కొనబడు చున్నధారాగమనములలో నాల్గవదిగా ఇది ఉన్నది పంచధారలలో నాల్గవది దీని కర్థ మగుట క్రమమే వచించును (ఆం భా) వచించిన ఉలుక్కు ఇది గాదు నీచగమనము ఉక్కు నకు అర్థ మనుట ఉసంగతము ప్రమాదపడినవారు (జి కా శి వ్యాఖ్యాతలు) (సూ ని శ ర లు) ప్రమాదపడ లేదు (సూ ని) ఉక్కు గ్రహించి ఉక్కు కడ ఆం భా ఉదాహరించుట ప్రమాదము (బ్రౌ) ఉలుక్కు గ్రహించి నీచగమనము ఉసునర్థ మిచ్చినది (చూ అను) ఆం భా లో ఉలుక్కు అనుభేదమే సముచితము ప్రామాణికము

అస్కందితము —నిశ్చల మై అతివేగము అతిమందము గాక సమ మైనగతి అస్కందితము -ఉని (గురు)

వల్గితము —వేగము గా విడువ బడి మీ దికి కాళ్లు కదలించుచు పాఱెడి-అశ్వధారావిశేషము- అని (శ ర) గుఱ్ఱపుదౌడు-అని (సూ ని) అశ్వగతిభేదము ఒకవైపుగా నడపడము-అని (బ్రౌ)

రెచితము —తాళగతితో పేరెము గా దిరుగుట-ఽని(గురు)

[ఈధారాగమనముల గూర్చి (వై జ) ఇట్లను చున్నది- అశ్వానాం తు గతిర్ధారా విభిన్నా సా తు పఞ్చధా అస్కన్దితం ధౌరితకం రొచితం వల్లి(ల్గి)తం ప్లుతమ్ ఇత్యేతేషాం చ పఞ్చానా మేకైకం బహుభేదకమ్ త త్రాస్కన్దితకం కోపా దివసర్వపదై ర్ముహు ఉత్ప్లు త్యోత్ప్లుత్య గమన ముపకణ్ఠాపరాభిధమ్ అథ ధౌరితకం ధౌర్యం ధౌరితం ధౌరిణం చ తౌ తచ్చ కఙ్క శిఖి క్రోడ నకు లానాం గలై (త్రై) స్సమమ్ రేచితం స్యా ద్భూరవహం త చ్చావక్రగతి ర్ధుతా వల్గితం వల్గనం పద్భి ర్భుదా శ్చేష్టా యమాదయ ప్లుతం తు లఙ్ఘనం పక్షిమృగధర్మేణ భిద్యతే (అని) వీని గూర్చి కొంచెము భేదముతో మఱికొన్ని నిఘంటువులు ఇట్లను చున్నవి ఉత్తేరిత ముపకణ్ఠ మాస్కన్దితక మి త్యుఽ ఉత్ప్లు త్యోత్ప్లుత్య గమనం కోపా దే వాఖిలై పదై (హైమనామమాల) తత్ర ధౌరితకం చ తత్ బభ్రు కఙ్క శిఖి క్రోడగతివత్ (హైమనామమాల) ఉత్తేజితం రెచితం స్యా న్మధ్యవేగేన యా గతి (హైమనామమాల) వల్గితం పున అగ్రకాయసముల్లాసా త్కుఞ్చితాస్యం నత త్రికమ్ (నామ

మాల) ప్లుతం తు లఙ్ఘనం పక్షిమృగగత్యనుహారకమ్ (హైమము) (అని) (మా సుధ)

[ధారాగమనములను గూర్చి (వేంక) ఇట్లను చున్నది జోదనన (య)డ్డవేదెము రవనడ చుట్టుపేరెము పరువు లనగ బంచధారలపేర్లగు (తిర్య-93) ఈ పంచధారలను వర్ణించుచు(నారం) పద్య మిట్లున్నది- ఉక్కడ మైనమంచితను వొప్పెడు నాహయరత్న మెక్కినన్ గక్కస మేమి లేక రవగాలును జోదన యడ్డవేదెమున్ లుక్కుదువాళి జిల్గనడక ల్గనిపించుచు బోయి పోయి రా జక్కడ వన్నె సోక నటు హా యనినన్ గదలెన్ జరీలునన్ (87) (వేం) వరుస పాటింపక మొత్తము పంచధారలను పేర్కొనినది అం భా క్రమము పాటించి- ఆస్కందితం రెచితకం అనుపద్ధతిని వానిని వచించినది కనుకనే అం భా లోని వేదెము (రెచితము- మూడవ గమనవిశేషము) అడ్డవేదెము అని రెండవదిగా వచింపబడినది (వేంక లో) ఇట్లే తక్కినవియు విపర్యస్తము లైన విందు క్రమము (వేంక లో) అవివక్షితము వేంక లోని చుట్టుపేరెము నే చుట్టుపర్వు చుట్టువెడెము అనురీతిని నిఘంటువులు గ్రహించినవి (సారం పద్యము- అం భా ను అనుసరించి పంచధారలను వరుసగా వర్ణించినది ఈపద్యము (బ్రౌ లో ఇట్లున్నది- ఉక్కళ మైనమంచితను వొప్పెడు నాహయ మెక్కి వాగలో కక్కస మేమి లేక రవగాలును జోడనయడ్డ (డ్డ) వేదమున్ లుక్కుదువాళి జంగనడలుం గనుపించ (చు)క పోయిపోయి (చూ బ్రౌ రవగాలు) (ఇచ్చట (శ ర) పాఠ మిట్లున్నది రవగాలును జోదన యడ్డవేదెముల్ దొక్కుదువాళి జిల్గునడలుం గనుపించుచు (అని) జిల్గునడ లను నీపాఠమే సముచిత మనిపించు చున్నది పంచధారలే యిట వర్ణింప బడు చున్నవి వేదెము నకే అడ్డవేదెము పర్యాయము ఉలుక్కు జంగనడ సంబంధము లేని విట లుక్కు (వల్గితమును వచించు) దూకుడు నకు పర్యాయ మన దగినది అడ్డవేదెముల్ అను ఏకవచనపాఠమే క్రమభంగము లేనిది అడ్డవేదెముల్ దొక్కుడు అనుశర పా యతికై పరిష్కృత మైనదనిపించును (సారం జి కా వ్యా) ఇట ప్రమాదభూయిష్ఠము

సీ అశ్వతనుత్రాణ మడరు బక్కెర యన
    బల్యాణ మొప్పును బల్ల యనగ

జానంబు మె త్తన జీనంబు దనరును
 గ్రాలు ఖలీనంబు కళ్లె మనఁగ
వాగె యం చన గను వల్గాఖ్య మెఱయును
మొగము ట్టన గ నశ్వముఖవిభూష
దనరు దలాట మం చనఁగ నశ్వశిరోవి
భూషణసంజ్ఞ యై పొస గు చుండు

గీ దం గన గ నశ్వమధ్యబంధంబు మీఱు
జొ కన గ దఱ టన గఁ గశాఖ్య వెలయు
గొఱప మనఁగ క్షుం ప్రము పర గు గవణ
మన హయాహారభేద మై చను మహేశ 99

పక్కెరం—ఇది అశ్వతనుత్రాణమునకు (గుఱ్ఱముయొక్క కవచమునకు (అంగికి) పేరు

పల్ల— ఇది పల్యాణమునకు (పల్లనకు ) ఎక్కునప్పుడు క్రింద మెత్తగా ఉండుటకై గుఱ్ఱముమీద వేసెడిగంతకు) పేరు

జానము మెత్త—ఇవి జీనమునకు (గుఱ్ఱపుపల్లకు క్రింద వేసెడి గంతకు) పేర్లు

కళ్లెము—ఇది ఖలీనమునకు (కవికకు కళ్లియమునకు కళ్యమునకు గుఱ్ఱము నోటికి తగిలించెడిదానికి) పేరు

వాగె—ఇది వల్గకు (వాగకు గుఱ్ఱపుముఖరజ్జువునకు గుఱ్ఱమునోటికి తగిలించెడిపగ్గమునకు అవక్షేపణికి) పేరు

మొగముట్టు—ఇది అశ్వముఖవిభూషకు (మొగసరికి గుఱ్ఱముమొగమునందు ఉంచుభూషణమునకు) పేరు

తలాటము—ఇది అశ్వశిరోవిభూషణమునకు (తురాయికి పక్షియీ కలతోను రత్నములతోను గూడిన ఒకవిధ మగుశిరోభూషణమునకు) పేరు

తంగు—ఇది అశ్వమధ్యబంధమునకు (టంగునకు టంగువారునకు తంగువారు నకు గుఱ్ఱములమీద గంత జాఱకుండ బిగువుగా నడుమునకు గట్టెడి త్రాడు వోలె నిడుపుగా కోసినతోలుచీలికకు) పేరు

చౌకు తఱటు—ఇవి కశకు (చేర్కోలకు ములుకోలకు చేరుకోలకు చబుకు నకు గుఱ్ఱము చో నగువాని గొట్టెడికొరడాకు) పేర్లు

కొఱపము—ఇది క్షురప్రమునకు (గొఱపమునకు గుఱ్ఱమును తోమెడి ఒకపని ముట్టునకు) పేరు

కవణము—ఇది అశ్వాహారవిశేషమునకు (దాణకు గుఱ్ఱము తిను ఒకదినుసు ఆహారమునకు ఉలవలు చో నగుదానికి) పేరు

మొగముట్టు — మొగమట్ట - ముఖపట్ట- మణులమొగమట్ట పన్ని సాహిణి యొకండు (స్వారో 4 37) అని (బ్రౌ) మొగముట్టు అనియే వారము నే డిట అగపడు చున్నది (చూ మనుచ 4 28) ప్రయోగ మి ట్లున్నది- నిగరంపు బగడంపుజిగి దొట్టుమొగముట్టు (ఉ రా 7) (చూ శ ం నిగరము)

కొఱపము — గొరప మని సంశాది గానే యిట (బ్రౌ పా) (చూ అను) (శ ర) గొరపము గ్రహించి ఇట్లు సంశాది గానె కొన్నిదేశములందు వ్యవహారము అని వ్రాసినది ఇట్లే- కొఱపము కదయ గొఱపము కొఱపము రెండును ప్రయోగములం దు దృష్టములు నిర్ధారకము లేదు (సం క్షురప్ర ప్రా ఖురప్ప)(చూ సూ ని)

[ జీనంబు మె త్తన జేనన (వావి అపపా)]

[ వల్కాఖ్య - వావి అపముద్రి ]

[ నశ్వశిరోధి భూషణసంజ్ఞ (వావి అపపా) దీనినే ప్రమాణీకరించి తలాటము- తల కుచ్చు- అను అర్థము చెప్పు చున్నది (సారం జి కా వ్యా) (చూ సారం 8) శిరోధి శిరస్సు కాదు గదా ఇది యెట్లు సంగతము ]

[ వాయూహారభేదంబు లగు (వావి పా) ]

సీ అంకవన్నె యనంగ నశ్వపార్శ్వాలంబి
 రజ్జుసమాఖ్య యై ప్రబలు చుండు
 బంచకం బన నశ్వపశ్చాత్ప్రదేశ మా
 నశ్వఖాదన సాధకాస్యలంబి
 భస్త్రి బొక్కెన యన బరగు గైజామోర
 యన హయశీర్షకంపనము వెలయు
 బాలాసత్రాళ్ల న బంధరజ్జువు లొప్పు
 వేసడం బన గను వేసట మన

గీ వ్యాసటిక విలసిల్లును నరద మన గ
 దేరు నాఁగను రథసంజ్ఞ మీఱు బండి
 యన గ శకటసమాఖ్య యై యలరు చుండు
 ద్యూతశకటంబు సగ టన దోఁచు నథవ 200

అంకవన్నె—ఇది అశ్వపార్శ్వాలంబిరజ్జువునకు (అంకవన్నియకు అంకెవన్నెకు గుఱ్ఱముమీ దికి ఎక్కుటకు ఆధారము గా ప్రక్కల నుండుత్రాళ్లకు) పేరు

పంచకము—ఇది అశ్వపశ్చాత్ప్రదేశమునకు (గుఱ్ఱముయొక్క వెనుకభాగమునకు) పేరు

బొక్కెన—ఇది అశ్వఖాదనసాధకాస్యలంబిభస్త్రికి (ఉలవలు లో నగుదాణ ఉంచి గుఱ్ఱమునోటికి తగిలించుసంచికి) పేరు

కైజామోర—ఇది హయశీర్షకంపమునకు (కయిజామోరకు గుఱ్ఱము తలయూపునకు గుఱ్ఱము ముందుకు వెనుకకు తల కదలించుటకు) పేరు

పాలాసత్రాళ్లు—ఇది బంధరజ్జువులకు (గుఱ్ఱము లో నగువానిని కట్టెడి త్రాళ్లకు) పేరు

వేసడము వేసటము — ఇవి వ్యాసటికకు (కంచరగాడిదకు అశ్వతరమునకు కంచరము అను- ఒకవిధ మగు బండికి కట్టు-(ఒకవిధ మగు) గాడిదకు) పేర్లు

అరదము తేరు — ఇవి రథమునకు (స్యందనమునకు) యుద్ధార్థ మైన చక్రములం తోడి యానమునకు (గమనసాధనమునకు) పేర్లు

బండి — ఇది శకటమునకు (గుఱ్ఱపుబండి మొద లగుదానికి) పేరు

సగటు — ఇది ద్యూతశకటమునకు(చదరంగమునందలి శకటమునకు (నెకటునకు) పేరు

అంకవన్నె — అంకెవన్నె (రూపాం) (శ ర) అంకెవన్నియ గ్రహించి గుఱ్ఱము నెక్కుట కిరుప్రక్కల నమర్చినయుపమెట్టు అని అర్థ మిచ్చినది అంకవన్నె (రూపాం) అనినది అనవలసి యున్న ఇది రెండవ యర్థ మన వలయును అంకవన్నె అన గా అశ్వపార్శ్వాలంబిరజ్జువు (ఆం భా) కాలు పెట్టి గుఱ్ఱముమీ దికి ఎక్కు అంకెము (ఆము 2 33) ఇల బొదద్వయి రాయ న లొక్కుదవు నెందే బొబ్బ టో నంకవన్నెలు రెండై అని (ప్రౌ) ఇట వేద వ్యా ఇట్లున్నది-ఒంకెవన్నెలు రెండు ఐ-( అంకెవన్నె యన గా రౌతు కా లుంచి యెక్కుటకు గాను గుఱ్ఱమునకు పార్శ్వమున ప్రేల గట్టెడిఇనుపవలయముతోడివారు) వీరు తాత్పర్యమున దీనిని ఇట్లు వివరించు చున్నారు- అత్యున్నతాశ్వములకు నిచ్చెనవలె ఎక్కుటకై ప్రక్కకు రెండేసి అంకెవన్నెలు వేయుటయు ప్రసిద్ధము (అని) సూ ని ఇట్లను చున్నది (క అంగవడి అంకోణీత అంగవడి అంగపడి) రికాబు గుఱ్ఱము నెక్కుటకు ప్రక్క నమర్చిన మెట్టు అని ప్రయోగము లిచ్చినది- (అశ్వపార్శ్వావలంబిరజ్జువు అని ఆం భా అనినది ఇక ఇచ్చినప్రయోగము లివి- అరు దారి మగరాల యంకవన్నియలు రత్నవిచిత్ర మగు ఖలీనంబు మెఱయ (ఇందు 2 64) హయము డిగ్గె బ్రద్యుమ్నుం డంకవన్నె యొకటి సాహిణీ యవ్వల నూ ది పట్ట (ప్రభా 2 38) ఈ ప్రయోగములందు ఆం భా అర్థము సముచితము గా సరిపడ దనియే అనిపించు చున్నది (చూ వేదమువారు చూపిన పై తాత్పర్యవివరణము)

కైజామోర — గుఱ్ఱపుముఖచేష్ట (దీపిక) హయశీర్షకంపనము (ఆముక్తమాల్యద2 3) ఆ జానేయంబులు ఫేనహాస మిడి కైజామోర లల్లార్చుచున్ - అనినది (ప్రౌ)

(చూ అను) [ఇట-కైజా ర్చుచున్ అని (వేదమువారిపా) కళ్లెము పై కెత్తి బిగ గట్టినముఖముఱ-అని దీనికి (వేద వ్యాఖ్య) (ఇందు పద్యసంఖ్య 26 – ఉన్నది) (అం భా) చెప్పినయర్థము దీనికి సంబంధించినది కాదు అర్థాంతరము(చూ సూ ని)

పాలాసత్రాళ్లు —(శ ర) గుఱ్ఱముకాళ్ల గట్టుత్రాళ్లు అని అర్థ మిచ్చినది ప్రకరణవివక్ష తో అం భా ను ఉదాహరించి బంధరజ్జువు అని సర్వసాధారణముగానే అర్థ మిచ్చినది (బ్రౌ) (చూ అను) ఇట్టిసందర్భములలో ప్రకరణము వివక్షించుట ఒకప్పుడు వివక్షింపక పోవుట గూడ నిఘంటు వ్యాఖ్యా కర్తల సంప్రదాయమునకు విరుద్ధము గాదు ప్రయోగము లేమనునో లవి గానరా లేదు (అం భా) ఇట- అశ్వబంధరజ్జు వనుట లేదు

వ్యాసటి —దీనికి (వికృ వేసటము వెసడము (రూపాం) అన దగినది [వేసడం బన గను వేసర మన - (వావి పా) (అపపా) బ్రౌ వేసటము గ్రహించి- వ్యాసటిక దేగయు చెలంగు వేసట మన లని అం భా ఉదాహరించినది పద్యసంఖ్య 73 గా ఉదాహరించినది ఇట (ముద్రి పారము) వేసడము గా ఉన్నది (చూ అం భా 3 48) [వేసర శబ్దము- (ప్రకృ) వేసడము- (వికృ) అను చున్నది (శ ర) అశ్వతర స్యా ద్వేసరో వేటసర అని (వైజ (భూ క్షత్రి)]

రథము — యానే చక్రిణి యుద్ధార్థే శతాఙ్గ స్స్యన్దనో రథ అని (అమ) తక్కినవా నియందు వీనిప్రయోగము లాక్షణి ము (అమ) అసౌ పుష్పరథ శ్చక్రయానం న సమరాయ యత్ అని యుద్ధమునకు గానిదానికి వెఱనామ మిచ్చినది అట్టిది యిట జంగలేదు లాక్షణి ము గా ఇది సంగృహీత మైన దనిపించును

సీ కంబళివాహ్యకాఖ్య లగు గొల్లార్బండి
పాటబండి వోాయలబండి యనగ
నలరు దృణాద్యానయనసాధనవిశేష
సంజ్ఞ యీాడిక యన సరవడి యన
గట్ల యం చన గను గట్లమంచ మనంగ
యాప్యయానాభిధ యలరు చుండు

నుయ్యాల యనగను నుయ్యెల యన దొట్ల
యన లాలి యన డోల దనఁ జుండు

గీ. బరగు బల్యంకికకు బేరు పల్లకి యన
జెందు నాందోళికకు సంజ్ఞ యందల మన
గొఱలు దదుభయదండంబు కొమ్మనంగ
భూరిభవభంగ శ్రీమాతృభూతలింగ 20

కొల్లార్బండి వాటబండి హాయలుబండి—ఇవి కంబళివాహ్యశకటమునకు (కొల్లారుబండికి కొలారుబండికి ఎద్దులబండికి) పేర్లు

ఈడిక సరవడి—ఇవి తృణాద్యానయనసాధనవిశేషమునకు (గడ్డి లో నగువానిని తీసికొని వచ్చు ఒకవిధ మగుబండికి (పంముపంటిదానికి) పేర్లు

కట్ల కట్లమంచము—ఇవి యాప్యయానమునకు (శిబికకు మంచపుడోలికి) పేర్లు

ఉయ్యాల ఉయ్యెల తొట్ల లాలి—ఇవి డోలకు (ఊయెలకు ఉయాలకు ఉయేలకు ఉయ్యలకు ఊయేలకు ఉయ్యేలకు బిడ్డలను పండుకొనజేసి ఊచెడితొట్టికి) పేర్లు

పల్లకి—ఇది పల్యంకికకు (పాలకికి మనుష్యులు మోసెడి ఒకవిధ మగు వాహనము నకు (గమనసాధనమునకు) పేరు

అందలము—ఇది ఆందోళికకు (ప్రక్కలయందు కప్పు లేక (కురిచీ యట్లు) ఉండు ఒకవిధ మగువాహనమునకు) పేరు

కొమ్ము—ఇది పల్యంకికాందోళికలదండమునకు (పల్లకికి అందలమునకు ముందు వెనుకల ఉండెడిదండెకు) పేరు

కొల్లార్బండి — కంబళివాహ్య కాఖ్య లగు గొల్లాబండి లని (బ్రౌ పా) కంబళివాహ్య

కాఖ్య లగు గొల్లార్బండి ఉనియే (ఆం భా పా ) అని కంబళముచే గప్పబడిన బండి అని అర్థ మిచ్చి ఈ (ఆం భా )ను ప్రమాణీకరించినది (సూ ని ) (చూ కొల్లార్బండి) ఇది ప్రమాదము రథవిశేషాదు లర్థమన వలనన్ప్రయోగాదు లేవైన నున్న అవి లాక్షణికము లగునర్థాంతరము లన వలసినవి [(రూపాం )- కొలారుబండి కొల్లారుబండి ]

పాటబండి — తాను ప్రియసతియును మేటిగుజ్జుల గట్టినపాటబండి యెక్కి శీఘ్రుంబ మందకు నేగె నెలమి అని (హరి పూ 6 4 ) ( గుజ్జు కోడెదూడ - (చూ సూ ని )

హోయలుబండి — శతాంగము గంత్రి అనగా ఎద్దులు ఈడ్చెబండి ఉని (బ్రౌ ) (చూ అను )

సరవడి — యాప్యయానము (ఆం భా ) డోలి పల్లకి-అను చున్నది (బ్రౌ ) (చూ అను )

కట్ల —(శ ర బ్రౌ ) కట్లి అను చున్నవి

యాప్యయానము — శిబికో యాప్యయానం స్యాత్ (అమ ) యాప్యే రథమై ర్వాహ్యం యానమ్ ద్వే పాలకీ ఇతి ఖ్యాతస్య ఉని (సుధ )

తొట్ల —తొట్టె తొట్టెల- (రూపాం )

పల్లకి —ఇది పల్లః అని హ్రస్వాంతము గాను పల్లకీ అని దీర్ఘాంతము గాను గలదు- పల్లకి పల్లకీ పాలకి పాల్కి- నా బల్యంకికాఖ్యలు పర గు అని (నాంబ సా 64 ) పల్లకులన్ మహోత్కృష్టముల భద్రగజంబుల నందలంబులన్ (జైమి 2 ) పల్లకీలు నం దలములు వారువంబులును దంతులు నాది గ గల్గువాహనం బులు డిగి వచ్చి కలా 2 7 ) తద్భవ స్యాఽపి శబ్దస్య దీర్ఘాన్తత్వం క్వచి ద్భవే త్తని అథర్వ ణు డు పల్లకీ శబ్దము సంస్కృతమునను గలదు అద్యాయా మపి ప్రయుజ్యతే పల్లకీశబ్ద ప్రోల్లసత్పల్లకీశబ్దై అని అహోబలపతి (చూ న చ దేశ్యపదే (ఆం చి సూ వ్యాఖ్య )

అందలము —పార్శ్వముల మఱుగు లేనిపల్లకి అందోళము-ఉని (శ ర )

[ కమ్మి — మృశవాహ్యకాఖ్య అని (వావి అపముద్రి) ( గొల్లాబండి - (అం భా) కంబలివాహ్యము అనగా ఎడ్ల బండి-అని (ట్రౌ) (మా అను) గస్త్రీ కమ్మలి వాహ్యకమ్ అని (అమ) కమ్మల రాస్నా ఉస్యా ఉస్త్ర ఇని (౦ 2 5) కమ్మలిభి ఎృష్టె ఉహ్యతే-ణ్యత్ (3- - 24) న్వార్థే కన్ (జ్ఞాప ౦ 4 5)--ని (సుధ) సూ ని గస్త్రీ సం వి ఈ త్రు కంబలావృతరథము (వై ని అను చున్నది పై ని గస్త్రీ త్రు కూబరం న త్రు రథే కమ్మలివాహ్యకే ఇని ఆపైని వృతే రథే పాణ్డుభి స్స్యా త్పామ్మలై పాణ్డుకమ్మలీ ఏవం కామ్మలవా స్త్రాద్యా కమ్మలాదిభి రావృతే అని యను చున్నది (అమ) గూడ- పాణ్డు మ్మలసంవీత స్స్యన్దన పాణ్డుకమ్మలీ రథే కామ్మలవస్త్రాద్యా కమ్మలాదిభి రావృతే ఇనినది ఇట్లను చున్నందున (సూ ని) ఇచ్చిన యర్థముగాక వైజకు అమరము చెప్పిన- అర్థమే అర్థమనవలసి యున్నది సాంబ స్పష్టముగా ఇట్లను చున్నది- ఆరద మన దేరన గ రథం బమరు హొయలు బండి కొల్లారుబండి నా బర గు గోశ తాంగనామముల్ (మాన 45)

సీ అను సన దొడు పన నాందోళికాదిదం
        డాగ్రసంధేయాఖ్య యలరు చుండు
  బన్నాగ మన గను భాసిలు చుంతును
        నాందోళికాద్యవయవసమాఖ్య
  బండిక ల్లన గను బం గును జక్రంబు
        బండిక న్నన గను బర గు నాభి
  బండికన్నులయందు బట్టించుచమురు కం
        దెన యన గను గడిదేరు చుండు

గీ నేమి దనరారు చుండును నెమ్మ నెమ్మి
  కమ్మి యన గను దగు గూబరమ్ము పరము
  నా గ నక్షభిధ యిరుసు నా గ వెలయు
  భూరిభవభంగ శ్రీమాతృభూతలింగ 202

అనుసు తొడుపు—ఇవి ఆందోళికాదిదండాగ్రసంధేయమునకు (అందలము పల్లకి లో నగువానిదండె (బొంగు) కొన వేసెడిలోహపు గట్టునకు పొన్నునకు ఇనుము లో నగువానికడియమునకు) పేర్లు

పన్నాగము—ఇది ఆందోళికాద్యవయవమునకు (అందలము లో నగువానిచట్టమునకు) పేరు

బండికల్లు—ఇది చక్రిమునకు (రథాంగమునకు కల్లునకు బండిచక్రిమునకు) పేరు

బండికన్ను—ఇది నాభికి (పిండికకు రథచక్రనాభికి బండిచక్రముయొక్క నడిమితూమునకు) పేరు

కందెన—ఇది బండికన్నులయందు పట్టించు చమురునకు (కందియనకు) పేరు

నెమ్మ నెమ్మి కమ్మి—ఇవి నేమికి (చక్రధారకు చక్రముచుట్టు వేసినయినుపకట్టునకు బండిచక్రముయొక్క చుట్టంచునకు) పేర్లు

పరము—ఇది కూబరమునకు (యుగంధరమునకు కాడిమానిని బండి లో నగువాని మొదట ఉండెడినిడుపాటిమానికి కట్టెడిప్రదేశమునకు) పేరు

ఇరుసు—ఇది అక్షమునకు (చక్రిధారణమునకు చక్రిము తగిలించు ఇనుపకమ్మికి) పేరు

అనుసు — అనుసు తొడుప అనగా ఆందోళికాదిదండాగ్రసంధేయము దీనిని అండా అనికూడ అంటారు అని (బ్రౌ) (చూ అను)

పన్నాగము — అందలముమీదికప్పు - అని (శ ర) ఇది రెండవయర్థము మన దగినది

కందెన — ఇరుసున గందెన బెట్టక పరమేశ్వరుబండి యైన బారదు సుమతీ (సు శ 30) బండి యిరుసునకు బూసెడిమసి అని (సూ ని శ ర లు) కందియన (రూపాం) కందియనలు వూస గుజ్జంబులు పూన్చి మీద నాయుధంబులు నించి (కు సం 2 784) (మా సూ ని)

కూబరము — కూబర స్తు యుగంధర అని (అమ) ఇట కూబర శబ్దమునకు నొగ అనెడి అర్థము నే చాలనిఘంటువు లిచ్చినవి (చూ గుర-మొ) ఆం భా నొగను వేఱు గా చెప్పు చున్నది (2 203) (సుధ) మాత్ర మిట (కూబరయుగంధరశబ్దములను) ద్వే యుగ కాష్ఠబన్ధనస్థానస్య అని వ్యాఖ్యానించినది తదనుగుణ మగు-ర్థమే ఇట యుక్త మనిపించినది కూబరయుగంధరశబ్దములు నొగకట్టు తత్ప్రదేశము అను రెం డర్థములు గలవి గా తో చును నొగ కా డిమ్రా కన దగు గూబరము ఉని (సాంబ మాన 46)

అక్షము — స్యా దక్ష శ్చక్రధారణమ్ అని (వైజ భూ క్షత్రి-) చక్రధారణము అను దానికి (సూని) చక్రనాభి బండికంటినడిమితూము బండికుంచము అర్థ మను చున్నది వైజ లోని చక్రధారణ పదమునకు ఇరుసు అర్థ మనవలసి యున్నది అక్షకీలే త్వణి అని (వైజ భూ క్షత్రి)

సీ చీల జంజడ యాణి చిలుక యం చన గ సం
ధానితకీలాఖ్య దనరు చుండు
నొగ యన గా నెంచ దగు యుగంధరసంజ్ఞ
యుగసంజ్ఞ కా డి నా నొప్పు చుండు
యెకిరింత యన గను నెక్కు డనంగను
వాహనసంజ్ఞ యై వఱలు చుండు
మావటీ డన గను మావంతు డన గను
నాధోరణునిసంజ్ఞ యలరు చుండు

గీ రవుతు రౌతు రావు తనంగ రాహుతు డగు
బరిగిరౌ తన బల్యాణబంధరహిత
హయసమారోహకాఖ్య యై యలరు చుండు
భూషితభుజంగ శ్రీమాతృభూతలింగ 203

చీల జంజడ ఆణి చిలుక—ఇవి సంధానితకీలకు (అణికి ఇరుసుతుది చీలకు ఇరుసుచివరం చక్రములు జాఱ కుండుటకై ఉంచెడిసీలకు) పేర్లు

నొగ— ఇది యుగంధరమునకు (నొగకఱ్ఱకు కాడిమాకునకు కాఁడికి ఆధారమై బండి తోలు నగువాని మొదట ఉంచెడినిడుపాటికఱ్ఱకు) పేరు

కాడి— ఇది యుగమునకు (ఎడ్లు తోలు నగువానిమెడపై ఉంచెడి కఱ్ఱకు) పేరు

ఎకిరింత ఎక్కుడు— ఇవి వాహనమునకు (ఎక్కిరింతకు యుగ్యమునకు ఎక్క నైనఎను గు తోలు నగువాని కన్నింటికి) పేర్లు

మావటీడు మావంతుడు— ఇవి అధోరణునకు (హస్తిపకునకు మావతునకు బరికానికి మావటికి మావటీనికి ఏనుఁగును నడపువానికి) పేర్లు

రవుతు రౌతు రావుతు— ఇవి రాహుతునకు (రాహుత్తునకు సాదికి అశ్వారోహకునకు గుఱ్ఱపురౌతునకు) పేర్లు

బరిగిరౌతు— ఇది పల్యాణబంధరహితహయసమారోహకునకు (జీను వేయనిగుఱ్ఱమును ఎక్కెడిరౌతునకు) పేరు

జంజడ — జంజడి-అని (బ్రౌ పా) (చూ అను)

ఆణి —(ఉణి సం) అక్షాగ్రకీలకే తు ద్వయో రణి అని (అమ) ఆణి - సంస్కృతము చున్నది (సూ ని) ఉణి యే ప్రజ్ఞాద్యణ్ణంతము ఆణి కావచ్చును (సూ ని) తెను గుగా దీనిని గ్రహింపవే గ్రహింపక సంస్కృత మగు ఆణి కి ఇరుసు తుదిచీల అని అర్థ మిచ్చినది (ఆం-భా పా) ఆణి తో ఇచ్చినది) (చూ జంజడ చిలుక) (ఇట్టివి కొన్ని అచ్చటచ్చట తెలుగులు గా ఆం భా లోను ఆం సం మొలోను కానవచ్చు చున్న వని పూర్వ ముక్తము)

కాడి — శమ్యా స్త్రీ యుగకీలకమ్ అని కాడిచీలనుగూడ వేఱుగా (అమ) వచించినది

బరిగిరౌతు — పరిగిరౌతు అని గ్రహించి పల్యాణరహితహయసమారోహకుడు ఆం భా బండిగుఱ్ఱము నెక్కెడువాడు- అనినది (బ్రౌ) (చూ -ను) బరిగిరౌతు పల్లము వేయనిగుఱ్ఱముమీద నెక్కెడిసాదిః అని (శర)

[సంధానితకిలాఖ్య — చన గను దైనితకాభిధ గాను దారు (వావి పా) (అపపా)

సీ. గుల్లా మన గుఱాలగో చన గా గుల
ప యనంగ దగు నశ్వపాలకుండు
పారివా డన గను బరిచరుం డొప్పును
బేరణ మన గను బేరణి యన
మైమఱు వన గను మేమఱు గనఁ గత్త
ళ మ్మన గా బొందళ మ్మనంగ
జో డన గవచంబు శోభిల్లు జిలుకత్తు
జీరా యన గ దద్విశేషము లగు

గీ. జను శిరస్త్రంబు గొగ్గి సీసకము బొమిడి
కం బనం ను బేటి నా గను దనర్చు
సారసనసంజ్ఞ సాచిభుజావలంబి
కృత్తి పక్షదల డా బన గేరు నభవ 204

గుల్లాము గుఱాలగోచ గులప—ఇవి అశ్వపాలకునకు (గుఱ్ఱములను గాపాడువానికి) పేర్లు

పారివాడు— ఇది పరిచరునకు (పారికాపునకు పరిధిస్థునకు సేనయందు రాజాజ్ఞ నెఱవేర్చుచుండువానికి) పేరు

పేరణము పేరణి మైమఱువు మేమఱువు మేమఱుగు కత్తళము బొందళము జోడు—ఇవి కవచమునకు (వర్మమునకు తనుత్రాణమునకు కంకటమునకు యుద్ధాదులందు తొడుగుకొను ఇనుపచొక్కాయకు) పేర్లు

చిలుకత్తు జీరా—ఇవి కవచవిశేషములకు (చిలుకొత్తునకు జిరాకునకు కవచభేదములకు) పేర్లు

గొగ్గి సీసకము బొమిడికము—ఇవి శిరస్త్రమునకు (శిరస్త్రాణమునకు బొమిడీకమునకు బొమిడికకు ఇనుపటోపికి) పేర్లు

పేటి—ఇది సారసనమునకు(కవచము దృఢము గా ఉండుటకై యోధులు ధరించు నడికట్టునకు, ( పటకా మొద లగుదానికి) పేరు

పడుదల, డాబ—ఇవి సాచిభుజావలంబికృత్తికి (యోధులు జందెమువలె వేసి కొనెడి తోలుపట్టెకు) పేర్లు

గుజాలగోచ —(సూ ని ) ఈపదముకడ ఈ (ఆం బా )ను ఇచ్చి ఇట్లు వ్రాసినది- గోచి గోచు-ఉనియు ఛేదింప వచ్చును గుజాలగో వనంగా' (వ్రాఁత ప్రతిపా ) ఇం కను విచార్యము (అని ) (శ ర బ్రౌ ) ఈపదమును గ్రహింప లేదు

పరిచరు డు — పరిధిస్థః పరిచరః అని (అమ ) ఇట సేనాయాం రాజ్ఞో దణకారిణః' అని నది (సుధ ) సేనచుట్టుగాచువాఁడు' -అనినది (గురు )

జీరా —(సూ ని ) జిరా జీరా ఏనుఁగులకు గుఱ్ఱములకు పైని వేసెడి వస్త్రకవచము-అని దీని స్వరూపమును వివరించినది (రా వి 5 9 ) ప్రయోగముతో (చూ జిరా ) చిలు కత్తు'-కవచవిశేషము (పొట్టికవచము) చిలుకొత్తు'-కవచము-అని (బ్రౌ ) రెండును పర్యాయము లని (సూ ని )

గొగ్గి సీసకము — గొగ్గిసీసకము' అని ఏకపదముఁ గానే దీనిని గ్రహించి శిరస్త్రము' అను-అర్థ మిచ్చినది (బ్రౌ.) సీ సక మెడలించి నెత్తిఁ బెుచన్ గద వ్రేయుచు దాఁటె' (రా యు కాం 2 ) (చూ శ ర ) సీసకమునకు కిరీటము' అర్థ మనిన దిది

సారసనము —'సారశన' అని (బ్రౌ ) దీనికి యుద్ధమునందు నడుమునకు కట్టి యుండే పట్టుతాడు-మొద లగునది-అని అర్థము చెప్పినది (చూ అను ) నడికట్టు' అని మాత్రము (సూ ని శ ర లు ) సారసనం మధ్యే ధార్యం సకఙ్కటైః' లని (వై జ భూ క్షత్రి )- (సకఙ్కటైః-కవచధారులచేత యోధులచేత-అనుట) య త్తు మధ్యే సకఞ్చు కాః బధ్నన్తి త త్సారసన మధికాఙ్గః' అని (అమ )- కఞ్చుకదార్ఢ్యార్థం మధ్యకాయే నిబద్ధస్య' అని సారం బలమ్ అస్యతే దీప్యతే ఽనేన అస-గతిదీ ప్త్యాదానేషు' కరణా (3 3 1 7 ) ఇతి ల్యుట్ శకన్ధ్వాదిః' అనినది (సుధ )

పడుదల — జిగిపట్టుపడిగట్టుపడుదల పట్టంబు నేజాయు బాగుదేర (దశా 0 1 3 ) (చూ సూ ని )

సీ సన్నాహమంబు సమకట్టినది యాయి
తము సజ్జ, కట్టాయిత మన వెలయు
విలుకాఁ డనంగను వింటివాఁ డనఁగను
ధన్విసమాఖ్య లై తనరు చుండు,
నారీతి నాయుధాహ్వయములఁ బరికించి
తజ్జీవిసంజ్ఞలఁ దలఁప వలయు
మాసటీఁ, డనఁగను మాస్టీఁ డనంగను
సాదనకాఁ, డన శస్త్రదక్షుఁ

గీ డలరుఁ దద్విద్య సాదన యనఁగ నెగడు
నఱుకు పరువడి గాయమానంబు విసరు
మొన లనంగను దద్భేదములు చెలంగు
నొక టొకటి పెక్కువితము లై యొప్పు నభవ 205

సమకట్టినది, ఆయితము సజ్జ కట్టాయితము—ఇవి సన్నాహమునకు (సంసిద్ధ ముపకు, సంనద్ధమునకు ఆయత్తమునకు ప్రయత్నము చేసి అంతయు సిద్ధపఱ చినదానికి) పేర్లు

విలుకాఁడు వింటివాఁడు—ఇవి ధన్వికి (ధానుష్కునకు, ధనుర్ధరునకు విల్లు పట్టి నవానికి) పేర్లు.

[ ఆరీతి దలఁప వలయు విలుకాఁడు వింటివాఁడు- అనువిధము గా-ఆయా ఆయుధము ల పేళ్లకు కా (ఁడు) వాఁడు చేర్చిన-ఆయా ఆయుధజీవులు అర్థ మగుదురు-(అని) అనుకొనవలయును.]

మాసటీఁడు మాస్టీఁడు సాదనకాఁడు—ఇవి శస్త్రదక్షునకు (ఆయుధవిద్యయందు ఆఱితేఱినవానికి తత్ప్రయోగమున నేర్పరి అగువానికి) పేర్లు

సాదన—ఇది శస్త్రవిద్యకు (ఆయుధవిద్యకు) పేరు

నఱుకు పరువడి గాయమానము విసరు మొన—ఇవి శస్త్రవిద్యాభేదములకు (ఆయుధవిద్యలోని విశేషములకు) పేర్లు

[ ఒక టొకటి యొప్పు ఈశస్త్రవిద్యలయందు ఒక్కొక్కవిద్య అనేకభేద ములు కలది యై ఉండును ]

సన్నాహము — ప్రయత్నము' అను- అర్థమైన ఇది ప్రసిద్ధ మైనను అర్శఆద్యజన్త' మయియో అధికరణార్థకఘఞన్త మయియో ఆయత్తము' అను అర్థము ను గూడ ఇది చెప్పఁగల్గును

ఆయితము —(సం ఆయత్తము) ఆయిత్తము' (రూపాం ) ఆయిత్తపడు ఆయిత్తపాటు- మొ ) మీరాయిత్తపడి వెనకారం డనుడు' (సారం 1 77 )

సజ్జ — విణ ఆయితము ఈనెలఁతఁ గన్న మన్మథుఁ డైన జిగురుగొడుగు పువ్వటమ్ముల పొదులు లోను గ సజ్జలు సేయఁగ దా నియమింపండె విరహతాపముపేర్మి' (భార విరా.2ఆ )' అను చున్నది (శ ర ) ఇచ్చట సజ్జలు-(శయ్యలు) చేయ' అని యే అర్థ మనుట స్పష్టము ఆయితము' అను-అర్థము గల సజ్జ' కిది (ఉదా ) కాదు ఇట్టివి అక్కడక్కడ శ ర లో కాన్పించు చున్నవి. ఇందులకు వేఱు (ఉదా.) అన్వేష ణీయము

తద్భేదములు — ఈ శస్త్రవిద్యాభేదములు ఇట్లు వచింప బడినవి (నఱుకు-) గజ్జదుముకు నఱుకు లనునఱుకులను' ఉని (మల్లి పు 3 69 ) (పరువడి- చిట్టడుగు కత్తెరపావు పావులు జొగినపావు మొదలు గాఁ గలపదిరెండుపరువళ్లయగణ్యప్రావీణ్యం బెఱిం గి (ప్రబం 78 ) మల్లుఁడు వేసెడుఅడుగుల భేదము ' అని (సూ ని ) (గాయమా నము) లోబిత్తరియు వెలిబిత్తరియు సర్పాంకుశంబును మొదలు గాఁ గల పదిరెండు గాయమానంబులును' అని (ప్రబం 78 ). (విసరు) ఝూటు మొద లగు పదినాలుగు విస రులు' (ప్రబం 78 ) (మొన)- అరిమీటుమొన నెరమీటుమొన తాలంపుమొన లాది గాఁ గల పదిరెండుమొనలు' (ప్రబం 78 ) (చూ సూ.ని ) ఈమొనలఁగూర్చి హం సవింశతి ఇ ట్లను చున్నది- లోమొన వెలిమొన ఉసిమొన ముమ్మొన చతురమొన పుణ్యపుమొన పాపపుమొన దాఁటడుగుమొన కదలుమొన అరవీటుమొన సరితొళంపుమొన లాదిగాఁ గల పదిరెండుమొన లవారి తెలిసిరి' (1 2 45) అని (బ్రౌ )

[సాదనకా దన — సాదకాఁ దన గ అసి (వావిపా) (అపహా)]

సీ॥ సాధనాయుధములు సానకత్తి యనంగ
బొందకోల యనంగఁ బొలుపుఁ గాంచు,
మాసటిపోట్లాటమట్టుకుఁ దగు కత్తి
చేకత్తి, యనఁగను జెలఁగు చుండు
జింకకొమ్ములు రెండు చేర్చి యల్లు లమర్చి
డాఁకేలఁ బూని యొడ్డఁగను బొడువ
సంగతి గలయది సింగోట యనఁగను
దివిదారికొమ్మ నాఁ దేజరిల్లు

గీ॥ నొంటిపోట్లాటఁ గోరుచు నున్నయట్టి
మాసటీలకుఁ గైదువు లమ్మట్టుఁ జూచి
యేరుపఱచుట వెలయుఁ గొలారిక మనఁ,
దద్రణావని పడవ నాఁ దగును నభవ 206

సానకత్తి బొందకోల—ఇవి సాధనాయుధములకుశస్త్ర (ఆయుధ) విద్యాదక్షుల శస్త్రవిద్యాభ్యాసమున కగు ఆయుధము'లకు) పేర్లు

చేకత్తి—ఇది శస్త్రవిద్యాదక్షుల పోట్లాటకు మాత్రము ఉపయోగపడుకత్తికి పేరు

సింగోట దివిదారికొమ్మ—ఇవి ఇఱ్ఱికొమ్ములు రెండు జతచేసి అంటుచీలలు వేసిన సాధనవిశేషమునకు (ఎడమచేతఁ బట్టిఒడ్డుటకు పొడుచుటకు ఉపయోగింప వీలైనదానికి) పేర్లు

కొలారికము —ఇది దంద్వయుద్ధము చేయ నున్న- ఆయుధవిద్యావంతులకు కొలత చూచి కైదువులు(ఆయుధములు) ఏర్పఱచుటకు) పేరు

పడవ —ఇది తద్రవణానికి (ఆశస్త్రవిద్యాదక్షులు పోరాడెడి యుద్ధభూమికి) పేరు

సానకత్తి —(సాదన+కత్తి) సాధన చేయు కత్తి (చూ శర)

బొందకోల — మల్లసాధనాయుధవిశేషము అని (శ ర)

దివిదారికొమ్ము — రెం డిట్టికొమ్ములను ఇరుప్రక్క మొనలుగా జతపఱచి ఏర్పఱచిన మల్లసాధనవిశేషము' అని (శ ర) దివిదాల్కొమ్ము (రూపాం) (చూ ఆం పద పరి 57)

మాసటీఁడు — మాసటి, మాస్టీఁడు' దీనికి (రూపాం) అనఁ దగినవి శస్త్రదక్షుఁడు' అను నర్థ మిచ్చినవి వీనికి ఆం భా (చూ 2 205). మాసటి మాస్టీఁడు-అనువానికి శూరుఁడు మల్లుఁడు అనురెండర్థములు ప్రయోగదృష్టము లని వానిని ఉదాహరించు చున్నవి (శ ర మొ) మాసటి' ఆధోరణు డు మాస్టీఁడు'- శస్త్రదక్షుఁడు-అని (బ్రౌ) (చూ అను) వీనికి ఈభేద మెట్లు సంగతమో (సూ ని)- మాసటీఁడు' అనుదానికి శూరుఁడు మల్లుఁడు శస్త్రదక్షు డు' వేఱు వే అని మూఁ డర్థములు వేఱుపఱచి ఇచ్చు చున్నది (ఆం భా) మల్లాభిధానముల వేఱు గా వచించినది (చూ 2 207) అసిగదాద్యాయుధ విద్యాదక్షుఁడే ఇట వచింపఁబడు చున్నాఁడు మాసటి మాసటీఁడు' అనువానిచే అందు లకే శస్త్రవిద్యాదక్షుల'-అనురీతిని నావ్యాఖ్యానము సాగినది సాదనకాఁడు' అనుదానికి (కలా) ప్రయోగ మి ట్లున్నది- ఏ నాంధ్రదేశంబుననుండి వచ్చిన యొక్క యత్యం తచాతురీధురంధరుం డైన కటారిసాదనకానివలన ననేకకాలం బభ్యసించి పేరు గల బిరుదుమాస్టీలఁ బెక్కండ్ర జయించి యెక్కడను మోఁకవోని మానుషంబున ననూన గర్వాండ నగు చునికింజేసి నిన్ను నిట్టి పోరునకుం బిలిచితి' (8 08) (దీనికి ముందు కేరలాధీశ్వరుని యుద్ధపుఁబిలుపుమాట లి ట్లున్నవి) ఘన మిద్దఱము నుద్దించుకొని కటారుల నెక్కటికయ్యంబు గావించుచు శౌర్యంబులకొలంది నెఱపుదము' (అని) పిలిచి నది కటారులయెక్కటికయ్యమునకు జరగినదియు నదియే ఇది మల్లయుద్ధము కాదు మల్ల యుద్ధమునకు (నియుద్ధము, బాహుయుద్ధము) అనునవి పర్యాయములు శస్త్రాదులు ముట్టక చేయుద్వంద్వయుద్ధ మిది నియుద్ధ' శబ్దమును (గుసు) ఇట్లు నిర్వచించినది శస్త్రాదిక మనాదేయ మితి నియతం యుద్ధం నియుద్ధమ్ (శస్త్రాదులు పట్టఁ గూడ దనునియ మము గలయుద్ధము)' (అని) భీమజరాసంధుల యుద్ధ మిట్టిది దీనిని నన్నయ మల్ల యుద్ధ మని విస్పష్టము గా చాటి చెప్పు చున్నాఁడు- అధికబాహుబలుల మయిన మాముప్వుర యందు నొక్కరుని మహాబలాఢ్యు గోరికొనుము వాఁడు ఘోరాజిలో

నిన్ను మొనసి మల్లయుద్ధమున జయించు' (భార సభా 1 191)। ఇట్లే మల్లయుద్ధంబు సేయ నిశ్చయించి' మల్లయుద్ధకౌశలం బేర్పడం బెనంగునెడ (99 206) ఇఁక (కలా) ప్రయోగమునందలి సాదనకాఁడు' శస్త్రవిద్యాదక్షుఁడే (గోబలీవర్దన్యాయమున) ఇచ్చటి మాస్టిలును అస్త్రవిద్యాదక్షు లనవలసినవారే (కిలాలోని సాదనకాఁడు' మల్లుఁడు' అను శ ర వ్యాఖ్య ప్రమాద మనఁ దగి యున్నది మాస్టీఁడు' అనుదానికి (రామా 8 91) ప్రయోగము (సూ ని) మల్లుఁడు-
ఊరుఁడు- అనునర్థ మనుటకై ఇచ్చిన ప్రయోగములు చాలవఱకు బాగుగా పరిశీలించుకొనిన (ఆం భా) చెప్పిన యర్థమునకు సరిపడునవియే మల్లయుద్ధమునకు-శస్త్రవిద్య'కు ఐనభేదము సరిగా గుఱుతింపమిని ఈయర్థప్రమాద మేర్పడిన దనిపించుచున్నది ఆం భా కు పై (కలా రామా) ప్రయోగములు లక్ష్యము లయి యుండును ఆం భా కర్త ప్రయోగదృష్టి, అందుల కైన పరిశీలనాదృష్టి- అనన్యసాధారణము లనుటకు ఇట్టివి కొన్ని పూర్వ ముదాహృతములు

పడవ — ఈపదమును ఈయర్థమున నిఘంటువులు గ్రహింప లేదు యుద్ధము అనునదియే దీనికి అర్థ మను చున్నవి (శ ర మొ)

[ ఒడ్డనగ' అని (శ ర ప్రౌ పా) పూని 'ఒడ్డగను అనుసంస్కార ముచితము ఇంకను విచార్యము - అని సూ ని (చూ. దివిదారికొమ్ము) ఇట్లనియు ఒడ్డగ' పదము గ్రహించి సాధనవిశేషము' అనియే అర్థ మనినది దివిదారికొమ్ము' దగ్గఱ సూ ని సూచించినసంస్కారమే యిట నాకును సముచిత మ[illegible]ంచినది (సూ ని) చను సింగోట దివిదార్కొమ్మన శృంగయు గళికి సమాఖ్య[illegible] గా' (ఆం పద పారి 57) ఉదాహరించినది

సీ. మనును జెట్టి, యనంగ మల్లాభిధానంబు
తద్విద్య సా మనఁ దనరు చుండుఁ,
గస్నాతలు పుటము ల్గస్తాలు మండీలు
దాళాలు డింకులు దండెములును
లాఁగు లనంగను రాజిల్లుఁ దద్భేద
నామధేయంబు, లెన్నంగఁ గొన్ని

తత్సాధనంబు లై తగుఁ గంబము కౌణత
కటి కన లోడి సంగడయు, బాల

గీ సంగడయు నీలి గోతా, మనంగఁ గొన్ని
దట్టి, యనఁ గచ్చ మగును, జేతా ళ్లనంగ
మల్లయుద్ధాయుధాఖ్య లై యుల్లసిల్లు
ము ళ్లనఁ దద్గ్రనామము లొప్పల్చు నభవ 207

జెట్టి—ఇది మల్లునికి (సాముచేయువానికి) పేరు

సాము—ఇది మల్లవిద్యకు (ఖురళికి గరిడికి మల్లురు చేయువ్యాయామమునకు) పేరు

కన్నాతలు పుటములు గస్తాలు మండీలు తాళాలు డింకులు దండెములు, లాఁగులు—ఇవి మల్లవిద్యావిశేషములకు (సాముతోనిభేదములకు) పేర్లు

కంబము కౌణత, కటిక రోడి సంగడము బాలసంగడము నీలి గోతాము—ఇవి మల్లవిద్యాసాధనములకు (సాము చేయుటకై త్రిప్పెడు పరికరములకు (పనిముట్లకు) పేర్లు

దట్టి—ఇది కచ్చమునకు (కక్ష్యకు కాసెకోకకు, దట్టీకి డింఢునకు పోరాటమునకై మల్లులు కట్టుకొనెడి నడికట్టునకు) పేరు

చేతళ్లు—ఇది మల్లయుద్ధాయుధములకు (మల్లయుద్ధమున ఉపయోగించెడి ఆయుధము లకు) పేరు

ముళ్లు—ఇది మల్లయుద్ధాయుధాగ్రములకు (చేతాళ్లకొనలకు) పేరు

మల్లయుద్ధము — మల్లః నియోధకః బాహుయోద్ధా'-అని (న త.సి ప ల సం ) నియుద్ధం బాహుయుద్ధం స్యాత్' అని (వై జ భూ క్షత్త్రి.)

గస్తాలు — బసికీలు గస్తాలు పుటంబు లనునట్టి వరుస లలితంబులను' (మల్లపు 3 69 ) (చూ సూ ని )

డింకులు — డింకీలు (ముద్రి పా ) (శ ర ) డింకీలు అవియే అను చున్నది (బ్రౌ డింకి, డింకీ- అని రెండును గ్రహించినది

కౌణత — కౌణిత' (బ్రౌ పా ) (చూ అను )

కటిక — (బ్రౌ ). కటికి'-మల్లయుద్ధ విశేషము-అని ఈ (అం.భా ) నే ఉదాహరించినది (బ్రౌ ) (చూ అను ) ఇట్లు ఉదాహరించియు కటికన -జట్టివాండ్ల ఆయుధవిశేషము (అం భా ) (అని) అనినది (చూ అను ) (బ్రౌ పా ) ఇచ్చట ఎ ట్లుండెనో తెలియదు

సంగడ — జెట్టి సాధనకు ఉపయోగ మైన ఇనుపగుండు' అని (శ ర )

[నీలి —నీల-వాని అపముద్రి ) ]

గోతాము —గోతము (రూపాం ) మల్లులు సాదనకొఱకు ఱాళ్లు నించి యుంచుకొనెడుగోనె'-(శ ర ) (మనుచ 4.8 ) పద్యముకడ వ్యాఖ్య. దీనిని ఇట్లు వివరించినది జెట్టులు సాదన చేయునప్పుడు జనుపనారసంచులలో రాలు పోసి కుట్టి పిడికిళ్లతో పొడుతురు' (అని ) (చూ సూ ని )

[లోడి — లోడు' వాని అపముద్రి ]

సీ బిరుదు వేసినజెట్టిపరివార మగునట్టి
వా రొప్పుదురు హొంతకారు లనఁగ
గుద్దులాటకు జెట్లఁ గూర్చువానికిఁ బేరు
దనువంది యనఁగను దనరు చుండు
నణుకువాఁ డనఁ దగు నన్యజాతీయుండు
కవణకాఁ డన మీఱు గమనవేది
మల్లచఱు, పనంగ మల్లచఱుపు డన
భుజసమాస్ఫాలనం బొప్పు చుండు,

గీ దండ యనఁగను ముష్టియుద్ధాదిమగతి
మించు, నందున మద్దెళసంచు మొదలు
కొన్ని భేదంబులు చెలఁగు నన్ని దెలుప
గ్రంథవిస్తరభయముచేఁ గాలకంఠ 208

హొంతకారులు—ఇది బిరుదు వేసినజెట్టిపరివార మైనవారికి (మల్లవిద్యయందు ఆఱితేఱినగొప్పమల్లునియొక్క బలగమునకు (పరిజనమునకు) పేరు

దసువంది—ఇది గ్రుద్దులాటకు జెట్లను గూర్చువానికి (ఒక రొకరు గ్రుద్దులాడుచు పోరాడుటకై మల్లురను ఒకచో చేర్చువానికి) పేరు

అణుకువాఁడు—ఇది అన్యజాతీయునకు (మల్లజాతివాఁడు కానిపెఱజాతివానికి) పేరు

కవణకాఁడు—ఇది గమనవేదికి (మల్లయుద్ధపునడక తెలిసినవానికి) పేరు.

మల్లచఱుపు మల్లచఱుపుడు—ఇవి భుజసమాస్ఫాలనమునకు (భుజాస్ఫాలనమునకు దండచేతిపై అఱచేతితో కొట్టుటకు) పేర్లు.

దండ— ఇది ముష్టియుద్ధాదిమగతికి (ఒండొరులు పిడికిళ్లతో పొడుచుకొనుచు చేయుయుద్ధమునందలి మొదటిగతికి, మల్లయుద్ధవిశేషమునకు) పేరు

మద్దెళసంచు—ఇది ఒకవిధ మగుదండకు పేరు

[ మొదలు దెలుప -ఇట్టి వింకను కొన్నిగతివిశేషములు కలవు గ్రంథము చాల పెరు గు ననుభయముచే అవి ఇందు తెలుపను ]

హొంతకారులు —హొంతకాఁడు-అను ఏకవచనము తో జెట్టికాఁడు' అనిమాత్రము ని ఘంటువులు ఈపదము ఈ అర్థము న గ్రహింప బడ లేదు వీనిచె

అణుకువాఁడు —ఈపదము గ్రహించి ఈ అర్థము' (సూ ని శ ర బ్రౌ ణు.) ఈయ లేదు

[గమనవేది — గమనబోధి -అని (వావి పా) (ఆపపా)]

సీ. కల్లంబు రాటంబు కత్తి కొక్కెస తొట్టు
రూణింపు బరిపోటు రొండివేటు
వింటాలము పణమ్ము పెట్లాఁగు పాఱమ్ము
డొక్కరం ముత్తరడొక్కరమ్ము
కన్నాత, చాంగణ కందణంబు తిణింగి,
గొంతుమాఱును, జేబ కుమ్మరింపు
కాసెనిల్కడ గళకత్తెర జోడింపు
నరసింగము సరిబిత్తరము కిల్లి

గీ. లాఁగు, సమసీసము తడకా ల్సందుసీస
మంజమెడపట్టు, నాఁగఁ జెన్నలరుచుండు
ముప్పదియు రెండు విన్నాణములకుఁ బేళ్లు,
భూరిభవభంగ శ్రీమాతృభూతలింగ 209

కల్లము రాటము కత్తి కొక్కెస తొట్టు రూణింపు బరిపోటు రొండివేటు వింటాలము, పణమ్ము పెట్లాఁగు పాఱమ్ము, డొక్కరము ఉత్తరడొక్కరము కన్నాత చాంగణ కందణము, తిణింగి గొంతుమాఱు జేబ కుమ్మరింపు కాసెనిల్కడ గళకత్తెర జోడింపు నరసింగము సరిబిత్తరము కిల్లి లాఁగు సమసీసము తడకాలు సందుసీసము అంజమెడపట్టు—ఇవి ముప్పదిరెంకువిన్నాణములకు (జెట్లు పట్టుపట్టులకు) పేర్లు

ఉత్తరిడొక్కరంబు —(సం ఉత్తరదోఃకరము) 'గ్రీవాయా శ్చ భుజాయా శ్చ పాదే నాక్రమణే సతి అన్యజాన్వవబద్ధేన కుర్యా దుత్తరదోఃకరమ్' అని (శివతత్త్వరత్నాకరము) (చూ శ.ర).

[కందణంబు — కన్నాత చాంగణ కిరిదణంబు తిణింగి అని ఒకచో (సూ ని) (చూ తడకాలు)]

[లాఁగు —చాగు-వావి పా (అపపా ) సరిబిత్తరంబును లాఁగును వింటాణంబును
అనువిన్నాణంబులు విశదపఱచి' (మల్లుపు 3 69 ) (చూ ూ ని )

[రౌంజివేటు —రౌండిర్వేటు-(వావి పా పారాం ) శ ౨ రౌండిర్వేటు' గ్రహించినది ]

[వింటాలము — వింటాశెము' అని (మల్లుపు 3 69 ) ]

[చాంగణ — బాంగణ' వావి అపముద్రి ) ]

[కాసెనిల్కడ —కాసెనల్కడ-(వావి అపముద్రి ) ]

సరిబిత్తరము — సిరిబిత్తరము'(వావి అపముద్రి )

[కిల్లి — కిర్లి' అని (శ ర బ్రౌ ) ]

సీ వెంబడి బాసట, వెంట, తో, డనుగల
మనుఁ, గనఁగను సహాయాఖ్య దనరుఁ,
దోడ్పా టనంగను దోఁచు సాహాయ్యంబు
దండు, దడ మనంగఁ దనరు సేన,
యుభయసేనాభిధ యొ ప్పిరువా గనఁ,
బొల్చు సేనాముఖము మొన యనఁగ
వ్యూహంబు వెలయుచు నుండు మొగ్గర మన
నొడ్డన మం చన నొడ్డనంగ

గీ వెలయు సంపద సిరి లచ్చి కలిమి యనఁగఁ
బరఁగఁ బేదఱికంబు నిప్పచ్చరమ్ము
నెవ్వ యెద్దడి లేమి నా నివ్వటిల్లు
రిక్తతకు నామధేయము ల్భక్తవరద 210

వెంబడి బాసట వెంట తోడు అనుగలము అనుఁగు—ఇవి సహాయునకు (సహాయమునకు)— తోడ ఉండువానికి (దానికి) పేర్లు

**తోడ్పాటు**—ఇది సాహాయ్యమునకు (సాహాయ్యకమునకు సాహ్యామునకు తోడు పడుటకు తోడ ఉండుటకు) పేరు

**దండు, దండము**—ఇవి సేనకు (దళమునకు అనీకమునకు సైన్యమునకు) పేర్లు

**ఇరువాగు**—ఇది ఉభయసేనలకు (రెండుపక్షముల సేనకు) పేరు

**మొన**—ఇది సేనాముఖమునకు (నాసీరమునకు సేనయొక్క ముందుభాగమునకు) పేరు

**మొగ్గరము ఒడ్డనము ఒడ్డు**—ఇవి వ్యూహమునకు (సేనావిన్యాసమునకు పద్మాద్యాకారము గా సైన్యమును ఉంచుటకు) పేర్లు

**సిరి, లచ్చి, కలిమి**—ఇవి సంపదకు (సంపత్తికి కల్మికి ధనాధిక్యమునకు) పేర్లు

**పేదఱికము నిప్పచ్చరము నెవ్వ ఎద్దడి లేమి**—ఇవి రిక్తతకు (శూన్యతకు లేమిడికి, లేవడికి, దారిద్ర్యమునకు, ధనాదులలేమికి) పేర్లు

వెంబడి, వెంట —అనువానికి సహాయార్థమును (శ ర హూ వి) (మొ) ఇచ్చట లేదు ఒకప్రయోగ మి ట్లున్నది మనుఁ జాకర్ణధనుర్గుణాకలితుఁడై నావెంట రా నొంటియే (వే?)' (అని) (చూ బ్రౌ వెంట) ఇచ్చట నావెంట రాఁగా' నాతోఁ గలసి రా గా సహాయుఁడై రాఁగా (వేరు) ఒంటివే? అని అర్థ మనిపించును (అం భా)కు చక్కని లక్ష్య మనఁ దగి యున్న దిది కాలువవెంటఁ బూచిమ ల్లిక లవలంబనంబు గ (స్వా 2 21) మొ చోట్లఁగూడ (లాక్షణికము గ) కాలువతో కలసి ఉండునట్లు గా పూచిన మల్లికలు అని అర్థ మన వచ్చును బ్రహ్మచారులు వెంట రా బ్రాహ్మణుండు వచ్చి నింటికిఁ బ్రజ దన్ను మెచ్చి చూడ' (స్వా 64) అనుచోఁగూడ (బ్రహ్మచారులు) సహాయు లై రాఁగా' అనుట సముచిత మన వచ్చును (వెంబడి) పక్షిభాగములవెంబడి ఇథంబుల్ జాఱి పోఁగా' (పంచ పీ 60) (చూ బ్రౌ వెంబడి) ఇచ్చట (వెంబడి-తోడను- అని బ్రౌ టీక) పక్షభాగములతో కలసి యున్న కుథములు జాఱి పోఁగా- అను-అర్థ ముచితమే చేనివెంబడిచేను' ఇత్యాదులు వ్యవహారదృష్టములు (చేనితో కలసి యున్నచేను' అని అర్థము) ఇట్లే మఱికొన్నిప్రయోగములకడఁగూడ ఈ

యర్థము సమన్విత మగు ననిపించు చున్నది విజ్ఞులు పరిశీలింతురు గాక

సహాయాఖ్య — అనుప్లవ స్సహాయ శ్చానుచరో ఽభిచర స్సమాః' అని (అమ) ఇట తోడ వచ్చువానికి పేళ్లు అని (గురు) సహ ఆయతే గచ్ఛతి అని సహాయ'శబ్దము ఎచాద్యజన్తము గా నిష్పన్నము

రిక్తత — రిక్తం కాననశూన్యయోః' అని (విశ్వ) (రిక్తత-శూన్యత) [సొంబ లేమి పేద ఱికము లేమిడి లేవడి నిష్పచ్చర మిడుమ నెవ్వ యన గ దారిద్ర్యనామముల్' (మాన 36) అని వచించినది ఇది అంధ్ర కంటె అధికము గా గ్రహించిన ఇడుమ ను ఈ యర్థమున (సూ ని శ ర మొ) గ్రహింప లేదు ప్రయోగము లెమియే ఇందులకు కారణ మగునే అందులకె (అం భా) గ్రహింప లే దేమొ దీనిని

నెవ్వ — చేరి యొకండు నెవ్వఁ బడి చిక్కుచుఁ జేరెఁడుశాలిధాన్యమే కోరు నతండు పిమ్మట నకుంఠధనోన్నతు డై వసుంధరం బూరికి సాటి గాఁ దల చు (భర్తృ 37) (చూ సూ ని)

[ఒడ్డనము —ఒడ్డణము-(వావి పా) (ఉపపా) అనురూపము లగు మాతొడ్డనముల్ ప్రస్ఫురితములు దృఢంబులు గాఁ దీర్చినఁగాక (భా భీష్మ 2 26) (చూ సూ ని)

సీ చేటు చెడిది చెట్ట నేగి సిలు గనంగ
నాపదభిఖ్య లై యలరు చుండుఁ
జేడ్పా టనంగను జెలఁగు నాపత్ప్రాప్తి
కైదువ యనఁగను గత్తి యనఁగ
నాయుధ మొప్పు వి ల్లన ధను వెనఁగును
సింగాణి యనఁ దగు శృంగధనువు
అటని చెల్వగును గొ ప్పనఁ బిడికిటికట్టు
నాఁగను లస్తకనామ మొప్పు

గీ నల్లె యరి నారి గొనయ మం చనఁగ వెలయు
మౌర్వి దనరారు చుండుఁ దన్మధ్యతంతు

బంధ మరిపోసి యనఁగఁ గూర్పరి యనంగఁ
బుంగవతురంగ శ్రీమాతృభూతలింగ 211

చేటు చెడిది చెట్ట సేగి సిలుగు—ఇవి ఆపదకు (విపత్తునకు విపత్తికి పెద్ద కష్టమునకు) పేర్లు

చేడ్పాటు—ఇది ఆపత్ప్రాప్తికి (ఆపదపా లగుటకు) పేరు

కైదువ కత్తి—ఇవి ఆయుధమునకు (శస్త్రమునకు ప్రహరణమునకు, యుద్ధమున ప్రహరించుట కగు ఖడ్గాదిసాధనములకు) పేర్లు

విల్లు—ఇది ధనువునకు (చాపమునకు శరాసనమునకు కోదండమునకు ధనుస్సునకు) పేరు

సింగాణి—ఇది శృంగధనువునకు (సింగిణికి సింగిణీకి కొమ్ముతో చేసినధనుస్సునకు) పేరు

కొప్పు—ఇది అటనికి (కోటికి కోపునకు, ధనురగ్రమునకు ధనుస్సుయొక్క చివరిభాగమునకు) పేరు.

పిడికిటికట్టు—ఇది లస్తకమునకు (పిడికట్టునకు ధనుర్మధ్యమునకు ధనుస్సుయొక్క నడిమిప్రదేశమునకు) పేరు

అల్లె అరి నారి గొనయము—ఇవి మౌర్వికి (జ్యాకు, శింజినికి అల్లెత్రాటికి) పేర్లు

అరిపోసి కూర్పరి—ఇవి మౌర్వీమధ్యతంతుబంధమునకు (అరివోయుచోటికి నారియందు బాణము సంధించుప్రదేశమునకు) పేర్లు

ఆపదభిఖ్యలు —వీని నిట్లు వచించినది (సాంబ) దెస యాత్రము కడగండ్లు గోరము కస్తి బెడఁద, యడలు చే టన విపదాఖ్యలు వర్తిల్లుఁ ' (మాన.36.)

చేశ్పాటు —ఆపదకు పర్యాయముఁ గానే దీనిని ఉదాహరించు చున్నది (ఆం సం) బెడఁద

దెస చేటు చేడ్పా ట్గొడ వాత్రం బంగలార్పు గోరంబు దొసం గిషుమ వెత కస్తి యం గద కడగం డ్లనఁ జను విపత్తు' (మాన 59 )

సింగాణి —ఇది ధనుర్మాత్రమునకు వాచక మైనట్లు (సాంబ ) అను చున్నది విలు విల్లు సింగాణి వి ల్సింగిణి యనంగఁ గోదండమున కగు' (మాన 40 ) (ఆం సం వేంక ) కూడ ఇట్లె అనినవి (ఆం సం స్థా 45 వేంక మాన 6 ) (సింగాణి) ఒకదినుసు విల్లు-అని (శ ర ) (కాళ మా ) కొన్ని విండ్లకు ఇట్లు పేర్కొనినది విల్లు పట్టిన పదియేను నాళ్లలోన వీఁక గల్గిన తడవిల్లు వెదురువిల్లు సెలసువిల్లును మొద లైనచేగ విండ్లు చులుకఁగాఁ దీసి ' (కాళ 3ఆ ) (చూ శ ర విల్లు )

నారి — నారీ యోషితి మౌర్వ్యాం చ పిత్తశే ఽపి నిగద్యతే (రభసః) (చూ సుధ ) (సం నాడీ ప్రా నాళీ నాడీ క త నారి ) (మా సూ ని ) ఈసం పదము కన్నడము- (మొ ) వానియం దవతరించి కన్నడము- మొ అయినట్లే తెలుఁగునం దవతరించి తెలుఁ గైనది ర-డ' ల కభేద మాశ్రయించి ప్రాకృతసమము గా ఈదేశభాషలయందు వెలసిన దిది యనినను దోసము కానరాదు (ఆం భా ) గ్రహించిన పూర్వో దాహృతసం భాషాపదము లన్నియు చాలవఱ కిట్టివే అనిపించును ఈ (ఆం భా ) ను చూచియే కాఁ లయు కూచిమంచితిమ్మకవి తన అచ్చతెలుఁగుకబ్బము'న దీని నిట్లు ప్రయోగించు చున్నాఁడు కడలిదొన పాపనారియుఁ బుడమితేరు పూవి కడిమి మెఱయ దిగప్రోల్ల గూల్చిన పేటివేల్ప (నీలా 2 20 ) (చూ సూ ని )

అరిపోసి —అరిబోయుట-బాణము సంధించుట-అని (బ్రౌ ) అరితోసి' కి (రూపాం ) అరి పోసి' అని ఒకరు (శ ర సూ ని ) దీనిని గ్రహింప లేదు (అరిపోయు + ఇ ) త్రిమ్మరి' మొ.వానివంటి దిది' అన వచ్చును.

సీ అమరు గుణారోహణాభిధానం బెక్కు-
పెట్టుట యనఁగ మోపెట్టుట యనఁ
దెగ యనఁగా గడిదేఱును జ్యాకృష్టి
చాపకర్షణ బలసాధనంబు
ద్రోణ మనంగను దోఁచు, బ ల్వాగువిల్లు
దనరి యుండును గపోదా యనంగఁ,

బంఁగు లెప్ప యనంగ గుఱి యనఁగఁ బఱిన
లక్ష్యాభిధానంబు లక్ష్యవీధి

గీ కొ౦ఱలు సూటన నమ్ము లకోరి తూపు
కోల యనఁగను శరము తగును దనరుచు
సరుడు నాఁగను గఱి లేనిశరముపేరు
భూషితభుజంగ శ్రీమాతృభూతలింగ 212

ఎక్కుపెట్టుట మోపెట్టుట—ఇవి గుణారోహణమునకు (ఎక్కిడుటకు సజ్యము చేయుటకు ధనుస్సునకు నారి తగిలించుటకు) పేర్లు.

తెగ—ఇది జ్యాకృష్టికి (జ్యాకర్షణమునకు నారి తివియుటకు బాణమును ఏయుటకై వింటినారిని లాగుటకు) పేరు

ద్రోణము— ఇది చాపకర్షణబలసాధనమునకు (ధనుస్సు లాగుటకైనభుజబలమును గలిగించు ఒకవిధమగు ఉపకరణము నకు (పనిముట్టునకు) పేరు

కపోదా—ఇది బల్వాగువింటికి (పెద్దవింటికి గొప్పధనుస్సునకు (గాండివము వంటిదానికి) పేరు

లెప్ప గుఱి—ఇవి పతనలక్ష్యమునకు (శరవ్యమునకు శరవేధనస్థానమునకు గుఱి మాచి ఏసినబాణము పడెడి చోటికి) పేర్లు

సూటి—ఇది లక్ష్యవీథికి (లక్ష్యమార్గమునకు లక్ష్యమును పొందుటకైన-త్రోవకు- ఉపాయము నకు) పేరు

అమ్ము లకోరి తూపు కోల—ఇవి శరమునకు (సాయకమునకు ఆశుగమునకు ఇషువునకు లకోరీకి బాణమునకు) పేర్లు

సరుడు—ఇది గఱి లేనిశరమునకు (కంకపక్షి (రాబందు) లో నగువానిఱెక్కలు ఉండనిబాణమునకు) పేరు

ద్రోణము —— దోణము-దోణాము -(రూపాం ) భుజమునకు బలము వచ్చుటకై త్రిప్పె డు జెట్టివానియుపకరణవిశేషము- అని (శ ం )

సూటి —— గుఱి అనెడి అర్థము నే ఇచ్చినవి నిఘంటువులు (చూ శ ర సూ ని మొ ) (అం శే ) మాత్రము ఉపాయము అనెడి అర్థము ను ఇచ్చు చున్నది- అఖ్య లై తనరారు నుపాయమునకు సుఖ వనఁగ వెర వనఁగను సూటి యన గ (అం శే 27 ) గుఱి అనునది రెండవయర్థము కావచ్చును

లకోరి —— న చ దేశ్యపదేన చైకవర్ణే ఽపి' (అం చి 42 ) ఇట-అహ్హోబలపతి నవలా నేజా లకోరీ మత్తా' ఇత్యాద్యా దేశ్యాః అనినాఁడు ఐనను సాంబ లకోరి యం పఱ నారస మమ్ము తీరు శరాఖ్యలు (మాన 45 ) అను చున్నది ప్రయోగములును దీనిని గా దనుట లేదు వెడవిలుకానికిం జెఱకువిల్లును గల్వలకోరి (విజ వి 1 2 ) విక్ర నవల యు నాధువే అను చున్నది లన్నవలముద్దుమోమును' (5ఆ ) (చూ శ ర ) లకోరీ' (రూపాం ) ఈరీతిం గెందలిరుల కోరీ సురతాణి కాఁకఁ గూర్చుచ కోరీ శారీ కేరీ మత్తమ యూరీరవములకునులికి యుగ్మలి మదిలోఁ ౙ (చంద్రా 4. 78 ) (చూ సూ ని )

సరుడు ——ఇది బాణమాత్రమునకు వాచకము-అని (వేంక ) బాణం బొప్పు జిలు కంపఱ సరుడు ములికి తూపు నమ్ము నా ' (మాన 75 ) (అని ) సరము అను చున్నది (సాంబ)- లకోరి యంపఱ నారస మమ్ము తీరు ములికి సరము కోల చిలుకు తూ పన శరా ఖ్యలు (మాన 15 ) చిత్రపుఙ్ఖ శ్శు౦ స్సరః ' అని (త్రికాం శే ) (మా సుధ క్షత్త్రి 86 శ్లో వ్యా ). ఈ సర' శబ్దమే అచ్చతెలుఁగు కబ్బములవాడు కవఱన అచ్చికి' మయి ఉండుట సర శబ్దమునకు-(వికృ ) సరుడు' ఐన దని పించును ఈ పదములకు పైనిఘంటువు లిచ్చిన బాణము అనెడి అర్థము' సాధారణ వివక్షచే లాక్షణికము గా నయిన దని పించును

సీ పాఱవాత మ్మనఁ బరఁగుచు నుండు వి
శాలముఖం బైనసాయకంబు
దుష్కంటకశరంబు దోఁటమ్ము, నాఁగను
జిల్లకోల యనంగఁ జెలఁగు చుండు

దోనమ్ము, లం చన నౌ నల్పశరములు
నారాచ మొప్పను నారస మనఁ,
జాపానపేక్షి యౌ శర మొప్పు చుండుఁ జే
య మ్మంచనంగ జోడ మ్మనంగ

గీ. నంపఱ యనఁగ శరసమూహంబు దనరుఁ
జిలు కనఁగ ముల్కి యనఁగను ఫలము దనరుఁ
బింజ, రొద యనఁ బుంఖంబు వెలయు చుండు,
భూషితభుజంగ శ్రీమాతృభూతలింగ 213

పాఱవాతమ్ము—ఇది విశాలముఖసాయకమునకు (పాఱమ్మునకు విశాలమైనమొన గలబాణమునకు) పేరు

దోఁటమ్ము చిల్లకోల—ఇవి దుష్కంటకశరమునకు (కర్ణిశరమునకు బాణాగ్రమున చెవివలె వంకర గా ఉండుములికి గలబాణమునకు) పేర్లు

దోనమ్ములు—ఇది అల్పశరములకు (చిన్నబాణములకు) పేరు

నారసము—ఇది నారాచమునకు (ప్రక్ష్వేడనమునకు ఏషణమునకు ఇనుపబాణమునకు) పేరు

చేయమ్ము జోడమ్ము—ఇవి చాపానపేక్షి యౌశరమునకు (ధను వక్కఱ లేని బాణమునకు, చేతితో విసరెడి అమ్మునకు) పేర్లు

అంపఱ— ఇది శరసమూహమునకు (బాణపరంపరకు బాణపంక్తికి వరుస గా ఏయఁబడెడిబాణములకు) పేరు

చిలుకు, ముల్కి—ఇవి ఫలమునకు (అలుఁగునకు ములికికి బాణాగ్రపు ఉక్కుతునక కు) పేర్లు.

పింజ రొద—ఇవి పుంఖమునకు (కాణ్డమూలమునకు, బాణముక్రింది చివరకు అల్లెత్రాటికి కూర్చు బాణమూలమునకు) పేర్లు

పాఱవాతమ్ము — పాఱయొక్క వాదరవంటివాదర ఁలబాణము-అని (శ ర )

దోఁటమ్ము —(దోఁటి-అమ్ము) దోఁటివలె వం పైన అలు గు గలబాణము (శ ర )

నారాచము — సర్వలోహమయస్య శరస్య' అని (సుధ ) అచ్చ-ఇనుపబాణము' అని (బ్రౌ ) (చూ అను ) సర్వలోహా స్తు యే బాణా నారాచా స్తే ప్రకీర్తితాః' (మా శ ర నారాచము) నారసము, చిలుకు ములికి అంపఱ' అనునవి (సామాన్యముగా) బాణ పర్యాయము లని (సాంబ ) (చూ మాన 45 )

ఫలము — శస్త్రముఖం ఫలమ్' అని (వైజ భూ క్షత్త్రి ) బాణాదుల యగ్రపుటుక్కు-తునుక- అని (శ ర.)

పుంఖము —బాణపుపిడి- అని (గురు )

[ జాపానపేక్ష మౌ ' (వావి పా.)

రాద —దీనిని ఈయర్థమున (సూ ని శ ర మొ ) గ్రహింప లేదు.

సీ. తరకసమ్ము పొది బత్తళిక, పాణివడమ్ము,
దొన యనఁ దూణీర మొనరి యుండు,
వాలు, ఖండా కరవాలు, మేల్కత్తి త
రవలి నరాజి పిరంగి యడిద,
మన ఖడ్గనామ మై యలరుచు నుండును
దార, నా వాయి, నా ధార వెలయుఁ,
జాయ, లం చన నసిచ్ఛాయ లై తగుఁ గృపా
ణీరేఖ లొప్పును దోంము లనఁ

గీ బెణక నాఁగను గరవాలపృష్ఠ మొప్పు
మీఱును గృపాణికాగ్రంబు చూరి, యనఁగ
సురె కటారి పిడెం, బన శోభిలును గ
రాసినామంబు లై, నిటలాగ్నినేత్ర

తరకసము పొది బత్తళిక పాణివడమ్ము దొన—ఇవి తూణీరమునకు (నిషంగమునకు, ఇషుధికి, అమ్ములపొదికి) పేర్లు.

వాలు ఖండా కఱవాలు మేల్కత్తి, తరవలి నరాజి పిరంగి, అడిదము—ఇవి ఖడ్గమునకు (కరవాలమునకు కృపాణమునకు కత్తికి) పేర్లు

దార వాయి—ఇవి ధారకు (వాదరకు ఖడ్గాదుల పదునైన అంచునకు) పేర్లు

చాయలు—ఇది అసిచ్ఛాయలకు (కత్తియొక్క కాంతులకు) పేరు

తోరములు—ఇది కృపాణీరేఖలకు (కత్తిచాఱలకు) పేరు

పెణక—ఇది కరవాలపృష్ఠమునకు(కత్తియొక్క వెనుకభాగమునకు) పేరు

చూరి—ఇది కృపాణికాగ్రమునకు (చుఱకత్తియొక్క (ఒకవిధ మగుచిన్నకత్తియొక్క) మొనకు) పేరు

సురె కటారి పిడెము—ఇవి కరాసికి (చేకత్తికి, చిన్నకత్తికి కఱవాలికకు, కృపాణికకు) పేర్లు

ఖండా —(సం కఱణ్డః) పెద్దకత్తి' ఒండొంటిఁ గొట్టుచో ఖండాలు ఖంగుఖం, గునఁ దాఁకి పెనుమిణుఁగురులు గ్రక్క' (కలా 8 66) అని (సూ ని) ఖండా కత్తి'-(ం 8) అని (బ్రౌ) ఇది (గ్రా వి) అని (శ ర) సాంబ కత్తికి నామములను ఇట్లు వచించినది కత్తి వాలడిదము కైదువు నన ఖడ్గ మెసఁగు (మాన 43)

తరవలి —పట్టాకత్తి పిరంగికత్తి-అని (సూ ని)

దార —ఈయర్థమున దీనిని నిఘంటువులు (శ ర బ్రౌ సూ ని) గ్రహింప లేదు

[పెణక — పెణిక' అని (వావి పా) (పేణిక-అని బ్రౌ) ఇదియే గణసంగతికి పెణిక' అయి ఉండును (చూ అను.) పెడక' (రూపాం) కత్తి మొద లగువానియొక్క పృష్ఠభాగము-అని (సూ ని.)

కృపాణికాగ్రము — కృపాణిక కు ఛురిక చూరకత్తి-అని అర్థ మిచ్చినది(సూ ని) ఇది అల్పా కృపాణీ కృపాణికా' అని అల్పార్థకప్రత్యయాంతము గా నిష్పన్నము

దీనిఁబట్టి ఇచ్చట ఛురికాగ్రము' అనెడి 'అర్థము' యుక్త మనిపించినది. (సూ ని.)
ఇ ట్లనక 'స్వార్థికకప్రత్యయాంత' మిది యనునట్లు- కత్తి మొన' అని అర్థ మొసఁగినది

సీ. పట్టసనామము ల్పట్టె మన మొహదా
        యన నడ్డకత్తి నా నలరు చుండు,
    నొఱ యనఁ గోశాఖ్య యొప్పుఁ, జిల్కడ యనఁ
        దద్బంధగుణసంజ్ఞ దనరు చుండుఁ
    గోశాంతకోశాదిగుప్తిభూషలు కుప్పె,
        యన నరడా, యన నగుఁ గ్రమము గఁ,
    గోశసమాచ్ఛాది కొఱలు గలీ బన,
        ఖడ్గాదిముష్టిసంగ్రాహ్యతలము

గీ. పరుఁ జనఁ బరుం, జనంగను బరఁగు నదియె
    చనును నెమ్మిలిపరుఁజు గాజాపరుఁ, జనఁ,
    బిడి యనంగను త్సర్వాఖ్య వెలయు చుండు,
    భూషితభుజంగ శ్రీమాతృభూతలింగ 215

పట్టెము, మొహదా అడ్డకత్తి—ఇవి పట్టసమునకు (పట్టాకత్తికి రెండువైపుల వాదర (పదు నైనఅంచు) గలపెద్దకత్తికి) పేర్లు

ఒఱ—ఇది కోశమునకు (ప్రత్యాకారమునకు, ఖడ్గాదులు ఉంచుకొనెడి-ఒఱకు) పేరు.

చిల్కడ—ఇది కోశబంధగుణమునకు (ఒఱకు కట్టెడిత్రాటికి) పేరు.

కుప్పె—ఇది కోశాంతగుప్తిభూషకు (ఒఱకు చివర ఒఱ జాఱ కుండ మూతి కట్టు గా అమర్చెడిభూషణమునకు) పేరు.

**అరడా**——ఇది కోశాదిగుప్తిభూషకు (ఒఱకు మొదట ఒఱ జాఱ కుండ మూతి కట్టు గా ఏర్పఱచు అలంకారము నకు) పేరు

**గలీబు**——ఇది కోశసమాచ్ఛాదికి (ఒఱకు తొడుగుగవుసెనకు) పేరు

**పరుఁజు పరుంజు నెమ్మిలిపరుఁజు గాజాపరుఁజు**——ఇవి ఖడ్గాదిముష్టిసంగ్రాహ్యతలమునకు (పిడికిలితో గట్టి గా పట్టుకొనఁబడు పిడిచివరిప్రదేశమునకు పిడికొనకు) పేర్లు

**పిడి**——ఇది త్సరువునకు (ఖడ్గాదులముష్టికి పిడికిటితో పట్టుకొనుదానికి పిడికి) పేరు.

పట్టసము — పురోడాశో ఽపి పట్టసః (అమ) (గురు పా) ఇట పట్టిశః అని (సుధాపా) పట్టిసః' అని (మకుటుఁడు) (చూ సుధావ్యా) పట్టసో లోహదణ్డో యః తీక్ష్ణధారః ఖురోపమః కణ్ఠకచ్ఛేదనో ఽప్యేవం ద్విముఖ శ్చ భవ త్యసౌ (వై జ భూ క్షత్రి). దీని కర్థము శస్త్ర భేద' మనినది సుధ పట్టాకత్తి' ఇది యని స్పష్టపఱచినది బ్రౌ (చూ పట్టెము)

మొహదా —(బ్రౌ) మెహదా గ్రహించి ఈయర్థమే యిచ్చి ఈ (ఆం భా) ను ఉదాహరించినను (మి ని)లో మెహదా' మొహదా' రెండింటినిఁ జూపి రెండింటికి ప్రమాణము, ఈ (ఆం భా) అను చున్నది ఒది యెట్లో రెండవదానికడ ఆంధ్రశబ్దార్ణవ మనుట ఆంధ్రభాషార్ణవము అనుట కైనప్రమాద మనిపించు చున్నది (మి ని) ఇట్లను చున్నను (బ్రౌ)నుబట్టి మెహదా' అనియె బ్రౌ పాఠ మనుకొన వచ్చును

పరుఁజు —ఇట జర పరుంజు ననంగను బరఁగు నదియె చనును నెమ్మలిపరుఁజు గాజాపరుఁజన అని (శ ర పా) (చూ శ ర గాజాపరుఁజు) నెమ్మిలిపరు జు' అని (శ ర పా) అని (సూ ని) నెమ్మలిపరుఁజు' అని (బ్రౌ చి ని పా) (త ఇమలిక నెమలి) అనినది 'నెమిలి కి నిర్ధారకప్రయోగ మి ట్లున్నది పక్షములు గప్పి పసిపాపపాములకును మేపు లొసఁగి రక్షించునెమిళ్లు' (జై భా 4 79) (చూ సూ ని)

పిడి, పరుఁజు —ఈ ఆం భా నే ప్రమాణము చేసి, పరుఁజు' (మొ) పిడి' సమానార్థకము లనునట్లు అభిప్రాయపడు చున్నవి నిఘంటువులు అప్పుడు ఖడ్గాదిముష్టిసంగ్రాహ్యతలము త్సరువు-వేఱు గా ఆం భా పేర్కొనుట అసంగత మగును పరీశీలించిన

(అం భా ) ధోరణి ఇట్టిపునరుక్తములు కలది కాదు అందులకే పిడికి పరుఁజు-మొ వానికి వేఱుగా అర్థము నిర్వచించితిని

సీ పరుఁజులోపలఁ జీల పట్టించునలుగువా
యమరుప యోగ్య మైనట్టితావు
మొసలికా టనఁగను మొసలివా, యనఁగను
జిమట యనంగను జెలఁగు చుండుఁ
బలక యం చనఁగను ఫలకసమాఖ్య యౌ,
ఖేటక, మెసఁగును గేడె మనఁగఁ
దద్భేదనామ మై తనరును జిల్లోటి
కేవడ మం చనఁ,గేరు చుండు

గీ గుదె గుదియ, దుడ్డు గునుపము గుడుప యనఁగ
ముద్గరము భిండిపాలమ్ము పొలుచుఁ జిల్ల
కో, లనఁ దగుం గురాసము గొడ్డలి, యన
భూషితభుజంగ శ్రీమాతృభూతలింగ 216

మొసలికాటు మొసలివాయి చిమట—ఇవి పరుఁజు...తావు నకు (మకరము ఖాకృతి కలపిడికొన పరుఁజు దానియందలిచీల పట్టుకొనునట్లు అలుగువాయి అమర్చుటకు వీలు గా ఉండుప్రదేశమునకు) పేర్లు

పలక—ఇది ఫలకమునకు (పలకవంటి (డాలువంటి) ఆయుధవిశేషమునకు) పేరు

కేడెము—ఇది ఖేటకమునకు (చర్మఫలకమునకు డాలునకు, బాణములు తగుల కుండ అడ్డము గా పెట్టుకొను తెప్పవంటి సాధనవిశేషమునకు) పేరు

చిల్లోటి కేవడము—ఇవి ఖేటకవిశేషమునకు (ఒకవిధ మగుకేడెమునకు) పేర్లు.

గుదె, గుదియ, దుడ్డు గునుపము గుడుప—ఇవి ముద్గరమునకు (దుర్ఘణము నకు, ఆయసదండమునకు, కుఱుచని ఇనుప దుడ్డునకు) పేర్లు.

చిల్లకోల——ఇది భిండిపాలమునకు (భిందిపాలమునకు ఱాలు చిమ్మెడి ఒకవిధ మగు ఆయుధము నకు విడిచివాటుగుదియకు) పేరు

గొడ్డలి——ఇది కుఠారమునకు (గొడ్డలివంటి-ఆయుధవిశేషమునకు) పేరు

చిమట —'త్సర్వగ్రము కత్తి మొద లగువానిని అమర్చెడి పిడియొక్క కొన' అని (సూ ని)

పలక — పలక, కేడెము ఇవి సమానార్థకము లనియే నిఘంటుకర్త లందఱు అభిప్రాయ పడుచున్నారు (ఆం భా) వీనిని వేఱు గా ప్రదర్శించు చున్నది సంస్కృతమునఁ గూడ ఫలక- ఖేటకి శబ్దములు సమానార్థకములు గా కానవచ్చు చున్నవి ఫలం చర్మ మయం చర్మఫలకం ఖేటకం సమమ్' అని (వైజ భూ క్షత్రి) (సూ ని) పలక-కేడెము డాలు ఆయుధవిశేషము- అని ఈ (ఆం భా)ను ఇచ్చినది కొన్ని ప్రయోగము లి ట్లున్నవి- పలకలు నొడ్డనములఁ గ త్తలములు నసిశక్తికుంతతతియుం గొని ' (కు సం 1 640) ఈప్రయోగమే ఇచ్చి ఒడ్డనము' ఒకరక మగుకేడెము'- అను చున్నది (సూ ని) ఖేటకవిశేషములను (ఆం భా) ఇట ఇచ్చి యున్నదిగదా వానిలో ఒడ్డనము లేదు ఒడ్డనము' నకు ఖేటవిశేష' మర్థ మగుటకు మఱి యే ప్రమాణము (సూ ని) చూప లేదు మఱియొకచో- నిక్కము హరిదాసులకును మొక్కల మునఁ గీడు సేయ మొనసినయేనిన్ స్రుక్కదె వాసవుపట్టిన చొక్కపుఁ బల కైనఁ బెద్ద శూలం బైనన్' (నృసిం 4 6). ఇచ్చటి 'పెద్దశూలము - అనుదానిసాహచర్యమున ఇది ఆయుధవిశేష' మే దైనఁ గావలయు ననిపించును. ఒడ్డనము ఉపయోగపడు రీతి ఇట్లు వర్ణింపఁబడినది- అనువున నద్భుతంబు లగునాక్రమణంబుల వాని నెల్ల నొడ్డనమున నాఁగి యాఁగి సుదృఢం బగుఖడ్గముచేతఁ గొన్ని తు త్తునియలు సేయుచున్' (హరి ఉ 7 228) డాలు ఇది' అనునట్లే ఈవర్ణన యున్నది ఒకరక మగుకేడెము- అనెడియర్థము చెప్పవలయునంతటియావశ్యకత కాన్పింపదు

ముద్గరము —(సూ ని) ముద్గరము, గద-అని ఈ (ఆం భా) ను ఇచ్చినది ఇచ్చటి 'గద' అనుదానికి ఇనుపదుడ్డు' అనియే అర్థము గద' అనుదానికి గదాయుధము గుదె' రెండును అర్థములు గదా' శబ్దమునకు రెండర్థములను ఇచ్చినది (బ్రౌ)(చూ గద) కనుకనే- 'దుడ్డు' అనుదానికి ఈరెండర్థములు కల వని వీనిని వేఱు గా ప్రదర్శించి

యున్నది (సూ ని) (చూ 2 3-అర్థములు) గుదె యనఁగ దుడ్డనంగను గదకు పేళ్లు అని (ఆం శే 47) ఇది దీనికి రెండవయర్థము అద్దె అనినది (సూ ని) ద్రుఘణో ముద్గరఘనౌ అని (ఉమ)

భిండిపాలము — భిండివాలము'- అని (వావి పా) (ాశాం.) భిన్దిపాల స్సృగ స్తుల్యా' అని (అమ) భిన్ది ర్ద్వాదశతాలం తు దశకున్తో ఽభిధీయతే' (భరతః) తదవచ్ఛిన్నః కాలో ఽపి భిన్దిః భిన్దిం పాలయతి' అణ్- అని (సుధ) ఇట భిణ్డిపాలః' అనునది (పారాం) అనినది (గురు) భిణ్డిపాలః క్షేపణీయః' (అని) (వైజ భూ క్షత్రి) వాడుకయందు భిణ్డివాల మందురు' అని (శ ర) దీనికి (భిండిపాలశబ్దమునకు) వ్యాఖ్యానములు ఇట్లర్థి మొసఁగినవి- అశ్మప్రక్షేపకసాధనస్య' గోఫణ' ఇతి ఖ్యాతస్య నాళీకాస్త్రస్య' ఇత్యన్యే'- ఽని (సుధ) భిండివాలము'- అనియే రామాయణము- భిణ్డివాలైశ్చ ఖడ్గైశ్చ' (రామా యుద్ధ 42 45-) నాళీకాస్త్రము- వడిసెలవలె ఉండునస్త్రవిశేషము- అని (సూ ని) నాళీకము అనుదానికి (సూ ని) ఇనుపనాళము కల ఆయుధము (తుపాకి మొ) అనినది హస్తప్రమాణ మైనవిడిచివాటుగుదియ' అని (గురు) రెండు మూఁడు చక్రములు గల మాదిగకత్తి' అని కొందఱు' అని మఱియొకయర్థముగూడ ఇచ్చినది (శ ర) దీనికి గదావిశేషము' అర్థ మను చున్నది రామా వ్యాఖ్య- (చూ యుద్ధ 42 స 45 శ్లో వ్యా)

గొడ్డలి —యుద్ధసాధనము గొడ్డలివంటి దిది 'పొలుపు గఁ గొండకట్టెలకుఁ బోయెడివాని విధంబు దోఁప గొడ్డలి యిది యేమి దీన జగడం బొనరింపఁగ వచ్చితే బళా బళ ' అని (దశా 6 9)

సీ ఖండపరశు వొప్పు గండగొడ్డలి యన
బరిస, బడిత యనఁ బరిఘ మొప్పు
సెలకట్టె యనఁగను వెలయు శల్యము, సురె
సురియ చూరి యనంగ ఛురిక దనరు
జముదాడి, యనఁగను యమధాటి చను, నేజ
బరిచి యీఁటె, యనంగఁ బరఁగుఁ గుంత,

మలరును గొరక నన నల్పకుంతాభిధ
బల్లె, మనంగను భల్ల మమరు.

గీ బాగుదా రన నల్పాసిపరఁగు బాఁకు
వంకి చిల్లాణ మనఁగను వక్రశస్త్ర
మలరు చుండును దొంకెన యనఁగ వెలయు
నాయుధవిశేషనామ మై, యబ్జమౌళి 217

గండగొడ్డలి—ఇది ఖండపరశువునకు (పరశువునకు, పక్షిముక్కువలె వంపు తిరిగిన- ఒకవిధ మగు గొడ్డలికి) పేరు

బరిస బడిత—ఇవి పరిఘమునకు (పరిఘాతమునకు దండవిశేషమునకు అంతట ఇనుపముండ్లతో కూడిన యినుపదండమునకు) పేర్లు.

సెలకట్టె—ఇది శల్యమునకు (సెలగోలకు, ఆయుధవిశేషమునకు) పేరు

సురె, సురియ, చూరి—ఇవి ఛురికకు (శస్త్రికి,ఒకవిధ మగుచిన్నకత్తికి) పేర్లు

జముదాడి—ఇది యమధాటికి (నిడు పైన పిడి గల- ఒకవిధ మైన కటారికి) పేరు.

నేజ బరిచి, ఈఁటె—ఇవి కుంతమునకు (ప్రాసమునకు, ఆయుధవిశేషమునకు) పేర్లు

గొరక—ఇది అల్పకుంతమునకు (చిన్న ఈఁటె కు) పేరు

బల్లెము—ఇది భల్లమునకు (జెముడాకువంటి అలుఁగు గలబాణవిశేషమునకు) పేరు.

బాగుదార—ఇది అల్పాసికి (చిన్నకత్తికి ఆయుధవిశేషమునకు) పేరు

బాఁకు వంకి చిల్లాణము—ఇవి వక్రశస్త్రమునకు (వంకరకత్తికి వంకరపిడి గలిగి పొడుచుట కుపయోగించు కత్తికి) పేర్లు

డొంకెన—ఇది ఆయుధవిశేషమునకు (ఒకవిధమగు-ఆయుధమునకు) పేరు

[గండగొడ్డలి — (గండ్రగొడ్డలి- (వావి పా ) (అపపా ) గండగొడ్డండ్లచేఁ జెండిచెండి' (రసి 0 ) మొ ]

పరిఘము —ఈశబ్దమునకు (నానా ) పరిఘో ముద్గరే ఽర్గలే ' అని ముద్గరము అర్థమనినది (గురు )- పరిఘః పరిఘాతే ఽస్త్రే ఽపి' అనుచో దీనినే ఉదాహరించి ఇనుప కట్లగుదియ' అర్థ మనినది (ఆం భా.) ముద్గరమునకు పేర్లు (2 206) లో ఇచ్చినది కాన లోహదణ్డవిశేష మిది అనవలయును కనుకనే మేదిని (అమ )ను వివరించుచు- పరిఘో యోగభేదే ఽస్త్రవిశేషే ఽర్గలఘాతయోః అని ఆయుధవిశేష మిది అనినది(చూ సుధ ) దీనిస్వరూపమును ఇట్లు వివరించినది-(స త సి ప ల సం )- సర్వతః కణ్టకితో లోహదణ్డః' అని లోహబద్ధస్య లగుడభేదస్య లోహాఙ్గీ' ఇతి ఖ్యాతస్య' అని (సుధ.) ముద్గర మనుట సుధ'కు అభిప్రేతము కాదు అట్లే ఐన, (గురు )వలె (నానా ) ఉదాహరించి మద్గర' మనియే అని యుండును అస్త్రభేద' మర్థ మనినమేదినిని ఉదాహరించి ఇట్లు వచింపదు

సెలకట్టె —దీనిని నిఘంటువులు ఇట్లు విశదపఱచినవి-( వసి సెలకట్టె'-అనినది (గురు ) వసి' అనుదానికి- కొన చెక్కిన కొయ్య'- అను అర్థ' మిచ్చి వసులు గసులు పోఁగువాఱు వెండ్రుకత్రాళ్ల బలువిండ్లు నమ్ములు బల్లెములును' (హరి 2 6 ) (మొ ) ఉదాహరించి, వేఁట కగుసాధనములలో ఇది యొకటి అను చున్న ట్లున్నది (సూ ని ) వసికి-వేఱు గా పేర్లు ఇచ్చు చున్నది-(ఆం భా ) (2 208 ) బాణము అనిమాత్ర మన్నది (శ ర ) (బ్రౌ ) శరము' అని దీనికి అర్థ మిచ్చి ఇట్లు వివరించినది-మూరెఁడుకట్టెకు చబుకు కట్టినది అని (చబుకు-జాటీ-కొరడా ) సలకట్టె- సెలకట్టియ సెలగోల-దీనికి పర్యాయము లనినదికూడ (బ్రౌ ) సెలకట్టె- బాణవిశేషము'- అని (సూ ని ) దివము బాణోత్కరములఁ గప్పఁ డీఁటెల సెలకట్టియలను వేర్యియుఁడు (హరి ఉ 1 83) అనుప్రయోగము ఒకటి సెలకట్టె ఈఁటె' అనునవి బాణములు కావు ఆయుధవిశేషములు' అని విశదపఱచు చున్నది ఒకప్పుడు బాణవిశేష' మర్థ మనవలసిన (అర్థాం ) ఒడి ఇది కాదు

శల్యము — వా పుంసి శల్యం శఙ్కు ర్నా' అని (అమ ) ఇది శఙ్కు-శల్యశబ్దములు

సమార్థకము లనినది శఙ్కు-శబ్దము-అస్త్రవిశేషవాచకము శఙ్కుః పత్రశిరాజాలె సంఖ్యాకీలకశమ్భుషు యాదాస్త్రభేదయోః' అని (మేది) శఙ్కుః ప్రహరణాన్తరే' ఉని (శాశ్వతము.)

జముదాడి — జముదాళి' (రూపాం) తలగుడ్డ నొడు పింత దప్పించి చేయిచ్చి కుడి కేల జముదాళికొలఁదిఁ బొడిచి' (రా వి 3 67) (చూ.సూ ని) జముదాడి' అనినను ఇట సరిపడునదియే

యమదాటి —యమధార-అని చెప్పఁబడెడి ఒకబాణము అని (బ్రౌ) యమదాటి యమధారము-వే అను చున్నది (శ ర) (సూ ని) యమధారము-ఇరుప్రక్కల వాదర కల కత్తి-అని (శ ర) అట్టి ఆయుధమును' అని (చూ సూ.ని)

నేజ —దీనికి, తోమరము' అర్థ మనినది (సూ ని) ఈ(అం ధాను) ఇచ్చి (చూ నేజ) 'ఈఁటె'అనుదానికి 'కుంతమ్ము' అను ఆయుధవిశేషము'-అర్థ మని ఈ(అం ధా)నే ఉదాహరించినది (సూ ని) (చూ ఈఁటె) ప్రాసస్తు కున్తః' అని (అమ) శర్వలా తోమరో ఽ స్త్రియామ్' అని (అమ) కనుక తోమరము నేజ వే అనవలయును (లేదా) తోమరము' అనునది నేజ' కు (అర్థాం) ఉన వలయును

గొరక — కొరక' అని (బ్రౌ) (అనుబంధమున) చిన్న ఈఁటె' అర్థము-అని (బ్రౌ)- (ఇనుపబాణము' అని (శ ర) (గొరకకట్టె'-అలుఁగు గలచేతికఱ్ఱ-అని (శ. ర) గొరకకట్టె-చేతియీఁటె, చిన్నయీఁటె'-(బ్రౌ) అని (సూ ని) (చూ గొరకకట్టె) గొరకకట్టె' గొరక ఏకార్థకము లనియే (బ్రౌ) అభిప్రాయపడు చున్నది)

భల్లము — భల్ల స్స్యా త్పుంసి భల్లకే శస్త్రభేదే పున ర్ద్వయోః అని (మేదిని) (చూ స.ధ) స్నుహీదలపలో భల్లః' అని (వైజ. భూమ్య్త్రి) కావున భల్లశబ్దము -ఆయుధము (ఈఁటె), బాణవిశేషము'-అను రెం డర్థములును గలది (బ్రౌ)- భల్ల శబ్దార్థమును ఇట్లు విశదపఱచినది-విశాల మైనమొన గలిగి విర్దిరోధము గా దేని నైన భేదించి పోఁగలిగిన బాణము (అని)

బాగుదార — బాగుదారు' అని (బ్రౌ) (శ ర సూ ని) బాగుదార' అనియే అను చున్నవి. (సూ.ని) నూతనపలాశసుమం బనుబాగుదారచేఁ జలమున నయ్యతిన్

నఱకె సారససాయకవీరుఁ డంతటన్' (చంద్రి 2 84) అని ప్రయోగ మిచ్చినది బాగు దారుచేఁకా' అన్నను ఇది సరిపడునదియే (బ) బాగుదార్లు' బాదు పెట్టినయట్టిబాగుదార్ల రుమాలు లెగ వైచి తెగ నొరల్ సేయువారు' (మల్ల పు 2 4) (చూ సూ ని)

వంకి — బాఁకు వంకిణికి' పర్యాయ మిది ముప్పదిరెండు ఆయుధములలో ఇది యొకటి అని (సూ ని)

చిల్లాణము — చిల్లాడము' (రూపాం) (వంకి' అని అనబడు తున్నది వంకర వంకర గా ఉండుకత్తి-అని (బ్రౌ.) (చూ అను) ఆయుధవిశేషము-అని (శ ర) చిల్లాణము'నకు (సూ ని) బాఁకు-అని అర్థ మిచ్చినది ఈ 'లం భా వే ప్రమాణముఁ గా చూపినది ఖిల్లుఁ దొకిడు పొడిచినతర బల్లెమువెంబడినె యుఱికి పైఁ బడుపులిఁ దాఁ జుల్ల రపుఁ గోర బెడిదపు జిల్లాణముకొలఁది గ్రుచ్చి చీరెం గేరెన్' (చంద్రా 2-89.) ప్రియోగ మిచ్చినది

దొంకెన — పొడుచుకొనివచ్చిన కొన గలది అని బ్రౌ పొడిచి పేగులు లాగుటకు ఉప యోగించుకొంకి కలఒకవిధ మగు- ఈఁటె' యగు నేమో

సీ. వాయిదా, రనఁబడు వంకలు గలకత్తి
దోదుమ్మి సైబసఁ దోచుఁ చుండు,
నాలక్షణము గల్గి యాగతి వం పైనఁ
బరఁగుచు నుండును గిరు, సనంగ,
నొడిసె, యనంగను వడరు నావిద్ధము,
గ్రాలుఁ ద్రికాష్ఠి తిక్కటి యనంగఁ
దగు శిలాయంత్రంబు దంచన మనఁగను
వసి గసి మే కన వసుధ శంకు

గీ భేదనామంబు లగుచు శోభిల్లును సుర
క్రోవి పీరంగి బాణము గుంటిక్రోవి
జబురుజంగి తుపాకి బజా యనంగ
వెలయు నగ్నిప్రసారణాఖ్యలు మహేశ

వాయిదార దోదుమ్మి సైబు—ఇవి వంకలు గలకత్తికి (దోదుమ్మికి, వంపులు కలిగిన ఖడ్గమునకు) పేర్లు

కిరుసు—ఇది ఆలక్షణములు గలిగి ఆగతి వం పైనదానికి(వాయిదార మొద లగు వానితో సమానము గా ఉండి అట్లే వంపులు తిరిగి ఉండెడి ఒక దినుసు కత్తి కి) పేరు

ఒడిసె—ఇది ఆవిద్ధమునకు (గోడలు రో నగువానిని తొలిచి రంధ్రము వేయు-ఒకవిధమగుసాధనమునకు అయుధవిశేషమునకు) పేరు

తిక్కటి—ఇది త్రికాష్ఠికి (త్రిక్కటికి మూఁడు కఱ్ఱలతో ఎర్పఱచిన-ఒకవిధ మగు ఆయుధము నకు) పేరు

దంచనము—ఇది శిలాయంత్రమునకు (కోట ఎక్క కుండ శత్రువులపై ఱాలు ఱువ్వెడు-ఒకవిధమగు సాధనమునకు) పేరు

వసి గసి మేకు—ఇవి శంకుభేదమునకు (ఇవి ఒక్కొక్కటి ఒక్కొకవిధ మగు మేకునకు చెక్కినమొన గల కొయ్యకు దానివంటిదానికి వేఁటకగు ఒకదినుసుసాధనమునకు శల్యమునకు) పేర్లు

సురక్రోవి పీరంగి బాణము గుంటక్రోవి జబురుజంగి తుపాకి జజాయి—ఇవి అగ్నిప్రసారణమునకు (అగ్నిని నలుమూలల చుట్టుకొనఁ జేసెడి ఆయుధము నకు మందుగుండు వేసి గట్టించి కాల్చ-ఇనుపగొట్టము కలయుద్దసాధన విశేషమునకు) పేర్లు

వాయిదార — వాయిదారు' అని (బ్రౌ)

దోదుమ్మి — ఇది కిరుసు' పర్యాయము లను చున్నది (బ్రౌ) (చూ అను) ఖడ్గము ఖడ్గవిశేషము అని అర్థ మిచ్చు చున్నది దీనికి (సూ ని) (బ్రౌ) కిరుసుకత్తి'కి ఇట్టియర్థమే ఇచ్చినది కిరుసు కడ రెం డంచులు గలిగి వంకరలు గలకత్తి' అనినది (చూ అను) దోదుమ్మి' కి ప్రయోగము గూడ ఇచ్చినది (బ్రౌ). ఆప్రయోగ మిది-చంద్రకాళ కురాళంబు సరిగెచెరుగు జిపుఁగు కెందమ్మిదోదుమ్మిచీనిరుమ్మి పైరిణీ

కమ్మితెరచాటుపాన్పుమీద' (హంస 5-167) (బ్రౌ పా (ముద్రిపా) ఇట్లున్నది- చంద్రకావి సరాళంబు సరిగె చెఱఁగు జిలుఁగు కెందమ్మిలోకమ్మి చీరకమ్మి పైరిణికమ్మితెఱచాటు పాన్పుమీఁద (5 144) అని

సైబు —దీనికి ప్రయోగ మిట్లున్నది- చాయలం గ్రక్కు నశిబుసైబుపట్టా నట్టిట్టు జళిపించుచుఁ దెంపుసొంపు దీపింప రయంబున' —(మల్ల(ల్లి?)పురా 2 48) (చూ సూ ని సైబు)-

కిరుస —ఇరుప్రక్కల వాదర గలిగి వాటమైనకత్తి- అని (సూ ని శ ర లు) దీనిస్వరూపమును కిళాప్రూప్యోదయ మిట్లు వర్ణించినది కిఱుసుకత్తి' కిరుసు' పర్యాయములు (చూ బ్రౌ) అపగతధైర్యుఁ జేసె నను నత్తఱి నాళుకవాణివేణిచా క్కఁపుఁబస కాముబల్కిరుసుకత్తియుఁ బోలె నరాళపార్శ్వమై యుపరికృత ప్రసూనరచనోజ్జ్వలతావిభవంబుచేత దంత పుఁబిడికైవడిన్ మొదలు తద్దయు నింపు జనింపఁ జేయఁగాన్' (కిలా పూ 7- 2)

ఒడిసె —ఇది ఈ అర్థము'న నిఘంటువులలో గ్రహింపఁబడ లేదు

వసి గసి —వేఁటకు సాధనములు గా వచింపఁబడు చున్నవి- వసులు గసులు ఆదిగాఁగఁ దెచ్చి రాటవికులు' (పి శకుం 6మొ) (చూ సూ ని గసి)

[సురక్రోవి — సురక్రోవి పిరంగి బాణము గుంటకోవి' అని (వావి పా.) (బ్రౌ శ ర లు) ఈపారమును అంగీకరింపవు. పిరంగి బాణము ఈయర్థమున వారు గ్రహింప లేదు సురక్రోవి గ్రహింపక సురకాలి' గ్రహించి (ఆం భా) అనినది (శ ర) (బ్రౌ,శ ర) రెండు సుబాణము' గ్రహించి ఈయర్థ మిచ్చి (ఆం భా పా) అను చున్నవి (బ్రౌ) ఒకచో (సుర) కోవి పిరంగి సుబాణము గుంటకోవ' అని (ఆం భా పా) ఇచ్చినది (చూ సుబాణము) ఇఁదు గణభంగ మేర్పడు చున్నందున (శ ర) దీనినే సురకాలి' అను మార్పుతో గ్రహించిన దనిపించును గుంటక్రోవ' అనుటమాత్రము విశేషము మఱియొకచోఁగూడ సుబాణము' (ఆం భా పా) గా (బ్రౌ) ఉదాహరించినది (చూ అను) ఐనను (బ్రౌ శ ర)ల పార మిట యుక్త మనిపింప లేదు బాణము' ఒకవిధ మగుపిరంగి -అని క్రిందిప్రయోగ మిచ్చినది (సూ ని) బాణములఁ జివ్వలునిచినబాణములను గుంటక్రోవుల ' (రా వి 5 22) బాణవిద్దె, బాణసంచు' మొద

లగునవి వ్యవహార ప్రయోగ దృష్టములు సబాణము సురక్రోవి' ఈయర్థమున అన్వేషణీయములు అందులకే జబురుజంగి కడ సూ ని ఇచ్చిన పారమే నాపార మైనది

గుంటక్రోవి — గుంటక్రోవి గుంటికోవి-రెండును గ్రహించినది (సూ ని) ఈ ఆం భా పా ను గూడ రెండువిధములఁ గా ఉదాహరించినది (చూ సూ ని గుంట కోవి జబురుజంగి) గుంటక్రోవ' (చి ని బ్రౌ శ ర)- అనినదికూడ (చూ గుంట కోవి. సూ ని) గుంటకోవి-పెట్లదిమ్మె గుంటకోవ- ఒకవిధమైనపిరంగి' అను చున్నది (బ్రౌ చూ అను)

గుంటక్రోవ — ఒకదినుసు పిరంగి అని (శ ర) గుంటికోవి- గుండు-క్రోవి ఒక విధ మైనతుపాకి-అవి (సూ ని) గుంటకోవ- అగ్నిప్రసారణము ఒకవిధ మైన పిరంగి ఆం భా అని బ్రౌ (చూ అను)

సీ బాదరు నాఁగను బరఁగుఁ దుపాకిలో
        పలను జానకిత్రాడు నిలుపుతావు,
  చుఱుకైనమందుపేర్వరఁగు రంజక మన
        లగ్గనఁ బ్రాకారలంఘనంబు
  అది రెండువిధములఁ బొదలుచు నుండును
        లగ్గ నా సురతాణిలగ్గ, యనఁగఁ
  బాషాణదార్వగ్నిభాండాదికావిధ
        లగ్గదిం పనఁగఁ జెలంగుఁ బోక

గీ తరలుడు, తరలిక యరుగు డరుగడమ్మ
  కదలుడు, కదలిక, కదలు కదలడమ్మ
  చనుట యేఁగుట యేఁగు, డం చనఁగ యాత్ర
  తగును, దైవతయాత్ర జాతర యన భవ 29

బాదరు—ఇది తుపాకిలోపలను జానకిత్రాడు నిలుపుతావునకు (నిప్పు ముట్టించెడి త్రాడు ఉంచెడి తుపాకులచెవికి బాదరమునకు) పేరు

రంజకము—ఇది చుఱు కైనమందునకు (తుపాకిచెవియందు కాల్చుటకై ఉంచెడి మందునకు) పేరు

లగ్గ—ఇది ప్రాకాంలంఘనమునకు (ముట్టడించి) కోటపై కెగఁబ్రాఁకుటకు) పేరు.

సురతాణిలగ్గ—ఇదియు ప్రాకారలంఘనమునకు (నలుమూలలనుండి ముట్టడివేసి కోట నెక్కుటకు) పేరు

లగ్గదింపు—ఇది పాషాణదార్వగ్నిభాండాదికమునకు (కోఁటగోడమీఁదనుండి శత్రులపై దొర్లించుఱాతిబండలు కొయ్యమొద్దులు నిప్పులకుండలు మొద లగు వానికి) పేరు

పోక తరలుడు తరలిక అరుగుడు, అరుగడము, కదలుడు కదలిక కదలు కదలడము చనుట ఏఁగుట ఏఁగుడు—ఇవి యాత్రకు (గమనమునకు ప్రస్థానమునకు ప్రయాణమునకు పయనమునకు) పేర్లు.

జాతర—ఇది దైవతయాత్రకు(దేవతాదర్శనమున కైన ప్రయాణమునకు, తీర్థయాత్రకు, దేవత తీర్థము పర్వతము, సముద్రము-మొద లగువానినిఁగూర్చి చేసెడి ప్రయాణమునకు) పేరు.

బాదరు — బాదరము' అను (రూపాం) ఉదాహరించి- జానకిత్రాడు కరపించే చిలుకడ' (౦ 8) అని (బ్రౌ)

సురాతాణిలగ్గ —(శ ర బ్రౌ లు) గ్రహింప లేదు మనుజేంద్రుఁ డంత సేనలఁ బనుపుచు సురాతాణిలగ్గఁ బట్టించిన (కువల 3 2) (చూ సూ ని)

యాత్ర —'యాత్రా వ్రజ్యా ఽభినిర్యాణం ప్రస్థానం గమనం గమః' (అమ.) ఇచ్చట (సుధ) ప్రస్థానమాత్రస్య' అని వ్యాఖ్యానించినది గెలువ నిచ్ఛయించిన రాజుయొక్క పయనము' - అని (గురు.)

దైవతయాత్ర — దేవతకొఱ కైన (దేవతాదుల దర్శనమున కైన)ప్రయాణము యాత్రా

తు యాపనే ఽపి స్యా ద్గమనోత్సవయోః స్త్రియామ్' ఒని (మేదిని) (చూ సుధ)
జాతర' కు ఉత్సవవిశేషము అర్థము గా ఆం ధ్ర వచించినది (చూ 1 42)

సీ వెలువడుట యనంగ వెడలుట యనఁగను
        నిర్గమనాఖ్య గా నెసఁగు చుండు
నెఱయుట యనఁగను బరఁగుఁ బ్రసరణాఖ్య
        యభియానము దనర్చు నఱుముట యన
విద్రావణాభిఖ్య వెలయుచు నుండుఁ దో
        లుట యనంగను బఱచుట యనంగ,
నెసఁగు నపక్రమ మీడేఁగు ననఁగను,
        దాడి యనంగను ధాటి యగును

గీ దుమ్ము దువ్వ దుమారము త్రుమ్మ తుమురు
    దవ పదడు బుగ్గి నాఁగను దనరు ధూళి
    నుఱుము నుగ్గు. పొడుము, పొడి సురుము సున్ని
    చూ రనంగను విలసిల్లుఁ జూర్ణ, మభవ 220

వెలువడుట, వెడలుట—ఇవి నిర్గమనమునకు (బయలువెడలుటకు బయలుదేఱుటకు) పేర్లు.

నెఱయుట—ఇది ప్రసరణమునకు (సేనాదులు అంతట వ్యాపించి ఉండుటకు) పేరు

అఱుముట—ఇది అభియానమునకు (ఎదుర్కొనుటకు, ఎదురు గా పోవుటకు) పేరు

తోలుట పఱచుట—ఇవి విద్రావణమునకు (పశువులు రథములు లో నగు వానిని నడిపించుటకు) పేర్లు.

ఈడేఁగు—ఇది అపక్రమమునకు (ఈడఁబోకకు యుద్ధాదులనుండి వెనుకకు మరలుటకు) పేరు

దాడి—ఇది ధాటికి (దండయాత్రకు శత్రువుల జయించుటకై సేనతో వెళ్లెడి దిగ్విజయయాత్రకు) పేరు

దుమ్ము దువ్వ దుమారము త్రుమ్ము తుమురు దవ పదడు బుగ్గి— ఇవి ధూళికి (పరాగమునకు రజస్సునకు, రేణువునకు ధూళికి, మట్టిపొడికి) పేర్లు

నుఱుము నుగ్గు పొడుము పొడి సురుము సున్ని చూరు—ఇవి చూర్ణమునకు (ఏదేని యొక వస్తువుయొక్క పొడికి) పేర్లు

ప్రసరణము — స్యా దాసారః ప్రసరణమ్' (అమ) అంతట సేన వ్యాపించుటకు'-అని (గురు) (సుధ) కూడ సేనాసంబంధి' గానే దీనిని వ్యాఖ్యానించినది

అపక్రమము — అహితాన్ ప్ర త్యభీతస్య రణే యాన మభిక్రమః'- అనియే అమర మీసందర్భమున అనినది అపక్రమో ఉపాయో విప్రయాణం పలాయనమ్ సంద్ర వోద్ద్రావ సంద్రావ ప్రదావ ద్రావ విద్రవాః' అని వచించినది (వైజ భూ క్షత్రి)

ధూళి — రేణు ర్ద్వయోః స్త్రియాం ధూళిః పాంసు ర్నా న ద్వయో రజః' అని చూర్ణ క్షోదః' అనినది (ఆం భా ఒక్లే (అమ)

సురుము —ఈపద మెవరును గ్రహింప లేదు (సూ ని) 'సురుము అని (ఆం భా పా) ఇచ్చినది (చూ నుఱుము)

చూరు — చూర అని బ్రౌ (ప్రా చూరు క చూరు) (చూ సూని చూరు)

దవ, పదటు — దవ పదటు' (వావి పా) (అపపా) (చూ సూ ని దవ) పదడు చేపట్టుడుఁ బసిఁడి యై చనదె (పండి 2ప (చూ శ ర)

[ వెనఁగు నపక్రము మీదేరె ననఁగను' అవి (వావి అప పా) ఈదేరు' ఈదేఁగు'గా ఉండు నని పై రీతిని సవరించుకొంటిని ఈదేరు' ఈయర్థమున ఎవరు గ్రహింప లేదు ఈడఁబోవు'- వెనుదీయు అపక్రమించు'- అని (శ ర) అర్థ మిచ్చినది ఇట్లె (ఈడన్ + ఏఁగు ఈదేఁగు అనవచ్చును ఈక్రియనుండి యేర్పడినకృదంత మిది కావచ్చును ఉవర్ణకం బడుక్వాదుల కగు' (బాలవ్య, కృ 2) (ఆం శే) అహ వోన్ముఖతకు నోల మాన గొనక పిఱు తివియ కీడఁబో కనఁ బేళ్లు దనరు' (14) అను చున్నది (శ ర మొ) ఈడఁబోవు'న కిచ్చినయర్థ మిందులకు విరుద్ధము ]

సీ॥ డాలు, టెక్కెంబు, సిడమ్ము పడగ యనఁ
గేతునామంబులు గేరు చుండు
నహమహమికపేరు రహి కెక్కు నోహరి
సాహరి, యనఁగను సమరయాత్రి
సారి నాఁ దగు, లావు, సత్తి సత్తువ బల్మి
పీఁచ మోపిక యన వెలయు శక్తి,
సలిగ, యం చనఁగ నాశ్రయబలంబు చెలంగుఁ,
గడిమి యుక్కు కఱకు గట్టి కడిఁది

గీ॥ నాఁగ శౌర్యాభిధానంబు గాఁగఁ జెలఁగు,
బీర, మనఁగను బిగు వన బింక మనఁగఁ
బరఁగు గర్వంబు వెలయును బంద, కోఁచ
పిఱికి దొబ్బలగొ ట్టన భీతుఁ, డభవ 221

డాలు టెక్కెము, సిడము, పడగ—ఇవి కేతువునకు (ధ్వజమునకు పతాకకు, జెండాకు, రాజు లో నగువారు తమ్ము గుఱుతించుకొనుటకై రథాదులందు ఉంచుకొనుచిహ్నమునకు) పేర్లు

ఓహరిసాహరి— ఇది అహమహమికకు (నేనే సమర్థుడను నేనే సమర్థుఁడను-అనువీరుల పరస్పరాహంకారమునకు) పేరు

సారి—ఇది సమరయాత్రకు (యుద్ధప్రయాణమునకు) పేరు

లావు సత్తి సత్తువ బల్మి, పీచము ఓపిక—ఇవి శక్తికి (సామర్థ్యమునకు బలిమికి) పేర్లు

సలిగ—ఇది ఆశ్రయబలమునకు (అండదండలవలన కలుగుబలిమికి) పేరు

కడిమి, ఉక్కు, కఱకు, గట్టి, కడిఁది—ఇవి శౌర్యమునకు (వీరత్వమునకు పరాక్రమమునకు, మొక్కలమునకు బంటుతనమునకు) పేర్లు

బీరము బిగువు బింకము—ఇవి గర్వమునకు (వీరత్వమువలని-అహంకార మునకు) పేర్లు

పంద, కోఁచ పిఱికి దొబ్బలగొట్టు—ఇవి భీతునికి (పిఱికివానికి భయపడిన వానికి) పేర్లు.

టెక్కెము —టెక్యము టెక్కియము (రూపాం )- ధ్వజంబుపేళ్లు టెక్యము టెక్కెము టెక్కియము సిడంబు పడగ డా లన ' అని (సాంబ స్థా 62 )

కేతువు — (అమ ) ధ్వజపర్యాయముల వచించుపట్టున దీనిని వచింపక పోయినను నానార్థములయందు దీనిని ఇచ్చినది గ్రహభేదే ధ్వజే కేతుః' (అని )

అహమహమిక — అహం పూర్వ మహం పూర్వ మి త్యహంపూర్వి కోన్నతిః స్యా దహమహమికా యో ఒహంకారః పరస్పరమ్' అని (వై జ భూ క్షత్రి ) దీనికి వ్యుత్పత్తి (గణ మ ) ఇట్లు ప్రదర్శించినది-అహం శక్తో ఒహం శక్త ఇ త్యస్తి యస్యాం క్రియాయాం సా అహమహమికా స్వార్థికో మత్వర్థీయో వా కాట్ అహం పూర్వ మహం పూర్వం ప్రవర్త ఇతి విగృహ్య తద్భావో ఒహమహమికా'-పృషోదరాదిత్వా ద్వవ్యభావాది రితి సుధాకరః (గణ సమా 120 శ్లో ) మయూరవ్యంసకాదిగణ మాకృతిగణము తత్పారమువలన సాధుత్వము దీని కని- అయం మయూరవ్యంసకాది రాకృతిగణః తేన అహం శక్తో ఒహం శక్త ఇతి యస్యా మిత్యర్థే ఒహమహమి కే త్యస్య సాధుత్వం బోధ్యమ్ - అని (శేఖర భైరవవ్యాఖ్య ) (అమ ) అహమహమికా తు సా స్యా త్పరస్పరం యో భవ త్యహంకారః' అనినది తదనుసరణమే నే నొనర్చితిని ఆహరిఁ జూచి వేలుపు లహంకరణంబుల దైత్యసేనతో నోహరిసాహరిం బెనఁగ ' (వరాహ 6 14 ).

సారి —(ప్రౌ ) ఈయర్థమున దీనిని గ్రహింప లేదు (శ ర ) గ్రహించినది (సూ ని ) గ్రహించి, (ప్రబం -165 ) (మొ ) ప్రయోగములఁగూడ ఇచ్చినది ఖాడి' వేఱుగా (ఆం భా ) వచించు చున్నది (2 220) అందులకే ఈ యుద్ధయాత్ర' యుద్ధమునందలియాత్ర (సన్నాహము) అనఁ దగి యున్నది

సలిగ — సలిగె' రూపాం ) (అని) (బ్రౌ )

గట్టి —(ఆం సం ) గట్టి బిగువు' ధైర్యమునకు పేర్లను చున్నది- ఉక్కు- చేగ దిటము చేవ యొదుటు గట్టి దిట్ట మిఱిది బిగువు నాఁగ ధృతికిఁ బేళ్లు' (మాన 57 ) ఇది రెండపయర్థ మనఁ దగినది

శౌర్యము —(అమ ) శౌర్యము బలము పరాక్రమము-(మొ) ఏకార్థము లనినది- ద్రవిణం తర స్సహో బల శౌర్యాణి స్థామ శుష్మ చ శక్తిః పరాక్రమ ప్రాణౌ' అని యనను ( వైజ )-వీనిని వేఱుపఱచినది పరాక్రమ శ్శౌర్యం వీర్య మథ స్థామ బలం శుష్మ తర స్సహః' (భూమి క్షత్రి )

గర్వము —గర్వమునకు పే ర్లిదివఱకు వచింపఁబడినవి-(చూ 133 ) ఈగర్వము వే ఱనవలయును వీరగర్వ' మిది.

[దొబ్బలగొట్టు — బొబ్బలగొట్టు'- (ప్రాఁత ప్ర పా ) దొబ్బలగొట్టు'- (వ్రాఁత ప్ర పా ) దొంబులగొట్టు-(చి ని బ్రౌ పా ) దెబ్బలుగొట్టు-అని (వేంక ) దెబ్బల గొట్టు (ఆంధ్ర పదా ) (చూ సూ ని దొంబులిగొట్టు ) (శ ర ) ఇట్లను చున్నది- 'దొంబులిగొట్టు- (దొందు+పులి+కొట్టు) వ్యతిరేకలక్షణచే పిఱికి భీరువు. రెండు పులులను గొట్టువాఁడు-అని శబ్దార్థము'(అని ). సమర భీరు వునకుఁ బేళ్లగుఁ బాఱుఁ బోతు పిఱికి కోఁచ పందయు దెబ్బలుగొట్టన ' (వేంక మాన 69 ) చను భీతుఁడు కోఁ చనఁ బం దన దెబ్బలగొట్టు పిఱికి యనఁ బారోవ్పత న్నను' (ఆంధ్ర పదా నర వర్గ 40 ) (చూ సూ ని ) ఇట- వేంక (వ్రాఁత ప్ర పా.) ఒకటి- దొబ్బల గొట్టు'గా ఉన్న దని దానినే బ్రౌ. గ్రహించి, వేఱు వేఱుగా ( దొబ్బల గొట్టు' గా) గ్రహించిన దని (సూ ని ) (బ్రౌ )- దొంబులగొట్టు' గ్రహించి భీతు డు' అను 'అర్థ' మిచ్చి ఆం భా అనినది దొబ్బల గొట్టు' వేఱువేఱుగా గ్రహించి సమర భీతుఁడు' అని అర్థ మిచ్చినది (సూ ని ) అనినట్లే మఱియొకచో (చూ బ్రౌ అను ) ఆం భా పా కూడ వ్రాఁత ప్రతిపా ( దొబ్బలగొట్టు' ఒకటి) వేంక వ్రాఁత ప్రతి పా తో సంవదించు చున్నది కలదు అది వేఱు ఇది వేఱు' అనుట ఉచితము కాదు (ఆం పదా పా ) దె' దొ' అనుమార్పుతో ఇట్టిదే అయి యుండును ఇట్లీ మూఁడు ని ఘంటుపాఠములు సంవదించు చున్నప్పుడు ఆం భా పా దొబ్బలగొట్టు' అనియే అయి యుండు నవి నిశ్చప్రవచము దొబ్బ' అనుదానికి కండ' అను-అర్థము ప్రయో

గదృష్టము కండలు గలుగు ('పెరుఁగు') స్వభావము గలవాఁడు బయటికిఁ గదలక గేహేశూరుఁ డై యింటనే ఉండువాఁ డగుటనుబట్టి కండలు పెరుఁగునట్టివాఁడు పిఱికి పంద-అని అర్థము వచింప వచ్చును యథాస్థితము గానే వ్రాఁతప్రతిపా సమన్విత మగు చున్న దిప్పుడు ఏసంస్కారము లేక వ్యతిరేకలక్షణాశ్రయణ మగతికగతికము 'దొబ్బల' గొట్టు వేఱుపదము అని,(వేంక ను)ఆం. భా తో వేఱుచేసి, ఆం. భా కం ఠె వే అర్థము గా సమరభీతుఁడు' అనుట అనుచితము ఇట వేంక లో సమర భీతుఁడు' అని కానవచ్చు చున్నది (చూ వావి ప్రతి ) అందులకే 'దొబ్బలగొట్టు' అనియే నేను (ఆం భా. పా. గా) గ్రహించికొంటిని ]

సీ పోరాట పోట్లాట పోరు, కయ్యము, చివ్వ,
 కంగారు, కంగిస కలను, దురము,
గొడవ బవరము, జగడ, మాల, మని యన
 యుద్ధవాచకము లై యొప్పు చుండుఁ,
దనరును బెనఁకువ పెనఁగులాట, యనంగఁ
 బెన యన గ్రుద్దులా, టన నియుద్ధ
మలరు దండడి దొమ్మి యన సంకులరణాఖ్య,
 దంట, పో, రనఁ దగు ద్వంద్వయుద్ధ,

గీ మలరు చుండును కన్నెకయ్యం బనంగఁ
 బ్రథమయుద్ధాఖ్య, యెక్కటిబవర, మనఁగ
 నొంటిపోట్లాటపేరు గా నొప్పు చుండు,
 భూషితభుజంగ శ్రీమాతృభూతలింగ 222

పోరాట, పోట్లాట పోరు కయ్యము, చివ్వ, కంగారు, కంగిస, కలను, దురము, గొడవ, బవరము, జగడము, ఆలము—ఇవి యుద్ధమునకు (రణమునకు, సమర మునకు ఆహవమునకు, సంగ్రామమునకు ఆజికి, అనికి) పేర్లు

పెనఁకువ పెనఁగులాట గ్రుద్దులాట—ఇవి నియుద్ధమునకు (బాహుయుద్ధము

నకు, జెట్టిపోట్లాటకు మల్లయుద్ధమునకు శస్త్రము పట్టకుండ భుజములు పిడికిళ్లలో నగువానితో పోరాడుపోరాటమునకు) పేర్లు

దండడి దొమ్మి—ఇవి సంకులరణమునకు (తుములయుద్ధమునకు రెండుపక్షముల సైన్యములు కలయఁబడి (అందఱు కలసి) జరపుపోరాటమునకు దొమ్మికయ్యమునకు) పేర్లు

దంటపోరు—ఇది ద్వంద్వయుద్ధమునకు (జంటపోరునకు సేనలోనివారు ఒకరితో ఒకరుగా ఇద్ద ఱిద్దఱు కలసి జరపుపోరాటమునకు) పేరు

కన్నెకయ్యము—ఇది ప్రథమయుద్ధమునకు (మొదట జరపుయుద్ధమునకు, యుద్ధారంభమునకు) పేరు

ఎక్కటిబవరము— ఇది ఒంటిపోట్లాటకు (సైన్యాదులసంబంధము లేక ఇద్దఱు వీరులు అసహాయులుగా ఒకరితో ఒకరే చేయుయుద్ధమునకు, ద్వంద్వయుద్ధవిశేషమునకు) పేరు

పెనఁకువ —దీనిని యుద్ధసామాన్యమునకు వాచకముగా ఇతరనిఘంటువులు (వేంక మొ) గ్రహించినవి కయ్యము పెనఁకువ కలను దుర మ్మనఁ బోట్లాట జగడము పోరు బవర మని చివ్వ యేద్దె ఱ యాలము నాఁగ జన్యము (మాన 54) అని చివ్వ యేద్దెఱ యాలము బవరము పోట్లాట పెనఁకువ పోరు కలను కయ్యము దురము జగడ మన యుద్ధాఖ్య లమరు' (సాంబ మాన 31). పెనఁకువ జగడము యుద్ధంబునకుఁ బేళ్లు (ఆం సం మాన 48) కాన యవశ్యము పెనఁకువ నియుపాయమునఁ బగఱఁ గడ తేర్చు ధృతిం బూని (భార ఉద్యో 3 19) మొ (పెనఁగు-కువ) అని వ్యుత్పత్తి నియుద్ధమునే (పెనఁగులాడుమొ వానినిఁబట్టి)వాచ్యార్థముగా ఇది పూర్వము వచించెడి దనుట యుచితము తరువాత ఇది యుద్ధపర్యాయముగా పర్యవసిత మయిన దని పించును (సుదతి విరిఁబోఁడి' మొ వానివలెనే) ఈ విశేషార్థమును క్రిందిప్రయోగ మిట్లు తెలియఁ జెప్పు చున్నది మెడ నొకపూలసరం బిడి వడి ననిచిన నేఁగి పెనఁకువకుఁ బిలుచుటయున్' (అచ్చ కిష్కిం 40) (చూ సూ ని) ఇచ్చట నియుద్ధమే జరగినది నియుద్ధమే యిది

[నియుద్ధము — గ్రుద్దులా టనిన యుద్ధము' అని (వావి పా) (అపపా) దీనినే (సూ ని) గ్రహించి గ్రుద్దులాట' పదమునకు 'యుద్ధము అర్థ మనినది ప్రమాదము (శ ర) (గుద్దులాడుట- ఒకరి నొకరు గ్రుద్దుచు పోట్లాడుట'- అనియే అర్థ మిచ్చినది (సూ ని) 'పెన' కడ- గుద్దులా టన నియుద్ధము - అనియే (ఆం భా పా) ను ఉదాహరించినది నియుద్ధం బాహుయుద్ధే స్యాత్'అని (అమ) ఇట బాహుయుద్ధ మను నది మల్లయుద్ధము నకు వాచకము ఇందు బాహువులు నాంతరీయకము లగుటచే బాహుయుద్ధము' అనిపించుకొనిన దిది ]

ఎక్కటిబవరము — (సూ ని) దీనికి ఒకరితో ఒక్కరే చేయుయుద్ధము ద్వంద్వయుద్ధ ము'- అని అర్థ మిచ్చినది

సీ. అర్పు బొబ్బ, యనంగ నగు సింహనాదంబు
క్రం, దనఁగాఁ దగుఁ గ్రందనంబు
పొరుగు పొలపు పొమ్మ పొలిమిడి పోలు సు
మాళము బవిళి, మైమఱపు బ్రమరి
యనఁగ మూర్ఛాహ్వయం బలరారు చుండును
రాయిడి రారాపు రం పనంగ
నవమర్దనం బొప్పు హావడి యావడి
యన నుపద్రవసంజ్ఞ దనరు చుండు

గీ డామరం బగుఁ జూఱ కొల్ల పఱి యనఁగ,
వలస, యనఁ బ్రవాసాఖ్య గా వఱలు, జయము
గెల్పు గెలువడి గెలువము, గెలు పనఁ దగు,
భూషితభుజంగ శ్రీమాతృభూతలింగ 223

అర్పు, బొబ్బ—ఇవి సింహనాదమునకు (క్ష్వేడకు, సింహగర్జకు యుద్ధకాలమున వీరులు అఱచెడి అఱపు నకు వీరగర్జకు) పేర్లు

కఱిందు—ఇది క్రందనమునకు (యోధులు పరస్పరము అహంకారపూర్వకము గా యుద్ధమునకు రమ్మని పిలుచుపిలుపునకు వీరాలాపమునకు) పేరు

సొరుగు, సొలపు సొమ్మ, సొలిమిడి సోలు సుమాళము బవిళి మైమఱపు బ్రమరి—ఇవి మూర్ఛకు (వైచిత్త్యమునకు బాధాదులచే స్మృతి తప్పి వర్తించు టకు) పేర్లు

రాయిడి రారాపు ఱంపు—ఇవి అవమర్దమునకు (శత్రురాష్ట్రమునకు కలిగించెడి ఒత్తిడికి, పీడనమునకు) పేర్లు

హావడి ఆవడి—ఇవి ఉపద్రవమునకు (హావళికి ఆవళికి, బాధకు) పేర్లు.

చూఱ, కొల్ల పరి—ఇవి డామరమునకు (డమరమునకు విప్లవమునకు కొల్ల మొద లయిన దేశోపద్రవమునకు) పేర్లు

వలస—ఇది ప్రవాసమునకు (రాజోపద్రవాదులచే దేశము విడిచి పరదేశమునకు పోయి నివసించుటకు) పేరు.

గెల్పు, గెలువడి గెలువము గెలుపు—ఇవి జయమునకు (యుద్ధాదులందలి విజ యమునకు) పేర్లు.

అర్పు — బొబ్బ యార్పన నట్టహాసాఖ్య లెసఁగు' (సాంబ మాన 44). ఆర్పు పెడ బొబ్బ యన నట్టహాస మలరు' (వేంక మాన 68) ఇది రెండవయర్థ మనఁ దగినది బొబ్బమెకము' అని సింహమునకు పేరు బొబ్బ- సింహధ్వని' తత్సదృశ మగు భయంకరనాద మగుటనుబట్టి వీరగర్జయును బొబ్బ' అనిపించుకొనినది

క్రందనము — క్రన్దనం యోధసంరావః' అని (అమ)

[సొమ్మ — సొమ్మ'(వావి అపముద్రి) బారి దాఁకెను గడఁబట్టె మైమఱచెను సొమ్మ టఁబోయెను సొమ్మసిలెను వడఁ జెందె నన మూర్ఛ కడరు అని (వేంక (మాన 69) సొమ్మ దెలిసి' (అచ్చ యు కాం) (చూ శ ర)]

సుమాళము —సంతోషాధులచే కలుగుపారవశ్యము ఆవేశము- అని (శ ర)

రంపు —ఈయర్థమున ఈపదమును (బ్రౌ శ ర లు) గ్రహింప లేదు ఇమ్మాడ్కిం బటి వోయిన యమ్మొత్తము నడపికొనుచు' అని (భార మౌస 189)

అవమర్దము — అవమర్ద స్తు పీడనమ్' అని (అమ) దేశాదే రుపద్రవదానస్య' అని (సుధ) ['అనుమరనం బొప్పు' అని (వావి అపముద్రి)] ఒరయిక' ఒత్తిడి'- అనువానియట్లు సాధారణవాచకములు గూడ ఇవి (రాయిడి మొ) రెండవయర్థ మది విశేషార్థ మిది

డామరము — డిమ్బే డమర విప్లవౌ ' అని (అమ) ఈ డమర శబ్దమే (ప్రజ్ఞాద్యణ్ణ న్తమై) డామర' మైనది డామరే సమరే వా ఽపి దుర్భిక్షే వా జనక్షయే బందిగ్రాహే భయార్తో వా సదా స్వత్రీం నిరీక్షయేత్-' ఇచ్చట మాధవీయవ్యాఖ్య ఇట్లను చున్నది- డామరః పరసైన్యకృతోపద్రవాదిః' (పరా ప్రాయ 17శ్లో)

గెలువడి — గెలివడి గెలుపము'-అని (వావి పా) (అపసా)]

సీ. పగ యీఁగు టనఁ దగు వైరశుద్ధి పరుగు
పరువు పాఱు, టన ధావనము చెలఁగు,
గునుకు, దనంగను గును, కనఁగా నల్ప
ధావనసంజ్ఞ యై తనరు చుండుఁ,
దొలఁగు, దనంగను దలఁగు దనంగను
నపసరణాఖ్య లై యలరు చుండు
నపజయసంజ్ఞ లై యలరు బన్నము, విఱు
గోటమి, యోడుట యోలచెంగ

గీ. నాలు, విఱుగుడు విఱుపు నాఁ గ్రాలు చుండుఁ,
ద్రుంచుట చిదుముట తెగటార్చు, పరిమార్చు,
పొరిగొనుట పిల్కుమార్చు, చంపుట తునుముట,
యనఁగఁ దగు హింస భక్తహృద్వనజహంస 224

పగ యీఁగుట —ఇది వైరశుద్ధికి (వైరనిర్యాతనమునకు పగ తీర్చుకొనుటకు) పేరు.

పరుగు పరువు పాఱుట—ఇవి ధావనమునకు (శీఘ్రగమనమునకు పరుగెత్తుటకు) పేర్లు

గునుకుడు గునుకు—ఇవి అల్పధావనమునకు (మందధావనమునకు మెల్లని పరుగునకు) పేర్లు

తొలఁగుడు తలఁగుడు—ఇవి అపసరణమునకు (తప్పుకొనుటకు తొలఁగుటకు) పేర్లు.

బన్నము విఱుగు ఓటమి ఓడుట ఓలచెంగనాలు విఱుగుడు విఱుపు– ఇవి అపజయమునకు (పరాజయమునకు ఓటమికి) పేర్లు.

తుత్రించుట చిదుముట తెగటార్చు పరిమార్చు పొరిగొనుట పిల్కుమార్చు, చంపుట తునుముట —ఇవి హింసకు (వధమునకు) పేర్లు

[విఱుపు —విఱుగు-(అపపా) పునరుక్తము విఱుపు'-ఇది అగు ననిపించినదీ విఱుపు' నకు- అపజయము' అను అర్థము' కలదు- వేవిధంబుల మూఁకవిఱుపులమాట లేవేళఁ జెప్పెద రెదురుమెచ్చులకు' (అభి ద్వి 140) విఱుపుడు' అనుదానికి బహువచనము విఱుపులు- అని (బ్రౌ) (చూ విఱుపుడు) విఱుపు నకే (బ వ) ఇది అనుట ఉచితము గా తోఁచు చున్నది ]

అపజయము — అపజయ పరాజయ శబ్దములు పర్యాయములు- రణే భఙ్గః పరాజయః' అని (అమ)

హింస — హింసా చౌర్యాదికర్మ చ అని (అమ) ఆదినా బన్ధన త్రాసన తాడనాది- చాద్వధో ఒపి అని (సుధ) హింసా' శబ్దమునకు వధము అను అర్థము స్పష్టముగానే ఇచ్చినది (వైజ) వ్యాపాదనం చ హింసా చ కదనం సంకులో వధః (భూమిశ్రీ) ఇందుకుల మఱికొన్ని పర్యాయక్రియలను (వేంక) ఇచ్చినది - నుగ్గాడెఁ బరిమార్చె నులిమెను జక్కాడె మన్నిగొంచె సదమద మొనర్చె బించ మణఁచెఁ

జంపెఁ బిలుకు మారిచెను జా గఱ లాడెఁ బగ దెంచె నుఱుముచేసెఁ దునిమె మడిపె ముగించెను ద్రుళ్లడంచెఁ దుఱించె గగ్గులకాడు గావించె నులిచెఁ జెండె వెంపరలాడెనాఁ జెలఁగుపేళ్లవి యగును వధించె ననుటకు (మాన 54) ఇట్లే- (ఆం సం) సాంబ) కూడ వచించినవి

సీ సమయుట యీల్గుట చావు చక్కడఁగుట
        కుఱింగుట తుఱింగుట కూలుట దుది,
    దెళ్లుట మడియుట తెగుట డీల్పడుట నీ
        ల్గుట మొదలెచ్చెడు టడంగుట పొలియుట,
    మిత్తి పెన్నిదుర నా మీఱును మరణము
        సొర, సొద యనఁగను బరఁగును జిత,
    మొండె మనంగను బొల్చుఁ గబంధంబు
        సబము పీనుం గన శవము దనరు

గీ నడరు శవయానము గఁ బాడె పడియ యనఁగఁ
    గాడు మసనంబు వలికి నాఁగను శ్మశాన
    మడరుఁ, జెఱ యనఁగాఁ బ్రగ్రహంబు దనరు
    భూషితభుజంగ శ్రీమాతృభూతలింగ 225

సమయుట ఈల్గుట చావు చక్కడఁగుట కుఱింగుట తుఱింగుట కూలుట, తుది, తెఱిళ్లుట మడియుట, తెగుట డీల్పడుట నీల్గుట మొద లెచ్చెడుట, అడఁగుట పొలియుట మిత్తి పెన్నిదుర—ఇవి మరణమునకు (కాలధర్మమునకు, పంచతకు నిధనమునకు మృతికి చచ్చుటకు) పేర్లు

సొర, సొద—ఇవి చితకు (చితికి, ఒలికికి, పీనుఁగును కాల్చుటకై పేర్చిన కట్టెలు లో నగువానిప్రోగునకు) పేర్లు

మొండెము—ఇది కబంధమునకు (అశిరస్సునకు తల తెగినశరీరమునకు) పేరు

సబము పీనుఁగు___ఇవి శవమునకు (కుణపమునకు, ప్రేతమునకు మృతశరీర మునకు, ప్రాణము లేనిబొందికి) పేర్లు

పాడె పడియ___ఇవి శవయానమునకు (శవవాహనమునకు, ఖటికకు శవ మును కొనిపోయెడి ఒకవిధ మగువాహనమునకు) పేర్లు

కాడు మసనము వలికి___ఇవి శ్మశానమునకు (పితృవనమునకు పరేతభూమికి ఒలుకులమిట్టకు, వల్లకాటికి) పేర్లు

చెఱ___ఇది పరిగ్రహమునకు (ఉపగ్రహమునకు బందికి, చెఱ పట్టినమనుష్యా దులకు) పేరు

మరణము —[(వేంక ) మరణించెను అనుటకు పర్యాయక్రియలను కొన్నిటిని ఇట్లు ఉదాహ రించినది- పెద్దనిద్దుర పోయె బిద్దె దోరెను గంతు, గౌనియెఁ జనెఁ దెరలెఁ గూలెఁ జచ్చెఁ గెడసె నీలిగెఁ ద్రెళ్లె మడిసె సమసె బ్రుంగె నేఁగె ముగిసె ఈక్కె మెగురఁ గొట్టెఁ గ్రుంకెఁ దేఱెను బోయె డింకవేసెను ద్రుంగె నన గను మృతు డయ్యె ననుట కొనరు' (మాన 66 )]

[పడియ — బడయ' అని (వావి అపపా ) బడియ' అని గ్రహించినది (సూ వి ) ఇట్లు గ్రహించియు- బడయ' అని (అం భా పారము) ఇచ్చినది- (చూ పాడె ) పడియె'-అని (బ్రౌ పా ) పడియ' అనుట యుక్తమనిపించినది పాడె' కు పడె' (పడియ) (రూపాం ) అనఁ దగినవి అద్విత్వం చ భవే ద్విత్వం హ్రస్వోదీర్ఘ శ్చ కేషు చిత్' అని (అథ కా )]

వలికి —'వలికి వల్కి' ప్రదర్శించి మండువల్కులు చేరి మానవమాంస ఖండంబు లొండొండ గసికల గ్రుచ్చి (హరి ద్వి ఉ 823 ) అనినది (బ్రౌ ) (సూ వి ) ఇట- మండునొల్కుల' అనియే పార మను చున్నది చితి పేర్చెడిచోటు' గూడ దీనికి లాక్షణిక మగు- అర్థము

[చిత — చింత' అని (బ్రౌ పా ) వ్యాకులము అని అర్థముగూడ ఇచ్చినది (బ్రౌ ) (చూ అను పార ) ఇది (అపపా ) ఈ సందర్భమున (అమ ) స్యాత్ప్రఞ్చ తా కాలధర్మః ప్రగ్రహోపగ్రహౌ బన్ద్యామ్' అని చితా చిత్యా చితిః స్త్రియామ్'

అనినది దీనిని అనుసరించియే సౌర సౌద యనఁగను బరఁగును జిత' అనినది (అం భా) వ్యర్థ'కు పేర్లు వచించినది వేఱు గా అం భా (చూ 1 150) చింత' ఇది కాదు ]

ప్రగ్రహము — ప్రిగ్రిహోపగ్రహౌ బన్ద్యామ్' అని (అమ) ఇట (గురు)- చెఱపట్టి తెచ్చినవారి నుంచుచోటు పేళ్లు' అని చెఱపెట్టితెచ్చినమనుష్యాదులు-అని కొందఱు' అనినది (గురు) కొందఱు' అనినదానినే దీనికి అర్థము గా ఇచ్చినది (సూ ని) (చూ చెఱ)

తే అడరుఁ గారాగృహంబు గుయ్యారము చెఱ
సాల, బందిగ, మనఁగను జప్ప యనఁగ
ముద్ర తగుఁ, దోఁచు జీవనమ్మ గను మనుట
మనికి బ్రతుకు బ్రిదిమి, యన, మాతృభూత 226

గుయ్యారము చెఱసాల బందిగము—ఇవి కారాగృహమునకు (బన్ధనాలయము నకు బంధించినవారిని (ఖైదీలను) ఉంచెడిగృహమునకు) పేర్లు.

చప్ప—ఇది ముద్రికు (సంజ్ఞాక్షరములు చెక్కిన ఉంగరము లో నగుదానికి, మొహరు నకు) పేరు

మనుట మనికి బ్రతుకు, బ్రిదిమి—ఇవి జీవనమునకు (మనుగడకు, జీవించుటకు, ప్రాణధారణమునకు, బ్రతుకుటకు) పేర్లు

[బందిగము — బందిక మన' అని (ప్రౌ పా) ]

చప్ప — ముద్ర' అని నిఘంటువులు ఈ ముద్ర' శబ్దమునకు చాలయర్థములు గలవు ప్రకరణమునుబట్టి పైయర్థమే యుక్త మనిపించినది

జీవనము — జీవో ఽసుధారణమ్' -ని (అమ)

గీ. శ్రీలు వెలయంగ నీపేరఁ జేయుకతనఁ
బరఁగు నిద్ధర క్షత్త్రియవర్గ మిట్లు,

గైకొనుము దీని భక్తసంఘాభిమాని
మాతృభూత జగత్త్రయీ మాతృభూత 227

[చూ వ్యాఖ్యాకై స్వర్గ 68 ]

ఇది

క్షత్త్రియవర్గము

---

# వైశ్య వర్గము

సీ. వైశ్యనామంబులు వఱలుఁ గో, మ ట్లన
బేహారు లనఁగను బేరు, లనఁగ
నడక, యనంగను నడత యనంగను
నడవడి యనఁగను నడరు వృత్తి,
కొలు వని వ్రాయుట కొలువు త్రోయుటయు లా
వణము సలితము, నా వఱలుఁ గ్రమతఁ,
గొలు, వటం చనఁగను వెలయు సేవావృత్తి,
వేఁడు, టనంగను వెలయు యాచ్ఞ,

గీ య, ప్పనఁగ రవడి యనఁగ నలరు ఋణము,
వడ్డి, తేమాన మనఁగను వఱలు వృద్ధి,
పరచి, యన యాచితక మొప్పుఁ బొరచి యనఁగఁ
దద్విశేషంబు దనరును, ధాతృవంద్య 228

కోమట్లు, బేహారులు బేరులు—ఇవి వైశ్యులకు (ఊరుజులకు, మూఁడవకొలము వారికి) పేర్లు

నడక, నడత నడవడి—ఇవి వృత్తికి (జీవికకు, జీవనోపాయమునకు బ్రదుకు తెరువునకు) పేర్లు

లావణము—ఇది కొలువు అని వ్రాయుటకు (కొలువు (పని) ప్రారంభము అని వ్రాసికొనుటకు క్రొత్త గా వచ్చినకొలువుడుకానిని (పనివానిని) పట్టికయందు వ్రాసికొనుటకు) పేరు

సలితము—ఇది కొలువు త్రోయుటకు (పనినుండి తొలఁగించుటకు; కొలువుడు కానిని (పనివానిని) కొలువు మాన్పించి బయటికి పంపుటకు) పేరు.

కొలువు—ఇది సేవావృత్తికి (పరచిత్తానుసరణమున కొలువు కొలుచుటకు శ్వవృత్తికి) పేరు

వేఁడుట—ఇది యాచ్ఞకు (యాచనకు అర్థనకు అడుగుకొనుటకు) పేరు

అప్పు రవడి—ఇవి ఋణమునకు(ఒకరికడ ధనాదులు బదులుగా తీసికొనుటకు) పేర్లు.

వడ్డి తేమానము—ఇవి వృద్ధికి (అప్పిచ్చువానికి అప్పు పుచ్చుకొనినవానివలన నూటి కింత అని అధికము గా వచ్చుధనమునకు) పేర్లు

పరచి—ఇది యాచితకమునకు (ఎరవునకు, కొద్దిదినములు వాడుకొనుటకై అడిగి తెచ్చుకొనెడిసొమ్మునకు) పేరు

పొరచి—ఇది యాచితకవిశేషమునకు (చేబదులు గా అడిగి తెచ్చుకొనినధనాదికమునకు) పేరు.

వైశ్యనామములు — మఱికొన్నిటినిఁ గూడ వైశ్యపర్యాయములఁగా (వేంక) ఇట్లు ఇచ్చినది 'తొడకొడుకు తిరువంగడపుఁబుట్టువు బచ్చు బేరి కోమటి యన నూరుజన్ముఁ' (దు) (మాన 27)

వృత్తి — 'ఆజీవా జీవికా వార్తా వృత్తి ర్వర్తనజీవనే' (అమ)

వృద్ధి — ఈసందర్భమున (అమ) 'అర్థప్రయోగస్తు కుసీదం వృద్ధిజీవికా' అని 'వడ్డిబ్రతుకు' ను (వడ్డివ్యాపారమును) పేర్కొనినది ఈవృద్ధినిఁ గూర్చినభేదములు ఇట్లున్నవి- విచ్చనిచ్చవడ్డి నెలనెలవ ద్దొడఁ, బాటివడ్డి వడ్డిపైనివడ్డి యనఁగ నాల్గు తెఱఁగు లయ్యె నావడ్డి దాఁ, దగవుతోడ నెక్కుఁ దరతరంబ' (విజ్ఞా వ్య 66) (చూ. సూ వి) వైజ వీని నిట్లు పేర్కొనినది- సా కాయికా ఽన్వహం దేయా ప్రతిమాసం తు కాలికా కాలి (మి॰) కా తు స్వయందృష్టా చక్రవృత్తి (ద్ధిః) స్తు వృద్ధిజా' (భూ వైశ్యా)

యాచితకము — 'యాచ్ఞయా ఽఽప్తం యాచితకమ్' అని (అమ) అడిగి తెచ్చుకొనువస్తువు పేరు ఎరవును' అని (గురు)

సేవావృత్తి — సేవా శ్వవృత్తిః అని (అమ) ఇట సేవా చ వృత్తిః అని (పారాం) (చూ. గురు) వృత్తులగురించి మనువు ఇట్లను చున్నాఁడు- ఋత ముఞ్ఛశిలం జ్ఞేయ మమృతం స్యా దయాచితమ్ మృతం తు యాచితం భైక్షం ప్రమృతం కర్షణం స్మృతమ్ సత్యానృతం తు వాణిజ్యం తేనాఽపి ఖలు జీవ్యతే సేవా శ్వవృత్తి రాఖ్యాతా తస్మా త్తాం పరివర్జయేత్' (అని)

[సలితము — (సీతము' (వావి పా) సలితము' అనియే (బ్రౌ. శ ర)]

సీ. అప్పులవాఁ, డన నగు నుత్తమర్ణాఖ్య,
    యధమర్ణుఁడు చెలంగు నరువరి యనఁ,
దాకట్టు కుదువ, యుద్దర, వారకం బీ, డ
    నంగను నాధి చెలంగు చుండు
నాపమిత్యకసంజ్ఞ యలరు వీ, డనఁగను,
    గాఁ, పనఁ గమ్మతకాఁ, డనంగఁ
గమతగాఁ డనఁగను గమ్మతీఁ డనఁగను
    దుక్కిము చ్చనఁగను దోఁచు చుండు

గీ. హాళికాభిధ నువ్వుచే ననఁగఁ దిల్య
మలరు, నీరీతి ధాన్యభేదాఖ్య లరసి
వానిచే నని పలుకంగ వచ్చుఁ జుమ్మ,
భూరిభవభంగ శ్రీమాతృభూతలింగ 229

అప్పులవాఁడు—ఇది ఉత్తమర్ణునకు (ఋణదాతకు అప్పు ఇచ్చినవానికి) పేరు

అరువరి—ఇది అధమర్ణునకు (ఋణగ్రస్తునకు అప్పు పుచ్చుకొనినవానికి) పేరు.

తాకట్టు కుదువ, ఉద్దర, వారకము ఈడు—ఇవి ఆధికి (ఆయకమునకు, ఆహూకమునకు, నమ్మకమునకై ఉత్తమర్ణునికడ అధమర్ణుఁడు ఉంచెడిసొత్తునకు) పేర్లు.

వీడు—ఇది ఆపమిత్యకమునకు (కుందమార్పునకు వినిమయముచే పొందఁబడు దానికి, ఒకవస్తు విచ్చి దానికి మాఱు గా గ్రహించెడిమఱియొకదానికి) పేరు
కాఁపు, కమ్మతకాఁడు, కమతకాఁడు కమ్మతీఁడు దుక్కిముచ్చు—ఇవి హాళికునకు (కర్షకునకు, కృషీవలునకు, సేద్యగానికి దున్ని బ్రతుకువానికి రైతునకు) పేర్లు

నువ్వుచేను—ఇది తిల్యమునకు (నువ్వులు పండుపొలమునకు) పేరు

[ఈరీతి వచ్చుఁ = ధాన్యవిశేషవాచకములకు (వరి జొన్న, మినుము-మొ వానికి) చేను శబ్దము (ఉత్తరపదము గా) చేర్చిన అవి పండుపొలములకు పేర్లు అగును ఉదా -వరిచేను జొన్నచేను మినుపచేను-మొ ]

అధమర్ణుఁడు —అధమమ్-దుఃఖప్రదమ్-ఋణ మస్య సో ఽధమర్ణః (ఇశ్చె) ఉత్తమమ్-సుఖప్రదమ్-ఋణ మస్య స ఉత్తమర్ణః -అని వ్యుత్పత్తి (చూ. ఋణ మాధమర్ణ్యే' (3 2 60 సూ తత్త్వ వ్యా )

ఆపమిత్యకము — పరివర్తేన నిర్వృత్తం వస్తు స్యా దాపమిత్యకమ్ అని (వైజ భూ వైశ్యా ).

ఉద్దర —ఇది (శ ర బ్రౌ ) గ్రహింప లేదు ఉద్దరువు (రూపాం ) వెచ్చము వెట్టు మన్నఁ బదివేలకు నుద్దరు వొల్లరు ' (పి శ కుం 1 78 )

కమ్మతీడు — కమ్మటీఁడు' (వావి అపముద్రి )

[అది చెలంగు — వృద్ధి చెలంగు చుండు' అని (వావి అపపా ) ]

[ఫీడు —ఇట ఈడు' అని (సూని పా ) (పారాం ) వీడు-ఈడు' (రూపాం ) చూ ఈడుజొడు -వీడుజోడు' ఈడుజోడాడు -వీడుజోడాడు' (మొ ) (వీడుజొడాడు) విదియ చందురునితో వీడుజోడాడు రమణీయదంష్ట్రాంకురములవాఁడు' (పి శ కుం 1 6 (మొ ) బ్రౌ కూడ. (అం భా పా )ను ఈడు' గానే గ్రహించినది (బ్రౌ ) కొన్ని నగలు ఈడు పెట్టి యీరూకలు తీసుకొన్నాడు' అని (వ్య ) గూడ ఉదాహరించినది ]

సీ. చే నన( జెలిక నా క్షేత్రంబు విలసిల్లు(,
గుచ్చెల యన రాశి కొఱలు చుండు
ద్వ్యాఢకికాభిధ పఱిగ యం చన(గను
నల్పసస్యక్షేత్ర మలరు చుండు
మడి, యన(, గయ్య నా నడరు( గేదారంబు
వెలయు లోష్టము పెల్ల, పిట్ట, పెట్ట,
గడ్డ బెడ్డ యనంగ( గనుపట్టు( బాఱ నా(
గను నవదారణంబునకు( బేరు

గీ పర(గు( దవుగోల దో(కుడుపాఱ నా(గ(
దద్విశేషాభిధానంబు దగు సబళము
గడ్డపా ఱన( జెల(గును గొడ్డలి, యన(
గాను గుద్దాలనామంబు కాలకంఠ 230

చేను చెలిక—ఇవి క్షేత్రమునకు (పంటభూమికి పొలమునకు) పేర్లు

కుచ్చెల—ఇది రాశికి (క్షేత్రసమూహమునకు, వరి పండుపంటనేలగుంపునకు, కైదారమునకు) పేరు

పఱిగ—ఇది ద్వ్యాఢకికకు (రెండు తూముల విత్తనములు విత్తుటకు వీలైన పొలమునకు) పేరు

మడి—ఇది అల్పసస్యక్షేత్రమునకు (కొద్దిపైరు పైరుచేయుటకైనపొలమునకు) పేరు

కయ్య— ఇది కేదారమునకు (వరిమడికి సస్యమునకు నీళ్లు నిలుచుటకై గట్లు కట్టిన వరిపొలముకు) పేరు

పెల్ల, పిట్ట, పెట్ట గడ్డ, బెడ్డ—ఇవి లోష్టమునకు (మృత్తికాఖండమునకు మట్టి గడ్డకు) పేర్లు

పాఱ—ఇది అవదారణమునకు (భూమిని చెక్కెడి (త్రవ్వెడి) సాధనవిశేషము నకు) పేరు

తవుగోల, దోఁకుడుపాఱ—ఇవి అవదారణవిశేషమునకు (గడ్డి మొద లగువా నిని దోఁకెడి-ఒకవిధ మగుపాఱకు త్రవ్వుకోలకు) పేర్లు

గడ్డపాఱ—ఇది సబళమునకు(ఖనిత్రమునకు గునపమునకు పలుగునకు) పేరు

గొడ్డలి—ఇది కుద్దాలమునకు (గుద్దలికి, చిన్న గునపమునకు) పేరు

చెలిక — బీటినెల' అని (శ ర ). చెల్క- (రూపాం ) అంచుల గట్టి చెల్కలకు నాం ద్రుసు బిడ్డలు గూరఁ గోయఁ బో ' (ఆము 3 33 ) (చూ సూ ని )

రాశి —(సూ ని ) ఆం భా ను ఉదాహరించి కుచ్చెల అనుదానికి పిడుకలు, చొప్ప-మొద లగువానిప్రోగు రాశి-అని అర్థ మిచ్చినది ఈ సందర్భమున (అమ ) ఇట్లను చున్నది పుంనపుంసకయో ర్వ్రప్రః కేదారః క్షేత్ర మస్య తు కైదారకం స్యా త్కైదార్యం క్షేత్రం కేదారికం గణే' (అని) క్షేత్రగణస్య' అని (సుధ ) కేదారా ద్యఞ్చ (4 2 40 ) అని పాణినీయము కెదారాణాం సమూహః అనునర్థమున కైదార్యమ్ లో నగువానిని సాధించినది ఇచ్చటి ఆం భా కు ఈ యర్థమే అభిప్రేత మగు ననిపించినది

ద్వ్యాఢకిక —[ద్వే ఆఢకె సంభవతి (స్వస్మిన్ సమావేశయతి) ఇ త్యర్థే ద్వ్యాఢక శబ్దాత్ ద్విగో ష్ఠం శ్చ (5 1 54 ) అనుసూత్రమున ష్ఠన్ ప్రత్యయము దానికి (5 1 28 ) సూత్రమున లుక్కు జీష్ప్రత్యయము స్వార్థికకప్రత్యయము హ్రస్వము (టాప్ ప్రత్యయము] ద్రోణాఢకాదివాపాదా ద్రౌణికాఢకికాదయః ఽని (అమ ) ద్రోణాదిపరిమితవ్రీహ్యాదివాపయోగ్యక్షేత్రస్య' అని (సుధ )

మడి —ఇట అల్పసస్యక్షేత్ర మునకు ద్వ్యాఢకికాభిధ విశేషణ మని సమన్వయించి మడి కయ్య' పర్యాయము లనినది (సూ ని ) (చూ పఱిగ మడి ) ఆం భా ధోరణి కిది విరు ద్ధము 'మడి కి ప్రయోగ మి ట్లున్నది- అడిగినజీతం బియ్యని మిడిమేలపుదొరను గొల్చి మిడుకుటకంటెన్ వడి గలయెద్దులఁ గట్టుక మడి దున్నుక బ్రతుక వచ్చు మహిలో(సుమ

తీ ) (సుమ 3) ఇది దీనికి సరి యగునుదాహరణ మన వచ్చును అల్పసస్యక్షేత్రము' అనునర్థమే ఇట ( మడి కి) ప్రకృతార్థపుష్టి కలది గా కాన్పించును కయ్య, మడి సమానార్థకము లని (సూ ని ) చెప్పు చున్న కేదారము అను-అర్థము ఇట పొసఁగదు కేవలము- పొలము అనుటయు సముచిత మనిపించుట లేదు

[బెద్ద — పెద్ద అనునదియే ఇట (చి ని శ ర బ్రౌ ప్రాఁతముద్రి పా ) పైనాపారము (తాటియాకుప్ర పా ) (మా సూ ని )

అవదారణము — ఖనిత్ర మవదారణమ్ అని (అమ ) ( కుద్దాలాదేః అని (సుధ )
తవుగోల — త్రవుకోల త్రవ్వుకోల అని (శ ర ) తవుకోల అని (బ్రౌ )

సబళము — గడ్డపార ఇది ఏకార్థకము లనుటయే ఉచిత మనిపించినది అన్వయధోరణిని౽బట్టి ప్రాసము ఈటె - అని మాత్రమే (బ్రౌ శ ర మొ ) అర్థ మిచ్చినవి దీనికి

కుద్దాలము —అన్వయమునుబట్టి సరి గా చూచిన గొడ్డలి తోనే దీని కన్వయ ముచితము అప్పుడు కుద్దాలము ఖనిత్రసాధారణవాచక మైనను (చిన్నఖనిత్రమును వచించు) విశేషవాచకము గా వ్యాఖ్యాతము కావలసి వచ్చినది చిన్న గునపములు పెద్దగునపములు రెండును ఉన్నట్లు క్రిందిప్రయోగము తెలుపు చున్నది- గుద్దండ్లనుం బెద్దగునపంబుల ను గోట యొండొండ త్రవ్వుట (హరి ఉ 2 6 ) మొ ఈపద్యసమన్వయమున వేఱుగా నడచినవి (సూ ని మొ ) అవి నా కుచితము లనిపింప లేదు ఆం భా పరిశీలన మునుబట్టి ఆం భా ఇదివఱకు ఆయుధవిశేషము గా గొడ్డలి నిఁ బేర్కొనినది దానికి లాక్షణికముగా ఖనిత్ర మనునర్థము సిద్ధము అట్టివానిని మరల వచించుట సాధారణము గా అమరమట్లే ఆం భా గూడ జరపదు ఈ గొడ్డలి గుద్దలి' కైన (రూపాం ) అనఁ దగి నది గడ్డము-గద్దువ ఎద్దులు-ఎడ్డులు-మొ తెలుఁగున దృష్టములు (తె గడ్డము క గడ్డ ) గడ్డమునకు-గద్దువ (రూపాం )గా ఉదాహరించినది ఆం భా (మా 2 142 )

సీ మలుకోల, యనఁగను బొలుచును దోత్రంబు
కొఱలు లవిత్రంబు కొడవలి యన
నల్పలవిత్రాఖ్య యలరు లిక్కి, యనంగఁ
గూలు నాఁగ లవిత్రమూల మొప్పుఁ,

గలప యనంగను హల మొప్పు నైరగ
ట్టేరుకలప, నాఁగ మీఁఱుఁ దదుప
కరణ మాబంధమ్ము పరఁగు మ్రోకనఁగను
దలుగు, నాఁ బలుపు నాఁ దనరుఁ గంర

గీ. రజ్జు, పగ్గ, మనంగను బ్రగ్రహ మగు
రాజిలును వాఱెన, యనఁగ రజ్జుభేద
మదరుఁ దృణరజ్జు వెంటి నా, నఘవిభంగ
భూషితభుజంగ శ్రీమాతృభూతలింగ 231

ములుకోల—ఇది తోత్త్రమునకు (మునికోలకు తోదనమునకు పశువులను తోలు ములుకఱ్ఱకు) పేరు

కొడవలి—ఇది లవిత్రమునకు (దాత్రమునకు కక్కులు గలిగి వంకర గా ఉండు-ఆకారము గలిగి గడ్డి లో నగువానిని కోయుటకు ఉవయోగపడెడి పని ముట్టునకు) పేరు

కాలు— ఇది లవిత్రమూలమునకు (పిడిలో అమర్చెడి కొడవలిమొదటిభాగము నకు) పేరు

కలప—ఇది హలమునకు (నాఁగలికి) కొయ్య (ఎఁడికోల) లేని నాఁగలికి) పేరు

ఇరగట్టు, ఏరుకలప—ఇవి హలోపకరణమునకు (నాఁగలికి ఉపయోగించు సామగ్రికి-సామానుకు) పేర్లు

మ్రోకు—ఇది ఆబంధమునకు (వాఱెనయందుఁ దూర్చి) నాఁగటిని కాఁడికి కట్టు మోకునకు (లావైన త్రాటికి) పేరు

తలుగు, పలుపు—ఇవి కంఠరజ్జువునకు (తల్లునకు, సందానమునకు, పసులమెడకు తగిలించెడి త్రాటికి) పేర్లు

పగ్గము—ఇది ప్రగ్రహమునకు (రశ్మికి, కళ్లెము లో నగువానియందు తగిల్చి ఈడ్చి పట్టెడిత్రాటికి) పేరు.

వాఠెన—ఇది రజ్జుభేదమునకు (ఒకవిధ మైనపగ్గమునకు బలు పైనత్రాటికి, కాఁడికి ఏడికోలను కలపుత్రాటికి) పేరు

వెంటి— ఇది తృణరజ్జువునకు (కసవుపిరికి, గడ్డితో పేనినత్రాటికి) పేరు

తోత్త్రము — ప్రాజనం తోదనం తోత్త్రమ్' అని (అమ )

కూలు —కత్తి లో నగువానిమొదటిభాగము బల్లెము కూలులోనికి విఱిగినది' -అని వ్యవహారము-అని (సూ ని )

కలమ — నాఁగటిదుంప' - (నాఁగటి) కొయ్య లేనినా గలి) అని (శ ర ) ఇదియే ఇట యుక్త మనిపించినది నాఁగలికి పేర్లు వేఱు గా చెప్పఁబడు చున్నవి (చూ 2 232 ) హల శబ్ద మిట సముదాయే వర్తమానా శ్శబ్దా అవయవే ష్వపి వర్తన్తే' అనున్యాయమున వ్యవహృతము ఇల్లు కట్టుటకు ఉపయోగపడుదార్వాదిసామగ్రి' - అనునది దీనికి రెండవయర్థ మనఁ దగినది సుప్రసిద్ధార్థ మిది యని ఆం భా వదలి యుండును

ఏరుకలప —దీనిని (సూ ని శ ర లు ) గ్రహింప లేదు (బ్రౌ ) గ్రహించి ఈ యర్థము ను ఇచ్చినది (చూ అను )

ఆబన్ధము — ఆబన్ధో యోత్త్రం యోక్త్రమ్' అని(అమ ) వృషాదేః గళే యుగబన్ధనస్య' అని (సుధ ). పశువులమెడకు కట్టుమోకుపేళ్లు. పలుపు-అనినది (గురు )

[వాఠెన — వారె యనఁగను అని (వావి పా ) ఈ యర్థమున' వారె' అనుదానిని నిఘంటువులు గ్రహింప లేదు. వాఠెన' గ్రహించినవి ఈయర్థమునందు (సూ ని శ ర ) పగ్గపుం ద్రాడును మోకు వాఠెనయుఁ దాలిచి ముందఱ వెన్కఁ జుంగు ద్రే లాడఁగ' (శేష 4ఆ ) - మొద లగునవి వాఠెన' యే ఇది యను చున్నవి (చూ సూ ని వాఠెన ) కనుకనే ఇట రాజిలును వాఠెన' యనఁగ' అని ఉండు నని తోఁచినది ]

సీ లాంగలాదికము చెలంగు నే ఁరనఁగను

బరఁగుఁ దదర్థాఖ్య యరిక, యనఁగఁ,

గోఁచే రనంగను గొఱలు విపర్యయ
బద్ధలాంగలసంజ్ఞ పంట యనఁగ
నగుఁ గృషిసన్నాహ, మలరు నాఁగేలు నాఁ
గలి యనఁగాను లాంగలసమాఖ్య
పరఁగుఁ దత్పృష్ఠంబు పడత యనంగను
జీర్ణలాంగలసంజ్ఞ చెలఁగు గొనమ
గీ యనఁగ, నేఁడికో లనఁగను నెనయు నీష
ముష్టిసంగ్రాహ్యదారువు పొలుచు మేఁడి.
యనఁగ, యంత్రికనామధేయంబు జడ్డి
గ మన విలసిల్లు చుండును గాలగంర 232

ఏరు—ఇది లాంగలాదికమునకు (నాఁగలికిని అందుల కైనయెద్దులకును) పేరు

అరక—ఇది తదర్థమునకు(సర్వావయవములు గలిగి ఎద్దులు పూంచిననాఁగలికి) పేరు.

కోఁచేరు—ఇది విపర్యయబద్ధలాంగలమునకు (పణత మీఁదు గా కాఁడికి తగిలించిననాఁగలికి) పేరు [దుక్కికి పోవునపుడుగాని దుక్కి యై మరలి వచ్చునపుడు గాని యిట్లు తగిలింతురు.]

పంట—ఇది కృషిసన్నాహమునకు (వ్యవసాయమున కైనపూనికకు) పేరు

నాఁగేలు, నాఁగలి—ఇవి లాంగలమునకు (సీరమునకు, హలమునకు నాఁగెటికి, భూమిని దున్నుసాధనమునకు) పేర్లు

పడత—ఇది లాంగలపృష్ఠమునకు (పణతకు నాఁగలివెనుకటిభాగమునకు చివరి భాగమునకు ఏఁడికోల కాక మిగిలినదానికి) పేరు

గొనమ—ఇది జీర్ణలాంగలమునకు (అఱిగిననాఁగలికి) పేరు

ఏఁడికోల—ఇది ఈషకు (ఏఁడికఱ్ఱకు లాంగలదండమునకు, నాఁగలికొయ్యకు నాఁగలికి కాఁడికి నడుమ ఉండుకఱ్ఱకు) పేరు

మేఁడి—ఇది ముష్టిసంగ్రాహ్యదారువునకు (దున్నువాఁడు పిడికిటితో పట్టుకొనుటకై చివర అడ్డముగా చెక్కినచిన్నకొయ్యకు, మేఁడిసోగకు, మేఁడితోఁకకు) పేరు (కొన్నిచోట్ల సీల లేకయే మేఁడి పట్టి దున్నుటయు కలదు.)

జడ్డిగము—ఇది యంత్రికకు (విత్తనములు చల్లుటకు ఉపయోగించు యంత్రవిశేషమునకు మూఁడు రంధ్రములు పొడిచి వెదగొర్తి (విత్తనములు వేయుమూఁడు కఱ్ఱులు గలనాఁగలి) మీఁద అమర్చెడుపిడుతకు) పేరు

[లాంగలాదికము —లాంగలము-మొదలైనది (లాంగలము ఎడ్లు అనుట )]

ఏరు — ఏరికి నెద్దులు లేకూ రూరికి మోచుకొని తిరుగునొకముసలియుఁ దా నేరు గలిగి యొక యెద్దునఁ బోరుదిగంబరుడు సరియె పురికాఁపులకుఁజా (రా వి 56 ). ఈపద్యమునుబట్టి ఎద్దులు కట్టనినాఁగలి అందుల కైనయెద్దులు- ఏరు' శబ్దమునకు అర్థ మనవచ్చును. అంభా ఏరు, అరక' -భిన్నము లని వచించు చున్నది ఏరు-ఎద్దులను గట్టి దున్నుటకు సిద్ధపఱచిననాఁగలి-అని (శ ర త్రౌ సూ ని ) ఏరు-అరక' - పర్యాయము లనియే ఇవి అను చున్నవి

[తదర్థాభిఖ్య — బరఁగుఁ దర్థాభిఖ్య -అని వావి బరఁగుఁ దదర్థాఖ్య' అని ఉండు నని పించినది (తదర్థము దున్నుట కైనది అందులకు ఉపయోగపడునది సర్వావయవములు గలిగి ఎడ్లను పూంచినది- అనుట ]

అరక —సర్వావయవములు గలనాగంటికి ఎడ్లను పూసి (న్చి?) నది-అని (త్రౌ )

కోఁచేరు —నాగలిచాలు- కోఁచేరు పెట్టినరీతి గా ఉండేముక్కు- అని (త్రౌ )

పంట — పంట కైనకృషియు-పంట అనఁబడినది లాక్షణికార్థ మిది

పడత — పణత (రూపాం ) నాగేటిపణత - నాగలియొక్క మేడి తగిలించే మొద్దువంటిది (త్రౌ) నాఁగేటి గొడగ' అని (శ ర ) (త్రౌ ) లాంగలపృష్ఠము - అర్థము అని కూడ అనినది- (చూ అను ) దుంప పడత' - పర్యాయములు

ఏఁడికోల — ఈషా లాఙ్గలదణ్డ స్స్యాత్' అని (అమ ) హలయుగయోః మధ్యకాష్ఠస్య' అని (సుధ ) (దుంపకు కాఁడికి నడుమ ఉండుకఱ్ఱ ).

మేఁడి —ఇది సానుస్వార మని (శ ర) నిర్ధారక ప్రయోగము లే దని (సూ ని) మేఁడియు సిరముజా భుజముమీఁద భరించుచుఁ బోతునెద్దుతోఁ గూడఁగఁ గాఁడిఁ బూన్చి మునికోల కరంబునఁ బట్టి పగ్గపుం ద్రాడును మోరు వాతెనయుఁ దాలిచి ముందట వెన్కఁ జుంగు ప్రేలాడఁగఁ గాసె కట్టుకొని యకృటిలాత్మకుఁ డెఁగెఁ జేనికిన్' (శేష 4 ఆ) మేఁడి జాఱి రాకుండ వేసినచీల- మేఁడిచీల- దీనినే పట్టుకొందురు దున్నువారు దీనితో కలపినదానికి - మేఁడి' అని యిటవ్యవహరించినట్లు కానవచ్చుచున్నది

జడ్డిగము —పిడుతకు మూఁడుగొట్టము లమర్పఁబడి విత్తుట కుపయోగించెడి యంత్రవిశేషము- అని (శ ర) జడ్డిగమః జడ్డుగము జడ్డిగెము- అని గ్రహించి ఇది గొర్తిమీ ద పెద్తారు- అని (బ్రౌ)

[( యనఁగ నెనయు — యనఁగ నెసఁగు నీష) - (వావి అపపా) ఒకటికి రెండు తడవలు (సూ ని) దీనినే గ్రహించినది (చూ సూ ని గొనమ ఏఁడికోల) యతి భ్రంశము గమనించుకొన లేదు ]

సీ గుంటక నాఁగను గొఱ్ఱు నా దంతె నాఁ
బాపట, మనఁగను బరఁగును గృషి
సాధనభేదము ల్పనుఁ బలు గనఁగను
ఫాలాభిధానంబు పరఁగు చుండు
దిండడ నాఁగను దిర్యగారోపిత
దారువు గుజ్జు నాఁ దనరుఁ గుజ్జ
దారువు కృషిసంజ్ఞ మీఱుఁ గిసుక, దుక్కి
యనఁ, జాలు నాఁగ సీతాఖ్య దనరు

గీ మున్నరక యనఁ దొలిదుక్కి పొదలు చుండుఁ
బ్రబలు సీతానివృత్తి కొండ్ర యన గుంట
యనఁగఁ, గళ్ల, మనంగ ఖలాఖ్య వెలయు
ఖలముఖము వాగళం బన నలరు నభవ 233

గుంటక, గొఱ్ఱు దంతె పాపటము—ఇవి కృషిసాధనవిశేషములకు (వ్యవసాయమునకు ఉపయోగించెడి-ఒకవిధ మగు పనిముట్లకు) పేర్లు

[గుంటక—ఇది దున్ని విత్తులు చల్లినవెనుక నేల చదును చేయుసాధనమునకు పేరు

గొఱ్ఱు—ఇది దున్నినపొలముమీఁద గడ్డ పదును చేయుటకై ఉపయోగించు దానికి (దున్నెడుయంత్రమునకు) పేరు.

దంతె— ఇది పైరులోనికలుపు పోవుటకు దున్నెడుకొయ్యపండ్లతోడిసాధనమునకు పేరు

పాపటము—ఇది పాపనమునకు మిరెపచేను మున్నగువానిలోనికలుపు పోవుటకై దున్నెడునొకవిధ మగు సాధనమునకు పేరు ]

పలుగు—ఇది ఫాలమునకు (కృషకమునకు, నాఁగటికఱ్ఱునకు) పేరు

దిండర—ఇది తిర్యగారోపితదారువునకు (నాఁగలికి అడ్డు గా వేసెడికఱ్ఱకు గొఱ్ఱు పాపట- మొదలగునవి తగిలించుటకై అడ్డము గా వేయుఅడ్డకు) పేరు

గుజ్జు—ఇది కుబ్జదారువునకు (పొట్టికొయ్యకు) పేరు (గుంటకగుజ్జు పాపట గుజ్జు, దూలపుగుజ్జు-మొ ).

కిసుక దుక్కి—ఇవి కృషికి (సేద్యమునకు వ్యవసాయమునకు కరిసనమునకు) పేర్లు

చాలు—ఇది సీతకు (లాంగలపద్ధతికి, నాఁగటితో దున్నినరేఖకు) పేరు.

మున్నరక— ఇది తొలిదుక్కికి (ముందటి-అంకకు, ఎద్దులు పూన్చిననాఁగలితో మునుముందు దున్నుటకు ఏరువాకకు ఎచేటను చేయుదుక్కి-యొక్క ప్రారంభమునకు వ్యవసాయప్రారంభమునకు) పేరు

కొండ్రి—ఇది సీతానివృత్తికి (మళ్లించి దున్నిననడినేలకు చాలునకు) పేరు

కళ్లము—ఇది ఖలమునకు (ధాన్యము నుఱిచెడి తావునకు) పేరు

వాగళము—ఇది ఖలముఖమునకు (వాగళ్లమునకు కళ్లమునకు ముందటి భాగమునకు) పేరు

[గుంటక — గుంటుగ అని వావి (అపముద్రి)]

గొఱ్ఱు — దున్నినపొలమును చదును చేయుసాధనము -అని (సూ ని) ఇది చి ని శ ర బ్రౌ -అని గుంటకకుఁ గూడ ఈ- అర్థమునే ఇచ్చి పర్యాయము లివి అను చున్నది.) వే అర్థములు కలశబ్దము లివి అను చున్నది (ఆం భా) రైతులు వేఱు గానే వీనిని వ్యవహరించు చున్నారు

దంతె — దంతియ- (రూపాం) ఇట- దంతి నాఁ అని (వావి-అపపా.) ఇది కృషి సాధనవిశేషము నేల చదును చేసెడి అచ్చుకట్టు' అని (శ ర)' అని (సూ ని)

[బాపటము — బాపడము- అని (వావి పా) (శ ర బ్రౌ సూ ని) అన్నియు పాప టము' అనియే అనినవి. గొర్తిపై రుమీఁద గాదము పోవ దున్నెడుసాధనము- అని (శ ర) కొంద్ర-రైతులు దున్నునప్పుడు దున్నవలసినముందుప్రదేశమును నాఁగలి తిరుగుటకు వీలు కానందున ముందు దున్నక బాగుగా నాఁగలి తిరుగుటకై దాని వెంబడి కొంతకొంతయవకాశము ఉంచుకొనుచు దాని కెదురు గా నాఁగలి మరలించి దున్నుట ప్రారంభించి చుట్టు దున్నుకొనుచు వచ్చి అట్లే అవకాశము లుంచుకొనుచు ముందుదా నిని దున్ని క్రమక్రమము గా ఉంచిన యవకాశముల దున్నుకొనుచు వచ్చి దుక్కి పూర్తి చేయుదురు ఇట్లు ఉంచుచు వచ్చిన- అనడిమినేలలను దానివెంబడి సాగిన చాలును కొంద్ర'- అని రైతు లందురు తిన్నగా కొంద్రవేయు' మని కొంద్ర చిన్న దైనది పెద్ద దైనది- అనియు వ్యవహారము]

ఫాలము — ఫాలః కృషకః అని (అమ) (చూ గుఱ)

దుక్కి — దుక్కి- ఐనదా' అని వ్యవసాయ మైనదా' అని పర్యాయములు గా రైతులు వీనిని వ్యవహరించు చున్నారు

మున్నరక — ముందటి అరక' అని (బ్రౌ)

కొంద్ర — దీనిని (సూ ని) ఇట్లు వివరించినది. ఒకసారి చాలు చుట్టిన కొలఁది గల పొలము చుట్టు దున్నినచాలు నడిమినేల' (అని) (శ ర) మళ్లించి దున్నినచాలు' అనినది) (బ్రౌ) ఎదురు దున్ని మళ్లించిననడినేల'- అనినది

సీ గుంజ నాఁగను గట్టుఁగొయ్య నాఁగను మేధి
పయి రన సస్యంబు పరఁగు చుండుఁ,
జిఱువరి వచ్చగన్నెరు. తీఁగెమల్లియ
బుడమ,రాజనము నాఁ బొలుపుఁ గాంచు
వ్రీహి భేదమ్ములు వ్రీహిసామాన్యంబు
వరి. వడ్లు నాఁగను వఱలు చుండు
గోదుమ యనఁగను గోధుమ ల్వెలసిల్లు
లంక యనంగఁ గలాయ మొప్పు

గీ నారుగ యనంగఁ గోద్రవాఖ్య తనరారుఁ,
గొఱలు చుండుఁ బ్రియంగువు కొఱ్ఱ. యనఁగఁ,
బొలుచు జూర్ణంబు జొన్న నా. బుసుకుజొన్న.
యనఁగఁ జూర్ణవిశేష మౌ నహివిభూష 234

గుంజ కట్టుఁగొయ్య—ఇవి మేధికి (కళ్లమునందు పసులను కట్టుటకై పాఁతిన కొయ్యకు) పేరు

పయిరు—ఇది సస్యమునకు (సస్సెమునకు వరిపైరు మొదలైనపంటకు) పేరు.
చిఱువరి పచ్చగన్నెరు తీగెమల్లియ బుడమ రాజనము—ఇవి వ్రీహిభేదములకు (వడ్లలోని విశేషములకు) పేర్లు

వరి వడ్లు—ఇవి వ్రీహిసామాన్యమునకు (సాధారణముగా అన్నివడ్లకును) పేర్లు

గోదుమ—ఇది గోధుమలకు (గోధూమములకు ధాన్యభేధమునకు) పేరు

లంక—ఇది కలాయమునకు గుండ్రనిసెనగలకు (బటానీలకు) పేరు.

ఆరుగ—ఇది కోద్రవమునకు (అరికలకు ఆరుగులకు, ఆరుగలకు అళ్లకు) పేరు

కొఱ్ఱ—ఇది ప్రియంగువునకు (కంగువునకు, చిన్నగింజ గలిగి ఉండుఒకదినుసుధాన్యమునకు) పేరు

జొన్న—ఇది జూర్ణమునకు (యావనాళమునకు జొన్నధాన్యమునకు) పేరు

బుసుకుజొన్న—ఇది జూర్ణవిశేషమునకు (ఒకదినుసుజొన్నకు) పేరు

గుంజ — అని (ఆం భా) పాఠము గ్రహించియు ఈపదమును ఈయర్థమున గ్రహింప లేదు (సూ వి) (పాఠమునకై (చూ కట్టుఁగొయ్య- సూ వి) (శ ర బ్రౌ) గూడ గ్రహింప లేదు

కట్టుఁగొయ్య — (శ ర) కట్టుగొఱ్ఱు - గ్రహించి పసులను కట్టుటకై కళ్లమున పాఁతిన గుంజ మేధి- అనినది దీనినిఁబట్టి ఇట- (శ ర పాఠము) కట్టుగొఱ్ఱు అగు నని పించు చున్నది కట్టుఁగొయ్యకు నాఁగటి మేఁడి అర్థ మను చున్నది (శ ర)

మేధి — పుంసి మేధిః ఖలే దారు న్యస్తం య త్పశుబన్ధనే అని (అమ)

సస్యంబు — సస్యవాచకశబ్దములును (శబ్ద 29 సూ) (నిత్యైకవచనాంతములు) తఱచు గ ధాన్యవాచకశబ్దములును (శబ్ద 37) (నిత్యబహువచనాంతము లగు)-(ప్రౌ వ్యా) జొన్నలు రాగులు ము న్నగుశబ్దముల్ బహుతను దమపలము లగును' (ఆం భా 2 4)

వడ్లు—వడ్లకు రెడ్లకు భేదము చెప్ప లేము-అని లోకోక్తి వీనిభేదములను గొన్నిటిని (హంస) ఇట్లు వచించినది - బంగారుతీఁగెలు గంగాజలమ్ములు కస్తూరినిగరాలు కట కసరులు అనురీతిని (చూ హంస 4 28)

గోధుమల్ — గోధూమ స్సుమనా స్సమౌ అని (అమ) గోధూమ స్తు మ్లేచ్ఛభోజ్యః అని (వైజ భూ వైశ్యా) గోధూమము నకే గోధుమము (రూపాం) (చూ సూ ని గోధుమము) చరిత్రాదిగణపాఠమున ము లోపము గోధుముల్ - (వావి అపముద్రి)

కలాయము — కలాయ స్తు సతీనకః హరేణుఖణ్డికౌ చాస్మిన్' అని (అమ) చత్వారి రేణుకస్య అని (సుధ) రేణుకలు అనుశబ్దమునకు దేశ్యమున నూఁగుదోస అర్థ

మని వ్రాసినది ఒకనిఘంటువు- అని (శ ర) లంకలపేళ్ల గుండ్రనిసెనగలు నూ గుదోఁ అని కొందఱు- (అని) (గురు) [లంక- ఒకజాతిఅపరదినుసు అని (బౌ)

[చిఱువరి — చిరుతరి- (వావి- అపముద్రి) (చూ బ్రౌ- చిరువరి (అను) 'వ్రీహిభేద స్త్వణుః పుమాన్ అని (అమ) కొఱ్ఱలకంటె ఇంచుకంత గొప్ప దైనవ్రీహిభేదము చిఱువడ్లు- అని (గురు) ]

సీ సజ్జ యం చనఁగను సర్జము విలసిల్లు,
శ్యామాక మొప్పును జామ, యనఁగ,
వరిగ యం చనఁగను వరకము దనరారు
రాగి యం చనఁగను రాగి వెలయు,
ముద్గంబు పెసర నాఁ బొల్చును గారుపె
సర నాఁగ వనముద్గసంజ్ఞ చెలఁగుఁ,
గాకిపెసర, నాఁగఁ గనుపట్టు క్షుద్రము
ద్గము, మినుమనఁగ మాషము దనర్చు,

గీ నను మనంగను నిష్పావ మలరు చుండుఁ
బరఁగు బొబ్బర యనఁగను బర్బరమ్ము,
తువరి కంది, యనంగను దోఁచు, రాజ
మాష మలసంద, యనఁ దగు మాతృభూత 235

సజ్జ—ఇది సర్జమునకు (గంటెకు సజ్జపైరునకు, ఒకదినుసుకాయధాన్యమునకు) పేరు

చామ—ఇది శ్యామాకమునకు (గడ్డివలె ఉండు మొక్కలనుండి కలుగుఒకదినుసు పైరునకు) పేరు

వరిగ—ఇది వరకమునకు (వరిగపైరునకు) పేరు

రాగి—ఇది రాగికి (తపిఁదకు తవ్విఁదకు తమ్మిఁదకు చోడిపైరునకు ఒకదినుసుకాయధాన్యమునకు) పేరు.

పెసర— ఇది ముద్గమునకు (పెసరపైరునకు ఒకదినుసు కాయధాన్యమునకు) పేరు

కారుపెసర—ఇది వనముద్గమునకు( అడవిపెసరకు) పేరు

కాకిపెసర—ఇది క్షుద్రముద్గమునకు (పిల్లపెసరకు) పేరు

మినుము—ఇది మాషమునకు (మినుపపైరునకు, ఒకదినుసుకాయధాన్యమునకు) పేరు

అనుము—ఇది నిష్పావమునకు (అన్మునకు చిక్కుడువంటిగింజలు గలఒకజాతి పైరునకు) పేరు

బొబ్బరి—ఇది బర్బరిమునకు (ఒకదినుసు అలసందల పైరునకు) పేరు

కంది—ఇది తువరికి (ఆఢకికి కందిపైరునకు, ఒకదినుసుకాయధాన్యమునకు) పేరు

అలసంద—ఇది రాజమాషమునకు (అలసాంద్రమునకు కుల్మాషమునకు పెద్ద బొబ్బరలపైరునకు) పేరు

సర్జము —ఇది రాగి-షష్టికములు (షష్టికాః షష్టిరాత్రేణ పచ్యన్తే (5 90) (పాణినీయము) అఱువదిదినములకే పండుపంటలు ఒకకవి ఇట్లు వర్ణించినాఁడు- ఆఱువదు గంటె తవిందయ లఱువదిదినములకుఁ బండు నని బ్రతుకాసన్ దఱచుగ నేతాలెత్తఁగఁ బఱిపఱి యై యవియు మల్లెపడి చెడి పోయెన్ (కాశ 3 52) (చూ సూ ని)

శ్యామాకము —ఇది నీవారధాన్యమునకు చెందినది తృణధాన్యాని నీవారాః' అని (లమ) ఇట బహువచనేన శ్యామాకాదిగ్రహః అని (సుధ) ఇవి జింకలకుప్రియ మైన ఆహారము - శ్యామాక ముష్టిపరివర్ధితకో జహాతి సో ఽయం న పుత్త్రకృతకః పదవీం మృగ స్తే (శాకుం 4 4)

వరిగ —( వంగ పెద్దారుగపైరు-అని (శ.ర ).

రాగి — ఇది సం పదమును కావలయును అదే పదమును అర్థమునకై పునరుక్తము గా గ్రహించెడి 'అభ్యాసము' (ఆం భా )కు లేదు ఈసందర్భమున సం.పదములే (అర్థము నకై) అన్నియు ఒసఁగఁబడు చున్నవి నాచూచిననిఘంటువులలో ఇది ఈయర్థమున సం పదము గా కాన రా లేదు (ఆం భా ) ౨ఘంటుపరిచయము చాల గొప్పది ఎచ్చట నేని ఇది గ్రహింపఁబడి యుండ వచ్చును

పెసర —ఈపద్యమునందు అంతట పెసరు'-అనియే (వావి పా.) (బ్రౌ శ ర.) పెసర-అని అనుచున్నవి సూ ని రెండును గ్రహించినది (క పెసర్ త పయఱు ) (చూ సూ ని ) (పెసరు పెసరుఁగాయ మొ.)

బొబ్బర — బొబ్బర్లు' నల్లఅలచందలు-అని (బ్రౌ.) సస్యవిశేషము-అని (శ ర )

అలసంద —అలసందియ-(రూపాం ) శ్రాద్ధకర్మంబునందు వర్జ్యములు వినుము పెండలంబును దోస పలాండు వుల్లి యానుగ మ్మింగు వలసందియలు (మార్క 3 203 ) అలచందలు -అనియే (బ్రౌ ) ('అలచందలు-అని వ్యవహారము' అని (సూ అని )

సీ. ఒప్పుఁ గుళుత్థాఖ్య యులవ యం చనఁగను,
దిలసంజ్ఞ నూ, వనఁ దేజరిల్లు,
సెనిగ నా సెనగ, నాఁగను జణకము మీాఱు,
నాసురి దనరారు నావ, యనఁగ,
మెంతి, యనంగను మేంథినామము తగు,
శణము భాసిల్లును జను, మనంగ
దవసంబు, కొలుచు, నా ధాన్యంబు రాజిల్లు,
ముల్లు, నా శూకంబు పొలుపు గాంచు

గీ నె, న్ననఁగఁ గణిశ మలరు, నీఁచ యనఁగఁ
గణిశవృంతంబు చెలఁగును, గంకి యనఁగ

ధాన్యకణిశంబు వెలయును దైత్యవైరి
భూరిభవభంగ శ్రీమాతృభూతలింగ 236

ఉలవ—ఇది కుళత్థమునకు (గుఱ్ఱపుదాణా కది ఉపయోగపడుధాన్యము గల-ఒక దినుసుసస్యమునకు) పేరు

నూవు—ఇది తిలసస్యమునకు (నువ్వుపైరునకు నూనె తీయుట కది ఉపయోగించుతిలలు గల దానికి) పేరు

సెనిగ సెనగ—ఇవి చణకమునకు (సనగపైరునకు హరిమన్థమునకు) పేర్లు

ఆవ—ఇది ఆసురికి (ఆవపైరునకు) పేరు

మెంతి—ఇది మేంధికి (మెంతిపైరునకు) పేరు

జనుము—ఇది శణమునకు (జనుపపైరునకు పేరు) (గొడ్లమేఁతకు నార తీయుటకు ఇది ఉపయోగపడును)

దవసము కొలుచు—ఇవి ధాన్యమునకు (ధాన్యమాత్రమునకు అన్ని ధాన్యములకు) పేరు.

ముల్లు—ఇది శూకమునకు (వరి లో నగువానిముల్లునకు, యవాదుల-అగ్రభాగమునకు) పేరు

ఎన్ను—ఇది కణిశమునకు (వరి లో నగువానివెన్నునకు, సస్యాదిమంజరికి, వరి-మొద లగువానియొక్క బాగుగా ఈననికంకికి) పేరు

ఈఁచ—ఇది కణిశవృంతమునకు (ఊఁచకు జొన్న లో నగువానికాడకు) పేరు

కంకి—ఇది ధాన్యకణిశమునకు (జొన్న లో నగువానియొక్క ఈని గింజ పట్టిన కంకికి) పేరు

[సెనిగ —సెనిగె (వావి పా) దీనిని (సెనిగను) (సూ ని శ ర లు) గ్రహింపక పోయినను బ్రౌ సెనిగ గ్రహించి సెనిగ' (ఆం భా పా) అను చున్నది సెన

గలు (బెంగాల్ గుఱ్ఱములకు ఆహారము అనియు (బ్రౌ). సనగ- (రూపాం.) సనగ సొంపు జూటింగె సమసె టొబ్బరలు' (విష్ణు పు. 3ఆ.) 'సెనగ'కు మొదటిరూప మిది (చూ. శ ర)

ఆసురి — సర్షపే తు ద్వౌ తున్తుభకదమ్బకౌ సిద్ధార్థ స్త్వేష ధవళః' క్షవః క్షుతాభిజ ననో రాజికా కృష్ణికా ఽఽసురీ'-అని (అమ.) దీనిని(బట్టి నల్లఆవాలే' 'అసురి' శబ్ద మునకు అర్థము కావలసి ఉన్నది ఐనను (అం. భా) అమరమట్లు, వేఱు — తెల్లఆ వాల'కు పే ర్లీయక పోవుటనుబట్టి ఇట ఆసురి' శబ్దము సర్వసాధారణము గా - విశేష వాచకమును సామాన్యవాచకము నగురీతిని- ఉపయోగింప(బడినది-అని గ్రహింపవలసి యున్నది. కనుకనే- ఆవ ఆసురి (అం. భా.) ఆవాలు - అనినది బ్రౌ. (చూ. అను)

కొలుచు —ఈశబ్దమునకు వరిధాన్యము' అనువిశేషార్థమును గలదు ఇట ధాన్యసామాన్య మునకే ఇది వాచకము (అమ) ఈసందర్భమున ధాన్యం వ్రీహి స్తమ్బకరిః' అనినది 'ధాన్యసామాన్యస్య అనియే ఇట వ్యాఖ్య

ధాన్యంబు — ధాన్యములు సప్తదశ (17) గా వచింప(బడినవి [1 వ్రీహి 2.యవ 3. మసూర 4 గోధూమ 5 ముద్గ 6. మాష 7 తిల 8 చణక 9 అణు 10. ప్రియఙ్గు 11 కోద్రవ 12. మకుష్ఠక 13 కలాయ 14 కులత్థ 15. శణ 16 సర్షప 17. అతసీ సమాఖ్యాః- (లేదా) శణసప్తదశాని ధాన్యాని' ఇతి మహాభాష్యమ్ (5 2 4సూ) (చూ సుధాటిప్పణి)

ముల్లు — తీక్ష్ణాగ్రే శూక మస్త్రియామ్' అని (వైజ భూ. వైశ్యా) పదునైనయవాదుల అగ్రము

ఎన్ను — సస్యాదిమంజరి - 'వరియెన్ను' - మొ కంకి - (జొన్న లో నగువాని) వెన్ను - అని 'కంకి' వే ఱను చున్నది (శ ర) సూ ని వెన్ను వి సస్యాదిమం జరి కణిశము, కంకి'అని అర్థ మిచ్చినది కంకి జొన్న లో నగువాని ఎన్ను, వెన్ను- అనినది 'కణిశ'మును గూర్చి - (అమ) ఇ ట్లన్నది- 'కణిశం సస్యమఞ్జరీ' అని.

(కణిశము - సస్యమంజరి - ఎన్ను కంకి-(అని) (సూ వి) సస్య మంజరి ఎన్ను-
అని (శ ర)

[వృంతంబు —వృత్తంబు - (వావి అపపా) ]

సీ కణిశైకదేశంబు కనుపట్టు రెల్ల నాఁ,
గణిశభారమ్ము ముంగ యనఁ దనరు
సస్యకుసుమసంజ్ఞ చను సుం కనంగను
గుసుమ, నాఁగను సస్యగుచ్ఛ మొప్పు
గుంట, కఱ్ఱ యనంగఁ, గనుపట్టు నాళంబు
క్రోవి యనంగను గ్రో వనంగ,
జా డనంగను క్షీణసస్యంబు దగును బొం
దనఁగాను శుష్కసస్యము చెలంగు

గీ ఛిన్నయవముఖనాళంబు చెలఁగుఁ జొప్ప
యనఁగ నొదె యనఁగ దీర్ణయవనాళ
కాదులు చెలంగుఁ బన యన నలరు చుండుఁ
దాదృశవ్రీహిసస్యాఖ్య ధనదమిత్ర 237

రెల్ల—ఇది కణిశైకదేశమునకు (ఎన్నులోనిభాగమునకు కంకిలోని చిన్నచిన్న రెమ్మలకు) పేరు

ముంగ—ఇది కణిశభారమునకు (ఎన్నుల మోపునకు) పేరు

సుంకు, కుసుమ—ఇవి సస్యకుసుమమునకు (జొన్న లో నగువానికంకిమీఁది పూఁతకు కంకిలోని గింజ పాలు పట్టకముందు గింజగింజమీఁద పచ్చ గా ఉండుపువ్వునకు, గింజ ముదురఁగానే రాలిపోవుదానికి) పేర్లు.

గంట, కఱ్ఱ—ఇవి సస్యగుచ్ఛమునకు (వరి ము న్నగువానిదుబ్బునకు) పేర్లు

కోవి క్రోవి—ఇవి నాళమునకు (గడ్డి లో నగువానికాడకు) పేర్లు

జాడు—ఇది క్షీణసస్యమునకు (పండక ఏపు గా పెరిఁగినజొన్న మున్నగు వానిపైరునకు) పేరు

బొందు—ఇది శుష్కసస్యమునకు (వెన్ను దీయుటకు యోగ్యము కాని వరి లో నగువానిపైరునకు) పేరు.

చొప్ప—ఇది ఛిన్నయవముఖనాళమునకు (నఱకినయవాదిసస్యములకాడకు (దంటునకు) పేరు

ఓదె—ఇది దీర్ఘయావనాళకాదులకు (కోసి వేసినజొన్న మొద లగువానికి) పేరు

పన—ఇది తాదృశవ్రీహిసస్యమునకు (కోసి వేసిన వరిపైరునకు) పేరు

కుసుమ —దీనికి సస్యకుసుమము సుంకు' అని అర్థ మిచ్చి సస్యకుసుమసంజ్ఞ చను సుం కనంగను గుసుమ నాఁగను' అని (ఆం భా )ను ఉదాహరించినది (సూ ని ) బ్రౌ. సస్యగుచ్ఛము (ఆం భా ) అను చున్నది (చూ అను ) బ్రౌ అన్వయ మిట ప్రమాద మనవలసి యున్నది

గంట కట్ట — సస్యనాళము' అని గంటకిడ అర్థ మిచ్చి - గంటకట్ట యనంగఁ గనుపట్టు నాళంబు' (ఆం భా.2 237 ) అనినది (సూ ని ) కట్ట' కడ- గంట, వరి - మున్నగు వాని దుబ్బు, సస్యగుచ్ఛము-అని అర్థ మిచ్చి సస్యగుచ్ఛ మొప్పు గంటకట్ట యనంగ' ఆం భా (2 23 )- అనినది సమన్వయమున పొరపడి పరస్పరవిరుద్ధము గా ఇట్లు (సూ ని ) ఉదాహరించిన దని తోఁచు చున్నది

[ గ్రోవనంగ — గ్రోలనంగ' (వావి.పా ) (సూ ని ) క్రోలు' గ్రహించి, దీనినే చూపి క్షీణసస్యము అనెడి అర్థ' మిచ్చినది కోవి' గ్రహించి కోవి యనఁగను గ్రోవి యనఁగ జా డనంగను క్షీణసస్యంబు దగును' (ఆం భా 2 237 ) అని జాడు క్షీణ సస్యము' అని ఆ కోవికి అర్థ మిచ్చినది సమన్వయమున (సూ ని ) ప్రమాదపడినది సరిగదా పారగ్రహణమున సైతము ఒకవ్యవస్థ పాటింపనిది గా తోఁచు చున్నది ]

చొప్ప —జొన్న లో నగువానిదంటు-అని (శ ర ) సూ ని కోసినజొన్న లో నగువాని దంటు-అనికూడ ఇచ్చి ఈ ఆం భా ' ను ఉదాహరించినది

ఓదె — కోఁత కోసి చేనియం దక్కడక్కడ నుంచెడు వెన్నుపోఁచల ప్రోగు- అని (శ - ర ) సూ ని శ ర ఇచ్చినఅర్థ మిచ్చి చిన్నపన -అనికూడ అనినది

పన — చేలో కోసి వేసిన ప్రోగు' అని (బ్రౌ ) కోసి చేలలో వేసిన-ఓదెలప్రోగు - అని (సూ ని ) ఈ ( ఆం భా ) నే ఇచ్చినది ప్రమాణము గా

సీ. దంటనఁగా సస్యదండము విలసిల్లుఁ
ఈరఁగు నీన యనంగఁ బత్త్రనాడి
సొరుగాకు కారాకు చొక్కటాకు, వగుడు
నాఁగను వెలయు జూర్ణాదిశుష్క
పత్త్రాభిధానంబు పరఁగును బుససంజ్ఞ
బుసి యనఁగా బన బూగరు యనఁ
దుచ్ఛధాన్యాభిధ దోఁచుఁ దాలు తఱక
పొల్లకట్టు, తఱక పొల్లు పొల్ల

గీ. తప్ప, తంకర దూరు నాఁ దనరుఁ దుషన
మేతధాన్యాభిధలు మూఁగపోఁ తనంగ
మూన యనఁగాను, దుషయుక్తము లగు స్వల్ప
ధాన్యముల్ చింక యును, కనఁ దగు మహేశ 238

దంటు—ఇది సస్యదండమునకు (జొన్న లో నగువానికఱ్ఱకు) పేరు

ఈన—ఇది పత్త్రనాడికి (ఆకునరమునకు తములపాకు మొద లగువాని—ఈనెకు-నరమువంటి పోఁచకు) పేరు

చొరుగాకు, కారాకు చొక్కటాకు వగుడు—ఇవి జూర్ణాదుల శుష్కపత్త్రము నకు (చొక్కాకునకు చొరువునకు, జొన్న మొద లైనవానియొక్క ఎండిన ఆకు నకు పేర్లు

బుసి, గాబ, బూగరు—ఇవి బుసమునకు(పలాలాదిక్షోదమునకు పొట్టునకు) పేర్లు

తాలు తఱక పొల్లకట్టు తబక పొల్లు పొల్ల తప్ప తంకర తూరు—ఇవి తుచ్ఛధాన్యమునకు (నిస్సార మైనధాన్యమునకు గింజ లేనిధాన్యమునకు) పేర్లు

మూఁగపోఁత మూన—ఇవి తుషసమేత ధాన్యమునకు (ముడి ధాన్యమునకు, పొట్టు విడనిదానికి) పేర్లు (ముడిపెసలు ముడిజొన్నలు-మొ.).

చింక ఇనుకు—ఇవి తుషయుక్తము లగుస్వల్పధాన్యములకు (ఊఁకతో కలసి నూక గా ఉండుధాన్యములకు) పేర్లు.

కారాకు — జీర్ణపర్ణము పండుటాకు - అని (శ ర ) మొ

వగుడు —ఒగుడు- అని (సూ ని శ ర లు ) వగుడు-ఒగుడు' - రెండును కల వను చు గాలిఁ బోయెడివగుడాకుగతిఁ గరంబు తూలి పోయెడినెమ్మేనితోడఁ జనుచు'(కుచే 2 5 ) అని ఉదాహరించు చున్నది (బ్రౌ ) అచ్చట (సూ ని ) గాలిఁ బోయెడియొగుడాకు అని (బ్రౌ పా ) (ముద్రిపా ) వరుగాకు' -అనినది (చూ సూ ని ఒగుడు). [వగడు-వాని అపముద్రి ] ఒగుడు అనుటకు నిర్ధారకము చూప లేదు (సూ.ని శ.ర లు ) (బ్రౌ ) ఒగుడు' అనుటకు వ్యవహారము ప్రమాణ మను చున్నది (కుచే ప్రయోగము రెండిటికి (ప్రమాణముగా) ఉదాహరించినది (బ్రౌ ) ఇది యెట్లో ఆం ధ్రా నుబట్టి వగుడు అనుటయే యుక్త మనిపించు నిట

బుసము — కడఙ్గరో బుసం క్లీబే ఽని (అమ ) ఇట (సుధ ) పలాలాదిక్షోదస్య' అని వ్యాఖ్యానించినది 'పలాలో ౭ స్త్రీ స నిష్ఫలః' అని (అమ ) ధాన్యరహితకాణ్డస్య' అని (సుధ )

గాబ — తృణవిశేషము' - అని మాత్రము (సూ ని శ ర బ్రౌ లు) [సూ ని , (శ ర బ్రౌ - తోపాటు) ప్రకృతార్థమున దీనిని గ్రహింప లేదు ఐనను బుసి - బూగర' అనువానికడ వీనికి పర్యాయము గా ఒకటికి రెండు పర్యాయములు గాబ' అనుదానిని ఆం ధ్రా పారము గా ప్రదర్శించినది (సూ ని )

తుచ్ఛధాన్యము —(శ ర ) ఇ ట్లను చున్నది (తాలు ) ఎన్ను తీసి ఎండి పోయినపైరు (తఱక, తప్ప-) గింజ పట్టనిధాన్యము (తూరు)- ధాన్యముతో కలసి యున్నగల్ల పొట్టు మొ (అని.)

[మూఁగపోఁత —మూఁగఁబొంత - అని (వావి అపముద్రి) ]

ఇనుక —ఇట తుషయుక్తఅల్పధాన్యములు అనగా మూన ఉమక నూకలుగా ఉండెటిది- అని (బ్రౌ) (చూ అను) ఇనుకు బొంతచేతఁ గప్పఁబడినయల్పధాన్యము - అని ఈ ఆం భా ఇచ్చి ఇనుకు' అని యిట భేద మను చున్నది (శ ర) నిర్ధారకము లేదు దేనికని

చింక — తుషయుక్త మైనస్వల్పధాన్యము (బి) రెల్లలలో నుండుజొన్నలు- (శ ర)' అని (సూ ని)

సీ. ధాన్యశకలములు దనరు నూక లనంగ
నూఁక పొట్టుముక నా నొప్పుఁ దుషము
పిసరు పిప్పి యన నిష్పిష్టతుషం బగు,
నుఋవుడు నాఁగను బరఁగు చుండుఁ
గణిశచూర్ణంబు సద్గ్రిహణంబు తూర్పు నా
వెలయును దృణధాన్యములు చెలంగు
గునుకులు దూసరుల్, గొలివె లనంగను,
జెలఁగు త్రో లన నులూఖలముపేరు

గీ కుంది కుందెన యనఁగను గొఱలు వ్రీహ్యు
లూఖలము ముసల మెసఁగు రోఁకలి యన,
వఱలుఁ బొన్ననఁగాను శంబకసమాఖ్య,
భూతిలసితాంగ శ్రీమాతృభూతలింగ 239

నూఁకలు—ఇది ధాన్యశకలములకు (గోధుమ చో నగువానికణములకు శంబూకములకు) పేరు

ఊఁక పొట్టు, ఉముక—ఇవి తుషమునకు (ధాన్యముయొక్క పైపొట్టునకు) పేర్లు

పిసరు పిప్పి—ఇవి నిష్ప్రష్టతుషమునకు (బాగుగా పిసికి నీరు పిండివేసినధాన్య పుపొట్టునకు) పేర్లు

నుఱుపుడు— ఇది కణిశచూర్ణమునకు (కాళ్లతో నదిమి త్రొక్కినకంకులనలుగుడునకు) పేరు.

తూర్పు—ఇది సద్గ్రహణమునకు (తూరుపునకు ఎగురఁబోసి పొల్లునుండి ధాన్యమును విడఁదీయుటకు) పేరు

గునుకులు దూసరులు గొలివెలు—ఇవి తృణధాన్యములకు (తృణమువంటి ధాన్యవిశేషములకు, ఎవరును విత్తకయే పడి మొలచి పండెడుధాన్యములకు) పేర్లు.

తోలు—ఇది ఉలూఖలమునకు (దంచుట రుబ్బుట లో నగువానికి ఉపయోగించెడి సాధనమునకు) పేరు

కుంది కుందెన— ఇవి వ్రీహ్యులూఖలమునకు (ధాన్యము దంపుకొనుతోలునకు) పేర్లు

రోఁకలి—ఇది ముసలమునకు (దంచెడుసాధనమునకు) పేరు

పొన్ను— ఇది శంబకమునకు (శంబమునకు రోఁకలి ము న్నగువానికొనకు అమర్చెడిలోహవలయమునకు (ఇనుపకడియమునకు) పేరు

నూకలు — ఫలీకృత స్తణ్డుల స్స్యాత్ ధాన్యానాం తు తుష స్త్వచి శమ్బూకా స్తు కణా సూన్ష్మె స్తణ్డులస్య తు యో మలః శమ్బూకః కణ్డనం చాఽసౌ' అని (వైజ పాతా పురా )

నుఱుపుడు —నుఱిపిడి నూఱిపిడి నూర్పు నూఱుపుడు-అని(సూ ని ) నుఱిపిడి-అనియే (శ ర ) నూఱుపుడు' అనుదానికి నుఱుపుడు' (రూపాం ) అనవలయును ధాన్య ము మొద లగువానినిఁ గాళ్ల మొద లగువానితోఁ ద్రొక్కి నలుపుట-(అని)అర్థ మిచ్చి నది (సూ ని ) దీనికి

తృణధాన్యములు — తృణధాన్యాని నీవారాః' (అమ )

కుంది —దంచునప్పుడు ధాన్యము చెదరి పో కుండ గుంటచుట్టు నమర్చుకాతికుదురు (శ ర త్రౌ అని(సూ ని ) ఇది దీనికి సుప్రసిద్ధార్థ మని వదలినది (అం భా )అనిపించును (అర్థాం ) ఇది

శంబకము —స్వార్థికప్రత్యయాంతము శమ్బ స్స్యా న్ముసలాగ్రస్థలోహమణ్డలకె పవొ (చూ సుధ )

[ లూఖల రోఁకలి' అని కిఖప్రాస మొకటి కానవచ్చు చున్నది లేదా ఉలూఖల మునకు (రూపాం )గా ఉలూకలము గూడ ఉన్న దన వలయును ]

సీ. చేట నా శూర్పంబు చెలఁగు మొంటె మొరిఁటె
యన బ్రహ్మశూర్పాఖ్య యలరు చుండు
జల్లి జల్లెడ యనఁ జాలని విలసిల్లుఁ,
గండోల మెసఁగును గంప యనఁగ
సిబ్బి పల్లిక నాఁ బ్రసేవవిశేష మౌ
బుట్ట పుట్టిక పుట్టి పుటిక యనఁగఁ
దనరును బిటకంబు, దగుఁ గుసూలాభిధ
గాదె యనంగను గరిసె యనఁగఁ

గీ. దద్విశేషసమాఖ్యలు దనరు చుండు
కొట్టె కూటు పొడక కుమి బొట్ట యనఁగఁ
బఁరగు ఖాతవిశేషము ల్పాఁతఅ యన
నూబ యనఁగను జంద్రమశ్శాబకధర 240

చేట— ఇది శూర్పమునకు(బియ్యము లో నగువానిని చెరుగుసాధనమునకు)పేరు

మొంటె మొరిఁటె— ఇది బ్రహ్మశూర్పమునకు (బొమ్మచేటకు, బాలిక లాడు కొనుచు బొమ్మలకడ ఉంచుకొనెడిచేటకు దానివంటి దైన చిన్నచేటకు) పేరు

జల్లి జల్లెడ——ఇవి చాలనికి (బియ్యము లో నగువానిని జల్లించుసాధనము నకు తితఉవు నకు) పేర్లు.

గంప—ఇది కండోలమునకు (వెదురుబద్దలు కో నగువానితో అల్లిన పాత్రము నకు) పేరు

సిబ్బి పల్లిక—ఇవి ప్రసేవవిశేషములకు (వరుగు మొద లగునవి ఎండఁబెట్టెడి ఒకవిధ మగుతట్టకు దాఁగరకు, ఎండుపుఁదట్టకు) పేర్లు

బుట్ట పుట్టిక పుట్టి పుటిక— ఇవి పిటకమునకు (చిన్నగంపకు) పేర్లు

గాదె గరిసె—ఇవి కుసూలమునకు (ధాన్యము కో నగునవి పోయుటకై మట్టి యొఱలచే ఏర్పఱచినబొట్టకు) పేర్లు

కొట్టె కూటు పొడక కుమి బొట్ట—ఇవి తద్విశేషములకు(ఒకవిధ మైనగాదె లకు) పేర్లు

పాఁతఱ ఊఱ—ఇవి ఖాతవిశేషములకు (ధాన్యము లుంచుటకై నేల త్రవ్విన-ఒకదినుసుపల్లములకు) పేర్లు

పల్లిక —సిబ్బి యనేపాత్రవిశేషము సిబ్బిప్రసేవవిశేషము- శరావము-అని (ఆం భా ) కు ఇచ్చట అర్థము చెప్పు చున్నది (బ్రౌ ) (చూ అను )

ప్రసేవవిశేషము — స్యూతప్రసేవౌ అని(అమ ) ఇట (సుధ ) వస్త్రశణాదినిర్మితస్య'- 'థైలా' ఇతి ఖ్యాతస్య అని వ్యాఖ్యానించినది (సూ ని ) పల్లిక' కడ-ప్రసేవవిశేషము-వెదురుబద్దలు మున్నగువానితో అల్లిన-వెడ ల్పయినతట్ట, దాఁగర-అని వచించినది ఇట్లు వచించియు - సిబ్బిపల్లిక' గ్రహించి వెడల్పుమూతి గలగంప' అని అర్థమిచ్చినది ఇది ఏకపద మనునట్లు

[బుట్ట — హౌఁ బుట్ట'-(వావి అపముద్రి ) పుట్టి-పుట్టికె-పుటిక గ్రహించి (అం భా ) అనుచున్నది (బ్రౌ ) (చూ అను ) (సూ ని ) బుట్ట' కడ- పుట్ట (అపముద్రి ) బుట్టి-వ్రాఁత ప్రా తప్రతిపా అనుచున్నది (బుట్ట-పుష్పాదు లుంచెడికరండము-అవి శ ర మొ )(శ ర పుటిక, పుట్టి-అనువానిని ( పుటి'కి) వైకృతములఁ గాగ్రహించినది )

ఇక- బుట్ట-బుట్టి-బుట్టిక'- అనువానిని గూడ కరండము' అనునర్థమునందు గ్రహించినది (శ ర ఆం భా పా )ఇట ఎట్లుం డెనో తెలియదు

కుసూలము — ధాన్యకోష్ఠే కుసూలో ఽథ కణ్డోలః పిటక పిటః అని (వైజ పాతా పురా ) ఇది కణ్డోలపిటక శబ్దములు సమానార్థకము లనుచున్నది (అం భా )వే అను చున్నది

[తద్విశేషములు —ఈవిశేషములను (శ ర ) కొంత వివరించినది-(కొట్టె) మట్టియొఱలయంతటి దట్ట మగుకాఁగు (ఒకవిధ మైనగాదె-అని (సూ ని ) (కూటు) ధాన్యము పోయుటకు వెంటితో నేర్పఱచెడుగాదె పురి(శ ర )అని సూ ని (చూ కూటు ) (కుమి) కుసూలవిశేషము- అని (శ ర ) [కుమ్మి (రూపాం )] ఈ తట్రబద్దలు లో నగువానితో నల్లినటొట్ట కుసూలవిశేషము-అని (శ ర ) [పౌణక(రూపాం ) పౌడక]

టొట్ట —వెదురుబద్దలు లో నగువానితో నల్లినగాదె- అని (శ ర ) ఇదిలాక్షణికార్థము దీనికి

[ మొంటె, మొరిఁటె యష్టాహ్వశూర్పాఖ్య యలను చుండు అని ఇచ్చటిపార మను చున్నది (బ్రౌ ) (చూ అను మొంటె ) మొంటె కడ(ఆం భా ) అని అష్టాహ్వశూర్పము మొరిటె-అను చున్నది (బ్రౌ ) మొరిటె కు చిన్నచేట అని అర్థము వచించినది (శ ర ) బాలిక లాడుకొను చిన్నచేట-అని దీనిని వివరించినది (సూ ని ) ఒకచో- బ్రహ్మశూర్పాఖ్య' అని యిచ్చటి (ఆం భా పా ) అను చున్నది (చూ సూ ని మొరిఁటె ) చిన్నచేట-అనియే అర్థ మిచ్చినది ఇట్లనియు మొంటె కడ- బ్రహ్వశూర్పాఖ్య అనియే ఆం భా పార మిచ్చినది (సూ ని ) దీనిని బట్టి - బ్రహ్మ లను దానికి (అపముద్రి ) బ్రహ్వ'- అని తోఁచు చున్నది నిఘంటువులు చూచినంతలో- ప్రహ్వ అనుదానికి- అల్పార్థకత్వము ఈయ లేదు ప్రహ్వము-ఏటవాలు గా ఉన్నది వంగినది- మొద లగురీతిని అర్థములు ఇచ్చు చున్నవి బ్రహ్మశూర్పము బొమ్మచేట కు ఐన సంస్కృతీకరణ మనిపించును అష్టాహ్వశూర్పము అను (బ్రౌ.పా కు) అర్థము తెలియ వలయును అష్టశూర్పము'-అని నిఘంటువులలో నాయన్వేషించినంతలో కనఁబడ లేదు, అల్పశూర్పాఖ్య' ఇది కావచ్చు ననిపించినది

బ్రహ్వశూర్పము (అనువావి పా న ) బుట్టయాకారము కలిగి వంగి యుండు-ఒకవిధ మగుచేట-అన వలయును స్థితగతిచింతనము గా ]

సీ వంటయి ల్లనఁగను వంటి ల్లనంగ వి
లసిలు చుండును మహానససమాఖ్య
సూపకారంబు హెచ్చును సువార మనంగ,
నడరును సూపకారుఁ డడబాల
వంటలవాఁడు సువారంపువాఁ డనఁ,
బొయి ప్రొయ్యి నా నధిశ్రయణి వెలయుఁ,
దచ్ఛిలానామంబు దనరుఁ బొక్కలి యనఁ,
బిటకయంత్రాభిధ వెలయు దాలి

గీ. యనఁగఁ దంపి యనంగఁ గుండాఖ్య వెలయు
చుండు గుండ మనంగను గొండ మనఁగఁ
బరఁగ నంగారధాని కుంపటి, యనఁ దగు
బంగల యనంగ బండికుంపటి యగు, భవ 241

వంటయిల్లు వంటిల్లు—ఇవి మహానసమునకు (బానసమునకు వంటసాలకు వంట చేసెడిఇంటికి) పేర్లు

సువారము—ఇది సూపకారమునకు (పాకమునకు వంటకు) పేరు

అడబాల వంటలవాఁడు సువారంపువాఁడు—ఇవి సూపకారునకు (సూదునకు, పాచకునకు బానసీనికి వంట చేయువానికి) పేర్లు

పొయ్యి ప్రొయ్యి—ఇవి అధిశ్రయణికి(పొయ్యికి అగ్నిని ప్రజ్వలింపఁ జేయుటకై ఇటికలు మొద లగువానితో నిర్మించెడిదానికి) పేర్లు

పొక్కలి—ఇది అధిశ్రయణీశిలకు (పొయ్యి కగుఱాతికి పొయిగడ్డకు) పేరు.

దాలి తంపి—ఇవి పిటకయంత్రమునకు (పాలు కాఁచుట కో నగువానికై పేర్చినపిడుకలప్రోగునకు) పేర్లు

గుండము—ఇవి కుండమునకు (అగ్నికుండమునకు, నిప్పులగుంటకు) పేర్లు

కుంపటి—ఇది అంగారధానికి(హసన్తికి నిప్పులు ఉంచెడిపాత్రమునకు) పేరు

బంగల—ఇది బండికుంపటికి (అంగారశకటికి ఒకచోటినుండి వేఱొకచోటికి తీసికొని పోవుటకు ఉపయోగించెడికుంపటికి) పేరు

వంటయిల్లు — బోనపుటిల్లు వంట యిల్లు సువారంపుటి ల్లనఁ బాకమం దిరము రాజిలు (సాంబ స్థా 68 )

సూపకారము — సూపశాస్త్రము పాకవిద్య- అని (బ్రౌ ) సూపకారములోని సూప' శబ్దము పాకమాత్రోపలక్షకము సూపో ఽస్త్రీ ప్రహితం సూదో ఽపి అని (వైజ పాతా. పురా )

ప్రొయ్యి — ఇది త్రివిధము- గడ్డప్రొయ్యి గాఁడిప్రొయ్యి గుంటప్రొయ్యి-' అని (శ ర ) (చూ ప్రొయ్యి )

పొక్కలి —ప్రొయిమీఁదిఎత్తుగడ్డలు- అని (బ్రౌ ) ఎత్తుడుప్రొయ్యి మూఁడురాళ్లు పెట్టిన ప్రొయ్యి- అని (శ ర )

తంపి — దీనికి దాలిగుంట అర్థమని త్రంపి అనుదానికి దాలి అర్థ మను చున్నది (శ ర ) (సూ ని )- తంపి కి దాలి అర్థ మని తంపి కి త్రంపి (రూపాం ) అను చున్నది ప్రయోగము లి ట్లున్నవి- (త్రంపి) ఆసలత్రంపి వెట్టి హృదయం బను కాఁగున యోగవాసనా భ్యాసపునీరు గాఁచుటకు నాగమపావకముం దగిల్చి (ఉ హరి 4 86 ) నీ రాఱువేఱుఁబిడకలదాళ్లిడి నెల్లికొయ్యలు ద్రచ్చి నుచ్చు లంటించినం జెచ్చుపెరుఁగుచిచ్చు లాత్రంపులం దవిలించి (మనుచ 4 60 ) మొ (తంపి)- నేతులు గొనిపోయి నెఱయఁ దంపులఁ బోసి పెనుమంట లొండొండ తనరఁ జేయు ' (హరి పూ 5 206 ) (చి ని పా ) అని (సూ ని ) (29 ) సంఖ్యతో) నిప్పులఁ బోసి అని (ముద్రిపా ) పై తంపులఁజ అనుదానికి దాలిగుంట అనునర్థమునకం టె దాలి ఽనెడియర్థమే సముచితము పై ప్రయోగములఁబట్టి తంపి- త్రంపి (రూపాం ) అనుటయే న్యాయ్యము

పిటకయన్త్రము — పిటక శబ్దమునకు నాచూచిననిఘంటువులు పిడుక అనునర్థము నిచ్చుట లేదు సూ ని పిడక కడ (సం పిష్టకః ప్రా పిట్ఠజ ) అను చున్నది

బంగల — కుంపటి అంగారధానిక- అని (శ ర ) హసన్త్యఙ్గారశకటీ హసన్యఙ్గా

ంధా న్యపి (ఒని) (వైజ పాఠా పురా) ఈ అఙ్గారశకటి నే (విశేషవివక్షతో) బండికుంపటి అని వేఱు గా (అం ఖా) వ్యవహరించిన దనిపించును

సీ॥ ని ప్పింగలము, మల్లె నిప్పుక వైరాలు
వైరవు, లనఁగ నంగార మొప్పుఁ,
గార్చి, చ్చెరగలి, నాఁ గనుపట్టు దావాగ్ని
మంట, నా జ్వాలనామంబు వెలయు,
నదరులు మిణుఁగుఱు లన నౌ స్ఫులింగము
లొ ప్పగ పొవ యన ధూమము తగు నిగుఱు
నీఱు బూడిద యన నెగడును భస్మాఖ్య
పరఁగు నుల్కాభిధ కొఱవి యనఁగఁ

గీ॥ గచ్చిక యనంగ వెలయు దగ్ధపిటకంబు
కుమ్మ నాఁగఁ దుషాగ్ని యై కొఱలు
న ల్లనంగను గాశికానామము లగు
మూర్ధధృతగంగ శ్రీమాతృభూతలింగ 242

నిప్పు ఇంగలము మల్లె నిప్పుక వైరాలు వైరవులు—ఇవి అంగారమునకు (వయిరవులకు, కట్టెనిప్పునకు) పేర్లు

కార్చిచ్చు ఎంగలి—ఇవి దావాగ్నికి (దవమునకు, వనవహ్నికి అడవిలో చెట్లు ఒండొంటితో రాచుకొనుటవలన కలిగిననిప్పునకు) పేర్లు

మంట—ఇది జ్వాలకు (అర్చికి, అగ్గిమంటకు) పేరు

అదరులు మిణుఁగుఱులు— ఇవి స్ఫులింగములకు (మిడుఁగుఱులకు నిప్పు కణములకు) పేర్లు

పొగ పొవ—ఇవి ధూమమునకు (మేఘవాహినికి, మండుటకు ముందు నిప్పు రాఁజుకొను చున్నప్పుడు బయలుదేఱుపొగకు) పేర్లు

నిగులు నీఱు బూడిద—ఇవి భస్మమునకు (కట్టెనిప్పుమీఁది (కాలి) తెల్లనగు ధూళికి) పేర్లు

కొఱవి—ఇది ఉల్కకు (మంట లేనినిప్పుకట్టెకు (కొఱకచ్చునకు) పేరు

కచ్చిక—ఇది దగ్ధపిటకమునకు (కరీషమునకు కాలినపిడుకకు) పేరు

కుమ్ము—ఇది తుషాగ్నికి (కుకూలమునకు ఊఁకనిప్పునకు) పేరు

బొగ్గు నల్ల—ఇవి కాళికకు (ఇంగాలమునకు మండి చల్లారినకట్టెతునుకకు) పేర్లు

వైరవులు — లైరవు లనగ (వావి అపముద్రి) వైరవులు అని (బ్రౌ)

అంగారము — అఙ్గార ముల్మకే న స్త్రీ పుంలిఙ్గ స్తు మహీసుతే అని (విశ్వ) ఇచ్చట సుధాటిప్పణి ఇట్లను చున్నది- (అఙ్గారః) స చ సాగ్నిః నిరగ్ని శ్చ సాగ్నౌ యథా- అఙ్గారచుమ్బితమివ వ్యథమాన మాస్తే ఇతి నిరగ్నౌ యథా- కలఙ్క స్తత్రత్యో వ్రజతి మలినాఙ్గారతులనామ్ ఇత్యాదిప్రయోగః- ఇతి మకుటః- ఇతి (చూ అథ న స్త్రీ స్యా దఙ్గారః అనెడి (అమ) వ్యాఖ్యాసందర్భము)

భస్మము — భసితం భస్మ భూతి స్స్యాత్ (వైజ స్వర్గ లోక) భస్మము - ఏదైనను కాలి తెల్లగా నైనపొడి బూది- (అని) (శ ర)

ఉల్క — దీప్తాగ్రం కాష్ఠ ముల్కా- స్యా త్క్రముకో ఉలాత ముల్మకమ్ అని (వైజ స్వర్గ లోక)

[నల్లనంగను —నల్ల లనఁగను- (వావి పా) బ్రౌ సూ ని (బ లోనే) దీనికి ప్రయోగములను ఇచ్చినవి- నల్ల- (నల్లలు అని (బ్రౌ) తేట లగులేటినల్లలు గ్రుమ్మరించి' (స్వారో 4 93) నల్లలను దిలకంబులను దీర్చి (తారా 5 46) అనినది అళిసమూహంబు నల్లలు (పరిబంధ 44) లనినది (సూ ని)

సీ భస్మవిశేషంబు పరఁగును గఱు, కన

మసి యన మషి యొప్పు మంగల మన

భ్రాష్ట్రాభిధానంబు పఱఁగుచు నుండును
స్వేదని వెలయును బెన మనంగఁ
గందువు బాణలి కంచుకం బనఁ దగు
సిద్దె, యం చనఁగను జెలఁగుఁ గుతువు,
బొడియ యం చనఁగను బొల్చును గుతుపంబు
చనును గుతూద్వయసంగతంబు

గీ సంగడ మనం గుతూముఖాచ్ఛాదనంబు
దట్ట యనఁ దగుఁ, జిరిపి నాఁ దనరుఁ దైల
మార్జకము, గంటె గరిఁటె నా మనును గంబి,
మిల్లి, యన నల్పకంబి యౌ మిహిరభూష 243

కళుకు—ఇది భస్మవిశేషమునకు (మూలికాదులు కాల్చి చేసినభస్మమునకు, క్షారమునకు) పేరు

మసి—ఇది మషికి (గుడ్డపేలిక లో నగునవి కాల్చిన-అగునల్లనిపొడికి) పేరు

మంగలము—ఇది భ్రాష్ట్రమునకు (అంబరీషమునకు, వేఁపుడుచట్టికి) పేరు.

పెనము—ఇది స్వేదనికి (దోసెలు మున్నగునవి కాల్చెడియినుపరేకునకు) పేరు

బాణలి కంచుకంబు—ఇవి కందువునకు (వేఁచుట లో నగువానికి ఉపయోగించెడిలోహపాత్రమునకు, మూఁకుటివంటిదానికి, బూరెలమూఁకుటికి) పేర్లు

సిద్దె—ఇది కుతువునకు (స్నేహపాత్రమునకు, నూనె నేయి మొద లగునవి పోయుగొట్టమువంటి-పొడు గగుసన్నని మూతి గల-ఒకవిధ మగుపాత్రమునకు) పేరు

బొడియ—ఇది కుతుపమునకు (చిన్నకుతువునకు చిన్నసిద్దెకు) పేరు

సంగడము—ఇది కుతూద్వయసంగతమునకు (రెండు సిద్దెలకు వేసెడిమెలికకు) పేరు

దట్ట—ఇది కుతూముఖాచ్ఛాదనమునకు (సిద్దెమూతికి వేసెడిమంటిమూఁతకు) పేరు

చిరిపి—ఇది తైలమార్జకమునకు (సన్నమూతి గలసిద్దెలోనిజిడ్డు తుడుచుటకు ఉపయోగించెడి-ఒకవిధ మగుసాధనమునకు) పేరు

గంటె గరిఁటె—ఇవి కంబికి (దర్వికి అన్నము లోనగువానినిఁ బైకిఁ దీయుట కౌసాధనమునకు) పేర్లు

మిల్లి—ఇది అల్పకంబికి(చిన్నగరిఁటెకు) పేరు

కఱుకు — మందాకు మాడ్చి రాచినపొడి-అని (శ ర )

స్వేదని — నా కస్తు ర్వా స్వేదని స్త్రియామ్ అని (అమ ) ఇది కస్తువు స్వేదని' ఏకా ర్థము లను చున్నది (ఆం భా ) భేదము చెప్పు చున్నది ఇట్టివి అచ్చటచ్చట కాన వచ్చును

సిద్దె —బుంగవలె తోలుతో కుట్టిన పాత్రము- అని (శ ర )

కుతువు —కుతూః కృత్తేః స్నేహపాత్రం సై వాల్పా కుతుపః పుమాన్' అని (అమ ) తోలుతోఁ జేసినతైలపాత్రము కుతూః' అనఁబడును-అని (గురు ) లోహపాత్రముల కును ఆముదపుసిద్దె అనునట్టివ్యవహారము (లాక్షణికము గా) తరువాత ఏర్పడిన దనవలయును కుతుపము-చేతిసిద్దె- అని (శ ర సూ ని )

బొడియ —రెండుసిద్దెలకు వేసెడిపెన- అని (శ ర ) ప్రమాదమున- సంగడము నకు ఈ యవలసిన- అర్థము' (శ ర ) దీని కిచ్చినట్లు తో చు చున్నది

సంగడము —నిఘంటువులు దీనిని ఈ అర్థము న గ్రహించుట లేదు (సూ ని ) గ్రహించి కుతూముఖాచ్ఛాదనము'- అని అర్థ మిచ్చినది అన్వయమున ప్రమాదపడినట్లు తోఁచు చున్నది

దట్ట — దట్టా'-అని (శ.ర )

సీ చనును బిత్తెడ యన శష్కులికాభ్రమ
ఖసముద్ధరణసాధకాహ్వయంబు

తండువు తెడ్డు నాఁ దనరు, మహాతండు
వబక నా నగప, నా నలరు చుండుఁ,
జట్టువ పౌన్నట్టు చట్టువం, బనఁగను
దారుహస్తాభిధ దనరు చుండుఁ,
దెలె హరివాణంబు తలిగ, కంచము, తట్ట
చాకీ, లనంగఁ గంసంబు దనరుఁ

గీ. బళ్లెరము, పళ్లె, మనఁగను బాత్ర మొప్పు,
గిన్నె యన డబ్బు రనఁ గోర యన్నఁ జషక
ము తగుఁ, జనుఁ బత్రపాత్రంబు పుల్లె యనఁగఁ,
బత్త్రచషకంబు దొన్నె దొప్పన మను, భవ 244

బిత్తెడ—ఇది శష్కులికాప్రముఖసముద్ధరణసాధకమునకు (చక్కిలము లోనగు వానిని పైకి ఎత్తెడు లోహసాధనవిశేషమునకు) పేరు

తెడ్డు—ఇది తండువునకు (కొయ్యగరిటెకు, తెడ్డునకు) పేరు

అబక, అగప—ఇవి మహాతండువునకు (టెంకాయచిప్పగరిటెకు, కొయ్యకు టెంకాయ చిప్పను గ్రుచ్చి గరిటెవలె చేసినదానికి) పేర్లు

చట్టువ, పౌన్నట్టు, చట్టువము—ఇవి దారుహస్తమునకు (హస్తాకారము గలుగునట్లు కొయ్యతో ఏర్పఱచిన - ఒకవిధ మగుగరిటెకు) పేర్లు.

తెలె హరివాణము తలిగ కంచము, తట్ట చాకీలు—ఇవి కంసమునకు (భోజనపాత్రమునకు) పేర్లు.

పళ్లెరము, పళ్లెము—ఇవి పాత్రమునకు (పళ్లియమునకు తమలపాకులు మున్నగునవి ఉంచుకొనెడి- ఒకవిధ మగుపాత్రమునకు) పేర్లు.

గిన్నె, డబ్బర కోర—ఇవి చషకమునకు (దబ్బరకు, పానపాత్రమునకు మద్యము లో నగునవి త్రాగెడిపాత్రకు) పేర్లు

పుల్లె—ఇది పత్రపాత్రమునకు (ఆకులతో ఏర్పఱచినభోజనపాత్రమునకు విస్తరికి) పేరు

దొన్నె, దొప్ప—ఇవి పత్త్రచషకమునకు (ఆకుతో ఎర్పఱచిన పాత్రమునకు చారు మొద లగునవి త్రాగుటకు ఉపయోగపడుదానికి) పేర్లు

బిత్తెడ — జిత్తెడ నాన -(వావి అపముద్రి)

తండువు — స్యా త్తణ్డూ ర్దారుహస్తకః' అని-(అమ) (ఇది గురు పా) స్యా త్తర్దూ ర్దారుహస్తకః' అని-(అమ)(సుధాపా) (ఆం భా) గురు పా చొప్పున తణ్డు' వనినది

దారుహస్తము —(అమ) తండువు-దారుహస్తకము-పర్యాయము లనుచున్నను (ఆం భా) వీనిని విశేషవివక్షతో వేఱుపఱచినది

చాకీలు —చాకీ-అని (ఏ). (శ ర బ్రౌ చి ని) ఏకవచనాంతముఁ గానే దీనిని గ్రహించినవి బహువచననిర్దేశ మవివక్షితము వివక్షితమైనఁ గంఠోక్తము గా అం భా వచించును.

కంసము — కంసో ఽస్త్రీ పానభాజనమ్'-అని (అమ) కంసో దైత్యే పానపాత్రే కాంస్యే మానాన్తరే ఽపి చ' (నానా.) ఇవి అన్నియు పానపాత్రమే అర్థ మను చున్నను ఈశబ్దమునకు భోజనపాత్రము అర్థ మను చున్నది (ఆం భా)

సీ తామ్రాది కలశాభిధానము లెచ్చలు వొందుఁ
దంబుగ యనఁగను జెం బనంగ
దార్వాదికలశము ల్దనరు ముంత యనంగ
గుండ నాఁగ మృదాదిభాండ మెసఁగు
దామ్రాదిభాండము ల్దనరు బిందె యనంగ
విస్తృతతత్సంజ్ఞ వెలయు చుండుఁ
జెరవ, యనంగను జెరవ మనంగను,
గ్రాలుఁ గటాహంబు క్రాఁ గనంగ,

గీ గాజుకొప్పెర, యనఁగను గర్పర మగు
నెగడు నీరా డనంగను నీళ్ల చివది
యన నలంజరనామధేయమ్ము సాని
క, లన వెళపాటితట్టలు వెలయు నభవ 245

తంబుగ చెంబు—ఇవి తామ్రాదికలశపాత్రములకు (రాగి మొద లగువానితో చేసినచిన్నలోహపాత్రలకు) పేర్లు

ముంత—ఇది దార్వాదికలశమునకు (చల్ల లో నగునవి పోసికొనుటకై కొయ్య మొద లగువానితో చేసిన ముంతకు మానిముంతకు) పేరు

కుండ—ఇది మృదాదిభాండమునకు (మట్టి లో నగువానితో ఒనర్చినకడవకు) పేరు

బిందె—ఇది తామ్రాదిభాండములకు (రాగి మొద లగువానితో చేసినలోహ పాత్రవిశేషమునకు నీళ్లు లో నగునవి తెచ్చుకొనుటకు ఉపయోగించెడి ఒక సాధనమునకు) పేరు

చెరవ చెరవము—ఇవి విస్తృతతామ్రాదిభాండమునకు (రాగి లో నగువానితో చేసిన-వెడలుపుమూతి గలపాత్రమునకు కలాయివంటిదానికి) పేర్లు.

క్రాఁగు—ఇది కటాహమునకు (పెద్దబానకు) పేరు

గాజుకొప్పెర—ఇది కర్పరమునకు (గాజుతో చేసిన-వెడల్పుమూతి గల చిన్న పాత్రమునకు) పేరు

నీరాడు నీళ్లచివది— ఇవి అలంజరమునకు (స్నానాదులకై నీళ్లు కాఁచెడి కాఁగునకు) పేర్లు.

సానికలు—ఇది వెళపాటి తట్టలకు (వెలు పైన తబుకులకు ఒకవిధ మైనవెడల్పు పళ్లెములకు వెడల్పు గల భోజనపాత్రలకు) పేరు

తంబుగ — తంబిగి' అనికూడ (సూ ని) గ్రహించినది తంబుగకు ప్రమాణము గా ఈ ఆం భా ను తంబుగగా ఇచ్చినది ఇట్లు పారము చూపి- చెంబు' కడ- తంబిగ గా ఈ (ఆం భా పారమునే) ఇచ్చినది (సూ ని) ఆం భా ను గ్రహించుటలో ఇట్టి పరస్పరవైరుద్ధ్యములు కొన్నిచోట్ల చూపట్టుచున్న వని పూర్వము వచించితిని (తంబిగ-మెడ నిడుపు గా ఉండెడిచెంబు చెంబు-రాగి మొద లగువానితో చేసిన-చిన్నమూతి గలస్వల్పపాత్రము-అని (సూ ని) అర్థ మిచ్చు చున్నది వీనికి)

ముంత —జోడ్తెవెలవంటిమూనిపాత్రము-అని (శ ర)

భాండము — భాణ్ణ మావపనే ఉమత్రం భాజనే పాత్ర మి త్యభే' అని వైజ (పాతా పురా) (ఆం భా) భాండ' శబ్దమునకు భాజనము' అర్థము కాఁ దగి యున్నది

బిందె —ఒకకవి ఇట్లు వచించినాఁడు- హరివాణంబుఁను గిన్నియల్ పడిగముల్ హస్తావళు ల్పీరముల్ గరిఁజె ల్గిండ్లు ను దట్ట లొడ్డికలు గంగాళాలు పింగాండ్లు ఘర్ఘరికల్ బిందెలు కొప్పెరల్ (వరా 4 1 2)

కటాహంబు — కటాహో ఘృతతైలాదిపాకపాత్రే ఒపి కర్పరే' అని (విశ్వ)

సానికలు — సానిక-సానికె మంటికంచము సానికలు-అనఁగా పెడ్డాప్పటిమానితట్టలు (D) అని (బ్రౌ)

వెళుపాటి —వెడలు పైన పరిమాణము గలది చంచరీకాంగనాగరుచ్ఛాయ నలరు కుటిల కోమలతరదీర్ఘకుంతలములు మడమ లంటఁగ నిడుపాటిజడలు గట్టఁ బాశుపతమంత్ర దీక్షఁ జేపట్టె గౌరి' (హర 4 10) నిడుపాటివంటిదే వెళుపాటి

సీ. కడవ యనంగను ఘట మగు ఛల్లి ని
కటఘట మొఁ బొంతకడవ యనఁగఁ
బశ్వాదిభాండంబు పరఁగుఁ దొట్టి యనంగఁ
దతముఖభాండాఖ్య తనరు బాన,
పవ్వ, గంగాళము, బందడ, మనఁగను,
నుత్పంక్తివిన్యాసయోగ్యభాండ

మలరును నేవు నా, నతిజవగ్రాహ్యజ
లానయనార్హభాండంబు పంటి

గీ పనఁటి యనఁ దగు, వర్తులభాండ మెసఁగుఁ
గుండ, యన వెస, లన నల్పభాండ మెసఁగు,
నల్పముఖభాండనామధేయంబు చెలఁగు
బుడ్డి బుంగ బుడిగ, నాఁగ, భుజంగభూష 246

కడవ— ఇది ఘటమునకు (అన్నాదులు వండెడిపాత్రమునకు; పిరరమునకు, వంటకుండ-లోనగు స్థాలికి, ) పేరు.

పొంతకడవ—ఇది ఛుల్లీనికటఘటమునకు (పొయ్యిదగ్గఱినీళ్లకుండకు) పేరు.

తొట్టి—ఇది పశ్వాదిభాండమునకు (పశువులు లో నగునవి నీళ్లు త్రాగెడి గాబు తొట్టికి) పేరు

బాన పవ్వ గంగాళము బందడము—ఇవి తతిముఖభాండమునకు (వెడ ల్పైన పై భాగము (మూతి) గలపాత్రమునకు) పేర్లు

నేవు— ఇది ఉత్పంక్తివిన్యాసయోగ్యభాండమునకు (పై ని దొంతర పేర్చుటకు వీ లైనదొంతికుండకు) పేరు.

పంటి, పనఁటి—ఇవి అతిజవగ్రాహ్యజలానయనార్హభాండమునకు (చప్పున నీరు గ్రహించి తెచ్చుటకు అనుకూల మైనపాత్రమునకు) పేర్లు.

కుండ—ఇది వర్తులభాండమునకు (గుండ్రనిపాత్రకు) పేరు

వెసల—ఇది అల్పభాండమునకు (చిన్నకుండకు) పేరు.

బుడ్డి, బుంగ బుడిగ—ఇవి అల్పముఖభాండమునకు (చిన్నమూతి గలపాత్రకు; కూజా లో నగువానికి) పేర్లు

కడవ — తిండిపోత నీకు భండనం బేటికిఁ గడవఁ జేరి మనసుకాంక్ష దీఱ నోపుకొలఁది

మిగ్రింగి యూరక నీ వింటి కిడన యుండు మింక నెడిచి పడక (భార ద్రో 4 239 ) (కడవ-ఉన్నపుకుండ-అని భావము)- అని (సూ ని ) పిఠరః స్థాల్యుఖా కుణ్డమ్' అని (అమ ) ఈ కుణ్డ'మే ఇట కడవ' అనఁబడిన దని తోఁచినది

ఘటము — కలశ స్తు త్రిషు ద్వయోః ఘటః కుటనిపౌ ' అని (అమ ) కలశపర్యాయము ఘట మను చున్నను (ఆం భా ) వంటకుండ' గానే ఇచ్చటిఘటశబ్దార్థమును వచించి నది కుండ ను వేఱు గా వచించిన దిది- (2 245 )

తొట్టి —ఈ-అర్థమునందు (సూ ని ) ఈ పదమును గ్రహింప లేదు

పవ్వ —ఉత్పంక్తి విన్యాసయోగ్యభాండము, దొంతికుండ-అని (బ్రౌ ) (చూ అను ) అన్వయమున ప్రమాదపడినది

[గంగాళము —కంచాళము-(వావి ఉపముద్రి ) ]

సేవు —దీనిని ఏనిఘంటువులు గ్రహింప లేదు

పనఁటి — వంటకుండ, కుండ'-అని (శ ర ) చప్పున నీళ్ల మించి తెచ్చెనోనఁ దగినకుం డ-అని (సూ ని ) పెద్దకాఁగు (ంజ) మూతివెడల్ప గిలయుటికి-అని (బ్రౌ.) జలానయనార్హ భాండంబు పంటి' ఉనుచో ల-డ'లకు డలయో రభేదః' అనున్యాయమున యతి

వెసల —వెసల, వెసలె-అటిక-అని(బ్రౌ ) వంటపాత్ర పాత్ర-అని (సూ ని ) తాఁ జెద్ద కోమటి వెనుకయ్య చేతికి వెసల యిచ్చు అనుసామెతను ప్రయోగములతో ఉదాహరించి నది (ఉ హరి ) ప్రయోగ మొకటి గూడ ఇట్లున్నది తా జెద్దవాఁడు వెనకయ్య చేతికి వెస లిచ్చె ననుమాట నిజము గా (4 60 ) (అని ) అటిక' అనునర్థమే యుక్తము వీనియందు (సూ ని ) ఇచ్చిన యర్థము వీనికడ సరి గా దనిపించును [ వెనకయ్యవెనుకయ్య' అని (సాంబ ) కుమారస్వామికి పే ర్లిచ్చి వెనుకయ్య అనుదానికి అనుజు డు (తమ్ము డు) అనునర్థము కల దను చున్నది- వెనకయ్య వెనుకయ్య వేల్పులదళవాయి ' (దేవ 7 ) (అని ) (ఉ హరి మొ చోట్ల వెను కయ్య' అనుటయే యుక్తము ) ]

[బందడము — బందడ మనికి నా (వావి వా ) ఇదియే (బ్రౌ పా ) గా ఉన్నది బందడ- మనికి -అనగా ఉత్పంక్తివిన్యాసయోగ్యభాండము-అని (బ్రౌ ) (చూ అను )

బందడము-దొంతికుండ-అవినది (శ ర.) 'బందడ మనఁగను' అనునదియే (శ ర.పా ) కా నోపును బందడము-బందలము- తతముఖభాండము-వెడఁదబాన- అని (సూ. ని.). (బ్రౌ.శ.ర అన్వయమున ప్రమాదపడిన వనిపించు చున్నది.)[ఇచ్చట-'బందడ మనికి నా'అనుపారమున-'బందడ, మనికి' వేఱుపదము లనుట ఉచితము- మణిక' శబ్దమునకు (వికృతి) 'మనిక' ( మనిక' రూపాం ) అన వలయును. మనిక' అనుట ఉచితము అలిఞ్జర స్స్యా న్మణికః' అని (అమ ) మహాకుమ్భస్య' అని సుధ ]

[బుడ్డి బుంగ —'బుడ్డి బొంగ బుడిగి' అని (వావి పా.). (బొంగ-వావి అపముద్రి.) బుడిగి-చిన్నకుండ-అని (బ్రౌ ) బుడిగ-పిడుత(చిన్నకుండ) అని (శ. ర ). బుడుగు-పొట్టి బుడుగుయొక్క (రూపాం ) బుడిగి' అనియు (శ ర ) బుడ్డి-చిన్నమూతి గలనిడుపాటికాచపాత్రవిశేషము (శ ర )]

సీ నిమ్నభాండాభిద నెగడు లోవి యనంగ,
నతభాండసంజ్ఞ గూన, యనఁ బరఁగు,
దుత్త, యనంగను దుగ్ధభాండం బొప్పుఁ,
దగు గళంతిక గలంతె గరిగ యనఁ,
బ్రతలాల్పభాండంబు పరఁగుఁ జట్టి, యటిక,
యన, ముష్టిమానభాండాఖ్య పిడుత,
యనఁ దనరారు, నత్యల్పభాండం బొప్పు
గురిగి యం చనఁగను గురియ యనఁగ,

గీ లడ్డిగ, యనంగ వేణుపాత్రంబు చెలఁగు,
గొట్ట, మనఁ దద్విశేషంబు కొలఁ చుండు,
దీపపాత్రంబు ప్రమిద, నాఁ దేజరిల్లు
భూరిభవభంగ శ్రీమాతృభూతలింగ 247

లోవి—ఇది నిమ్నభాండమునకు (లోఁ తైనకుండకు, పెద్దకుండకు) పేరు.

గూన—ఇది నతభాండమునకు (వక్రభాండమునకు, అంతయు సమము గా లేక

క్రింద పైని సన్నముగాను నడుమ లావు గాను ఉండి- ధాన్యాదులు పోసికొను టకు ఉపయోగించెడికుండకు) పేరు

దుత్త—ఇది దుగ్ధభాండమునకు (పాలకుండకు) పేరు

గలంతె, గరిగ—ఇవి గళంతికకు (గిండివలె సన్నపుమెడ గలిగి వంచుటకు వీలైనముక్కు- గలకుండకు) పేర్లు

చట్టి అటిక—ఇవి ప్రతలాల్పభాండమునకు (చాలవెడ ల్పైనక్రిందిభాగము గల చిన్నకుండకు) పేర్లు

పిడుత—ఇది ముష్టిమానభాండమునకు (పిడికెఁడుకొలత కలకుండకు మిక్కిలి చిన్నకుండకు) పేరు

గురిగి గురియ—ఇవి అత్యల్పభాండమునకు (బాలికలు ఆడుకొను చున్న పిడుతకు) పేర్లు

లడ్డిగ—ఇది వేణుపాత్రమునకు (వెదురుతో అల్లినబుట్ట పళ్లెము-మొద లగు వానికి) పేరు

గొట్టము—ఇది తద్విశేషమునకు (ఒకవిధ మగువేణుపాత్రమునకు వెదురు గొట్టమునకు) పేరు

ప్రమిద—ఇది దీపపాత్రమునకు (దీపము వెలిగించెడిప్రమ్మిదకు ఒకదినుసు శరావమునకు) పేరు

లోవి —నీళ్ల తెచ్చుకొనేయిత్తడిపాత్ర-అని (బ్రౌ) నిమ్నభాండము-అనియు (బ్రౌ) (చూ అను) వంటకుండ స్థాలి-అని (శ ర సూ ని)

గూన —అడ్డకుండ-అని (శ ర) లోఁతుకుండ అని (సూ ని)

దుత్త — ఆముదపుదుత్త ఇత్యాదులు గోబలీవర్దన్యాయమున సంగతములు

చట్టి —నోరు వెడల్పు గలచిన్నమట్టిపాత్రము-అని (శ ర)

లద్దిగ —ప్రయాణము పోవునపుడు నెయ్యి నూనె మొద లగునవి పోసికొని పోయెడు చిన్నమూతి గలపాత్రవిశేషము-అని (శ ర) లద్దిగము (రూపాం) (బ్రౌ) లద్దిగె కూడ (రూపాం) అను చున్నది

ప్రమిద —ప్రమితె ప్రమిదె-అని (బ్రౌ)

[గలంతె — కలంత అని (వావి అపముద్రి)]

[గురిగి — గురిగ యం చనఁగను గురి యనంగ (వావి పా) (గుఱిగి గురియ అను పైపాఠము (బ్రౌ వ్రాఁతప్ర పా) (చూ సూ ని గురియ)]

సీ. సిబ్బి మూఁకు డనంగఁ జెలఁగు శరావంబు
 పరఁగు దడ్డెము సావ బఱ్ఱె మల్ల
యన నగుఁ దద్విశేషాభిధ శాకంబు
 కూర యనంగను మీఱు చుండుఁ
జూర్ణశాఖాభిధ శోభిల్లు దుగ్గు నాఁ,
 బప్పు బేడ యన సూపంబు దనరు,
నుపదంశసంజ్ఞ యై యొప్పుఁ బచ్చడి యన
 శాకనాళముపేరు చనును గమ్మ

గీ. కామ కాఁ డనఁ దింత్రిణీకంబు చింత
పం డనంగ వెలయును సంబా రనంగ
వేశవారంబు దనరును వెలయు మిరియ
మన మరీచాఖ్య పార్వతీప్రాణనాథ 248

సిబ్బి మూఁకుడు—ఇవి శరావమునకు (కుండమీఁద మూయుటకు ఉపయోగించెడి మట్టిపాత్రకు వర్ధమానమునకు) పేర్లు

దడ్డెము సావ బఱ్ఱె మల్ల—ఇవి తద్విశేషమునకు (ఒకవిధ మగుమూఁకుటికి, మట్టికంచమునకు) పేర్లు

కూర—ఇది శాకమునకు (తోఁటకూర వంకాయ మొద లగుదానికి (పక్వమునకు, అపక్వమునకు) పేరు

దుగ్గు—ఇది మూర్ణశాకమునకు (తొక్కునకు ఉప్పు కారము చేర్చి తోటికో నలఁగఁ గొట్టినమామిడికాయలు లో నగువానిముద్దకు తొక్కుడునకు) పేరు

పప్పు బేడ—ఇవి సూపమునకు (కాయధాన్యములపప్పునకు) పేర్లు

పచ్చడి—ఇది ఉపదంశమునకు (భక్ష్యద్రవ్యములకు ఉపకరించెడివ్యంజనవిశేషమునకు వంకాయపచ్చడి కందిపచ్చడి మొద లగువానికి) పేరు

కమ్మ కాయ కాఁడ—ఇవి శాకనాళమునకు (తోఁటకూరకాఁడ లో నగువానికి) పేర్లు

చింతపండు— ఇది తింత్రిణీకమునకు (బిఁడు తీసినచింతగుల్లలముద్దకు) పేరు

సంబారు—ఇది వేశవారమునకు (సంభారమునకు కూరలలో వేయురసనర్గమునకు ఆవాలు మెంతులు జీలకఱ్ఱ మొద లగువానికి) పేరు

మిరియము—ఇది మరీచమునకు (మిరెమునకు ఒకవిధ మగుసంభారవస్తువునకు) పేరు

సిబ్బి — ఇత్తడి మూఁకుడు- అని (శ ర) సిబ్బిరేకు అనియు దీనికి వ్యవహారము

మల్ల —మల్లః పాత్రే కపోలే చ మత్స్యభేదే బలీయసి (మేదిని) (చూ సుధ) మల్లి ర్మల్లికాపాత్రపీఠ యోః అని (వైజ ద్వ్య స్త్రీలి) మల్లీ తు మృత్పాత్రతృణశూల్యయోః అని (నానా) వీనినుండి యేర్పడినది ఇచ్చటి-మల్ల

కూర — దీనిభేదములను (సూ ని) ఇట్లు వచించినది - ఆకుఁగూరలు పూవు గూరలు, కాయకూరలు దుంపకూరలు (అని)

[దుగ్గు — తొక్కుడు' అని ప్రా త ప్ర పా]

సూపము — దీనికి సంస్కృతమున వండినపప్పే అర్థము

వేశవారము — వేసవారము'- అని (అమ పా) సుధ ఇట వేసవారము ను ఇట్లు

వివరించినది- వేసవార ఉపస్కరః- (అమ) ద్వే సంస్కారార్థే దీయమానస్య హిఙ్గ్వాదేః- హిఙ్గు జీరక హరిద్రా ధాన్యక శుణ్ఠీ సర్ష పాదేః ఇతి మకుటః చిత్రకం పిప్పలీ మూలం పిప్పలీ చ వ్యనాగరమ్ ధాన్యకం రజనీ శ్వేతతణ్డులా శ్చ సమాంశకాః వేసవార ఇతి ఖ్యాతః శాకాదిషు నియోజయేత్-ఇ త్యాత్రేయసంహితా వింశతిః పలాని హరిద్రాయాః దశపలాని ధాన్యకస్య, పఞ్చపలాని శుద్ధజీరకస్య, పలసార్ధద్వయంమేథికాయాః- ఏత చ్చతుష్టయం భర్జితమేవ గ్రాహ్యమ్ త్రీణి పలాని మరీచస్య అర్ధపలం రామఠస్య-ఏత త్సర్వ మేకత్ర సంయోజ్య సంమర్దితం వేసవార' ఇత్యుచ్యతే- ఇత్యన్యే'(అని)

మిరియము — మిరియంబుతోఁ గూడ మేళవించినతెనె దోఁసంపులడ్వాలు పలచి ఘజియించి రాగి పిండివంటకములు (వైష 6 20) ఇట్లు సంభారవస్తువు గా ఇది వర్ణింపఁబడినది

సీ ఇంగు వనంగను హింగువు పసుపు బం
  డారు నాఁగను హరిద్ర చను, సోఁపు
నల్లజీలకఱ నాఁ జెల్లును సుషవిక,
  మెంతి యనంగను మేంథి యొప్పు
నార్ద్రకంబు చెలంగు నల్ల, మనంగను,
  గుస్తుంబరి దనర్చుఁ గొతిమిరి యన
సొంటి యనంగను శుంఠి యౌ లవణాఖ్య
  యుప్పు నా వెలయు నిందు ప్పనంగ
గీ నడరు సైంధవలవణము, నౌ బిడాల
లవణ మంటుప్పు చౌటు ప్పన విలసిల్ల,
నొగి సురక్షార మగును బెట్లు ప్పన న్ను
ఱ ప్పనంగఁ గళాభాసితోత్తమాంగ 249

ఇంగువ—ఇది హింగువునకు (రామఠమునకు కూరలలో అది ఉపయోగించు హింగువు చెట్టుయొక్క జిగురునకు) పేరు

పసుపు బండారు—ఇవి హరిద్రకు(కూరలలో అవి వేసికొనుటకు పూసికొనుటకు ఉపయోగించెడిపసుపుకొమ్మనుండి ఎర్పడు పచ్చనిపొడికి) పేర్లు

సోఁపు నల్లజీలకఱ—ఇవి సుషవికకు (కృష్ణజీరకమునకు నల్లజీలకఱ్ఱకు ఒక దినుసుజీలకఱ్ఱకు) పేర్లు

మెంతి—ఇది మేంథికి (మెంతిగింజలకు మెంతులకు) పేరు

అల్లము—ఇది ఆర్ద్రకమునకు (శృంగవేరకమునకు కారము కలిగి కూరలలో వేయుటకు పచ్చడి చేయుట కది ఉపయోగించు - ఒకజాతిదుంపకు) పేరు

కొతిమిరి—ఇది కుస్తుంబరికి (ధాన్యకమునకు కొత్తిమిరికి దనియపుమొక్కకు) పేరు (దీనిగింజలే దనియాలు)

సొంటి—ఇది శుంఠికి (మహౌషధమునకు పక్వము చేసి ఎండఁ బెట్టిన-అల్లమునకు) పేరు

ఉప్పు—ఇది లవణమునకు (షడ్రసములలో ఒకటికి కూరలో నగువానిలో ఉపయోగించుదానికి) పేరు

ఇందుప్పు—ఇది సైంధవలవణమునకు (మణిమంథమునకు శీతశివమునకు ఒక దినుసు-ఉప్పునకు) పేరు

అంటుప్పు చౌటుప్పు—ఇవి బిడాలలవణమునకు (పాక్యమునకు వంటుప్పునకు) పేర్లు

పెట్లుప్పు సురుప్పు—ఇవి సురక్షారమునకు (వేఁడికి బ్రద్దలగు - ఒకదినుసు ఉప్పునకు సురేకారమునకు) పేర్లు

పసుపు — పసుపునకు పేర్లిదివఱ కిచ్చినది ఆం భా (చూ 2 55) ఇది కూరలలో వేసికొనెడి పచ్చనిపసు పనఁ దగినది అది వనౌషధివర్గము అట (అనఁగా 2 55 లో) పసపు పసుపు—ఇవి పసుపుచెట్టునకు పసుపుకొమ్మనకు- పేర్లు' అని అర్థము చెప్పవలసి యున్నది ఈపసుపుభేదములను కస్తురిపసుపు, కూరపసుపు మ్రానిపసుపు చాయ

పసుపు పిండిపసుపు- అని వివరించినది (సూ ని) నీలిపసుపు అడవిపసుపు- గూడ కల వనుచున్నది (బ్రౌ) (చూ పసుపు) (శ ర) పసపు' గ్రహింప లేదు (బ్రౌ సూ ని)- రెండును గ్రహించినవి (త పచప్పు) ఒకప్రయోగ మి ట్లున్నది- పసపు నలుం గిడి రైదువ బిసరుహలోచనలు పెండ్లిపెద్దలయాజ్ఞ' (మనుచ ౕ. ౦౬) (మనుచ) మఱియొకప్రయోగముగూడ ఇ ట్లున్నది తనయపసపున కొసఁగె గంధర్వవిభుఁడు' (ౕ 102) (సూ ని) ఇట్లే ఇచ్చటిపాఠ మిచ్చినది పసుపు అనునది శ ఠ నుబట్టి తరువాత జరిగినపరిష్కర్తలసంస్కార మనిపించును శ ర నుబట్టి ఇట్టిమార్పులు చాలచోట్ల ప్రబంధములలో జరిగినట్లు అచ్చటచ్చట ఆం భా ఇచ్చునిట్టిరూపములఁబట్టి మన మూహింపఁ దగునవకాశ మున్నది

బండారు — చి కి వైద్యశాస్త్ర మి ట్లను చున్నది బండారు నావపిండి యు వెండియు మఱి కొట్టుపిండి వివరముతోడఁ మెండు గ నడికిలితోడను నొండొంటిం గలిపి పెట్ట నొప్పు గ మానుఁ' (చికి చి ని) ఱాతిమీఁద ఱాచి పూసికొనెడిపసుపు హరిద్రావిశేషము- ఇది-అని (సూ ని) పసుపు అనుటయే యిట సంగత మనిపించును బండారు' హరిద్ర- పసుపు' అనియే (బ్రౌ) (చూ అను) శ ర (భల్లా 1) ప్రయోగ మొకటి యి ట్లిచ్చినది- బండారుకొమ్మనిపట్టుపుసెట్టి యిలు దూఱ నిచ్చునే' (అని) ఇట-పసుపుఁగొమ్మనుటయే సముచిత మనిపించు చున్నది ఇఁక-ఒకప్రయోగము (సూ ని) ఇ ట్లిచ్చు చున్నది- కసి గలసిగలసంగళ్లఁ బూదండ లొసపరిబాగు లై యొనరంగ జుట్టి బండారు గలిసినపసిమిక్రొమ్మిసిమి పిండిగందములు ముప్పిరిగొనఁ బూసి' (ఉమ క 282 పొ 22 పం) (అని) ఇట పసుపు' అనుట స్పష్టము ఇఁక గౌరగ మై మైలారుఁ గొనియాడు నొకవేళ నొసలిపై బండారుపసుపుఁ దాల్చి' (7 230) అను (కాశీ ప్ర) కడ బండారు పసుపు నకు- హరిద్రావిశేషము' అను నర్థము (గోబలీవర్దన్యాయమున) సిద్ధించిన దన వచ్చును బందారు'అని (సూ ని పా)

సోఁపు —ఒకదినుసుసంభారవస్తువు-అని (శ ర) [ సోపు-సుషవి (ఆం భా) (హంస 4 66)- దుంపబచ్చలి తో టకూర కొత్తిమిరాకు సోఁపు మెంతాకు చుక్కాకు గలదు'- అని (బ్రౌ) (చూ అను) ]

మేంథి —మెంతి- మెంతులు' అనియే ఇట అర్థము ధాన్యవాచకమే ఇది సస్యవాచకము గా ఇదివఱ కిది పేర్కొనఁబడినది (చూ 2.236) ధాన్యవాచక మగుటను

మెంతులు' అని బహువచనాంతమే కావలయు నని (శ ర సూ ని) మెంతి మెంతులు' అనుచున్నది (బ్రౌ) ధాన్యవాచకములు (బహు) అనుట ప్రాయిక మని (ఆం భా) ఆశయము మెంతివజ్జిగ' మొ దృష్టములు (వృత్తిని ఏకవచనాంతము లైన వివి యని (శ ర మొ) వానియాశయము

కుస్తుంబరి — కుస్తుంబురు చ ధాన్యాకమ్ అని (అమ) 'ధన్యాకం ధాన్యకం ధాన్యం కుస్తుమ్బురు ధనీయకమ్ ఇతిరభసః-అని(సుధ) కుస్తుంబరి-ధాన్యాకము సం ఈ స్త్రీ కొత్తిమిరి అని(సూ ని)

లవణము — సముద్రలవణము సైంధవలవణము బిడాలలవణము-అని ఇది మూఁడువిధములు సైంధవలవణమునకు రాతిఉప్పు' అనియు పేరు మూఁడవలవణమును మందులకు ఉపయోగింతురు-అని (బ్రౌ) లవణవిభాగమును (అమ) చూపినది (వైజ) పది విధము లని దీనిని వివరించినది (చూ భూమి వైశ్యా)

అంటుప్పు — (శ ర) అట్టుప్పు గా గ్రహించినది అట్టుప్పు' (ప్రాఁతప్రపా) (చూ చౌటుప్పు సూ ని)

చౌటుప్పు — (చౌడు + ఉప్పు) రౌమకము లవణభేదము బిడలవణము-అని (సూ ని) రౌమకే బస్తకమ్' అని (అమ) ఇట (గురు) ఇట్లను చున్నది సంభరి' దేశమందు రుమ అను ఉప్పుగని కలదు అందు వేసినకాష్ఠము కొన్నిదినములకు ఉప్పగును దానియందు పుట్టిన-ఉప్పునందు రౌమక బస్తక శబ్దములు వర్తించును చౌటు ప్పని కొందఱు (అని)

సురుప్పు — ఈపదమును నిఘంటువులు గ్రహింప లేదు చుఱుప్పు' నకైన (రూపాం) చుఱుప్పు సురుప్పు' అన నగు నేమో సురేకారము' గ్రహించి పెట్లుప్పు'-అర్థమను చున్నది (బ్రౌ)

[బిడాలలవణము — బిడలవణము తగును నట్టుప్పు చౌటు ప్పన గ (ప్రాఁతప్రతిపా) అని (సూ ని) (చూ చౌటుప్పు) బిడాలలవణము బిడలవణము (సం వి అ న) అని (సూ ని) బిడాలలవణము అనుటకు ప్రమాణము గా ఈ (ఆం భా.) నే ఇచ్చినది బిడలవణము బిడాలవణము మాత్రము ఇచ్చినది (బ్రౌ) (చూ. మిశ్ర ని) (శ ర బిడాలవణము') గ్రహించి (అన్య అను చున్నది]

సీ. తండులక్షాళనోదకము రాజిల్లును
గుడితి, యనంగను గడు, గనంగ,
గూరాడు, కలి నాఁగ మీఱు ధాన్యామ్లము,
వఱలు నన్నరసంబు వార్పు, గంజి
యనఁగాను, గౌబేర మలరు నంబలి, యన,
విలసిల్లును విలేపి వెలవ, యనఁగ,
నిస్రావసంజ్ఞ మై నెగడు జావ యనంగ,
నుష్ణిక కాఁడి, నా నొప్పు చుండు;

గీ. నటకలి, యనంగఁ జెలఁగు నభ్యంగ తైల
హారకద్రవ్యసంజ్ఞ, మె, ట్టనఁగ మెడు, ద
నంగఁ బులిమె, ట్టనంగఁ జెలంగు చుండు
నభిషుతాఖ్య; నగాత్మజాప్రాప్తసఖ్య 250

కుడితి, కడుగు—ఇవి తండులక్షాళనోదకమునకు (బియ్యము కడిగిన కడుగునీళ్లకు, తండురీణమునకు) పేర్లు.

కూరాడు, కలి—ఇవి ధాన్యామ్లమునకు (పులియఁ బెట్టినకడుగునీటికి) పేర్లు.

వార్పు, గంజి—ఇవి అన్నరసమునకు (వారుపునకు అన్నము వార్వఁగా వచ్చిన అన్నసారమునకు వారుపుగంజికి) పేర్లు.

అంబలి—ఇది కౌబేరమునకు (పిండితో క్రొంచెము పలుచ గా కాఁచినదానికి, ఒక దినుసు జావకు) పేరు.

వెలవ—ఇది విలేపికి (కాఁపుడుగంజికి, పలుచ నైనదానికి) పేరు.

జావ—ఇది నిస్రావమునకు (నూకలు లో నగువానితో పలుచ గా కాఁచిన ఆహారపదార్థమునకు) పేరు

కాఁడి—ఇది ఉష్ణికకు (కాఁపుడుగంజికి, గట్టిదానికి) పేరు.

అటకలి—ఇది అభ్యంగతైలహారకద్రవ్యమునకు (తలంటునూనెజిడ్డు పోఁగొట్టు పదార్థమునకు, సీకాయ-లో నగుదానికి) పేరు

మెట్టు మెడుద పులిమెట్టు—ఇవి అభిషుతమునకు(పులిగంజికి పుల్లనీళ్లకు) పేర్లు

కూరాడు —కాఁచినకలి-అని (శ ర)

ధాన్యామ్లము — ఆరనాలక సౌవీర కుల్మా షాభిషుతాని చ ఉవన్తి సోమధాన్యామ్లకుఞ్జలాని చ కాఞ్జికె అని (అమ)

కౌబేరము —పాలు పిండి కలిపినపిండివంటభేదము-అని (బ్రౌ.) (చూ అంబలి-అను) ఒకదినుసుపిండివంట-అని (శ ర సూ ని)

అంబలి —అంబకిళము-ఒకదినుసుజావ-అనినది (శర)

విలేపి — యవాగూ రుష్ణికా శ్రాణా విలేపీ తరలా చ సా' అని- ఉష్ణికా-విలేపీ శబ్దములు ఏకార్థకము లనినది-(అమ) ఆం భా వే అనినది (సూ ని) వెలవకు' కాఁపుడుగంజి-అని అర్థ మిచ్చి- కాఁడి కిఁగూర ఇదేఅర్థ మను చున్నది (ఆం భా) వచించు చున్న భేదమును గమనింప లేదు (శ ర) కాఁడి కి పులియఁ బెట్టిన కడుగునీరు-అర్థమని నది కలి'కి మరల ఇదేఅర్థ మనినది ఆం భా కు విరుద్ధము గా (వైజ) వీనికి ఇట్లు భేదము వచించినది- యవాగూ రుష్ణికా శ్రాణా పిచ్ఛా సా తు ఘనా ద్రవా విలేపీ స్యా ద్విలే ప్యా చ' (పాతా పురా) (అని)

నిస్రావము — మాసరాచామనిస్స్రావప్రసావ్రా భక్తమణ్డకే అని (వైజ పాతా. పురా) మాసరాచామనిస్రావా మణ్డే భక్తసముద్భవే - అని (అమ) వార్చినగంజిపేళ్లు' అని ఇట (గురు) గంజి-అని (శ ర) భక్తరసము గంజి-అని (సూ ని)

అటకలి — జావభేదము- అని (దీపిక) (చూ బ్రౌ) నూనెజిడ్డు పోఁ గొట్టెడివస్తువు- ఉత్పాదనము- అని (శ ర) జిడ్డు పోవుటకై రుద్దెడిపదార్థము- చందనం బటకలిఁ బ్రామె నొక్క-కుటిలాలక యంబరరాజు పట్టికిన్' (ప్రబంధ 572) అని (సూ ని) తోముకొనే పిండి'-అని (బ్రౌ) నలుఁగు' ను ఉద్వర్త' మనుచు వేఱు గా వచించి నది ఆం భా (2 36).

అభిషుతము — శుక్తాభిషుత కుఞ్జలమ్ (పాతా పురా) అని శుక్తము-అభిషుతము

పర్యాయము లను చున్నది (వైజ) శుక్త’ శబ్దమునకు- పులిగంజి అని అర్థము కలదు-(చూ సూ ని) (వైజ.) తెలుఁగుటీక- అభిషుత శబ్దమునకు పులిగంజి’ అని అర్థ మిచ్చినది గృహోదకము దీనికి పర్యాయ మను చున్నది (వైజ) గృహోదకము-పుల్లనీరు కావచ్చును పులికడుగే కావలయు ననిపింపదు గృహామ్లము-అనుదానికి (సూ ని) పులికడుగు-అర్థ మనినది ఉభిషుత’ మునకు (సూ ని. మొ) పులికడుగు కలి-అర్థ మను చున్నవి కలి’ వేఱుగా గ్రహించి ధాన్యామ్లము’ అర్థ మనుచు- ఈఅర్థము-అభిషుతార్థము కా దను చున్నది (ఆం భా)

సీ. మీఁఱు యూషము కట్టుచారు, పణిద మనఁ
బా, గనఁగాఁ గుడపాక మెసఁగుఁ,
గండచక్కెర, యనఁ గమపట్టు మత్స్యంది,
గుడము బెల్లము చెఱకడ, మనఁ దగు,
శర్కరాహ్వయములు చక్కెర, యఁనగను
బంచదార, యనంగఁ బరఁగు చుండు,
శర్కరాభేదసంజ్ఞలు నవాతు, జుమోజు
పులకండ, మనఁగను బొలుపు గాంచు

గీ. సిగర యనఁగను శిఖరిణి చెలఁగు, నూరుఁ
బిం, డన లవణభావితపిష్ట మొప్పుఁ,
బులుప యులు, పన విరళామ్లకలితపిష్ట
మొనరుఁ, దిమ్మన మనఁగ దేమన మగు, భవ 251

కట్టుచారు—ఇది యూషమునకు (ఉడికినకందిపప్పు లో నగువానిరసమునకు) పేరు

పణిదము పాగు—ఇవి గుడపాకమునకు (బెల్లపుపాకమునకు, బెల్లము కాఁచి కరఁగింపఁగా గట్టిపడిన-ఒకవిధ మగు పాకమునకు) పేర్లు

కండచక్కెర—ఇది మత్స్యండికి (మత్స్యండికి, పటికబెల్లమునకు కలకండకు) పేరు.

బెల్లము, చెఱకడము—ఇవి గుడమునకు (చెఱకుపాలు కాఁచఁగా ఐనగట్టిపదార్థమునకు) పేర్లు

చక్కెర, పంచదార—ఇవి శర్కరకు (సితకు, మెత్తనిచక్కెరకు) పేర్లు

నవాతు, జుమోజు, పులకండము—ఇవి శర్కరాభేదమునకు (ఒకదినుసుచక్కెరకు, మిక్కిలి తెల్లనిగడ్డచక్కెరకు) పేర్లు

సిగర—ఇది శిఖరిణికి (సిగరమునకు, మెంతి జీలకఱ్ఱ మొద లగుసంభారములతో పొగచినమజ్జిగకు, పెరుఁగునకు- మెంతిమజ్జిగకు మెంతిపెరుఁగునకు) పేరు

ఊరుఁబిండి—ఇది లవణభావితపిష్టమునకు (ఉప్పు వేసి మెత్తగా రుబ్బిన మినుపపిండికి, వడియములు పెట్టుట కది ఉపయోగపడుదానికి,పచ్చడి గాఁ గూడ ఉపయోగించు-ఒకవ్యంజనవిశేషమునకు) పేరు.

పులుప ఉలుప—ఇవి విరలామ్లకలితపిష్టమునకు (చింతపండుపులుసులో కలపిన మినుపపిండి లో నగువానికి, ఒకవిధ మగుపులుసుపచ్చడికి) పేర్లు.

తిమ్మనము—ఇది తేమనమునకు (వ్యంజనమునకు, పాలు బెల్లము పిండి మొద లగునవి కలిపి ఉడికించిన ఇంచుకపలుచని పదార్థమునకు) పేరు

కట్టుచారు —కట్టు చారు —అని ఇవి భిన్నపదము లను చున్నది (సూ ని) కట్టుచారు'-అని ఏకపద మను చున్నది (బ్రౌ) (చూ అను) ఇదియే యుక్త మనిపించినది కేవలము చారు' అను దానికి ఈయర్థము లేదు (సూ ని గూడ) ఈయర్థము చారు' అనుదానికి ఈయ లేదు కట్టుచారు'-అని లోకవ్యవహారము ప్రహతము గా కలదు 'కట్టునీళ్లు' అనియు దీనికి (వ్య)

పణిదము —(సూ ని శ ర లు) దీనిని గ్రహింపలేదు (బ్రౌ.) గ్రహించినది (చూ అను)

మత్స్యణ్ది —మత్స్యణ్డీ ఖణ్డశర్కరా-అని (వైజ భూ వైశ్యా) మత్స్యణ్డీ ఫణితం ఖణ్డవికారే' అని (అమ) ఇట మత్స్యణ్డీ' అని (గురు పా)

జూమోజు —శర్కరాభేదము పులోజు'-(పాఠప్ర పా) బమోబ (వ్రాత ప్ర పా.) అని (సూ ని) (చూ జూమోజు)

సిగర —పెరుగులో కొంచెము శర్కర మసాలాలు వేసి చేసినది- ఽని (బ్రౌ) (చూ అను) కొన్ని సంబారువులు చేర్చి పక్వము చెసినమజ్జిగ-అని (శ ర)

శిఖరిణి — ఽపక్వతక్రం సవ్యోషచతుర్జాతగుడార్ద్రకమ్ సజీరకం రసాల స్స్యా న్మార్జితా శిఖరి ణ్యపి' (వైజ పాతా పురా) (ఇచ్ఛటిటీక-అల్లము జీలకఱ్ఱ ము న్నగునవి కలసిన మజ్జిగ-అనినది) దధి మధు శర్కరా మరీ చార్ద్రాదిభిః కృతస్య లేహ్యస్య-' అని (సుధ) శిఖరిణీ స్యా ద్రోమావళ్యాం రసాలవృత్త భేదయోః' అని (విశ్వ) (ఇచ్ఛటీ - పెరుగుతో చేయుపానీయవిశేషము-అనినది) రసాలాయామ్-పెరుగులో అనేకద్రవ్యాలు కూర్చి చెసినది- అని (బ్రౌ).

ఊరుబిండి —ఊరబెట్టినపిండి వ్యంజనవిశేషము- అని (సూ ని) ఊరు+పిండి - వ్యంజనవిశేషము అని మాత్రము- (శ ర) ఉరుబచ్చడి ఊరుబిండి'- సమానార్థకములు- ఽని (బ్రౌ)

ఉలుప —విశామ్లకలితపిష్టము పుల్లఊరుబిండి- అని (బ్రౌ) పలుచ గా నూఱినపుల్ల ఊరుబిండి-అని (శ ర)

తిమ్మనము — తెలినులివెచ్చయోగిరము తియ్యనిచారును దిమ్మనంబుఌన్ పలుచనియంబ ళుల్'- (ఆము 1 81.) ఉదాహరించి, (తిమ్మనము) పాయసము'- అని (టీక)-ఽని (బ్రౌ) వేదమువారిటీక ఇట- మజ్జిగపులుసు' అర్థ మను చున్నది (శ ర) గూడ ఇట్లే అనినది తేమనముఽడ (బ్రౌ)పాలు పిండి బెల్లము వేసి వండినది-అని (దీపిక) అనినది కందబజ్జి సమర్పించెఁ గందకబరి పాలతిమ్మన మిడియె శంపాలతాంగి' (బహు 4 35.) (చూ సూ ని)

తేమనము — నిష్ఠానం తేమనం తచ్చ వ్యఞ్జనం స్యాత్' అని (వైజ పాతా పురా.) నంజుకొనుపదార్థము, తిమ్మనము-అని (సూ ని) స్యా త్తేమనం తు నిష్ఠానమ్' అని (అమ) ఇట (గురు) మజ్జిగపులుసు (పాలు, పిండి బెల్లము వేసి వండినది)-అని వ్యాఖ్యానించినది

సీ లవణభావితశలాటువు మీఱు నూరుఁగా
యన మాంసరస మొప్పు నాణ, మనఁగఁ,
గఱకు ట్లనంగను గనుపట్టు శూల్యంబు,
తాలింపు తిరుగఁబోఁత పోగ పనఁగ
సంస్కారమున కాఖ్య చనును దాలింపు పై
చినది పొరఁటినది పొనఁటిన దన
వఱలును సంస్కృతవాచకంబులు గాను,
వడిఁగట్టు గాలింపు కడుగు దేరు

గీ పఱు పనఁగ శోధనాభిధ పరఁగు చుండుఁ,
జిక్కన మిసిమి మిహి జిడ్డు, జిగురు జిగట
నునుపు నున్నన నిద్దము నున్నని దన
స్నిగ్ధనామంబు చెలఁగును జిత్స్వరూప 252

ఊరుఁగాయ— ఇది లవణభావితశలాటువునకు (ఉప్పుతో ఊరఁబెట్టిన-నిమ్మ కాయ చింతకాయ-లో నగుదానికి, ఉపదంశమునకు) పేరు

ఆణము—ఇది మాంసరసమునకు (మాంసముయొక్క సారమునకు) పేరు

కఱకుట్లు—ఇది శూల్యమునకు (కఱ్ఱకుట్లకు కఱుకుట్లకు శూలమునకు గ్రుచ్చి కాల్చినమాంసఖండమునకు) పేరు

తాలింపు, తిరుగఁబోఁత, పోగపు— ఇవి సంస్కారమునకు (సాతాళింపునకు, ఉడికించినకూర లో నగువానిని నూనె వేసి జీరకాదిసంభారములతో పక్వము చేసి రుచి గలదానినిఁ గా చేయుటకు) పేర్లు

తాలింపు వైచినది పొరటినది పొనఁటినది— ఇవి సంస్కృతమునకు (సాతాళించి వండినకూర మున్నగుదానికి) పేర్లు

వడిఁగట్టు గాలింపు కడుగుడు, ఏరుపఱుపు—ఇవి శోధనమునకు (బియ్యము లో నగువానిని నీళ్లలో పోసి ఱాళ్ల అప్పలు లే కుండ శోధించుటకు) పేర్లు

చిక్కన మిసిమి మిహి జిడ్డు, జిగురు, జిగట నునుపు నున్నన, నిద్దము నున్ననిది—ఇవి స్నిగ్ధమునకు (నున్ననిదానికి చిక్కణమునకు) పేర్లు

ఊరుఁగాయ — తద్ధర్మార్థకధాతువిశేణముమీఁదినుమాగమప్రయోగములు భారతాదిప్రాచీన కవిగ్రంథములందు దృష్టములు గా కున్నను ఆతరువాతికవులయందు దృష్టములే. ఆవం జిగు రొక్కనుపచ్చళ్లను బాయసాన్నములు నూరుంగాయలుఞా ' (ఆము 1 82) వాలారుంగొనగోళ్ల ' (మనుచ 3 57) అమరుందుమ్మెద చాలు నానొనరె (వసు 2 72) అయ్యింతిచె క్కులఁ బోలుందెలనాకులు '(పాండు. 1 29) ఊరుఁబిండి (పాండు 4ఆ 184)మొ కనుకనే. నుమ్మోచ్ఛతః అనుదానిని వివరించుచు ప్రయోగ శ్శరణం కవేః' అనినాఁ డథర్వణుఁడు

కలుకుట్లు —శ ర ఇ ట్లను చున్నది దే వి (బ) కిఱ్ఱుకుట్లు యొక్క రూపాంతరము దీనిని కలుకుట్లు- అనియు కిలుకుట్లు- అనియు ఉభయవిధము గా వాడు చున్నారు (అని) బ్రౌ కలుకుట్టు- కలుకుట్లు అని (కఱ్ఱు+కుట్టు) అని వ్యుత్పత్తి వచించినది దీనికి బహువచనమందే ప్రయోగములు ఉదాహరింపఁబడు చున్నవి (అం భా) బహు వచననిర్దేశము ప్రాయికము గా(బహు) అనుటచే తెలుపును ఏకవచనప్రయోగమే దీని కుండ దనుట (అం భా) ఆశయము కా దని పూర్వ ముక్తము (బ్రౌ) ఏక వచనమునుగూడ ప్రదర్శించు చున్నది దీనికి

తిరుగఁబోత — తిరుగుఁబోఁత- (వావి -పపా) క్రొంబొగపుకూరవగ తిరు గంబోఁతల మెంతిజీలకంబులవలపుం దుంబొళ్లతావి సిగరుల గంబూర జగంబు వొగడఁగా నటు సుడిసెన్ (రా వి 2 101) (చూ సూ ని)

పొగపు —పొగు పనంగ- (వావి పా) ఇది (బ్రౌ పా) కానోపును (బ్రౌ) పొగుపు' గ్రహించి తిరుగఁబోఁత- అర్థ మను చున్నది (హ ని) పొగపు' గ్రహించి- ప్రమా

ణము గా (ఆం భా పా) పొగుపు - అని ఇచ్చు చున్నది (చూ సూ ని పొగుపు') ప్రమాదము పొగపు' అనియే (సూ ని ఆం భా పా.) పొగుపు' (సూ ని) గ్రహింప లేదు ఈ పాఠముచే నేను గ్రహించితిని తేనియం బొగపినఎుక్కలం బొగడి భూతపతిం బతి మెచ్చఁజేసె అని (పాండు 150) మొ సంస్కారము చెలంగుఁ జనుసు (వావి ఉపపా) సూ ని దీనిని గూడ ఇచ్చినది (చూ తిరుగఁ దోఁక)

వడిఁగట్టు —దీనికి పాత్రమునోటికి గుడ్డ కట్టి నీళ్ల లో నగువానిని వడియ బోయుట - అని అర్థ మిచ్చినది (శ ర) వడకట్టు'- ఆం భా వార మను చున్నది (ట్రౌ) (చూ లను) ఒడిగట్టు టకు మాఱు గా వడిగట్టు' ప్రయోగించినకవియు ఒకఁ డున్నాఁ డని (సూ ని) హంస ప్రయోగమును ఇట్లుదాహరించినది- గడి దేటి జారవిద్యకు వడిఁగట్టి దురంతకంతువనజశరాళిచేఁ బడఁ జాలనికతమున నా వడుపున నత్తగటబోటి వత్తిలఁ దొడఁగెన్ (2 25) కవులకు ప్రమాదము లుండు ననుట కిట్టివి నిదర్శనములు దీనిని బట్టి ఒడిఁగట్టు నకు పర్యాయము గా వడిగట్టు గ్రహించినది (ట్రౌ) ఇట్టివి ప్రమాణములు గా వనియే పెద్ద లందురు

జిడ్డు — నేయి లో నగువానియందలిమెఱుఁగు - అనునది దీనికి రెండవయర్థము (చూ సూ ని)

సీ బోరు లనంగను బొరుగు లనంగను
ధానాసమాఖ్య లై తనరు చుండు
బొరుగులు మొదలు గాఁ బోచిళ్ల వఱకును
బహువచనాలు గాఁ బరఁగు చుండు
గుగ్గి ళ్లనంగను గుల్మాషములు మిాఱు,
లాజలు దనరుఁ బేలా లనంగ
నటుకు, లడుకులు నా నగుఁ బృథుకంబులు
ప్రాలు నా నక్షతల్ వఱలుఁ, బ్రార్ధ

గీ నాక్షతలపేరు పోచిళ్లు నాఁగ, బియ్య
మనఁగ జాత్యేకవచన మై యలరుఁ దండు

లము, దనరు నాఱ్ఱద్రతండుల మ్మమర నానఁ
ఱ్ఱబాలు నాఁగను, బటదాళ పాకృతీశ 253

బోరులు బొరుగులు—ఇవి ధానలకు (వేఁచినయవలకు బొరువులకు (మరమ రాలకు) పేర్లు.

గుగ్గిళ్లు—ఇది కుల్మాషమునకు (అర్ధపక్వమునకు, ఉడుక వేసినసెనగలు లో నగువానికి) పేరు.

పేలాలు—ఇది లాజలకు (మంగలములో వేయింపఁగా ప్రేలినవడ్లగింజలకు, పేలలకు, ప్రేలలకు) పేరు

అటుకులు, అడుకులు—ఇవి పృధుకములకు (వడ్లు నానఁబోసి వేయించి కొట్టిన వానికి, చిపిటములకు) పేర్లు

ప్రాలు—ఇది అక్షతలకు (విఱుగనిబియ్యమునకు, దేవపూజకు ఆశీర్వాదము నకు ఉపయోగపడువానికి) పేరు

పోచిళ్లు—ఇది ప్రార్థనాక్షతలకు (ఉపశ్రుతిచే శుభాశుభములు తెలియుటకై చల్లు అక్షతములకు) పేరు

[బొరుగులు మొదలు గా పోచిళ్లవఱకును (అనఁగా ఈచెప్పినంతవఱకును) బహువచనాలు (నిత్యబహువచనాంతములు ఏకవచనప్రయోగము లేనివి]

బియ్యము—ఇది (జాత్యేకవచనము బహువచనప్రయోగము లేనిశబ్దము) తం డులమునకు (పొట్టు పోవునట్లు దంచి చెరిగినధాన్యమునకు) పేరు.

నానఁబ్రాలు—ఇది ఆర్ద్రతండులమునకు (నానఁబెట్టిన క్రొత్తచేరుడుబియ్యము నకు) పేరు

ధానలు — ధానా భృష్టయవే స్త్రియః అని (అమ) యవభిన్నములందు ప్రయోగము లాక్షణికము ధానా' శబ్దము నామలిఙ్గానుశాసనేతరనిఘంటువులందు (ఇది) నిత్యబహు వచనాంతము గా పఠింప బడ లేదు-అని (శ ర) ధానాః స్త్రియో భృష్టయవాః' అని (వై జ.) ధానా స్త్రీ భూరుహాం బీజే కుస్తుంబురుణి చా ఉప్యసౌ భృష్టే యవే భూమని

చ హర్షన స్దీత్యవోచత అని (కే ని) (చూ సూ ని ధాన) [ బోచిళ్లవలుసు - బోచిళ్ల వరకులు -(వావి అపముద్రి)

కుల్మాషములు —దీనికి గుగ్గిళ్లు-అనియు అర్థము కలదు (చూ సూ ని) ఈసందర్భమున -(అమ) ఆపక్వం పౌలి రభ్యూషః అను చున్నది ఇట వారితయవాదే ర్భర్జితస్య అని (సుధ) గుగ్గిళ్లకు అభ్యూషాదులు పర్యాయము లని-(శ ర సూ ని మొ) కుల్మాష' శబ్దమునకు- అర్ధస్విన్నస్య యవాదేః అవి (సుధ)

లాజలు — లాజాః పుంభూమ్ని చాక్షతాః' అని (అమ) ఇట-భృష్టవ్రీహ్యాదేః కేచిత్తు అఖణ్డతణ్డులా అక్షతా ఇ త్యాహుః'-అని (సుధ) చరిత్రాదు లాకృతిగణముగాన లాజలు' సాధువు దనుజవిరోధిమీఁద నొకతన్వి కరంబున లాజ లెత్తి, చల్లిన ' (పారి 3 19)

పృథుకములు — పృథుక స్స్యా చ్చిపిటకః'-అని (అమ)

పోచిళ్లు — శకునము చూచుటకై పౌరుగిండ్లమీఁద అక్షతలు నీళ్లు చల్లుదురు అట్లు చల్లెడివి చెలువుండు నను నిరీక్షించునా ప్రియముతో ననుచుఁ బోచిళ్లు నిత్యమును జల్లి' (రుక్మాం 3 223) ఇరుగుపొరుగిండ్లమీఁద అక్షతలు నీళ్లు చల్లి ఆయిండ్లవా రాడుకొను శుభాశుభవాక్యములను పొం చుండి విని శుభాశుభశకునముల నిర్ణయింతురు-అని (శ. ర) దీని కర్థము వివరించినది (చూ శ ర) ఇట్లే-(ప్రౌ) పై (రుక్మాం) పద్యమున- పోచిళ్లు నిత్యమును బోసి అని (సూ ని పా) [ప్రోచిళ్లు-అని ప్రౌ ఆం భా.పా (చూ అను)]

నానఁబ్రాలు —నానబాలు-అని(వావి అపముద్రి) దీనిక (కుల్మాషశబ్దమునకు) అలసందలు-అనునది (అర్థాం)

పటదాశ —(పటత్ + ఆశ) వస్త్రమువలె అచరించు చున్న (వస్త్రముల ట్లున్న) దిక్కులు గలవాఁడా దిగంబపడా అనుట ఈశ్వరుఁడు దిగంబరుఁడు- దిగమ్బరత్వేన నివేదితం వసు ' (కుమా 5 72) అని కాళిదాసు

సీ అక్షుణ్ణతండులాహ్వాయము చేరుళ్లు నా
దంగుళ్లు, నాఁగను దనరు చుండు,

నాహతతండులాహ్వయము లెసటిపోఁత,
లన సడింపు లనంగ నలరు చుండుఁ
బక్వచరవ్రీహిభవతండులసమాఖ్య
యుప్పిళ్లనంగను నొప్పు చుండుఁ,
దండులధూళి యొఁ దవు, డనఁ, బిష్టంబు
పిండి నా సత్తు, నా వెలయు చుండుఁ

గీ. జనును జలివిడి, చలిమిడి యన విఘృష్టి
త, మ్మపూపాభిధానమ్ము దనరుఁ గజ్జ
మప్పచ్చి, కజ్జాయ మనఁగ మండెఁ
గ, లనఁ దగు మండకమ్ములు, గరళకకంఠ 254

చేరుళ్లు దంగుళ్లు—ఇవి అక్షుణ్ణతండులములకు (తెలుపు రా కుండ కొంచెము గా దంచినబియ్యమునకు) పేర్లు

ఎసటిపోఁతలు సడింపులు—ఇవి ఆహతతండులములకు (ఎసటఁ బోయఁ దగిన బియ్యమునకు దంపి బాగు చేసినబియ్యమునకు) పేర్లు

ఉప్పిళ్లు—ఇది పక్వచరవ్రీహిభవతండులములకు (ఉడుకఁ బెట్టినవడ్లబియ్యమునకు, ఉప్పుడుబియ్యమునకు) పేరు

తవుడు—ఇది తండులధూళికి (బియ్యముమీఁది మెత్తనిపొట్టునకు, తౌడునకు) పేరు

పిండి, సత్తు—ఇవి పిష్టకమునకు (బియ్యము లో నగువానిపొడికి) పేర్లు

చలివిడి చలిమిడి—ఇవి విఘృష్టితమునకు (బాగుగా దంచినపిండి బెల్లపుపాకములో పోసి ఉడికించి చేసినభోజ్యపదార్థమునకు) పేర్లు.

కజ్జము అప్పము అప్పచ్చి కజ్జాయము—ఇవి అపూపమునకు (బెల్లము పిండియు, కలిపి చేసినగుండ్రనిభక్ష్యమునకు, గుడాపూపమునకు) పేర్లు

మండెఁగలు—ఇది మండకమునకు (మెత్తనిగోదుమపిండి నేయి మున్నగు వానితో చేసిన-ఒకభక్ష్యవిశేషమునకు) పేరు

చేరుళ్లు — ఈబహువచనాంత శబ్దములు వృత్తియందు ఏకవచనాంతములు (చేరుడు బియ్యము-మొ) వ్యస్తముగా వీని కేకవచనమున అనభిధానము

పిండి —సంస్కృతమున పిష్టి శబ్దముగూడ ఒకటి కలదు పిష్టి ర్నా పిష్టధానాదిమార్ణే అని (వైజ పాతా పురా)

చలిమిడి —బెల్లము కలిసినపిండి-అని (శ ర) బెల్లము పిండయు నీటితో కలిపి చేసిన భోజ్యపదార్థము-అని (సూ ని) చల్మిడి-(రూపాం) 'మెత్తనిదోసెలు మెఱుఁగులు వాఱు నిడ్డెనకుడుములు ఘృతముఁ జల్మిడులు (ప్రభు 4 ఓ0పొ 22పం చూ సూ ని)

అపూపము — కుడుములు ఘృతముఁ జల్మిడులు (ప్రభు 4 ఓ0పొ 22పం) (చూ సూ ని) పూపో ఽపూపః పిష్టకః స్యాత్' అని (అమ) అపూపసామాన్యమిట- అపూప' శబ్దమున కర్థమను చున్నది (సూ ని) అపూపము'నకు అప్పము' అనునది రెండవ అర్థముగా ఇచ్చి ఈ (ఆం భా)ను పర్యాయ మిచ్చు చున్నది అప్పము నకు నాఁవ్రాసినయర్థమునే (సూ ని) ఇచ్చినది అప్పము' నకు గుడాపూపము అను- ఈ అర్థము లోకప్రసిద్ధము ఆభక్ష్యవిశేషమునే (ఆం భా) ఇట వచించినది

[ మండిగ లనఁదగు మండికమ్మలు' అని ఆం భా పాఠ మగపడు చున్నది మండిగె లనఁదగు మండకమ్మ లనురీతినో మండెఁగ లనఁదగు మంటకమ్మ లనువిధముగనో సంస్కార్యముగా ఇది అగపడు చున్నది మొదటిది (బ్రౌ పా) రెండవది (శ ర పా) కాఁదగు నని ఊహింప దగి యున్నది (బ్రౌ) మండిగె' గ్రహించి- భక్ష్యవిశేషము అర్థమను చున్నది ఇఁక మంటకము గ్రహించి-తైత్తిలే- పంచదార వేయనిగోధూమపూరె-అనియు ఉనినది ప్రయోగము లెన్నియొ బ్రౌ మండిగె' అనురూపముతో ఇచ్చినది (శ ర) మండెఁగ' గ్రహించి (పంచదార వేయనిగోదుమ పూరి'-అర్థ మను చున్నది మంటకము సంస్కృతము గ్రహించి (బ్రౌ) వలెనే మండెఁగ'కు తా నిచ్చినయర్థమనే ఇచ్చు చున్నది ఇఁక (సూ ని) భక్ష్యవిశేషము అనునర్థము వచించుచు మండెఁగకు మండకము సం పర్యాయము కాఁదగినది కల దని దీనికి ప్రకృతినిఁగా దాని నిచ్చినది ప్రత్యేకముగా గ్రహించినదికూడ ఇఁక ఈ

మండెఁగలోనిభేదములను (సూ ని) ఇట్లు వచించు చున్నది - కండమండెఁగ, కట్టు మండెఁగ, పప్పుమండెఁగ, బెల్లమండెఁగ-అని వీని నన్నిటిని (బ్రౌ) 'మండిగె'గా ఉదాహరించు చున్నది- 'పొసఁగినపప్పుమండిగెలు ' గారెలు బూరెలు ఖండమండి గెలు' 'కుడుముల్ గారెలు బెల్లమండిగెలు' కట్టుమండిగెలు'-అని ఖండమండిగె'లే కండ మండెఁగెలు 'మండెంగలు'అని (నైష 7ఆ ౹ం.) ఉదాహరింపఁబడు చున్నది (శ ర.)చే. 'వరుసమండెంగలు వడ్డింప (చమ 3 8) అను చున్నది (సూ ని) ఇట మండింగె లన్నను బ్రమాద మేమియు లేదు కాని (శ ర) నిర్ధారకప్రయోగ మిచ్చుచు చున్నది మండెఁగ'కు చింపివల్కము లేమిచేసెతి దనఁ గావు, నెఱ వైనకండమండెఁ గలుగాని' (జై. 8ఆ) ప్రాసయతి ల-ర ఉ-అం ఖా అంగీకరించును గాన దీనినిఁ గా దనదు (సం మణ్డకః. క మండగె మండిగె త. మండిహై) (చూ సూ. ని.) 'మండెఁ గ ల నఁ దగు మండకమ్ములు' ఁని నే నిట అం ఖా పా. గా గ్రహించితిని ]

సీ. సేవె, లనంగను సేవికల్ విలసిల్లు,
నుత్కారిక వెలయు నుక్కెఱ యన,
గారి, యనంగను ఘారి దనర్చును,
నతిరసంబు చెలంగు నటిసె, యనఁగఁ,
బొలుచు మాషాపూపము వడ యనంగను
వడియ, మనంగను వటక మెసఁగు
గరివడె, మనఁగను ఖరవటకం బొప్పు,
బూరె, యనంగను బూరిక తగు,

గీ. బుబ్బుద, మనంగఁ దనరును బుద్బుదంబు
లడ్డువ, యనంగ లట్వ చెలంగు చుండు,
సారెసత్తు, లనంగను జంతిక, లన
యంత్రికలు మీఱు చుండు, శేషాహిభూష 255

సేవెలు—ఇది సేవికలకు (సేవియలకు, గోదుమనూకతో సన్నగా తాలికలు చేసి పాలు పోసి వండెడుదానికి (సేమ్యాకు) పేరు

ఉక్కెఱ—ఇది ఉత్కారికకు (ఒకవిధ మగుభక్ష్యమునకు, బెల్లము పిండి కలిపి చేసెడుదానికి) పేరు.

గారి—ఇది ఘారికి (గారెకు, అచ్చము మినుముతో చేసినగుంౘనిభక్ష్యవిశేషమునకు) పేరు

అతిసె—ఇది అతిరసమునకు (తీపిపిండివంటకు, బెల్లముగాని చక్కెరగాని పాకము పట్టి నానఁబెట్టి దంచినబియ్యపుపిండిపోసి నూనెతోఁగాని నేతితోఁగాని చేసెడుదానికి, అతిసియకు) పేరు.

వడ—ఇది మాషాపూపమునకు(మిరెపకాయ మొద లగుసంభారవస్తువులు చేర్చి చేసినగారెకు) పేరు

వడియము—ఇది వటకమునకు (భోజనమప్పుడు ఉపయోగించుటకై రుబ్బిన మినుపపిండిలో ఎండినబూడిదగుమ్మడిముక్కలు మిరెపకాయ లవి కలిపి యెండఁబెట్టెడిదానికి, వడెమునకు) పేరు

గరివడెము—ఇది ఖరవటకమునకు (ఒకవిధ మగు వడియమునకు) పేరు.

బూరె—ఇది పూరికకు (ఒకవిధ మగు అప్పము'నకు) పేరు.

బుబ్బుదము—ఇది బుద్బుదమునకు (ఒకదినుసుభక్ష్యమునకు, ఫేనకమునకు) పేరు.

లడ్డువ—ఇది లట్వకు (లడ్వకు, లడ్డునకు, చక్కెరపాకము, సెనగపిండి మున్నగువానితో చేయుమధురభక్ష్యవిశేషమునకు) పేరు

సారెసత్తులు, జంతికలు—ఇవి యంత్రికలకు (ఒకవిధ మగుమణుఁగుబూలకు) పేర్లు

సేవెలు — మణుఁగుపూలు-అని (బ్రౌ. మిశ్రని) 'ఖండశర్కరజున్ను కండచక్కెరలు దో, సెలు వడ లేవెపాసెములతోడ'(అని)(భీమ 1 60) (సేమ్యా)పాయసమే ఇచ్చటి

'సేవెపాసె' మనిపించును 'సేవె'కైన 'అపభ్రంశ'మే 'సేమ్యా' కావచ్చు నేమో 'జేవికల్' అని (వావి పా. అపపా)

ఉత్కారిక — 'ఉత్కారికా చూర్ణపూ (పు?) పే' అని (వైజ పాతా పురా) దీనికి 'రొట్టె' అర్థ మని ఒకతెలుఁగుటీక

ఉక్కెఱ —ప్రయోగములందు ఉభయరేఫములు కానవచ్చు చున్నను-శకటరేఫయుతమే ఇది యని అప్పకవి- సీ ఉక్కెఱయుఁ బక్కెఱయును గుఱుమాపు ఇవి యాది గాఁగఁ గొన్నితెనుంగుఁబల్కులహ్రస్వములమీఁదఁ దప్పక బండిఱా లొప్పు చుండు' (అప్ప 2.167) (చూ సూ ని)

ఘారి — గారె' అనియే (సూ ని శ ర. లు) గ్రహించినవి గారి-అనఁగా ఘారి, వడ (అం భా) అని (బ్రౌ.) (చూ. అను) 'ఘారి' గ్రహించియు (సూ. ని) 'గారె' అను అర్థ మీయ లేదు. 'ఘారిక' గ్రహించి 'గుడపిష్టాదికృతాపూపే' అనినది (బ్రౌ) శ ర. మాత్రము 'ఘారిక-భక్ష్యవిశేషము-'గారి' అను చున్నది

వడ —సంస్కృతశబ్ద మొకటి ఈయర్థమునకే ఈరూపముతో ఉన్న దని (సూ.ని) ఉదాహరించు చున్నది-(వడ-సం. వి అ. స్త్రీ భక్ష్యవిశేషము, గారె-అని.).ఒకకవి పిండి వంటలను ఇట్లు పేర్కొను చున్నాఁడు- ఇడి రమ్మోని కుపాయనంబుగా మనోఽభీష్టంబు గాఁ బూరియల్ వడలుం జక్కెరకజ్జకాయలును లడ్వా లుక్కెరల్ పూర్ణపుం గుడుముల్ గారెలు బెల్లమండెఁగలు నౌఁగుల్ కమ్మచాఁపట్లు నూ టిడులున్ దోసెలు నప్పముల్ సుకియలున్ హేరాళ మై కన్పడన్' (రామా.2 115) (చూ శ.ర.బ్రౌఁగు).

బూరె —'సంపుటకము' లనేభక్ష్యలు-అని (బ్రౌ.).

బుద్బుదము — ఫేనక శ్శమితా శుక్లా ఘృతపక్వా ఽల్పశర్కరా' అని (వైజ. పాతా. పురా.).

లట్వ —దీనికి ఈయర్థము (సూ ని మొ.) ఈయ కున్నను (శ. ర.) ఇచ్చినది.

జంతిక —మణుగుఁబువ్వులు-అనుదానికి జంతికలలో భేద మైనభక్ష్యము-అని (బ్రౌ.)

[ గరివడ యనఁగను' (వావి బ్రౌ.పా.) (పారాం.) ]

సీ. చక్కిలం, మనఁగను శష్కులి విలసిల్లు;
సుకుని, యనంగను సుఖిని చెలఁగుఁ;

బిష్టము చెలఁగును బి, ట్టనఁ, దద్విశే
        షము మీఱుఁ దోఁప, నా సంకటి, యన,
నప్పడ, మనఁగను నడరు నపూపము,
        కుడు, మన మోదకం బడరు, మణుఁగుఁ
బూవు, నాఁగఁ గుబేరమూలము దనరును,
        తిలగోళ మెసఁగుఁ జిమ్మిలి, యనంగఁ

గీ దోఁచు మధుపూరితము తేనెతొన యనంగ,
రొట్టె, సీకొట్టు, నిప్పటి, యట్టు దోసె,
యిడ్డెన యనంగ నిటు కొన్ని యెసఁగు చుండు
భక్ష్యభేదాహ్వయంబులు పార్వతీశ 256

చక్కిలము—ఇది శష్కులికి(పిండి మెలిపెట్టి చేసెడిగుండ్రనిభక్ష్యవిశేషమునకు) పేరు.

సుకుని—ఇది సుఖినికి (సుకియకు, పూర్ణమునకు పూర్ణపుబూరెకు, పూర్ణగర్భమునకు, బెల్లము సెనగపప్పుతో చేసెడిభక్ష్యవిశేషమునకు) పేరు

పిట్టు—ఇది పిష్టమునకు (ఉడుకఁబెట్టినపిండికి) పేరు

తోఁప, సంకటి—ఇవి పిష్టవిశేషమునకు (చిక్కగా కాఁచిన-అంబలికి) పేర్లు

అప్పడము—ఇది అపూపమునకు (అపూపవిశేషమునకు, పర్పటమునకు, మినుపపిండి ఉప్పు కారము వేసి తొక్కి చేసెడియొకభక్ష్యమునకు) పేరు.

కుడుము—ఇది మోదకమునకు (ఉండేరకమునకు ఉండ్రకమునకు ఉండ్రమునకు; ఉడికించినవరిపిండిని ఉండలు గా చేసి ఆవిరిమీఁద వండినభక్ష్యమునకు) పేరు.

మణుఁగుఁబూవు—ఇది కుబేరమూలమునకు(మణుఁగుఁబువ్వునకు, మినుపపిండి,

బియ్యపుపిండి నీళ్లతో కలిపి యంత్రమునం దుంచి నూనెలో చుట్టలు చుట్టలుగా త్రిప్పి వండెడు 'ఒకపిండివంట'కు) పేరు.

చిమ్మలి—ఇది తిలగోళమునకు (నువ్వులను బెల్లమును కలిపి త్రొక్కి చేసెడి ఉండకు; చిమ్మిరికి) పేరు.

తేనెతొన—ఇది మధుపూరితమునకు (తేనెలో నానవేసెడి-ఒకదినుసుభక్ష్యమునకు) పేరు.

రొట్టె, నీరొట్టు, నిప్పటి, అట్టు, దోసె, ఇడ్డెన—ఇవి భక్ష్యభేదములకు (ఒక్కొక్కటి ఒక్కొకవిధ మగుభక్ష్యమునకు) పేర్లు.

శష్కులి —'శష్కులీ త్వాయతా పిష్టగుడతైలతిలైః కృతా'- అని (వై జ. పాతా. పురా.).

సుఖిని — (బ్రౌ) సుకుని-సుఖిని- (ఆం. భా.) అనినది (చూ. అను.). ఇతరు లెవరును ఈయర్థమున వీనిని గ్రహింప లేదు నాచూచినంతలో. (సం ని.) 'సుఖిని' కి ఈ యర్థము వచించుట లేదు

పిట్టు —వాసెనమీఁద పక్వము చేసినపిండి-అని (శ ర బ్రౌ.సూ.ని ).

కుడుము —'కుడుములతిండికాఁడు' వినాయకుఁడు-(మా ఆం సం. దేవ. 12.)

మోదకము —మోదకః ఖాద్యభేదే ఽస్త్రీ హర్షకే పున రన్యవత్' అని (మేదిని )

కుబేరమూలము —ఇది మణుఁగుఁబూవునకు వాచకము గా ఏనిఘంటువు లిచ్చినవో తెలియరాలేదు ' బూవు నాఁగను కేరమూలము'-అని (వావి. ఉపపా.)

చిమ్మలి —నువ్వుపప్పును బెల్లమును గలిపి దంచి చేసెడిముద్ద- అని (సూ.ని )

తేనెతొన —'తొలతేనె'- అనుదానికి, తొఅతేనె, పుట్టతేనె-అని (సూ.ని.మొ.) అర్థమిచ్చుచున్నవి

రొట్టె —'భక్ష్యవిశేషము'-అనియే(బ్రౌ. మొ ).

నీరొట్టు —భక్ష్యవిశేషము-అని (బ్రౌ మొ ).

నిప్పటి —నిప్పట్టు- (యాపాం.). ఆకులు కప్పి నిప్పులోవేసి కాల్చెడిఅట్టు, ఒకవిధ మగు భక్ష్యము.

అట్టు — కాందవమునకు, పెనముమీఁద వండిన దానికి-అని (బ్రౌ). భక్ష్యవిశేషము-అని (సూ.ని) అపూపవిశేషము- అని (శ ర.)

దోసె — భక్ష్యవిశేషము అట్టు-అని (సూ ని) ఒకదినుసుపిండివంట- అని (శ ర.)

ఇడ్డెన — వాసెనకుడుము-అని (సూ.ని.) ఆవిరి కుడుము-అనియు వ్యవహారము.

సీ. భక్ష్యసామాన్యంబు పరఁగును బిండివం
ట, లనంగ, నన్నంబు వెలయు చుండు
బువ్వ, యోమటి కూడు బోనము, వంటకం
బోరె, మోగిరము, నా, నొప్పు చుండుఁ
గలవంటకం బనఁగాను మిశ్రాన్నంబు;
చలిది, నా శీతాన్నసంజ్ఞ దనరుఁ;
బాంచాళికాకేళిపక్వాన్ననామంబు
గుజ్జెనగూ. డనఁ గొజ్జలు చుండుఁ,

గీ. జిమిడిక, యనంగ లగడ నాఁ జెలఁగు చుండు
నధికపక్వాన్న, మలరు మాఁ డనఁగ దద్ధి
కాహ్వాయము, మెదు, కన సిద్ధకము మీఱు;
నెండుమెదుకులు పక్కు, నా నెసఁగు, నభవ. 257

పిండివంట—ఇది భక్ష్యసామాన్యమునకు (చక్కిలము లో నగుభక్ష్యములకు. అప్పము లో నగు-అపూపములకు) పేరు

బువ్వ, ఓమటి, కూడు, బోనము, వంటకము, ఓరెము, ఓగిరము—ఇవి అన్నమునకు (ఓదనమునకు, ఓయిరమునకు, ఓగిరమునకు, బియ్యము లో నగునవి వండిన 'ఆహారము నకు) పేర్లు

కలవంటకము—ఇది మిశ్రాన్నమునకు (పెక్కుపదార్థములతో కలపిన-అన్నమునకు, 'పులియోగిరము, దధ్యోదనము'-మొద లగువానికి) పేరు

చలిది—ఇది శీతాన్నమునకు (పర్యుషితాన్నమునకు చల్లారిన చల్లని యన్నమునకు, చల్దియన్నమునకు) పేరు.

గుజ్జెనగూడు—ఇది పాంచాలికాకేలిపక్వాన్నమునకు (బాలికలు బొమ్మలు పెట్టి ఆడుకొనునప్పుడు వండెడి-అన్నమునకు) పేరు

చిమిడిక లగడ—ఇవి అధికపక్వాన్నమునకు (చిమిడిఅన-న్నమునకు, ఎక్కు-వగా ఉడికిన-అన్నమునకు) పేర్లు

మాఁడు—ఇది దగ్ధికకు (అడుగంటి మాఁడిన-అన్నమునకు) పేరు

మెదుకు—ఇది సిద్ధకమునకు (అన్నకణమునకు, అన్నపుమెతుకునకు) పేరు

పక్కు—ఇది ఎండినమెదుకునకు (బాగుగా ఎండిపోయినమెతుకునకు) పేరు

అన్నము — భిస్సా స్త్రీ భక్త మన్ధో ఽన్న మోదనో ఽస్త్రీ సదీదివిః' (అమ)

కలవంటకము —నూవుపొడి లో నగువానితో కలపినవంటకము, చిత్రాన్నము-అని (శర)

గుజ్జెనగూడు — గుజ్జనగూడనఁ ' (వావి పా) బ్రౌ గుజ్జనగూడు - అనియే గ్రహించినది (శర) గుజ్జెనగూళ్లు' అనియే గ్రహించి, (దేవిబ) అను చున్నది (గుజ్జు+ఎన+కూళ్లు) అని వ్యుత్పత్తికూడ ప్రదర్శించు చున్నది ప్రయోగము లన్నియు (సూనిశరలు) బహువచనాంతములు గానే ప్రదర్శించిన విట (సూని) గుజ్జెనగూడు' అని గ్రహించినను ఏకవచనాంతప్రయోగము చూప లేదు. ఆంభా స్వపముగా ఏకవచనాంత మిది అను చున్నది నిర్దేశించి ఇందుమూలమున (కాల్వురు-మొ) చోట్ల (శర సూని) ప్రయోగములతో (బహు) అనినవిగూడ ఇట్టివే 'బహుతఁ దనరు' ఽననిచోట్ల, నిత్యబహువచనాంతము' లవి-అనుట ఆంభా కు సమ్మతము గాదు. సూనిశర లనుబట్టి కాక చాలినంతప్రయోగపరామర్శ మొనర్చి ఇట్టివి తెలియ నగు నని, మన కెఱుఁగఁ జెప్పు చున్న వివి పూర్వమిట్టివి ఉదాహృతములు. పూర్వము కాల్వురు' అనుచో ఈః ఆంభా సిద్ధాంతము ప్రాయికి మనవచ్చు నవి నాయనుటగూడ ఇట్టి

వానినిఁబట్టి చూచిన, సముచిత మనిపింపదు ప్రాయికము గా (బహు ) అనుటయందే వానికిఁ దాత్పర్య మనిపించును.

దగిక —'భిస్సటా దగ్ధికా' (అమ )

[లగడ —'లగడు' (వావి పా ) పై నాగ్రహించినది- ప్రాఁతప్రతిప్రాఁతప్రతులపా ) (చూ సూ ని ) ]

సీ. తైలాభిధానంబు దనరు నూనె, యనంగ,
నేరండతైలంబు మీఁఱు నాము
దం, బనఁ, బేఁడ, నాఁ దనరు గోమయసంజ్ఞ;
పిడుక నాఁ దనరుఁ దత్పిష్టకంబు;
వెలయుఁ గరీష మేర్పిడుక, పరంట, నాఁ,
దచ్చూర్ణ మెరువు, నాఁ దనరు చుండుఁ,
బాఁడి, యం చనఁగను బరఁగుఁ బయస్యంబు
పోసనాల్, పాలు, నాఁ బొల్చుబహుత

గీ. క్షీర మగు, గుమ్మ, యనఁగఁ దద్ధార వెలయు,
నానవా, లనఁ జిఱువాలు, నా నెసంగుఁ
గర్దమీకృతదుగ్ధంబు, క్రాలు ముఱ్ఱు,
నాఁగఁ బీయూషనామంబు, నాగభూష 258

నూనె—ఇది తైలమునకు (నువ్వులచమురునకు, నూనియకు) పేరు

ఆముదము—ఇది ఏరండతైలమునకు (ఆముదపువిత్తనాలు వండి తీసినచమురునకు)పేరు.

పేఁడ—ఇది గోమయమునకు (ఆవుపేఁడకు) పేరు

పిడుక—ఇది తత్పిష్టకమునకు (ఆవుపేఁడపిడుకకు; పిసికి పిడుచ గా చేసి తట్టి ఎండఁ బెట్టిన ఆవుపేఁడ'కు) పేరు

ఏర్పిడుక పరంట—ఇవి కరీషమునకు (నేలఁ బడి ఎండి ఏఱుఁబడెడిపేఁడకడికి) పేర్లు.

ఎరువు—ఇది కరీషచూర్ణమునకు (పైరునకై పెక్కునాళ్లు చేర్చి పెట్టఁగా ఎండి పొడి యైనపేఁడకడికి) పేరు.

పాఁడి—ఇది పయస్యమునకు (క్షీరవికారమునకు; నేయి మొద లగువానికి; వాని సమృద్ధికి) పేరు.

పోసనాలు, పాలు— ఇవి (బహుతన్-బహుత్వముతో; బహువచనాంతము లై అనుట) క్షీరమునకు (పయస్సునకు, దుగ్ధమునకు;(ఆవు లో నగు వాని)పాలకు) పేర్లు.

గుమ్మ—ఇది తద్ధారకు (పాలు పిండునప్పుడు వచ్చెడుధారకు; క్షీరధారకు; ఉష్ణ ధారలకు) పేరు.

ఆనవాలు, చిఱువాలు—ఇవి కర్దమీకృతదుగ్ధమునకు (ఇగుఁరు గాఁచినపాలకు) పేర్లు.

ముఱ్ఱు—ఇది పీయూషమునకు (క్రొత్తగా ఈనిన-ఆవు లో నగువాని పాలకు; జున్నుపాలకు) పేరు.

తైలము —'స్నేహే తిలానాం తైలం స్యా దన్యేషాం నామపూర్వకమ్'(వైజ భూ.వైశ్యా.)

నూనె —'తైలాఖ్య యగు నూనె తలచము రన' (సాంబ. మాన.47.).

ఆముదము —ఆమదము, ఆమిదెము- (రూపాం.). 'మానెండునూనె యాముదము నే యంతయు, నందులోపలఁ గలయంగఁ బోసి' (గోచికిత్స 11.చి.వి.). 'దివ్వెచమురు నామిదెము నా మదం బన, నేరండతైలాఖ్య లెసఁగు ' (సాంబ. మాన. 47.) (చూ. సూ వి )

గోమయము —అర్థాంతర మిది. 'పేఁడ నాఁగ గవాదివిష్ఠ మీఱును' అని (అం భా.)(చూ. 2.134 ) ముందు గోమయసంజ్ఞ గా ఉండి తరువాత గవాదివిష్ఠకు సంజ్ఞ గా బనది

(లక్షణచే). పిడుక' మొద లగువానియందును ఇట్లే లాక్షణికము గా వ్యవహారము 'గోవిట్ గోమయ మస్త్రియామ్' అని (అమ)

కరీషము — ఈ సందర్భమున (వైజ) గోశకృ ద్గోమయో న స్త్రీ గో గ్రన్థి శుష్కగోమయః దోహలం తు కరీషో ఽ స్త్రీ' (భూ పశు) అను చున్నది

ఎరువు — భూమిని బలపఱుచుటకు వేయుపేఁడమున్నగుదోహదపదార్థము — అటువంటి పదార్థము- అని (సూ ని)

పయస్యము — క్షీరదధ్యాదిసమృద్ధి' అని పాఁడి'కి అర్థ మిచ్చు చున్నది (బ్రౌ.) 'పయస్య మాజ్యదధ్యాది' అని (అమ).

పీయూషము — పీయూషో ఽభినవం పయః' అని (అమ) అభినవమ్' అనుదానిని (విశ్వమేదినులు, వైజ) ఇట్లు వివరించినవి- పీయూషం సప్తదినపర్యన్తక్షీరే తథా ఽమృతే' (విశ్వమేదినులు) (చూ సుధ, (ఊధస్యం జీవనీయం చ) ధారోష్ణం త్వమృతం పయః ఆసప్తాహా త్తు పీయూషమ్' (వైజ భూ వైశ్యా) (అని) (అమ)ను వ్యాఖ్యానించుచు (గురు) ఈనిన-ఏడుదినములలోనిపాలు జున్నుపాలు- అర్థ మను చున్నది. ఆవు లో నగునవి యీనినతరువాతిమూఁడుదినములలోనిపాలు- అని (శ ర సూ ని.) (చూ ముఱ్ఱుఁబాలు) జున్నుపాలు ముఱ్ఱుఁబాలు వే అను చున్న వివి

[ఏరివ్రడుక — ఏరివ్రడక- (వావి పా) ఇట్లే- పిడకః నా' అని (వావి పా) (సూ ని) పిడక' గ్రహించి (వావి పా)నే ప్రమాణ మనిన దచ్చట ఐనను- ఏర్పడుక' అనియే ఇచ్చుచు ఇచ్చట (ఆం భా పా ఏర్పిడుక) అనియే అను చున్నది (శ ర) పిడుక' గ్రహించి వాడుక పిడక' అనినది (సూ ని) రెండును గ్రహించినది (సం పిష్టకః ప్రా పిట్టజ) (చూ సూ ని) (వావి పా పారాం]

సీ మీఁగడ, యం చన మీఁఁగు మండాభిధ,
నవనీతసంజ్ఞ వెన్న, యన వెలయు,
నెయ్యి యం చనఁగను నివ్వటిల్లు ఘృతంబు,
చమురు మెఱుఁ గన స్నేహము దనర్చుఁ,
దనరును బక్వఘృతంబు తెలి యనంగ,
గసి, నా ఘృతాదికల్కంబు దనరు

నాతంచనాఖ్య మై యలరుఁ జేమిరి, యనఁ,
బెరుఁ గన దధిపేరు పఃఁగు చుండుఁ;

గీ గుంపెరుఁగు నాఁగ ద్రప్స మగుం గలు పన
మిశ్రదధి యొప్పుఁ, గా, నన మీఁఱు మథిత;
మదరు దండాహతము చల్ల యనఁగ మజ్జి
గ, యనఁ, దో దనఁ దగు దధికరణ, మభవ 259

మీఁగడ—ఇది మండమునకు (కాఁచిన పాలమీఁదితెట్టెకు, క్షీరసారమునకు, సంతానికకు, మస్తువునకు) పేరు

వెన్న—ఇది నవనీతమునకు (పెరుఁగు చిలికి తీయుదానికి) పేరు

నెయ్యి—ఇది ఘృతమునకు (ఆజ్యమునకు, వెన్న కరఁగింపఁగా ఐనదానికి) పేరు

చమురు మెఱుఁగు—ఇవి స్నేహమునకు (నెయ్యి నూనె మొద అగువానిజిడ్డునకు) పేర్లు.

తెలి—ఇది పక్వఘృతమునకు (కాఁచిననేతికి) పేరు

గసి—ఇది ఘృతాదికల్కమునకు (కాఁచిననెయ్యి లో నగువాని-అడుగునకు దిగుమడ్డికి) పేరు

చేమిరి—ఇది ఆతంచనమునకు (తోడువేయుటకు, పేరుటకై పాలలో మజ్జిగ ఉంచుటకు) పేరు

పెరుఁగు—ఇది దధికి (విప్రప్రియమునకు, తోడు వెట్టినపాలనుండి యేర్పడుదానికి) పేరు.

కుంపెరుఁగు—ఇది ద్రప్సమునకు (గడ్డ గా పేరుకొనని పలుచనిపెరుఁగునకు) పేరు

కలుపు—ఇది మిశ్రదధికి (మజ్జిగ కలిపినపెరుఁగునకు) పేరు

కాను—ఇది మథితమునకు (నీరు కలయనిమజ్జిగకు) పేరు

చల్ల, మజ్జిగ—ఇవి దండాహతమునకు (మజ్జిగ లన్నిటికి (నాల్గవవంతు నీరు గలసినదానికి, సగము నీరు గలసినదానికి, నీరే కలయనిదానికి-సాధారణము గా) పేర్లు.

తోడు—ఇది దధికరణమునకు (తోడుచల్లకు, చేమిరి పెట్టుమజ్జిగకు) పేరు.

మండము — మండం దధిభవం మస్తు అని (అమ). ఇట- (గురు) పెరుఁగుమీఁద తేట (పరక) పేరు మీఁగడ- అని కొందఱు-అను చున్నది (మీ గడ-కాఁగినపాలమీఁదితెట్టె పెరుఁగుమీఁదితెట్టె, మస్తువు అని (శ ర. సూ ని)

చేమిరి —తోడు- ఇది పర్యాయము లను చున్నవి (శ ర సూ.ని) (ఆం భా) వీనిని వే అన్నది. 'తోడు' కడ (ఆం భా) ఇచ్చి చేమిరి' లర్థ మను చున్నది (సూ ని) (చూ తోడు.) ఇట్లే- 'చేమిరి'కడ. (విచార్యము)

ద్రప్సము — ద్రప్సం దధి ఘనేతరత్' అని (అమ.) ద్రప్సం స్యా దఘనం దధి అని (వై జ భూ వై శ్యా) ఘనాత్ కఠినా దన్యత్ శిథిలదధ్నః'-అని (అమ)ను వ్యాఖ్యానించు చున్నది- (సుధ) (సూ ని తోడు వెట్టినకుండలోనియదుగుపెరుఁగు- అని అర్థమిచ్చి, తోడు పెట్టినకుండలోనిపైపెరుఁగు-అని కొందఱు నీళ్ల కలిపినపెరుఁగు ఘనేతరదధి-అని కొందఱు-అనినది)

మథితము — తక్రం హ్యుదశ్వి న్మథితం పాదామ్బ్వర్ధామ్బు నిర్జలమ్' (అమ) నిరమ్బు ఘోలం మథితమ్' అని (వై జ భూ వై శ్యా)

దణ్డాహతము — దణ్డాహతం కాలశేయ మరిష్ట మపి గోరసః' అని (అమ) ఇట మజ్జిగ మాత్రమునకు పేళ్లు అని (గురు.మొ)

[..గలుపన — గల పన' (వావి అపముద్రి) గలుపు నాఁ బెరుఁగును గాద మొప్పు' (ఆం భా 3.51.). కలు పనఁ బే రగు దధికిన్' (ఆం సం.నానా 1) విశేషవాచకము లకు (నానా) వచించునప్పుడు సాధారణవాచకములఁ గా ఆం భా ఇచ్చు చుండు నను టకు ఆం భా విశేషవాచకము లనువానినిఁ గొన్నిచోట్ల (ఆం.సం మొ) సామాన్య

వివక్షతో సాధారణవాచకములఁ గా ఇచ్చి చుండు ననుటకును ఇది గొప్పనిదర్శనము కలుపు' అనుదానివ్యుత్పత్తినిఁబట్టి చూచిన 'మిశ్రదధి'కే ఇది వాచక మనుట విస్పష్టము.]

సీ. ఆఁకలి యన గొద, యనఁగ నాఁకొంట, నాఁ
గను క్షుత్తుపేరు గాఁ దనరు చుండు;
నన్నాదివిన్యాస మలరు వడ్డన, యనఁ;
గమి, యనఁగా నొప్పుఁ గబళనంబు,
కబళంబు కడి, యనఁగాఁ జనుఁ, గవణ, మం
చన గజాదిగ్రాస మమరు చుండుఁ,
బిడుచ, ముద్ద, యనంగఁ బిండంబు వెలయును;
దగ, డప్పి, నీర్వట్టు, దప్పి, దూప,

గీ. యనఁ జనుఁ బిపాస, మెసవుట, యారగింత,
యారగింపు, కుడుపు, నాఁగ నలరు భుక్తి;
దనరు నాభుక్తి యాబూతి, యనఁగఁ; దనుపు
తనివి, యాపోవు, టనఁ దృప్తి దగు, మహేశ 260

ఆఁకలి, గొద, ఆఁకొంట—ఇవి క్షుత్తునకు (క్షుధకు, అంగదకు; బుభుక్షకు, అన్నము తినవలయు ననెడికోరికకు) పేర్లు.

వడ్డన—ఇది అన్నాదివిన్యాసమునకు (పరివేషణమునకు; విస్తరియందు అన్నము కూర లో నగువానిని ఉంచుటకు) పేరు.

కమి—ఇది కబళనమునకు (గ్రసనమునకు, ఆహారము లో నగువానిని మ్రింగు టకు) పేరు

కడి—ఇది కబళమునకు (పేఁడ లో నగువానిముద్దకు) పేరు.

కవణము—ఇది గజాదిగ్రాసమునకు (ఏనుఁగు గుఱ్ఱము లో నగునవి తిను చేరుడుబియ్యము ఉలవలు- మొద లగు 'ఆహారము నకు) పేరు.

పిడుచ ముద్ద—ఇవి పిండమునకు (అన్నపుముద్దకు) పేర్లు

డప్పి, నీర్వట్టు, దప్పి దూప—ఇవి పిపాసకు (ఉదన్యకు, దాహమునకు నీరు త్రాగవలయు ననెడికోరికకు) పేర్లు.

మెసవుట, ఆరగింత ఆరగింపు కుడుపు—ఇవి భుక్తికి (భోజనమునకు) పేర్లు.

ఆబూతి—ఇది అభుక్తికి (పెనుతిండికి భరింపరానిపెద్దతిండికి) పేరు

తనుపు తనివి, ఆపోవుట—ఇవి తృప్తికి (ఆపోకకు సంతృప్తికి, సౌహిత్యమునకు, సంతుష్టి చెందుటకు) పేర్లు.

క్షుత్తు — అశనాయా బుభుక్షా క్షుత్ (అమ)

కబళము — గ్రాస స్తు కబలః పుమాన్' (అమ)

పిడుచ, పిండము — కబలః కబలో గ్రాసో గుడః పిణ్డో గుడేరకః గడోర శ్చ గడోల శ్చ'- అని (వైజ పాతా పురా) ఇచ్చటిగుడాదులకు అన్నపుపిడుచ' అర్థము-అని (ఒకతెలుఁగుటీక) అను చున్నది (బ్రౌ)-పిడుచ- ముద్ద- అనువానికి ఇట్టి- అర్థమునే ఇచ్చు చున్నది (చూ అను) ముద్ద' కు (శ ర.) కబళము, పిండము-అను- అర్థముల వేఱు వేఱు గా ఇచ్చు చున్నది కడి పిడుచ, ముద్ద-ఇంచుమించు గా సమానార్థకము లని నిఘంటువులు (శ ర మొ) అను చున్నవు (ఆం భా) చే అను చున్నది భేదము చెప్పక తప్ప లేదు ('పిడచ' అని వ్యవహారము)

పిపాసా — ఉదన్యా తు పిపాసా తృట్ అని (అమ)

ఆబూతి — 'దయ్యపుతిండి తిను చున్నాఁ'డని లోకమున వ్యవహారము అతిండియే ఆబూతి' అనఁబడినది

తృప్తి — సౌహిత్యం తర్పణం తృప్తిః' (అమ)

సీ ఎంగిలి, నాఁగఁ జెలంగు నుచ్ఛిష్టంబు,
గోపాలకుం డొప్పు గొల్లవాఁడు
గొల్లఁడు, కీలారి, గొల్ల, కిలారి, ప
సులకాపరి, యనంగఁ, జెలఁగు చుండు

గోమహిష్యాదులనామము ల్పసి తొఱ్ఱు
    తొడుకు పసరము నా నడరు గోకు
లమ్ము మంద యనఁ గిలారమ్ము నా నాశి
    తముపట్టు పెంట నాఁ దనరు చుండు,

గీ. నెద్దనంగను వృషభాఖ్య యెసఁగు చుండు,
వెలయు గంగెద్దు నా దేవవృషభసంజ్ఞ
బసవఁ డాఁబో, తనంగ గోపతి దనరుచు
భూషితభుజంగ శ్రీమాతృభూతలింగ 261

ఎంగిలి—ఇది ఉచ్ఛిష్టమునకు (భుక్తోచ్ఛిష్టమునకు, తినఁగా మిగిలినపదార్థమునకు, నోటికి తగిలి అపవిత్ర మైనదానికి) పేరు

గొల్లవాఁడు గొల్లఁడు, కీలారి గొల్ల కిలారి పసులకాపరి—ఇవి గోపాలునకు (ఆభీరునకు మహాశూద్రినకు, ఆలకాపరికి, ఆవులఁ గాచెడు ఒకజాతివానికి) పేర్లు.

పసి తొఱ్ఱు, తొడుకు పసరము—ఇవి గోమహిష్యాదులకు (ఆవు బఱ్ఱె లోనగు పశువులకు) పేర్లు

మంద—ఇది గోకులమునకు (గోధనమునకు ఆవులగుంపునకు) పేరు

పెంట—ఇది ఆశితముపట్టునకు (గోవులు గడ్డి మేయుతావునకు) పేరు.

ఎద్దు—ఇది వృషభమునకు (ఋషభమునకు, బలీవర్దమునకు, పుంగవమునకు, మగజాతిగోవునకు) పేర్లు.

గంగెద్దు—ఇది దేవవృషభమునకు (దాసరులు భిక్షార్థము అలంకరించి తీసికొని వచ్చి రామయ్య సీతమ్మ అని ఆడించెడియెద్దునకు) పేరు.

బసవఁడు, ఆఁబోతు—ఇవి గోపతికి (ఆలపోతునకు అచ్చుబెద్దునకు, అచ్చువోసి స్వేచ్ఛగా విడిచిన-ఆఁబోతెద్దునకు) పేర్లు

ఎంగిలి — ఈ సందర్భమున (అమ.)- 'ఫేలా భుక్తసముజ్ఝితమ్' అనినది. (వైజ.) 'ఫేలా పిణ్డే ఉధికోజ్ఝితే' (పాతా. పురా.) అని దీనిని వివరించినది.

ఉచ్ఛిష్టము:—'పాత్రోచ్ఛిష్టము, భుక్తోచ్ఛిష్టము' అని రెండువిధము లిది. భుక్తోచ్ఛిష్టము- ఇట చెప్పఁబడిన దన వచ్చును.

పసి —'పసులు దొడుకులు పసరము లప్పసి యనంగఁ బశువులకు సమాఖ్య లై పరఁగు' (ఆంధ్ర. సం. తిర్య. 7.). ఆవు-అనునది వీనికి అర్థాంతరము. 'పసి గిడ్డి మొద వావు పసరము తొడు కనఁ, బశువుపే ళ్లగు' (సాంబ. తిర్య. 73.).

ఆశితముపట్టు — 'ఆశితము- పట్టు' వేఱు చేసి, సమానార్థకము లని (గౌష్ఠీనము,పూర్వము ఆవు లుండుచోటు) అని అర్థము వ్రాసి ఇట- (ఆశితంగవీనము) అని ఉండవలయు నని (సూ.ని.) అనినది (చూ.పట్టు) (పెంట-అనుదానికడ) మరల ఈ (ఆం. భా. పా. నే) ఇచ్చి- 'ఆశితముపట్టు' ఏకపద మని 'పూర్వము పశువులమంద ఉండినతావు, గోవులు మేయుగాదముపట్టు-అనినది. పూర్వాపరముల సమన్వయ మెట్లో? ఇట్టి విందు చాలఁ జేరినవి. ('గోష్ఠం గోస్థానకం తత్తు గౌష్ఠీనం భూతపూర్వకమ్') 'త్రి ష్వాశితం గవీనం తద్గావో యత్రాశితాః పురా' అని (అమ). ఇచ్చట (సుధ.) 'ఆశితంగవీనము'-అనుదానికి 'పూర్వం గవాం చరణస్థానస్య' అని అర్థ మిచ్చినది. 'చర' గతిభక్షణయోః' అని పాణినీయధాతుపారము. (పూర్వ మావుల మేఁపినచోటు-అని గురు.) 'యత్రాశితః పురా' అనుదానినే 'ఆశితముపట్టు' అని (ఆం భా.) అనినది. (గోవులు) ఆహారము తినినస్థానము-అని అర్థము. భూతార్థక క్తప్రత్యయాంత మిది 'పూర్వము తిని యుండుటను చెప్పును. ఇట సంస్కరింపవలసిన దేమియు నా కగపడ లేదు 'గౌష్ఠీనము అనునర్థము దీని కెట్లు చెప్పటయో నాకు తెలియలేదు. ('ఆశితంగు-ఖః'. చూ. 'అషడక్షీ ణాశిత ఙ్గ్వలంకర్మీణ ' (5.4.7. సూ.) (పాణినీయము.).

పెంట —ఆవులమంద ముం దున్నచోటు.- 'పేఁట' యొక్క (రూపాం). (మంగలపెంట-మొ.) అని (శ.ర.).

వృషభము —'గిబ్బ బసవఁ డాల పోతు నాఁబోతు మూఁపురముదా లెద్దు ము క్కంటి మా వన వృషాఖ్యలు దనర్చు' (సాంబ తిర్య. 73.).

గోపతి — 'షణ్డో గోపతి రిట్చరః' అని (అమ.). ఇట - గవాంపతివ ద్గర్భాధాన కారిత్వా ద్గోపతిః' అని (గురు.).

[తొట్టు.—తొట్టి (బ్రౌ. పా.) (చూ. అను.) ]

సీ. మూఁపుర, మంచన నూఁపుర, మంచనఁ
గకుదభిధాన మై క్రాలు చుండు;
గంగడో, లనఁగను గనుపట్టు సాస్నాఖ్య;
శృంగంబు కొ, మ్మనఁ జెలఁగు చుండు;
దూడ, నాఁ గ్రేపు, నాఁ దోఁచుసు వత్సంబు;
దనరు లేఁగ, యనంగఁ దర్ణకంబు;
గిత్త, నా గిబ్బ, నాఁ గెరలు నార్షభ్యము;
వెలయుఁ గోడె, యనంగఁ బెయ్య, యనఁగ

గీ. గోప్రభృతిపుంస్త్ర్యపత్యము; గ్గోవు కుట్టి,
యావు, నాఁగను; జిత్రగవాఖ్య లందుఁ
జెమటియా, వనునట్టుల నమరి యుండు;
భూషితభుజంగ! శ్రీమాతృభూతలింగ. 262

మూఁపురము, ఊఁపురము—ఇవి కకుదమునకు (వృషాఙ్గమునకు; ఎద్దుయొక్క స్కంధమునకు; భుజశిరస్సువలె ఎత్తైనముడివంటిదానికి) పేర్లు.

గంగడోలు—ఇది సాస్నకు (గళకంబళమునకు; ఆవులకు, ఎద్లకు మెడక్రింద వ్రేలాడెడి తోలునకు) పేరు.

కొమ్ము—ఇది శృంగమునకు (విషాణమునకు; ఆవు లోనగుపశువులకొమ్మునకు) పేరు.

దూడ, క్రేపు—ఇవి వత్సమునకు (ఏఁడాదిలోపలిపశుశిశువునకు) పేర్లు.

లేఁగ—ఇది తర్ణకమునకు (క్రొత్తగా పుట్టినదూడకు) పేరు.

గిత్త, గిబ్బ—ఇవి ఆర్షభ్యమునకు (కాలక్రమమున ఆఁబోతు కాఁ దగిన కోడెదూడకు) పేర్లు.

కోడె—ఇది గోప్రభృతిపుమపత్యమునకు (గోవు లో నగువాని మగదూడకు) పేరు.

పెయ్య—ఇది గోప్రభృతిస్త్ర్యపత్యమునకు (గోవు లో నగువానిఆఁడుదూడకు) పేరు.

కుఱ్ఱి, ఆవు— ఇవి గోవునకు (ధేనువునకు, పాఁడియావునకు) పేర్లు.

[చెమటియావు—ఇది చిత్రగవమునకు (పలురంగులు కల-ఆవునకు, కపిలధేనువునకు; పసుపు మించినతెలుపు కలదానికి; పుల్లావునకు) పేరు.]

వత్సము —'శకృత్కరి స్తు వత్స స్స్యాత్' (అమ) ఇట (గురు.) ఏఁడాదిలోనిదూడ పేళ్లు' అను చున్నది. 'ద్వితీయవయస్సును పొందనిదానికి' అని యనుటను సూచించుచు 'వత్సస్య'- అను చున్నది (సుధ).

లేఁగ —'క్రేపు పడ్డయు దూడ లేఁగ పెయ్య యన వత్సనామంబు లలరును' (సాంబ. తిర్య. 73.). ఇది లేఁగ, క్రేపు- (మొ) ఏకార్థకము లన్న చున్నది

గిత్త —' గోదె గిత్త యనంగఁ గోడెలు నుక్షాఖ్యలు' అని, 'కోడె, గిత్త' ఏకార్థకము లను చున్నది సాంబ. (తిర్య. 73.)

తర్ణకము —'సద్యోజాత స్తు తర్ణకః' అని (అమ) 'వత్సశబ్ద' మునకును- తర్ణకము'- అను నర్థము కలదు- 'వత్సః పుత్రాదివర్షయోః తర్ణకే నోऽపి క్లీబమ్' అని (విశ్వ.).

ఆర్షభ్యము —'ఆర్షభ్య ష్షణ్డతాయోగ్యః' (అమ.) ఇట 'స్పష్టతారుణ్యస్య' అని(సుధ.).

కుఱ్ఱి —పాఁడియావు, ధేనువు- అని (శ ర.). గోవు, ఆవు- అని (సూ.ని.)

సీ. గొ, డ్డన వంజ, నా గొంజ. నా వంధ్య యాఁ;
బొదలును సంధిని వెదమొద, వన;
నీచుకొనిన్నది, నా నెసఁగును నపతోక;
గేరు వామనగవి గిడ్డి, యనఁగఁ:

జను( జతుర్హాయనసంజ్ఞ పడ్డ, యనంగ(;
దఱపి, నా(గను వత్సతరి దనరు(;
బ్రథమగర్భిణిపేరు పర(గును మొద, వన;
గర్భిణి చెలు వందు( గట్టిన, దన;

గీ. నమరు బష్కయణి తఱపియా, వనంగ(;
జెల(గు మజ్జరి, యన(గ నైచికినమాఖ్య;
పొదు(గు, నాగను నూధస్సు పొలుచు చుండు;
నెమరు, నా(గను రోమంథ మమరు; నభవ 263

గొడ్డు; వంజ, గొంజ—ఇవి వంధ్యకు (వశకు; గొడ్డుటావునకు) పేళ్లు.

వెదమొదవు—ఇది సంధినికి (వెదావునకు; వెద యై (గర్భధారణకాలము కలిగి) ఆ(బోతుచే వెంటాడ(బడిన (ఆ(బోతుతో కలసికొనిన) 'ఆవు' నకు) పేరు.

ఈచుకొనినది—ఇది అపతోకకు (నెలలు నిండకమునుపే దైవికము గా చెడిన (జాఱిన) గర్భము గల 'ఆవు' నకు) పేరు.

గిడ్డి—ఇది వామనగవికి (పొట్టి 'ఆవు' నకు) పేరు.

పడ్డ—ఇది చతుర్హాయణికి (నాలుగేండ్లవయస్సు గల 'ఆవు' నకు) పేరు.

తఱపి—ఇది వత్సతరికి (ముదురుదూడకు; దున్నుటకు(గాని, బండి లాగుటకు( గాని అలవఱుప( దగిన యీడు గలకోడెదూడకు; దమ్యకు) పేరు.

మొదవు—ఇది ప్రథమగర్భిణికి (తొలిమాలి 'ఆవు'నకు; మొదటిగర్భము ధరించినదానికి; ప్రష్ఠౌహికి) పేరు.

కట్టినది—ఇది గర్భిణికి (గర్భము ధరించిన పశువునకు) పేరు

తఱపియావు—ఇది బష్కయణికి (ముదురుదూడ గల 'ఆవు'నకు; చాలకాలము క్రిందట ఈనిన 'ఆవు' నకు పేరు.

మజ్జరి——ఇది నైచికికి (ఉత్తమ మైన 'ఆవు'నకు మంచిలక్షణములు గలిగి, చాల పాలు గలదానికి) పేరు.

పొదుఁగు— ఇది ఊధస్సునకు (క్షీరాశయమునకు; ఆవు లో నగువానిపాలుండు చోటికి) పేరు.

నెమరు——ఇది రోమంథమునకు (పశువులు కొంచెము నమలి తినిన 'ఆహారము'ను నోటికి తెచ్చుకొని మరల చక్కఁగా నమలుటకు) పేరు.

గొంజ ——ఈ (అం. భా.) నే యిచ్చి 'గొడ్రాలు' దీని కర్థ మను చున్నది (శ.ర.) 'వశా వన్ధ్యా' అని యీప్రకరణమున (అమ.). 'వశా నార్యాం వన్ధ్యగవ్యాం హస్తిన్యాం దుహిత ర్యపి' (అని) (హైమము). ఇచ్చటి (అం. భా.)కు గొడ్రాలు అర్థము కాదు. 'గొడ్రాలు' వేఱు గా వచించినది (అం భా.) (చూ.2.106.). పై (అమ.) వ్యాఖ్యా సందర్భమున 'గొడ్డుటావు' అని (గురు.). 'ద్వేవన్ధ్యాయాః' అని (సుధ.).

సంధిని ——'అథ సంధినీ ఆక్రాన్తా వృషభేణ' అని (అమ.). ఇట-'కృతమైధునా' అని (స్పష్టము గా) (సుధ.). ఫలపడడానకు ఆయత్తము గా వుండేఆవు- (అము. 4.169.) టీ ఋతుమతి యైనధేనువు- అని (బ్రౌ.) (చూ.అను.).

ఈచుకొనినది:——'ఈచుకపోవు- (ఆవు) చావుదూడ వేయు-అని (శ.ర.).

అపతోక·——'అపతోకా స్రవద్గర్భా' అని (అమ.). 'అకస్మా త్పతితగర్భా' అని (సుధ.).

చతుర్హాయన..:——'చతుర్హాయణీ సంజ్ఞా యస్యాః' అని బహువ్రీహి. 'స్త్రియాః పుంవ ద్భాషితపుంస్కాదనూఙ్ సమానాధికరణే స్త్రియా మపూరణీప్రియాదిషు (6-3-34)-అను సూత్రమున పుంవద్భావము. 'వయోవాచక స్యైవ హాయనస్య ఙీ ణ్త్వం చేష్యతే' (అని) 'ఙీప్ ణత్వములు సంనియోగవిశిష్టములు గాన, 'ఙీప్పు' తోపాటు ణత్వనివృత్తి. ఇ ట్లిది సాధువు. 'చతురబ్దా చతుర్హాయణీ' అని (అమ.).

పద్ద:——తొలిచూలి 'ఆవు'లేక 'గేదె' అని (శ.ర.).' క్రేపు పద్దయు దూడ లేఁగ పెయ్య యన వత్సనామంబు లలరును ' అని (సాంబ. తిర్య. 73.). ఇట్టివి సామాన్యవిశేష న్యాయమునకుఁ జెందినవి.

తఱపి:— 'తఱపు నాఁగను' (వావి. అపపా.). ఱఱునెలలమీద బష్కయణము-అని (శ.ర.). 'వత్సతరి' శబ్దమునకు (సుధ.) 'వత్సభావ మతీత్య ద్వితీయం వయః స్పృష్టస్య' అని అర్థ మిచ్చి యున్నది.

వత్సతరి:—'దమ్యవత్సతరౌ సమౌ' అని (అమ.). 'వత్సోక్షా శ్వ ర్షభేభ్య శ్చ తనుత్వే' (5.3.91.) అని ష్టరప్రత్యయము. జీష్.

ప్రథమగర్భిణి·—'ప్రష్ఠౌహీ బాలగర్భిణీ' అని (అమ.) 'ప్రథమం గర్భం ధృతవత్యాః' అని ఇట (సుధ.).

మొదవు·—పాఁడియావు (అని) (శ.ర.ప్రౌ.).

బష్కయణి.—'చిరసూతా బష్కయణీ' (అమ.) (గురు.పా.)-'.. బష్కయిణీ' అని (సుధాపా.). 'బష్కయణి' అనుదానినిఁగూడ సాధు వనినది (సుధ.) 'బష్కయ స్త్వేకహాయనో వత్సః-ఇతి శాకటాయనః తేన నీయతే- సంపదాదిః ....జీష్- అని వ్యుత్పత్తి చెప్పినది.

మజ్జరి·—మజ్జిరి-(వావి. అపముద్రి.)

నైచికి:—'స్యా దుత్తమా గోషు నైచికీ' (అమ.). 'నైచికీ గౌ ర్గవాం శ్రేష్ఠా' అని (వైజ. భూ. పశు.). చక్కనిరూపము, మంచిప్రాయము గలిగి, సమృద్ధి గ పాఁడి యిచ్చెడియావు-అని శ.ర.వివరణము. ఆవులలో చాలపాలు గలిగి మంచిలక్షణములు గల 'ఆవు' అని (గురు.). శ్రేష్ఠ మైన 'ఆవు' అనియే (ప్రౌ. సూ. ని.).

సీ. చనును గర్భస్రావసంజ్ఞ కట్టుక, యనఁ;
　　　బొలుచు బీజావాపము వెద, యనఁగ;
　నీనిక, యం చన నీఁత, యనంగను
　　　బశ్వాదికప్రసవంబు చెలఁగు;
　నెనుపసరం, బన నెను, మన నెనుపెంటి,
　　　యన బఱ్ఱె, నాఁగసు దనరు మహిషి;
　వామనమహిషి యై వఱలు గేదె, యనంగ;
　　　మహిషవాచకము గా మనుచు నుంచు

గీ. దున్న, యన నెనుపో, తన దుంత, యనఁగఁ;
గీలకముపేరు లంకె, నాఁ గేరు చుండు;
దామెన, యనంగ దామని, దనరుఁ; గవ్వ,
మనఁగ మంథాననామ మౌ; నబ్జమౌళి. 264

కట్టుక—ఇది గర్భస్రావమునకు (పశ్వాదులగర్భపాతమునకు; నాలుగునెలలలోపల గర్భము జాఱి పోవుటకు) పేరు.

వెద—ఇది బీజావాపమునకు (గర్భాధానమునకు; పశ్వాదులు గర్భము కలిగించుటకు) పేరు.

ఈనిక, ఈఁత—ఇవి పశ్వాదిక ప్రసవమునకు (తిర్యగ్జడముల (పశుపక్ష్యాదుల) కాన్పునకు) పేర్లు.

ఎనుపసరము, ఎనుము, ఎనుపెంటి, బఱ్ఱె—ఇవి మహిషికి (ఎనుములలో ఆఁడుదానికి) పేర్లు.

గేదె—ఇది వామనమహిషికి (గేదియకు; పొట్టిబఱ్ఱెకు) పేరు.

దున్న, ఎనుపోతు, దుంత—ఇవి మహిషమునకు (లులాయమునకు; కాసరమునకు; దున్నపోతునకు) పేర్లు.

లంకె—ఇది కీలకమునకు (లంకియకు; పశువులలో నగువానినిఁ గట్టెడిగుంజకు) పేరు.

దామెన—ఇది దామనికి (పశురజ్జువునకు; పశువులను కట్టెడి పెద్ద (పొడుగైన) త్రాటికి; పెక్కుపలుపులు గలదానికి; దామెనత్రాటికి) పేరు.

కవ్వము—ఇది మంథానమునకు (మంథదండమునకు, పెరుఁగు చిలికెడిసాధనమునకు) పేరు.

కీలకము —'సమౌ శివక కీలకౌ' (అమ.). 'లంకె'కు ఈయర్థమును (శ.ర.మొ.) ఈయలేదు.

దామని.—'పశురజ్జు స్తు దామనీ' (అమ.). ఇట (గురు.) 'బహుదామయోగాత్ దామనీ' అని వ్యాఖ్యానించినది. (వైజ.)-'సందానం దామనీ దామా న నా దామ పశో స్తు యా రజ్జు స్సా బన్ధనీ (తత్రస్త్రీ త్వాల్పా)' (భూ.శూ.) అవి, ఇది పెద్దపలుపు. సందామాదులు దీనికి పర్యాయములు అవినది. దీనినే వివరించినది (గురు.). (అందులకే) (దామెన-పెక్కుపలుపులు గలపెద్దత్రాడు, త్రాడు-అనినది (సూ.ని.). '... విశ్వమెల్ల। నతిలీలమై మహాద్భుతసమగ్రస్ఫూర్తి. నుండును గోకనూ లున్నభంగి దామెనఁ బశువులు తగిలి యుండెడుమాడ్కి . ' (భాగ.) (6.169.). (చూ.సూ.ని.).

మంథానము —'వైశాఖ మన్థ మన్థాన మన్థానో మన్థదణ్డకే' (అమ.).

సీ. తరికంబ, మనఁగను దనరును గుటరమ్ము;
తరుచుట, చిలుకుట, త్రచ్చుట, యన
మథనాభిధానంబు మను; నొంచె, యనఁగను
లొట్టియ, యనఁగను లొట్టె, నాఁగ
లొటిపిట, యనఁగను లొటిపిట్ట, యనఁగను
లొట్టిపిట్ట, యనఁ గన్పట్టు నుష్ట్ర;
మలరును లొట్టేనుఁ, గన మహోష్ట్రాభిధ;
మేఁక, చుచ్చును, జింబు, మీఁబు ఛాగి;

గీ. ఛాగనామంబు చింబోతు, నాఁగఁ దనరు;
గొఱ్ఱె, గొఱ్ఱియ, యనఁగను గొఱలు మేషి;
తగరు, పొట్టే, లనంగను దనరు మేష;
మాశ్రితవృషార్వ! మాతృభూతాఖ్య! శర్వ! 265

తరికంబము—ఇది కుటరమునకు (కవ్వము తగిలించి త్రచ్చుట కుపయోగించుస్తంభమునకు) పేరు.

తరుచుట, చిలుకుట, త్రచ్చుట,—ఇవి మథనమునకు (కవ్వముచే దధి మొదలగువానిని బాగుగా చిలుకుటకు) పేర్లు.

ఒంటె, లొట్టియ, లొట్టె, లొటిపిట, లొటిపిట్ట, లొట్టిపిట్ట—ఇవి ఉష్ట్రమునకు (క్రమేలకమునకు; మహాంగమునకు; మరుద్వీపమునకు; ఒంటియకు) పేర్లు.

లొట్టెనుఁగు—ఇది మహోష్ట్రమునకు (పెద్దయొంటెకు) పేరు.

మేఁక, చుచ్చు, చింబు—ఇవి ఛాగికి (ఆఁడుమేఁకకు) పేర్లు.

చింబోతు—ఇది ఛాగమునకు (చీంబోతునకు; చీఁబోతునకు; మేఁకపోతునకు; మగమేఁకకు) పేరు.

గొఱ్ఱె, గొఱ్ఱియ—ఇవి మేషికి (ఆఁడుగొఱ్ఱెకు) పేర్లు.

తగరు, పొట్టేలు—ఇవి మేషమునకు (ఉరణమునకు; గొఱ్ఱెపోతునకు; మగగొఱ్ఱెకు) పేర్లు.

తరికంబము.—తరిగంబము-అని (చి.ని. శ.ర.).

కుటరము.—'కుటరో దణ్డవిష్కమ్భః' అని (అమ.). ఇట 'మన్థదణ్డాధారకాష్ఠస్య' అని (సుధ.).

లొట్టెనుఁగు —దీనికి 'ఒంటె' అని (సాధారణము గానే) అర్థ మిచ్చినది (శ.ర.). 'మహోష్ట్రము' అనియే అర్థము చెప్పినది (బ్రౌ.) (చూ. అను.). దీనికి 'ఒంటె అని అర్థ మిచ్చి ఈ 'ఆం.భా.'ను ఉదాహరించు చున్నది (సూ.ని.). ఇది యెట్లో!

గొఱ్ఱె.—దీనికి (బహు.) 'గొర్లు' అని ఒకచో ప్రయోగింపఁబడినది 'తొట్రించి గొర్లలో దోఁడేలు సొచ్చిన, ట్టీగబ్బిలేళ్ల నట్టిట్టు సేయు' (సారంగ.1.92.) (చూ. సూ.ని.).

మేషము:—'మే ఢ్రోర భ్రోర ణోర్ణాయు ర్మేష వృష్ణయ ఏడకే' అని (అమ.).

సీ. గాడిద, యంచన గర్దభనామ మౌ;
గోనె, యంచనఁగను గోణి పరఁగుఁ;

దద్విశేషాభిధ తగును బరక, మనఁ;
　　జను నల్పగోణ్యాఖ్య సలక, యనఁగ;
నత్యల్పగోణి యై యలరు విత్త, యనంగ;
　　నసిమి, గోతము, సంచి, యనఁగ నల్ప
గోణీవిశేషముల్ గొలు; వంచె, యనంగ
　　నట్టెడ, యం చన నాఢకమిత

గీ. గోణి తగు; ధాన్యపూరితగోణికాఖ్య
మగును బెఱి, కన; బెడక, నా మలఁగ, యనిన
ధాన్యవిరహితగోణి గాఁ దనరు చుండు;
నంకె, మండె, మనఁ జను గోణ్యర్థ; మథవః 266

గాడిద—ఇది గర్దభమునకు (గార్దభమునకు; ఖరమునకు; గాలిగానికి; గాడ్దకు) పేరు.

గోనె—ఇది గోణికి (ధాన్యము మున్నగునవి నించెడుజనుపనారసంచికి) పేరు.

బరకము—ఇది గోణీవిశేషమునకు (ఒకవిధ మగుగోనెకు; పెక్కుగోనెలు కలపి కుట్టిన-ఒకవిధ మగు 'ఆస్తరణము'నకు-పఱచెడిదానికి) పేరు.

సలక—ఇది అల్పగోణికి (చిన్నగోనెకు) పేరు.

విత్త—ఇది అత్యల్పగోణికి (మిక్కిలిచిన్నగోనెకు) పేరు.

అసిమి, గోతము, సంచి—ఇవి అల్పగోణీవిశేషములకు (ప్రత్యేకము ఒక్కొక విధ మగుచిన్నగోనెలకు) పేర్లు.

వంచె, అట్టెడ—ఇవి ఆఢకమితగోణికి (తూము (పదాఱుమానికల) ధాన్యము పట్టుగోనెకు) పేర్లు.

పెఱిక—ఇది ధాన్యపూరితగోణికకు (ధాన్యము నించినగోనెకు; గోనెమూటకు) పేరు.

బెడక, మలఁగ—ఇవి ధాన్యవిరహితగోణికి (ధాన్యము నింపనిగోనెకు; ఉత్త గోనెసంచికి) పేర్లు.

అంకెము, అండెము—ఇవి గోణ్యర్ధమునకు (ఎద్దు మొద లగువానిపై నగునొక పార్శ్వపుభారమునకు) పేర్లు. (రెండంకెములు ఒకగోనె).

గాడిద:—గాడ్ద (రూపాం.). 'జా తైనబారాహజారలేజికిఁ గాక, కఱకులకొల్లంబు గాడ్ద కేల' (వేఱ. 64.). 'రేవుగుఱ్ఱము, గాలిగాఁడు-అనునవి దీనికి పర్యాయములు '..రేవుగుఱ్ఱము గాలిగాఁడు, గాడిద యనఁగను ఖరము రాజిలు చుండు .' (వేంక. తిర్య.96.). 'అన ఘతఁ గృష్ణజన్మమున నావసుదేవుఁడు మీఁదకెత్తు గాఁ గనుఁగొని గాలిగానికడకాళ్లకు మ్రొక్కఁడె నాఁడు..' (భా.శ.38.) మొ. (చూ.సూ.వి.).

పెఱిక:—పెఱికె. (రూపాం.). ఎద్దు లో నగువానిమీఁద వేసి మోయించెడిగోనెమూట-అని (శ.ర.). ఈప్రక్కను ఆప్రక్కను ధాన్యాదులు పోసి- ఎద్దు, గుఱ్ఱము మున్నగు వానిమీఁద వేసి మోయించెడిగోనెమూట-అని (సూ ని.). ముత్తుముధాన్యము నించిన గోనెబరువు- (అని.) (బ్రౌ.).

మలఁగ:—ఎద్దుపై గంతతోడిసరకుగోనె-అని(శ.ర.).

[గోణ్యర్ధము·—'గోణ్యర్థము' (వావి.అపముద్రి.).]

సీ. తనరు గోణ్యుద్ధారిదండాఖ్య యెత్తన
 గో, లన బట్టినగోల, యనఁగఁ;
గంథాస్తరణ మొప్పుఁ గందరికం, బన;
 నలరు విక్రయ మమ్మ, డమ్మక, మన,
మాఱక, మనఁగను మాఱుగడ, యనంగ
 వినిమయనాభిధ వెలయు చుండు;
విలువ, నా జట్టి, నా వెల, యన రో, యన
 వెలయుచు నుండును విక్రయంబు;

గీ. కొనుట, దర, దారణ, యనంగ మనును క్రయము;
మొదలు, బండాల, మనఁ దగు మూలధనము;
మిగత, మిగు, లన లాభంబు మీఱు చుండుఁ;
గుదువ, యనఁగను నుపనిధి పొదలు; శర్వ! 267

ఎత్తనగోల, బట్టినగోల—ఇవి గోణ్యుద్ధారిదండమునకు (గోనె లెత్తి ఎడ్లమీఁద వేయుటకు సాధన మైనకఱ్ఱకు) పేర్లు.

కందరికము—ఇది కంథాస్తరణమునకు (గంతకు అడుగున ఒత్తుకొన కుండ వేసికొనుదానికి (మెత్తకు) పేరు.

అమ్మడు, అమ్మకము— ఇవి విక్రియమునకు (అమ్ముటకు; ఒకవస్తువును వెలకు ఇచ్చుటకు) పేర్లు.

మాఱకము, మాఱుగడ—ఇవి వినిమయనమునకు (వినిమయమునకు; మాఱుపునకు; ఒక టిచ్చి మఱియొకటి పుచ్చుకొనుటకు) పేర్లు.

విలువ, జట్టి, వెల, రో—ఇవి విక్రయమునకు (క్రియధనమునకు; కొనెడివస్తువున కిచ్చెడిమూల్యమునకు) పేర్లు.

కొనుట, దర, దారణ—ఇవి క్రియమునకు (విలుచుటకు; వెలకు (వస్తువును) తీసికొనుటకు) పేర్లు.

మొదలు, బండాలము—ఇవి మూలధనమునకు (క్రియవిక్రయాదివ్యవహారమునకైన (వ్యాపారమునకైన) మొదటిద్రవ్యమునకు; సంచికట్టునకు; పరిపణమునకు) పేర్లు.

మిగత, మిగులు—ఇవి లాభమునకు (అధికఫలమునకు; బేర మాడఁగా మిగిలిన సొమ్మునకు) పేర్లు.

కుదువ—ఇది ఉపనిధికి (న్యాసమునకు; దాఁచినసొమ్మునకు) పేరు.

ఎత్తనగోల·—ఇరువురు మనుష్యులు గోనె మున్నగుబరువులను త్రాళ్లు కట్టి మోచికొని పోవుటకై ఉపయోగించుకఱ్ఱ-అని (బ్రౌ.) (చూ.సూని.).

బట్టినగోల:—పెరికలను ఎత్తే దుడ్డుకఱ్ఱ-అని (బ్రౌ.) (చూ.అను.).

[బట్టినగోల —బట్టనగోల-వావి.అపముద్రి.]

కందరికము.—దీనిని గ్రహించి, కంథాస్తరణము, వర్తకులు కూర్చుండుటకు వేసికొను బొంత-అని (ఈ ఆం.భా.కు) అర్థ మిచ్చు చున్నది (సూ.ని.). (శ.ర.) 'కందళికము' అని గ్రహించి- 'ఎద్దువీఁపుపై వేసెడుగంత' అని అర్థము చెప్పినది. (బ్రౌ.) కందరికము, కందలీకము-గ్రహించి- 'కంథాస్తరణము-అనఁగా గంతకు అడుగున ఒత్తుకో కుండా వేసేది'- అనుచున్నది. (చూ.అను.).

విక్రయము:—'విపణో విక్రయః' అని (అమ.). ఇట 'విక్రయక్రియాయాః' అని (సుధ.).

రో:—'రై గ్లౌ శబ్దంబుల కోత్వంబు విభాష నగు' (బాలవ్యా.తత్స.64 ) అని నిష్పన్నమైనతత్సమ 'రో' శబ్దము ధనవాచకము. తెలుఁగువారివ్యవహారమున అదియే అర్థాంతరము సంపాదించి అచ్చతెలుఁగు గా ని ల్చె న దనవచ్చును!

విక్రయము — 'లోకనము-విలోకనము'- పర్యాయము లై నట్లు 'క్రయము-విక్రయము' పర్యాయములు. 'క్రయమునకు-వెల, వెల యిచ్చికొనుట'రెం డర్థములును గలవు (చూ. సూ.ని ).

క్రయము —ఇది భావార్థకాజన్తము. 'కొనుట' అని దీని కర్థము. (సూ.ని.) 'దర, దారణ' అనువానికి 'వెల' అని అర్థ మిచ్చినది. 'విలువ, జట్టి'- మొ. వానికిఁగూడ ఇదియే అర్థ మను చున్నది. రెండుచోట్ల (ఈ ఆం.భా.నే) ఇచ్చు చున్నది. ఎట్లు సంగతమో!

ఉపనిధి·— 'పుమా నుపనిధి ర్న్యాసః' అని (అమ.).

[మిగత.—మిగితి-(వావి.అపముద్రి.) 'మిగిలి'- (తాళ.ప్ర.పా.). మిగత- (ప్రాఁతప్ర. పా.) (చూ సూ.ని.).]

సీ. ఒకటి, యొక్కటి, యొకం, డొం, డొక్కఁ, డనఁగను
నేకసంఖ్యాఖ్య యై యెసఁగు చుండుఁ;
బది, యన దశసంఖ్య పరఁగు; నిర్వది, యన
వింశతిసంజ్ఞ యై వెలయు చుండుఁ;
బొలుచుఁ ద్రింశత్సంఖ్య ముప్పది, యనఁగఁ; జ
త్వారింశదాఖ్య నల్వది, యనంగఁ;
బంచాశదాఖ్య యేఁబది, యన రాజిలు;
నఱువది, యనఁగను నలరు షష్టి;

గీ. దనరు డెబ్బది, సప్తతి యనఁ;నశీతి
యెనుబది, యనంగ భాసిలు; నెసఁగు నవతి
తొంబది, యనంగ; నూ, అనం దోఁచు శతము;
వేయి, యన సహస్రాఖ్య యై వెలయు; నభవ! 268

ఒకటి, ఒక్కటి, ఒకండు, ఒక్కఁడు—ఇవి ఏకసంఖ్యకు (ఏకత్వసంఖ్య కల దానికి; ఒకనికి; ఒకదానికి) పేర్లు. [ఘటములఒకటి; పురుషులఒకటి-అనిఉం డదు. పదునెనిమిదివఱ కిట్లే.]

పది—ఇది దశసంఖ్యకు (దశత్వసంఖ్య కలదానికి; పదియవసంఖ్య-కలదానికి; కల వానికి) పేరు.

ఇర్వది—ఇది వింశతికి (వింశతిసంఖ్యకు; ఆసంఖ్య కలదానికి; ఇరువదికి) పేరు. [ఇరువది ఘటములు. ఘటములఇరువది' యిత్యాదులు. పందొమ్మిదినుండి మొద లిడెడిసంఖ్యావాచకము లన్నియు ఇట్లే!]

ముప్పది—ఇది త్రింశత్తునకు (మూఁడుపదులసంఖ్యకు; ఆసంఖ్య కలదానికి)పేరు.

నల్వది—ఇది చత్వారింశత్తునకు (నలువదికి; నాలుగుపదులసంఖ్యకు; ఆసంఖ్య కలదానికి) పేరు.

ఏఁబది—ఇది పంచాశత్తునకు (ఐదుపదులసంఖ్యకు; ఆ సంఖ్య కలదానికి) పేరు.

అఱువది—ఇది షష్టికి (ఆఱుపదులసంఖ్యకు; ఆసంఖ్య కలదానికి) పేరు.

డెబ్బది—ఇది సప్తతికి (ఏడుపదులసంఖ్యకు; ఆసంఖ్య కలదానికి) పేరు.

ఎనుబది—ఇది అశీతికి (ఎనిమిదిపదులసంఖ్యకు; ఆసంఖ్య కలదానికి) పేరు.

తొంబది—ఇది నవతికి (తొమ్మిదిపదులసంఖ్యకు; ఆసంఖ్య కలదానికి) పేరు

నూఱు—ఇది శతమునకు (పదిపదులసంఖ్యకు; ఆసంఖ్య కలదానికి) పేరు.

వేయి—ఇది సహస్రమునకు (పదినూర్లసంఖ్యకు; ఆసంఖ్య కలదానికి) పేరు.

దశసంఖ్య.—'సంఖ్యాః సంఖ్యేయే హ్యాదశ త్రిషు' అని (అమ.). 'ఆదశ- దశశబ్దశ్రుతి పర్యంతము-అనఁగా-ఏకశబ్దము మొదలు అష్టాదశపర్యంతము లైనసంఖ్యావాచకశబ్దములు లెక్కపెట్టఁ దగినవస్తువునందే వర్తించును'- అని (గురు.).

వింశతిసంజ్ఞ.—'వింశత్యాద్యా స్సదైకత్వే సర్వా స్సంఖ్యేయసంఖ్యయోః' అని (అమ.). ఏకోనవింశతిశబ్దము మొదలు కడపసంఖ్యావాచకశబ్దము లన్నియు సంఖ్యయందును,సంఖ్యేయము లైనవస్తువులందును వర్తించును (వింశతిశబ్దేన ఏకోనవింశతిశబ్దో ఽపి జ్ఞేయః) -అని (గురు.).

శతము.—'పఙ్క్తేః శ్శతసహస్రాది క్రమా ద్దశగుణోత్తరమ్' అని (అమ ). 'పఙ్క్తి' యనఁగా పది. పది మొదలుకొని పదింట గుణించిన- శతము, సహస్రము- మొద లైన సంఖ్య లగును పదిపదులు శతము. పదిశతములు సహస్రము. పదిసహస్రములు అయుతము. పది అయుతములు లక్ష- అని (గురు ).

సీ. కరిసె, యనంగను గాలుపలం బొప్పు;
నరపలం, బనఁగఁ గర్షాఖ్య యొప్పుఁ;
గర్షద్వయాభిధ గనుపట్టుఁ బల, మన;
నిల్ల మనంగను నెసఁగు ద్విపలి;
ముప్పలం, మం చన నొప్పు చుండుఁ ద్రిపలి;
నలుపలం, బనఁ జతుష్పలము దనరుఁ;

బంచపలాభిఖ్య పరఁగు నేఁబల, మన;
వెలయు షట్పలి యాఱుపల, మనంగ;

గీ. నల్లసిలు సప్తపలినామ మెళ్ల, మనఁగ;
వఱలుఁ బన్నిల్ల, మనఁగను ద్వాదశపలి;
వీసె, యనఁగను గనుపట్టు వింశతిపలి;
దడియ, మన నల్వదిపలముల్ దగును, శర్వ. 269

కరిసె—ఇది కాలుపలమునకు (పలములో నాల్గవభాగమునకు) పేరు.

అరపలము—ఇది కర్షమునకు (పలమునందు సగభాగమునకు) పేరు.

పలము—ఇది కర్షద్వయమునకు (రెండుకర్షములకు) పేరు.

ఇల్లము—ఇది ద్విపలికి (ఇరువలమునకు; ఇర్పలమునకు; రెండుపలములకు) పేరు.

ముప్పలము—ఇది త్రిపలికి (మూఁడుపలములకు) పేరు.

నలుపలము—ఇది చతుష్పలమునకు (నాలుగుపలములకు) పేరు.

ఏఁబలము—ఇది పంచపలికి (ఐదుపలములకు) పేరు

ఆఱుపలము—ఇది షట్పలికి (ఆఱుపలములకు) పేరు.

ఎళ్లము—ఇది సప్తపలికి (ఏడుపలములకు) పేరు.

పన్నిల్లము—ఇది ద్వాదశపలికి (పండ్రెండుపలములకు) పేరు.

వీసె—ఇది వింశతిపలికి (ఇరువదిపలములకు) పేరు.

దడియము—ఇది నల్వదిపలములకు (రెండువీసెలకు; దడెకు) పేరు.

కర్షద్వయము —'పలం కర్షచతుష్టయమ్' అని (ఉమ.). కర్షము, నిష్కము- ఎనుబది గురిగింజలఎత్తు. 'గుఞ్జాః ప ఞ్చాద్యమాషకః తే షోడశాక్షః కర్షో ఽస్త్రీ' (అమ.).

ఇది (సం పలమునకు ఐనయర్థము.) ఆం. భా. తెలుగు 'పలము' నకు అర్థము చెప్పినది.

ఇల్లము —'ద్విగువున కేకవచనంబు ప్రాయికంబు గా నగు ' (.బాల. వ్యా. సమా.18.)' ఇచ్చట-(శ. ర. ౹బౌ. లు) 'ఇల్ల మనంగను' అని ఆం. భా. పాఠమును గ్రహించినవి. (శ. ర.) (మి. గ్రా వి. (ఇరు+పలము) అని దీనిని నిర్వచించినది. ఇట-ఇర్వల మనఁగను' అని (వావి. పా.) దీనినే (సూ ని.) గ్రహించినది ఇది (పారాం.).]

ద్విపలి, త్రిపలి.—ఇవి 'పఞ్చవటి' ఇత్యాదులఁ బోలుసమాహారద్విగువులు.

[చతుష్పలము —'చతుఃపలము' అని (వావి. పా ) (అపపా ) 'ఇదుదుపధస్య చాఽప్రత్యయస్య' (8. 3. 41 ) అనుసూత్రమున షత్వము నిత్యము గా విహితము. 'చతుష్పల' మనియే (బ్రౌ.ఆం.భా.పా.) (చూ.అను.). పాత్రాదిగణపఠిత మైన 'త్రిభువనాదు' ల ట్లిది సాధు వనఁదగినది.]

ఏఁబలము·—పదిపలములకు 'ఏఁబలము'-అని నేఁటివ్యవహారము (చూ సూ.ని.శ.ర.మొ.).

[' మెళ్ల మనఁగ —'మెల్ల మనఁగ' అని (వావి ).'ఎల్ల' మిది అనినది. బ్రౌ. 'ఏళ్లము' అనినది (చూ.అను.). (శ.ర.) ఆం. భా. పా. గా ' మెళ్ల మనఁగ' అనియే యిచ్చి 'ఎళ్ల'షే ఇది అనినది (సూ. ని. గూడ) శ. ర.నే అనుసరించినది. వావి.పా. (పారాం ) 'ఇల్లము' వంటిది 'ఎల్లము' కావచ్చును! 'ల-శ.'లు అభిన్నములు.]

[పన్నిల్లము.—'పన్నిర్ల' మనఁగను' అని (వావి.పా.) ఇదియే (బ్రౌ.పా.) (సూ.ని.) దీనినే గ్రహించి (పది+ఇరు+పలము) అనినది (పారాం.). పై నాగ్రహించినది (శ.ర. పా.).]

వీసె —నలువది పలములు 'వీసె'అని నేఁడు చెప్పఁబడు చున్నది (చూ.బ్రౌ.అను.).

ముప్పలము —ముప్పాతిక-(మొ.) గ్రహించిన (శ.ర.బ్రౌ. లు) దీనిని వదలుట యుక్తమనిపించుట లేదు.

సీ. తనరారు సోల, యం చనఁగ నికుంచాఖ్య;
యద్ధ, యం చనఁగఁ దదర్ధ మొప్పుఁ;
దత్తురీయాంశంబు దగును జిట్టి, యనంగఁ;
గుడపాభిధాన మై యడరు నవల

మాన, నా ముంత, నా మానిక, యనఁగను;
ద్రవ్వ, నాఁ బడి, నాఁ, దదర్ధ మెసఁగుఁ;
బ్రస్థనామంబు గాఁ బరఁగుఁ గుంచ, మనంగఁ;
గుడపషట్కంబు ముయ్యడ, యనఁ దగుఁ;

గీ. బ్రస్థయుగ్మాఖ్య యిరుస, నాఁ బలుకఁ బడును;
జనును ముక్కస, నాగఁ బ్రస్థత్రయంబు;
తూము, నా నాఢకాభిధ దోఁచు చుండు;
భూరిభవభంగ! శ్రీమాతృభూతలింగ! 270

సోల—ఇది నికుంచమునకు (తవ్వలోని సగమునకు; మానికలోనినాల్గవభాగమునకు) పేరు.

అద్ద—ఇది తదర్ధమునకు (సోలలోనిసగమునకు; అరసోలకు) పేరు.

చిట్టి—ఇది తత్తురీయాంశమునకు (సోలలోనినాల్గవభాగమునకు; గిద్దకు) పేరు.

మాన, ముంత, మానిక—ఇవి కుడపమునకు (కుడవమునకు; రెండుతవ్వలకు; నాలుగుసోలలకు) పేర్లు.

ద్రవ్వ, పడి—ఇవి తదర్ధమునకు (మానికలోనిసగమునకు; తవ్వకు; రెండుసోలలకు) పేర్లు.

కుంచము—ఇది ప్రస్థమునకు (నాలుగుమానికలకు) పేరు.

ముయ్యడ—ఇది కుడపషట్కమునకు (ఆఱుమానికలకు) పేరు.

ఇరుస—ఇది ప్రస్థయుగ్మమునకు (రెండుకుంచములకు; ఎనిమిదిమానికలకు; అరతూమునకు) పేరు.

ముక్కస—ఇది ప్రస్థత్రయమునకు (మూఁడుకుంచములకు; పండ్రెండుమానికలకు) పేరు.

**తూము**—ఇది ఆఢకమునకు (ద్రోణమునకు; నాలుగుకుంచములకు; పదాఱు మానికలకు) పేరు.

[కుడపము—'కుడుపాభిధాన మై'-అని (వావి. పా.) (అపపా.) 'కుడపః ప్రస్థ ఇత్యాద్యాః' అని (ఉమ.) ఇట (గురు.) తనవ్యాఖ్యలో సూత్రము 'కుల్యతే సంస్త్యాయతే ధాన్య మితి కుడువః (పా.). కుడుపః కుల-సంస్త్యానే-'లడమో రథేదః' అని ఎచించు చున్నది. ఇట సుధాపా -'కుడవః' అనునది. కుడి-దాహే బాహులకాత్ కవచ్ప్రత్యయః అనిత్యత్వా న్న నుమ్' అనినది (సుధ.) నిఘంటువులు-'కుడపము, కుడవము' అనియే గ్రహించు చున్నవి.]

మాన—నాలుగుటంకిములమొత్తుబియ్యము పట్టేది. దేశభేదముచేత ఎక్కువతక్కువ లున్న
గలవు-(D) అని (బ్రౌ.)

పడి—మూఁడుసోలలు 'పడి' అని చెన్నపత్తన (వ్యవ.)

[ముయ్యడ—'ముయ్యెడ' (వావి అపముద్రి.) 'ముయ్యడ'-అనియే (బ్రౌ.) (ఆం.భా.పా.) ఇచ్చినది (సూ. అను.). (మూఁడు+అడ్డ) ఆఱుమానికలు (మా.శ.ర.)]

[ప్రస్థయుగ్మము—ప్రస్థయుగళాఖ్య యిరుస నాఁ బలుకఁబడును' అని (శ.ర.పా.) (పారాం.).]

సీ. ప్రస్థపంచకసంజ్ఞ పరఁగు నేగుస యన;
        షట్ప్రస్థపే రాఱు, సనఁగ వెలయు;
    నిద్దు, మం చనఁగను నెసఁగును ద్వ్యాఢకి;
        త్ర్యాఢకి ముత్తు, మం చనఁగఁ జెల్లుఁ;
    జతురాఢకీసంజ్ఞ చనును నల్తు, మనంగఁ;
        బంచాఢకియు నేఁదు, మంచుఁ దోఁచుఁ;
    షష్ఠాఢకీసంజ్ఞ చను నార్దు, మం చన,
        సప్తాఢకీసంజ్ఞ జరుగు చుండు
    నేడ్దు, మం చనఁగను; నెలమితోఁ గనుపట్టు
        నష్టాఢకీసంజ్ఞ యలరు చుండు

నెనమందు, మనఁగను; దనరుఁ దొమ్మందు, మ
నంగ నవాఢకీనామ మొప్పుఁ,

గీ. బందు, మంచు దశాఢకి పలుకఁబడును;
బొదలు నేకాదశాఢకి పదునొకొల్తు,
మనఁగఁ; బన్నిద్దు, మన ద్వాదశాఢకి తగుఁ;
బుట్టి, యన భార మగు; మాతృభూతలింగః 271

ఏగున—ఇది ప్రస్థపంచకమునకు (ఐదుకుంచములకు) పేరు.

ఆఱున—ఇది ప్రస్థషట్కమునకు (ఆఱుకుంచములకు) పేరు.

ఇద్దుము—ఇది ద్వ్యాఢకికి (రెండుతూములకు) పేరు.

ముత్తుము—ఇది త్ర్యాఢకికి (మూఁడుతూములకు) పేరు. [ఆఢకము-నాలుగు కుంచముల కొలఁది; తూము]

నల్తుము— ఇది చతురాఢకికి (నాలుగు తూములకు) పేరు.

ఏఁదుము—ఇది పంచాఢకికి (ఐదుతూములకు) పేరు.

ఆర్దుము—ఇది షష్ఠాఢకికి (ఆఱుతూములకు) పేరు.

ఏడ్దుము—ఇది సప్తాఢకికి (ఏడుతూములకు) పేరు.

ఎనమందుము—ఇది (అష్టాఢకికి (ఎనిమిదితూములకు) పేరు.

తొమ్మందుము—ఇది నవాఢకికి (తొమ్మిదితూములకు)పేరు.

పందుము—ఇది దశాఢకికి (పదితూములకు) పేరు.

పదునొకొల్తుము—ఇది ఏకాదశాఢకికి (పదునొకండుతూములకు) పేరు.

పన్నిద్దుము—ఇది ద్వాదశాఢకికి (పండ్రెండుతూములకు) పేరు.

పుట్టి—ఇది భారమునకు (ధాన్యమానవిశేషమునకు) పేరు. (దీనికి ఆయామండలములలో భిన్నభిన్నవ్యవహారము గానవచ్చు చున్నది.)

ఏగుస —(ఏను-కుంచములు) అని (శ.ర.). ఇవి యన్నియు పరిమాణవిశేషసంజ్ఞలు (ఇద్దుము- ఏఁదుము- (మొ.) 'ఇరు-తూము, ఏను-తూము' అనురీతివ్యుత్పత్తి కలవి.).

పందుము:—నలువదిమానికలు ఒంకెము. రెండు అంకెములు సలక. రెండుసలకలు ఏఁదుము. రెండు ఏఁదుములు పందుము. రెండుపందుములు పుట్టి- అనిగర్తమండలము- (గుంటూరుజిల్లా) వ్యవహారము. దాని కిది సరిపడి యున్నది.

[పదునొకొల్తుము —'పదునొకల్తుము'- అని (వావి. పా ). పదనకొల్తుము-అని(బ్రౌ పా.) (చూ. అను.). పదునొకొల్తుము- (పది+ఒకొండు+తూము) అని (సూ.ని.శ.ర. పా.). ఇదియే నాపైపారము.]

పుట్టి—బుత్తిపుట్టి (తూర్పుపుట్టి, ఇరవైకుంచములు). పల్లెపుట్టి-(ఎనుబది కుంచములు). మలకపుట్టి- (రెండువందలు-లేక - రెండువందలనలువదికుంచములు)-అనురీతివి దీని భేదములు (చూ.సూ.ని.బ్రౌ.). నాలుగు ఏఁదుములు కొలఁది- అని (శ.ర.). 'పుట్టి' కి. 'ఖ' అని పత్త్రములలో వ్యవహారము. 'ఖండీ' అనుదానికి లుప్తశేషము ఇది అని (బ్రౌ.) (చూ.సూ.ని.).

ఖారము—'అస్త్రియా మాఢకద్రోణౌ ఖారీ వాహో నికుఞ్చకః కుడవః ప్రస్థ ఇత్యాద్యాః పరిమాణార్థాః పృథక్పృథక్' (అమ.). దీనిని వివరించుపట్టున (సుధ.) ఖారశబ్దము నిట్లు వివరించినది- 'పలం ప్రకుఞ్చకం ముష్టిః కుడవ స్తచ్చతుష్టయమ్ చత్వారః కుడవాః ప్రస్థ శ్చతుఃప్ర(ప్ర?)స్థ మ థాఢకమ్ అష్టాఢకో భవే ద్ద్రోణో ద్విద్రోణా గో ణ్యుదాహృతా తా షేవ ఖారం జానీయా ద్వాహో ఖారచతుష్టయమ్' (అని.). ఇచ్చటి 'ఖార' శబ్దమున కిదే యర్థ మనిపించు చున్నది. అప్పుడు, 'పుట్టి'కి 'గోణి' అర్థము. (గోణి-రెండువంద'లయేఁబదియాఱుమానికలు) ఇదియే ఇచ్చటి పుట్టి కావచ్చును! అంకెము-అనఁగా నలువదిమానికలధాన్యము. 2 అంకెములు-1 సలక. 2 సలకలు-1ఏఁదుము. 2 ఏఁదుములు 1 పందుము. 2 పందుములు-పుట్టి. (అనఁగా 16 అంకెములు (అనఁగా) ఆఱువందలనలువది (640) మానికలు. అని (తెనాలి తాలూకా) వారి) వ్యవహారము.). అమరమట్లే సాంబ. ధాన్యము కొలుచువానిపేర్లను గొన్నిటిని ఇట్లు (తెలుఁగున) పేర్కొను చున్నది-' దూము ముంత ముకుసంబు బల్ల కుంచము సోల తవ్వ పడి యడ్డ గరిసె పుట్టి సెలగ మెరా కల మనంగ ధాన్యములు గొల్చు వానికిఁ దగును' (మాన.52.). (వేంక.) ఇ ట్లను చున్నది- 'ధర తూము ముం

తయుఁ దివ్వ సో లద్ద నా, ధాన్యము ల్గొలుచుసాధనము లవుచు గుంచంబు విరస ముక్కాన యనఁ దూములోఁ, బాలికి నరకు ముప్పాలికిఁ దగుఁ గొలువ నిరువదితూములు పుట్టి యనఁ బొల్చు' (మాన. 78.).

సీ. కాణి,యనంగను గాకణి విలసిల్లు;
వెలయుఁ దద్ద్వయ మరవీస, మనఁగ;
ముక్కాణి, యనఁగను బొల్చుఁ దత్త్రియసంజ్ఞ;
పణషోడశాంశంబు పరఁగు వీస,
మనఁగఁ; దద్ద్వితయంబు దనరుఁ బరక, యన;
ముప్వీస, మం చనఁ బొల్చుఁ దత్త్రి
యాఖ్య యై; పణచతుర్థాంశంబు పాతిక,
యన విరాజిలును; బణార్ధసంజ్ఞ

గీ. యొప్పు నడ్డుగ, యనఁగఁ; బాదోనపణము
వఱలు ముప్పాతిక, యనంగఁ; బణము రూక
యనఁగఁ జె న్నొందుఁ; బణదశకాఖ్య చెల్లు
మాడ, యన నిట్లు చెప్పెద; మాతృభూత! 272

కాణి—ఇది కాకణికి (కానికి; వీసములో నాల్గవవంతునకు) పేరు.

అరవీసము—ఇది తద్ద్వయమునకు (ఆ కాకణుల రెండిటి సమూహమునకు (రెండిటికి) రెండుకానులకు) పేరు.

ముక్కాణి—ఇది తత్త్రియమునకు (ఆ కాకణులమూఁడిటి సమూహమునకు (మూఁడిటికి) మూఁడుకానులకు) పేరు.

వీసము—ఇది పణషోడశాంశమునకు (రూకలోనిపదునాఱవభాగమునకు; నాలుగు కానులకు) పేరు.

పరక—ఇది తద్ద్వితయమునకు (ఆ వీసముల రెండిటి సమూహమునకు (రెండింటికి) రెండువీసములకు; రూకలోని యెనిమిదవభాగమునకు) పేరు.

ముప్వీసము—ఇది తత్త్రియమునకు (ఆ వీసముల మూఁడిటిసమూహమునకు; (మూఁడిటికి) రూకలో (పదాఱింట) మూఁడుభాగములకు) పేరు.

పాతిక—ఇది పణచతుర్థాంశమునకు(రూకలో నాల్గవభాగమునకు) పేరు.

అడ్డుగ—ఇది పణార్ధమునకు (రూకలో సగభాగమునకు) పేరు.

ముప్పాతిక—ఇది పాదోనపణమునకు(నాల్గవభాగము తక్కువ గా ఉన్న రూకకు) పేరు.

పణము—ఇది రూకకు (కర్షమెత్తు రాగినాణెమునకు) పేరు.

మాడ—ఇది పణదశకమునకు (పదిరూకలు పరిమాణము గా కలదానికి) పేరు.

తాణి —రూపాయలో అఱువదినాలుగవవంతువిలువ గలరాగినాణెము-(చూ.సూ.ని.).

వీసము — వడ్లగింజయెత్తుబంగారము - వరహాలలెక్కలో నాల్గుకానులు- (దీపిక) అని (బ్రౌ.).

ముప్పాతిక—వరహాలో (3/4) అని (బ్రౌ.).

పణము —'కార్షికే తామ్రికే పణః' అని (అమ.). ఇట (గురు.) కర్షమెత్తురాగిముద్ర- అని దీనికి అర్థము వచించినది. కర్షము- అనుదానికి (గురు.)-80 గురిగింజలమెత్తు గల (వెండి గాక) 'తక్కినలోహముద్ర'- అర్థ మను చున్నది (చూ. 'గుఞ్జాః ప ఞ్చాద్య మాషకః తే షోడశాక్షః కర్షో ఽస్త్రీ' అనెడి 'అమర' వ్యాఖ్యాసందర్భము.). ఇఁక (వైజ.) దీని నిట్లు వివరించినది- 'కార్షాపణః కార్షిక స్స్యాత్ స షోడశపణః క్వచిత్ లోహే వింశతిమానో ఽసౌ కార్షికే తామ్రికే పణః తామ్రికర్షకృతా ముద్రా క్వచి త్కార్షాపణః' (సామా. గణా.). (ఈ వైజ.ని నుబట్టి, '100 లేక 80 గురిగింజలయెత్తు రాగినాణె మిది' అని నిర్ణయింప వచ్చును.). మాషము- పణములో ఇరువదవవంతు. 'ఎనిమిదిగురిగింజలయెత్తు'-అని (సూ.ని.). 'ఐదుగురిగింజలయెత్తు' అని (శ.ర.). మతభేదముచే రెండును గ్రాహ్యములే. కర్షము-నాలుగుమాడలు- ఇరువదిచిన్నముల యెత్తు-అని (బ్రౌ.) (చూ కర్షము). చిన్నము (4 గురిగింజలమెత్తు) అని (శ.ర.). (80కాసులు 1పణము-అని (బ్రౌ.) (దమ్మిడిలో ఐదవభాగము కాసు ).

ద్రాంక:—'చిన్నమెత్తు వెండిబంగారములనాణెము' అని (శ.ర.). ఒకానొకనాణెము- అని (సూ.ని.). (శ.ర.) చెప్పినది అర్థాంతరము. ఇచ్చట 'ద్రాంక' పణము. నిష్కమును నిర్వచించుచు (గురు.) ఇట్లను చున్నది. 'సువర్ణ' మనఁగా నిరువదిరూకలయెత్తు గల బంగారము. 80 గురిగింజలయెత్తు. 'పల' మనఁగా నెనుబదిరూకలయెత్తు (320గురిగింజల యెత్తు) (అని).

మాడ:—'అరవరాసువర్ణము' అని (శ.ర.). పణదశకము (పదిరూకలు) అనునది కూడ దీనికి మఱియొకయర్థ మనినది (సూ.ని.). ఇదియే యుక్తము. ఇచ్చటి 'మాడ' 'రాగి ముద్ర'కు చెందినది. ('పణదశకము'-అనుచో పరిమాణార్థమున 'క' ప్రత్యయము.). ('కాకణి' మొద లగువానినిఁగూర్చి ఒకలెక్క ఇచ్చినది (సూ.ని.) (చూ.నిష్కము.).

సీ. దీనారమునందు ద్వాత్రింశదంశం బైన
బేడ, యం చనఁగను వెలయు చుండు;
ద్దుగుల, మ్మం చనఁగఁ దద్ద్విగుణంబు విలసిల్లుఁ;
దనరు ముచ్చివు, కనఁ దత్త్రికంబు;
తచ్చతుష్టయసంజ్ఞ దగుఁ జౌల, మం చనఁ;
బాదదీనారంబు పా, వనఁ దగు;
నర్ధదీనారాఖ్య యలరు మాడ, యన; న్వ
రా, యన దీనార మై యెసంగు;

గీ. నాణె, మనఁగను శుద్ధదీనార మొప్పు;
హీనదీనారసంపూర్తి కిచ్చునట్టి
ధనము వట్ట, మనంగను దనరి యుండు;
భూతిలసితాంగ! శ్రీమాతృభూతలింగ! 273

బేడ—ఇది దీనారములోని ద్వాత్రింశదంశమునకు (వరాలోనిముప్పదిరెండవ భాగమునకు) పేరు.

దుగులము—ఇది తద్యుగళమునకు (రెండుబేడల జతకు (రెండు బేడలకు) వరాలోని పదాఱవభాగమునకు) పేరు.

ముచ్చిపుక—ఇది తత్త్రికమునకు (మూఁడు దుగులముల సమూహమునకు (మూఁడు దుగులములకు) ఆఱుబేడలకు) పేరు.

చౌలము—ఇది తచ్చతుష్టయమునకు (నాలుగు దుగులముల సమూహమునకు (నాలుగు దుగులములకు) ఎనిమిది బేడలకు) పేరు.

పావు—ఇది పాదదీనారమునకు (దీనారములోని నాల్గవ భాగమునకు(1/4 వరాకు) పేరు.

మాడ—ఇది అర్ధదీనారమునకు (దీనారములోని సగభాగమునకు (1/2 వరాకు) పేరు.

దీనారము—ఇది వరాకు (వరాహముద్రిత మగుబంగారునాణెమునకు) పేరు.

నాణెము—ఇది శుద్ధదీనారమునకు (దోషము లేకుండఁగా (సరిగా) ముద్రింపఁబడినవరాకు) పేరు.

వట్టము—ఇది హీనదీనారసంపూర్తికి ఇచ్చునట్టి ధనమునకు (తక్కువ పరిమాణము కలదై చెల్లని దీనారమును చెల్లించుటకై ఇచ్చుతఱుగుధనమునకు) పేరు.

ముచ్చిపుక·— ముచ్చివక-మూఁడు పావలాలు-అని (బ్రౌ.).

చౌలము·— 'చవులము' (రూపాం.). నాలుగు బేడలు (అర్ధరూప్యము) అని అర్థము చెప్పుచున్నది ఈ-ఆం.భా.కు (సూ.ని.). ఈ (సూ.ని.) దుగులమునకు రెండు బేడలు- అనియే అర్థము చెప్పినది. సమన్వయ మెట్లో!

మాడ.— పదిరూకలు-అనునది దీనికి అర్థాంతరము. అది వేఱు (చూ.సూ.ని. మాడ.). ఆం.భా. దీనిని వచించినది (చూ.2.272.). నాలుగు రూపాయలు 'వరా'-అనునప్పుడు, రెండురూపాయలు విలువ గలది మాడ (చూ.బ్రౌ.) [4మాడలు1కర్షము-అని (బ్రౌ.)].

వరా:— తొమ్మిది చిన్నముల యెత్తు బంగారు ముద్రిక. మూఁడున్నర, లేక నాలుగు

రూపాయల విలువ గలది. 'కరుకువరహా, కంఠీరవరాయవరహా'-అని వీనిభేదములు. ఏఁబదిరెండు (లేక) ఏఁబదియాఱు (వడ్ల) గింజల యెత్తునకు 'వరాయెత్తు' అని వ్యవహారము (చూ.బ్రౌ. వరహా.)

నాణెము.— 'ముద్రింపఁబడిన 'రాగి, వెండి, బంగారము'ల బిల్ల' అని (శ.ర.).

వట్టము.— తఱుగు, చిల్లర మార్చునప్పుడు పెట్టునష్టము-అని (శ.ర.). ఈయర్థము ఇచ్చి 'వట్ట మం చనఁగ వెలయు, హేయదీనారముఖ భాగధేయసంజ్ఞ' అని (ఆం.భా. 2.192.) ను ఉదాహరించు చున్నది (సూ.ని.). అచ్చటి వట్టమునకు ఇచ్చటివట్టమునకు అర్థము వేఱు వేఱు. అచ్చటి 'వట్టము-హేయదీనారముఖభాగధేయము (తక్కువ నాణెములు మొద లగునవి చెల్లించు పన్ను) అర్థము గాఁ గలది. అది ఇది కాదు. అచ్చట-(2.192.) లో నేను (సూ.ని.)ని అనుసరించుచు అర్థము వ్రాసితిని. ఒకప్రయోగ మిట్లున్నది 'మఱుఁగుఁబూఁబొదలఁ గ్రుమ్మఱుగుఱచ్చపుఁదావి, తఱుగుఁ గైకొను చల్ల తఱుగుగాలి' (చంద్రా.4.278.). ఇచ్చటి (తావి) తఱుగు-(పన్ను-భాగధేయము-అనునర్థము గలది గా తోఁచు చున్నది. ఇది (2.192.) లోని 'వట్ట' మునకు (ఉదా. అనవచ్చు నేమో. '.. దారితఱుగు గైకొను .' అని ఇట (శ.ర.పా.).

సీ. ఎడబె, ట్టనంగను నెరుస, నా బారిము
ద్ర, యన దీనారభేదములు చెలఁగు;
కా, సనఁగాను గాకణిపేరు విలసిల్లుఁ;
బైక, మం చనఁగఁ దద్ద్వయము వెలయు;
దమ్మ, యనంగను దార, మనంగను
దచ్చతుష్టయసంజ్ఞ దనరు చుండుఁ;
దద్ద్వాదశం బైనఁ దగు నేబు, నాఁగను;
జను టంక, మనఁగ నిష్కాహ్వయంబు;

గీ. దద్విశేషాభిధలు గాను దగును డబ్బు,
లనఁగ దుగ్గాను, లనఁగ దు, డ్లనఁగ జగతి;

శూలధారి! పరాతంకచోళవైరి!
పుంగవతురంగ! శ్రీమాతృభూతలింగ! 274

ఎడబెట్టు, ఎరుస, బారిముద్ర—ఇవి దీనారభేదములకు (ఒక్కొకటి ఒక్కొక విధ మగుబంగారునాణెమునకు) పేర్లు.

కాసు—ఇది కాకణికి (దమ్మిడిలో ఐదవ వంతునకు; దుగ్గానిలో పదియవ వంతు నాణెమునకు) పేరు.

పైకము—ఇది కాకణీద్వయమునకు (రెండుకాసులనాణెమునకు) పేరు.

దమ్మము, దారము—ఇవి కాకణీచతుష్టయమునకు (నాలుగుకాసులనాణెమునకు) పేర్లు.

నేబు—ఇది కాకణీద్వాదశమునకు (పండ్రెండు కాసులనాణెమునకు) పేరు.

టంకము—ఇది నిష్కమునకు (నూటతొంబదిరెండుపైసల పెద్దనాణెమునకు) పేరు.

డబ్బులు, దుగ్గానులు, దుడ్లు—ఇవి నిష్కవిశేషములకు (ఒక్కొకటి ఒక్కొక విధ మగునిష్కమునకు) పేర్లు.

[డబ్బు—ఇది నాల్గుపైసలు (దమ్మిడులు) విలువ గలనాణెమునకు పేరు.

దుగ్గాని—ఇది పదికాసులకు (రెండుదమ్మిళ్లు విలువ గలనాణెమునకు) పేరు.

దుడ్డు—ఇది రెండుదుగ్గానులనాణెమునకు పేరు.]

కాసు—దుగ్గానిలో నాల్గవభాగము-అని (శ.ర.).

టంకము:—పదియాఱుడబ్బుల బంగారునాణెము, దీనారము-అని (శ.ర.). నాలుగు మాషముల యెత్తు (వైద్య.)-అని (సూ.ని.). 'పదాఱు లేక పదునాలుగు రాగిడబ్బుల విలువ గలబంగారునాణెము. లేక, పెద్దరాగినాణెము (192) పైసలు విలువ గలది 'గోవారూపాయ' అని దీనికి అర్థ మిచ్చు చున్నది బ్రౌ. (చూ.టంకము.). అట్టివిలువ

గలమనరూపాయయే దీనికి అర్థ మనిపించు చున్నది. 'టంక మలరును బది। యాఱు దుడ్లకు నులికి' అని (వేంక. నానా. 130.).

నిష్కము:—నిష్కముకడ (సూ.ని.) 20 వరాటంకములు కాకిణి. 4కాకిణులు 1పణము. 16పణములు 1ద్రమ్మము. 16ద్రమ్మములు 1నిష్కము. 108మాడలమెత్తు గలబంగారము. 150మాడలయెత్తు గలబంగారము-అని కొందఱు అని ఒకలెక్క ఇచ్చినది. ఇది బంగారు నాణెమువిషయము. ఇది గాక మాడ, దీనారము, టంకము- అనునర్థములఁ గూడ ఇచ్చినది. 'ఇరువది చిన్నములమెత్తు బంగారుముద్రిక'-అని (బ్రౌ.).

డబ్బు:— 'చిన్నమెత్తు రాగిముద్ర' అని (బ్రౌ.). కాని, మూఁడుపైసలు విలువ గల నాణెము (కొన్నిస్థలములందు నాలుగుపైసలు విలువ గల నాణెము) అని (సూ.ని.).

సీ. పంపు, పాలు, వంతు, నా భాగంబు విలసిల్లు;
నాస్తి, నా సర్వస్వ మలరు చుండు;
సరకు, సంకట, మనఁ జనును బణ్యద్రవ్య;
మమరు రొక్క, మనఁ బైక, మన ధనము;
గుళిక, పూదె, యనంగ ఘుటికాహ్వయం బొప్పు;
రాపొడి, నా ఘృష్టరజము చెలఁగుఁ;
దగ, టనఁ దగ, డనఁ దనరు లోహదళమ్ము;
మనుఁ దప్తలోహాఖ్య మం, డనంగఁ;

గీ. గడ్డి, యనంగ సలాక, నాఁగను శలాక
యమరు; గుం, డన నుండ, నా నమరు గోళ
కాఖ్య; రవ యనఁగాను లోహశకల మగు;
భూషితభుజంగ! శ్రీమాతృభూతలింగ! 275

పంపు, పాలు, వంతు—ఇవి భాగమునకు (అంశమునకు; విభాగమునకు; వాటాకు) పేర్లు.

ఆస్తి—ఇది సర్వస్వమునకు (అంతధనమునకు; సొత్తునకు) పేరు.

సరకు, సంకటము—ఇవి పణ్యద్రవ్యమునకు (అమ్మఁబడెడివస్తువునకు; పణితవ్యమునకు) పేర్లు.

రొక్కము, పైకము—ఇవి ధనమునకు (ద్రవ్యమునకు; దనమునకు) పేర్లు.

రాపొడి—ఇది ఘృష్టరజమునకు (ఱాయి మున్నగువానితో రాచినపుడు రాలెడి పొడికి) పేరు.

గుళిగ, పూదె—ఇవి ఘుటికకు (బంగారుపూస-లో నగుదానికి) పేర్లు.

తగటు, ఱగడు—ఇవి లోహదళమునకు (బంగారు లో నగువానిఱేకునకు) పేర్లు.

మండ—ఇది తప్తలోహమునకు (కాఁచిన- ఇనుము కరఁగిన- బంగారు లో నగుదానికి) పేరు.

కడ్డి, సలాక—ఇవి శలాకకు (బంగారు లో నగువానికమ్మికి) పేర్లు.

గుండు, ఉండ—ఇవి గోళకమునకు (గుండ్రముగా చేయఁబడినవస్తువునకు) పేర్లు.

రవ—ఇది లోహశకలమునకు (బంగారు లో నగువాని- ముక్క-కు-తునుకకు) పేరు.

భాగము — 'అంశభాగౌ తు ఏణ్టకః' అని (అమ.). 'కో రనఁ బా లన నంశంబు' అని (ఆంధ్ర. శే. 45.). వాటా అనునదియు దీనికి పర్యాయము- 'నాళీకారికి నొక్కజింక నొకయేణం బంజనాకామికిన్ గాళీకాంతున కొక్కలేడి నిడ నింకం గూడునే?మూఁడువాటాలుం బెట్టినఁ జెంగనాలు మము ముట్టన్ రాకుఁ డన్నరీతి మీ రేలా పోయెద రేణులార. నిలువుండీ మాసుతుం జూపుఁడీ.' (సారం. 3. 235.). ఇట (జి. కా.) వ్యాఖ్యాతలు ' మూఁడుమూ టాలుం బెట్టినచెంగాలు..' అనునదియే ఇట సాధుపార మని 'మూఁడు మూటాలు చెంగనాలు, ఇది ఓమనగుంటలఆటయందు ఒకపట్టున ఆటను నిలుపుసంకేత వాక్యము (ఇఁక నొకజింక నైనను మీ కిచ్చుట లేదు అని భా.) అనినారు. ఇదిగాక, 'శ. ర. లో 'వెంగనాలు= సమస్కృతి' అని యున్నదికాఁబట్టి పూ. టీ.వారు

'చెంగనాలు= నమస్కారములు' అన్నారు. కాని 'మూడువాటాలు పెట్టినను నమస్కారములు' అనుటలో అర్థము లేదు' అనినారుగూడ. కావి, ఇట 'మూఁడువాటాలుం బెట్టినఁ జెంగనాలు ..' అనునదియే యిట సముచిత మగుపాఠ మనిపించినది నాకు. వ్యాఖ్యాతలు 'చెంగనాలకు 'పెట్టిన' అనునది విశేషణము గా అన్వయించి ప్రమాదపడినారు. 'పెట్టినఁగా' అనుదానికి 'ఇంకం గూడునే?' అనుదానితో అన్వయము. ఒక్కలేడిని (మఱియొకలేడిని) ఇడఁగా= ఇచ్చుట. (ఇంకను కూడును ఏమి?) మూఁడువాటాలు ముగ్గురికి సమానము గా ఇచ్చితిమి. ఇంకను మఱియొకదానిని ఇచ్చుట కూడదు (తగదు) అర్థమునుబట్టి ఆక్షిప్త మయియో దేహళీదత్తదీపన్యాయమున ఉభయాన్వయము కలదియయియో? 'ఒక్కలేడి నిడఁగా' అనునది యిట సంబంధపడును ('ఒక్కలేడి నిడఁగా') అనుట- ఇచ్చిన, ముగ్గురికి మూఁడులేళ్లను (సమానముగా) ఈయవలయునుగాని, ఒక్కలేడి నిచ్చుట న్యాయ్యము కాదు. ముగ్గురికి మూఁ డిచ్చుట శక్యము కాదు-అనువ్యంగ్యార్థ స్ఫూర్తియుఁ గలది. ఇఁక, 'చెంగనాలు' అనునది 'నమస్కారము' అనెడి- అర్థము కలదియే! 'అయ్యా! నాజోలికి రావలదు. నీకు నమస్కారము' అనుటవంటితెలుఁగును డికార మిది. ఇట్టిపాఠము వదలికొని యెట్లో దీనిని సమన్వయింపవలయు నని వీరు పడరానిశ్రమము పడుట నా కుచిత మనిపింప లేదు.

రొక్కము — 'విత్తమునకు రూక, దనము రొక్క మనంగఁ దనరు' (ఆంధ్ర.శే. 45.). 'వెల' అని (సూ.ని.)

గుళిక:—గుళిక. (సం.) గుళిగ (వై.) అను చున్నవి (శ.ర. సూ. ని.). నిర్ధారక ప్రయోగము లేదు. 'గుళిక' కు. 'గుళిగ'- (వై.) అనియు, (సూ.ని.) 'గుళిక' అనియే (ఆం. భా. పా.) ఉదాహరించినది (సూ.ని.) (చూ. పూదె.). సంస్కృత శబ్దములును తెలుఁగువారివ్యవహారమున అర్థాంతరము సంపాదించి కొన్ని, సంపాదింపక కొన్ని 'అచ్చతెలుఁగు' అనఁబడుట దృష్ట మని పూర్వము వ్రాసితిని. అట్టిదే యిది. దీనికి 'రసమణి లో నగునది అర్థ మని (శ. ర.). గుళిక-ఉండ; మాత్ర; గోళీ- అని, 'గుళిగ-ఘుటిక, ఉండ-' అర్థ మను చున్నది (సూ. ని ). 'గుం డన నుండ నా నమరు' అను పై(ఆం. భా.)నుబట్టి (శ. ర.)అర్థమే పరిగ్రాహ్య మిచ్చుట నని తోఁచినది.

మండ:— ఈపదమును ఈయర్థమున (శ. ర. బ్రౌ. లు) గ్రహింప లేదు. (సూ. ని.) గ్రహించి ఈ (ఆం. భా.)నే ఉదాహరించినది.

రవ·—— 'ఖండము (ఖండమాత్రము)' అర్థ మనినది (సూ. ని.)

లోహశకలము·—— 'బంగారు, వెండి, ఇత్తడి, కంచు, ఇనుము'- ఇవి పంచలోహములు. సత్తు, తగరము, ధీవరము-అనువానితో కలసి అష్టలోహములు అని (శ ర.). 'సువర్ణం రజతం తామ్రం రీతిః కాంస్యం తథా త్రపుః సీసం చ ధీవరం చైవ అష్టలోహాని చక్షతే' అని (గుహ.) (చూ అష్టపదశబ్దవ్యాఖ్య.) (రీతి- ఇత్తడి. త్రపువు-తగరము. ధీవరము- ఇనుము.). 'సువర్ణం రజతం తామ్రం సీసకం కాన్తికం తథా వఙ్గం లౌహం లౌహా న్యష్టా విమాని తు' అని (సూ.ని.) (చూ. అష్టలోహకము.). నవలోహము అని యొకవాడుక కలదు-అని (శ.ర.) (చూ.లోహము). (లౌహము- ఇనుము. తీక్ష్ణలౌహము-కాలాయసము ఉక్కు.). 'నవలోహము'లనువారు 'ఉక్కు' ఒకలోహము క్రింద పరిగణింపెద రని తోఁచు చున్నదీ.) (సూ.ని.) పంచలోహములను ఇట్లు లెక్కించినది- బంగారు, వెండి, రాగి, తగరము,సీసకము (అని.).

[పూదె:—— 'పూటె-' (వావి. అపముద్రి).]

[ఘుటికా ..'—— 'ఘటికాహ్వయం బొప్ప' (వావి. అపముద్రి.)]

సలాక:—— 'శలాక' —— (వావి. అపముద్రి.)]

సీ. పచ్చ, యనంగను బరఁగు మరకతంబు;
గారుత్మతం బొప్పు గరుడపచ్చ
యనఁ; దద్విశేషాఖ్య యగును బేరోదనం,
బన; నది కృత్రిమం బయిన వెలయు
మాంచాళి, యం చన; మౌక్తికం బొప్పను
ముత్తెము, ముత్యము, ముత్తియ, మనఁ;
దద్విశేషాభిధ దనరుఁ దార, మనంగ
నాణి, యం చనఁగ సుపాణి, యనఁగ;

గీ. నదియె నెర డైనగొగ్గి, యం చనఁగ వెలయుఁ;
జిప్పముత్తెం, బటం డ్రదే చేయఁబడిన;

వీనితూనిక చవి. యన వెలయు చుండు;
భూరిభవభరిగః శ్రీమాతృభూతలింగః 276

పచ్చ—ఇది మరకతమునకు (మరతకమునకు; హరిన్మణికి; అశ్మగర్భమునకు; ఆకుపచ్చనిరతనమునకు) పేరు.

గరుడపచ్చ—ఇది గారుత్మతమునకు (గారుడమునకు; విషహరమునకు; పచ్చకంటె తక్కువ దానికి; లేఁతనలుపు గలదానికి) పేరు.

పేరోదనము—ఇది తద్విశేషమునకు (పేరొజనమునకు; ఒకదినుసుగరుడపచ్చకు) పేరు.

మాంచాళి—ఇది కృత్రిమ మైనపేరోదనమునకు; (చేఁతపేరోదనమునకు;కృత్రిమము గా ఏర్పఱుపఁబడినదానికి) పేరు.

ముత్తెము, ముత్యము, ముత్తియము—ఇవి మౌక్తికమునకు (ముక్తకు; అంభస్సారమునకు; చినుకుఁబూసకు) పేర్లు.

తారము, అణి, సుపాణి—ఇవి మౌక్తికవిశేషములకు (ఒక్కొకటి ఒక్కొక్క దినుసుముత్యమునకు) పేర్లు.

[తారము—ఇది శుద్ధముక్తకు; పులు కడిగిన ముత్యమునకు పేరు. (పులు-ముత్తెపుదోషము). అణి—ఇది అణిపూసకు; ఒకజాతిముత్తెమునకు పేరు. సుపాణి—ఇది శుభ్ర మైననీరు గలముత్యమునకు పేరు.]

గొగ్గి—ఇది నెర దైనముత్యమునకు (ఎచ్చుదగ్గులు గలముత్తెమునకు)పేరు.

చిప్పముత్తెము—ఇది చేయఁబడిన గొగ్గిముత్యమునకు (చేఁతగొగ్గిముత్యమునకు) పేరు.

చవి.—ఇది ముత్యములతూనికకు (ముత్యాలయెత్తునకు) పేరు.

గరుడపచ్చ:—పచ్చ, గరుడపచ్చ-పర్యాయము లనియే (శ.ర.సూ.ని.) వచించినవి. (ఆం.భా.)ను అవి గమనించినట్లు లేదు.(బ్రౌ.) వీనికి భేదము వచించినది (చూ.గరుడపచ్చ. గారుడము.). (వేంక.) భేదము లే దను చున్నది.-(చూ.స్థా.86.).

పేరోదనము:—పేరొజము, పేరోజము-(రూపాం.) ఒకజాతిగరుడపచ్చ-అని (సూ.ని.). ఒకతరహాపచ్చ-అని (బ్రౌ.) (చూ.అను.). 'పేరోదనము-మరకతమణివిశేషము. పేరోజము (సం.వి.అ.న.) క్షుద్రమణివిశేషము.'-అని (శ.ర.). 'పేరొజము' మాత్రము-పేరోదనమునకు (రూపాం.) అను చున్న దిది.

మాందాళి·—దీనికి కృత్రిమమరకతము (మాందాళిపచ్చ) అని (శ.ర.మొ.).

అణి, సుపాణి:—వీనిని సాధారణములఁగా నే (ముత్యము లన్నిటికి పర్యాయములఁగానే) (సాంబ.) వచించు చున్నది.-'అణి చిరుకుఁబూస పాణి సుప్పాణి ము,త్తెము ముత్తియంబు ముత్య మనఁ దనరు। మౌక్తికాఖ్యలు'-(స్థా.61.). ఇట్లె (వేంక. స్థా. 86.). (సుప్పాణికి-రూపాం. సుపాణి.)

గొగ్గి.—కొన గలముత్యము-అని (బ్రౌ.).

చిప్పము త్తెము —'చేఁతము త్తెము'-అని దీనినే (సూ.ని.) వ్యవహరించినది.

చవి:—(చూ.విజ.వి.1.16.). ఈ (విజ.వి.) పద్యముకడ, ఇటీవలివ్యాఖ్యాత లొకరు దీనికి ఈ యర్థము చాల శ్రమపడి 'షరాబు'ల నడిగి తాము తెలిసికొనినట్లు వ్రాసికొని నారు. (ఆం.భా.) ఈపదమునకు ఈయర్థము స్పష్టము గా చెప్పినది. (బ్రౌ.) చెప్పినది. (సూ.ని.) చెప్పినది. (ఆం.సం.) 'చవు లనఁగా నభిధానము లవు షడ్రుచులకు ముత్తియపుటెత్తులకున్' అనినది (నానా.15.) ఇట ముత్యాలసర మనువ్యాఖ్య ప్రమాదము.

సీ. పద్మరాగాభిధ పరఁగుఁ గెం, పన; నది
వన్నె తగ్గినఁ గరపక్క, యండ్రు;
కృత్రిమం బగునది గేరు రవాయి, నాఁ;
దత్కాంతి విడి, యనఁ దనరు చుండు;

నా కాంతి మెండైన నలరు మొక్కళి, యన,
నా కెంపుపని కుచ్చె, యనఁగ వెలయు,
నతికాంతి యా కెంపు నలరుఁ జొక్క మనంగఁ,
బ్రభపేరు వెలయును బాట, మనఁగఁ,

గీ బరఁగును బ్రవాళనామంబు పగడ, మనఁగఁ
బవడ, మనఁగ సిరాజి నా వానియొత్తు
కఱు, జనంగను విలసిల్లుఁ బ్రణతభక్త
భూరిభవభంగ శ్రీమాతృభూతలింగ 277

కెంపు—ఇది పద్మరాగమునకు (మాణిక్యమునకు శోణరత్నమునకు, ప్రాఁగెం పునకు) పేరు

కరపక్క—ఇది వన్నె తగ్గినదానికి (కాంతి తక్కువ గా ఉన్న కెంపునకు) పేరు.
రవాయి—ఇది కృత్రిమ మగుదానికి (కెంపువలె ఉండినవంటరాతికి) పేరు

విడి—ఇది తత్కాంతికి (కెంపుయొక్క ప్రకాశమునకు-దీప్తికి-జిగికి) పేరు

మొక్కళి—ఇది మెండైన ఆకాంతి కి (కెంపుయొక్క మిక్కిలి ప్రకాశమునకు) పేరు

కుచ్చె—ఇది ఆకెంపుపనికి (పద్మరాగములతోఁ జేసినశిల్పమునకు) పేరు

చొక్కము—ఇది అతికాంతి కలిగినకెంపునకు (గొప్పకాంతి గలపద్మరాగమణికి) పేరు

పాటము—ఇది ప్రభకు (కాంతికి సూర్యకాంతికి, కెంపులు నాణెము చూచుటకు తగినయెండకు) పేరు

పగడము పవళము సిరాజి—ఇవి ప్రవాళమునకు(విద్రుమమునకు పవడము నకు, మెఱుఁగురిక్కకు) పేర్లు

కణుజు—ఇది వానియెత్తునకు (పగడములతూనికకు) పేరు

కెంపు —(శ ర ) ఇట్లు వివరించు చున్నది- దీనికి సింహళము, కాళపురము ఆంధ్రము తుంబురము- ఇవి నాలుగు జన్మదేశములు సింహళమునందు పుట్టినకెంపు రక్తవర్ణము కలది దానికి పద్మరాగ' మని పేరు అది యుత్తమము కాళపురమునందు పుట్టినది పసుపుదాళు కలది దానికి కురువింద' మని పేరు అది మధ్యమము ఆంధ్రమునందు పుట్టినది అశోకపుచిగురుదాళు కలది దానికి సౌగంధిక మని పేరు అదియు మధ్యమము తుంబురమునఁ బుట్టినది నీలపుదాళు గలది దానికి నీలగంధి' యని పేరు అది అధమము-అని (చూ మాణిక్యము ) ఇంకను వివరణమునకై (చూ నా మధురావి వ్యా 1 58 ) మాణిక్యనామ మమరుఁ గెంపు రతనంబు మానిక మన' అని (వేంక. స్తా 86 )

కృత్రిమము —మన్ను వండి చేసిన - ఒకవిధ మగు మణి కెంపు వలె ఉండునది (వంటతాయి)

చొక్కము —దీనికి-చొక, చొకము, చొకా, చొకాటము-అనురీతిని (రూపాం ) (చూ సూ ని )

పాటము —కెంపులు నాణెము చూచుటకుఁ దగినవెలుఁగు గలవేళ-అని (సూ ని ) (బ్రౌ ) ప్రభ, కాంతి ఇది పాటమువేళ కాదు-అనినది (చూ అను )

సిరాజి —(బ్రౌ ) దీనికి సిరాజిదేశసంబంధ మైన'అని అర్థ మిచ్చి నిగర మైనసిరాజి పగడాలు చేకట్లు, కాంతికడెంబు లుంగరపుజొళ్లు' (హంస 4 38 ) ఉదాహరించినది (సిరాజిదేశపు) పగడమ' అనుదానికి శక్తిసంకోచమున బనయర్థ మిది

కణుజు —పగడములు తూఁచెడిమానవిశేషము- అని (సూ ని ) చవి' కడ (సూ ని ) కూడ ముత్యములతూనిక' అనియే అను చున్నది

[ తగ్గినగరపక్క-(వావి అపముద్రి )]

రవాయి — కృత్రిమపద్మరాగము' అనఁగా కెంపువలె ఉండే వంటరాయి- అని (బ్రౌ) (చూ అను )

ప్రణతభక్త —ప్రణుతభక్త- (వావి పా ) (పారాం )

సీ. పొలుచును వజ్రంబు మూలరా, లన మగ
రా, లనంగను గురుజా, లనంగఁ;
దత్ప్రతినిధిపేరు తలుపు, నా విలసిల్లు,
మంజాడి నాఁ దత్ప్రమాణ మొప్పుఁ;
గప్పురా, లనఁగను గనుపట్టు నీలము;
గ్గొతుపు, నాఁ దద్భేద మతిశయిల్లుఁ,
బటిక, యం చనఁగను స్ఫటికంబు విలసిల్లుఁ;
బరఁగుఁ దద్భేదంబు పలుఁ, గనంగ;

గీ. మానికము, రతన, మనంగ మణి చెలంగు;
నదియు సచ్ఛిద్ర మైనఁ బూ, సనఁ దనర్చుఁ;
గాకిబంగా రనంగ బేగడ యనంగ
నభ్రకము దోఁచుఁ; దిరిశిరఃపురాధినాథ 278

మూలరాలు మగరాలు, గురుజాలు—ఇవి వజ్రమునకు (హీరకమునకు; రవకు; మగమానికమునకు; వజ్రమణికి) పేర్లు.

తలుపు—ఇది తత్ప్రతినిధికి (వజ్రములకు మాఱుగా ఉపయోగించెడివజ్రము వంటిమణికి, కృత్రిమవజ్రమునకు) పేరు.

మంజాడి—ఇది తత్ప్రమాణమునకు (మంజాళికి, వజ్రమణుల ప్రమాణమునకు; వజ్రములు తూఁచుపడికట్టునకు) పేరు.

కప్పురాలు—ఇది నీలమునకు (తృణమణికి, మసారమునకు; పుల్లంటుజాతికి; ఇంద్రనీలమణికి) పేరు.

గొతుపు—ఇది నీలవిశేషమునకు (ఒకదినుసునీలమణికి) పేరు.

పటికము—ఇది స్ఫటికమునకు (అర్కమునకు, పటికపుజాతికి) పేరు

పలుఁగు—ఇది తద్భేదమునకు (ఒకదినుసుస్ఫటికమునకు) పేరు

మానికము రతనము—ఇవి మణికి (రత్నమునకు, అన్నిరత్నములకు) పేర్లు

పూస—ఇది సచ్ఛిద్ర మైనదానికి (విద్ధమణికి తొలి వేయఁబడినరత్న మునకు) పేరు

కాకిబంగారు భేగడ—ఇవి అభ్రికమునకు (వైద్యమునందు ఉపయోగించు ఒకధాతువునకు) పేర్లు

మూలరాలు —బహువచననిర్దేశము వృత్తిని అంత్యవర్ణలోపము తెలుపును

తళుపు — మణివిశేషము'- అని (శ ర )

మంజాడి — వజ్రప్రమాణవిశేషము'-అని (సూ ని ) వజ్రములతూనిక అని (శ ర )

పూస —'మణి' అని (శ.ర )

అభ్రకము — అభ్రకం గిరిజామలే' అని (అమ ) ఇట గిరిజామలే-అనునది ఏకపద మని స్వామి గిరిజం గిరిజాబీజ మమలం గవలధ్వజమ్'-అని వాచస్పతి (చూ సుధ ) (అభ్రికము)- భూమిలో అద్దపుపెంకువలె చిక్కటిది నలిపితే పొడి అయిపోతుంది అయితే కాకిబంగారు వేరు ఇది వేరు (కాకిబంగారము-దీపిక) అని (బ్రౌ )

[గురుజాలుఁ— గురుజరా లనంగ' ( వావి అపపా) ]

సీ కాంచనాభిధలు బంగారు బంగరు హొన్ను
పసిఁడి పసిండి పొన్ పైఁడి పయిఁడి
పుత్తడి యం చనఁ బొలుపారు నతిశుద్ధ
చామీకరాఖ్యలు చనుఁ గడాని
మేలిమి యపరంజి జాళువా, కుందనం
బుదిరి నా రజతాఖ్య యొప్పు వెండి
మడికా సనంగను, మను నారకూటంబు
పిత్తడి యం చన నిత్తడి యనఁ

గీ గాంస్యనామంబు విలసిల్లుఁ గం చనంగ
రాగి యం చన వెలయుఁ దామ్రాభిధాన,
మయము విలసిల్లు నిను, మన, నలరుఁ దద్వి
శేష ము క్కని చెప్పఁగ, శేషభూష 279

బంగారు, బంగరు హొన్ను పసిఁడి, పసిండి పొన్ (పొన్ను), పైఁడి పయిఁడి, పుత్తడి—ఇవి కాంచనమునకు (సువర్ణమునకు, స్వర్ణమునకు, బంగారమునకు, బంగరమునకు) పేర్లు.

కడాని మేలిమి, అపరంజి, జాళువా, కుందనము, ఉదిరి—ఇవి అతిశుద్ధకాంచనమునకు )తప్తకాంచనమునకు, మిక్కిలి శుద్ధమై ప్రశస్తమైనబంగారమునకు, పదాఱువన్నెబంగారునకు) పేర్లు

వెండి, మడికాసు—ఇవి రజతమునకు (దుర్వర్ణమునకు, రూప్యమునకు, శ్వేతమునకు, పంచలోహములలో ఒకటికి) పేర్లు.

పిత్తడి, ఇత్తడి—ఇవి ఆరకూటమునకు (కపిలోహమునకు, ఇత్తళికి) పేర్లు.

కంచు—ఇది కాంస్యమునకు (కంసమునకు, కంచులోహమునకు) పేరు

రాగి—ఇది తామ్రమునకు (శుల్బమునకు మర్కటాస్యమునకు, రాగిలోహమునకు) పేరు

ఇనుము—ఇది అయమునకు (అశ్మసారమునకు, ఇనుమునకు) పేరు.

ఉక్కు—ఇది అయోవిశేషమునకు (అయస్కారమునకు, కాఁచి శుభ్రము చేసిన యినుమునకు) పేరు.

కాంచనాభిధలు —వీనియందు- అపరంజి, కుందన' శబ్దములు తక్క- తక్కినవి సాధారణము గా కాంచనాభిధానము లని కొన్ని నిఘంటువులు- అధివర్ణకాంచనాఖ్యలు చెలంగు నపరంజి కుందనం బన' (వేంక స్థా 91.) అపరంజి కుందన మనఁ దప్తకనక మౌ'

(సాంబ.స్థా 67) (ఆంధ్ర సం) కుందనము కడాని, అపరంజి-అనునవి తక్క తక్కన వట్టి వను చున్నది తప్తకాంచన మమరుఁ గుందన మనంగ వాని యపరంజి నా'(ఆంధ్ర.సం స్థా.35)

అపరంజి — పదివన్నెబంగారు-అని (శ ర)

ఉక్కు — 'ఇనుము-ఉక్కు' పర్యాయము లని (సాంబ) ఉలి యుక్కు ను మనఁగ నాన రు నయస్సంజ్ఞ' (స్థా 65)

అయము — అయః'-అనుదాని కైనతత్సమ రూపము (అయస్సు'(రూపాం).

సీ లోహమలాభిధ లొప్పలు పారు చుండును
ద్రుప్పనఁ జీలు మనఁ ద్రుక్కనంగఁ
జిట్టె మం చనఁగను శింఘాణ మై తోఁచుఁ,
గాచము విలసిల్లు గా జనంగఁ,
బింగాణి, కుప్పె,కుప్పియ,కుప్పె, యనఁగను
దత్కృతచషకాఖ్య తనరు చుండు;
నింగిలీకం, బన హింగుళి విలసిల్లు,
హరితాళ మొప్పును నరిదల మనఁ,

గీ జెలఁగు సిందూరనామంబు చెందిర, మన,
దూది, యనఁ దూల మొప్పును, దుట్ట యనఁగఁ
బెర, యనఁగ క్షౌద్రపటలంబు పేరు చెల్లుఁ,
దేనె, యన క్షౌద్ర మొప్పును మైన, మనఁగఁ
బొలుచు సిక్థంబు శ్రీమాతృభూతలింగ 280

త్రుప్పు, చిలుము త్రుక్కు——ఇవి లోహమలమునకు (లోహములమీఁదిముటికికి, వెండి బంగారు-లో నగు ధాతుద్రవ్యములమీఁది (మసటునకు) మాలిన్యమునకు) పేర్లు.

చిట్టెము—ఇది శింఘాణమనకు (ఇనుపచిట్టెమునకు, ఇనుముమీఁదిముఱికికి) పేరు.

గాజు—ఇది కాచమునకు (ఒకదినుసుమట్టికి) పేరు

పింగాణి, కుప్పి కుప్పియ, కుప్పె—ఇవి తత్కృతచషకమునకు (గాజుతో చేసిన పాత్రమునకు) పేర్లు.

ఇంగిలీకము—ఇది హింగుళికి (హింగుళమునకు; ఇంగిలికమునకు; రాగద్రవ్య మునకు; రంగు గా ఉపయోగపడు పదార్థమునకు) పేరు.

అరిదళము—ఇది హరితాళమునకు (హరిదళమునకు పసుపుపచ్చనిధాతువిశే షమునకు, 'అర్దళము' అని వాడఁబడెడిదానికి) పేరు

చెందిరము—ఇది సిందూరమునకు (నాగసంభవమునకు; తుత్తినాగమునుండి ఏర్పడుదానికి, రససిందూరమునకు) పేరు.

దూది—ఇది తూలమునకు (కార్పాసమునకు, పిచువునకు, విత్తు తీసిన ప్రత్తికి) పేరు.

తుట్టె పెర—ఇవి క్షౌద్రపటలమునకు (మధుకోశమునకు, తేనెపెరకు, తేనెపట్టు నకు, తేనెతుట్టెకు) పేర్లు

తేనె—ఇది క్షౌద్రమునకు (మధువునకు, అన్నివిధము లగుతేనెకు) పేరు.

మైనము—ఇది సిక్థమునకు (మధూచ్ఛిష్టమునకు; మయినమునకు; అగ్నిసంయో గమున కరఁగుతేనెపెరలోని పదార్థమునకు, తేనెతో ఉండి తేనె పిండఁగా మిగిలెడి దానికి, ఉచ్ఛిష్టమోదనమునకు) పేరు.

లోహము — లోహం తు తైజసం సర్వమ్'-అని (వైజ భూమి 36)

చిలుము —రాగిచెంబు లో నగువానిలోఁ గలుగుముఱికి-అని(సూ ని)

త్రుప్పు — అయోమలము, ఇనుపకిట్టము కాలుష్యము మాలిన్యము (ఆం భా 280)' అను చున్నది (సూ ని)

శింఘాణము — శ్ఘాణ మపి తన్మలే' 'సింహాన' మితి (పారాం) అని (అమ) (చూ. సుధ). ధూర్త మణ్డూర సింహాణ వి ష్ఠాఖ్యాని త్వయోమలే' అని (వైజ భూమి శూద్రా) (గురు పా సింహాణ మనియే)

గాజు —'ఇసుక కరఁగించి చేసినయొకపదార్థము-అని (సూ ని) ఒకదినుసుమన్ను -అని (శ ర) కాచ శ్చిక్యే మణౌ నేత్రరోగభేదే మృదన్తరే' అని (విశ్వ మేది) (చూ సుధ)

కుప్పె —'కాచాదిపాత్రవిశేషము' అని (సూ.ని) మెడ నిడుపు గాఁ గలకాచపాత్రవిశేషము అని (శ ర)

పింగాణి — ఒక దినుసుతెల్లమట్టిపాత్రము' అని (శ ర) ఒకదినుసుతెల్లచీనామట్టి ఆ మట్టితోఁ జేసినపాత్రము అని (సూ ని) ఈయర్థ మి ట్లిచ్చి గాజుపాత్రము' అను నర్థము వేఱు గా ఈ(ఆం భా)కు చెప్పినది (సూ ని)

హింగుళి —హిఙ్గులో వర్ణకద్రవ్యే నా భణ్టాక్యాం తు హిఙ్గులీ' అని (మేదిని) (చూ సుధ) (సూ ని బ్రౌ) స్త్రీలింగము గా హింగులి గూడ ఉన్న దను చున్నవి

చెందిరము —కుంకుమము (కుంకుమపువ్వు) అని (బ్రౌ శ ర ఖ) సిందూరం నాగసంభవమ్' అని (అమ) నాగోద్భవం తు సిన్దూరం కుఙ్కుమేన సమప్రభమ్' అని (వైజ భూ వైశ్యా) కుఙ్కుమమునకు పేర్లు వేఱు గా చెప్పినది (ఆం.భా.) (చూ 2. 160)

క్షౌద్రము — మధు క్షౌద్రం మాక్షికాది'-అని (అమ) అదిశబ్దముచే తక్కిన 'మధువు' లను క్షౌద్ర' శబ్దవాచ్యములు మధువులు నాలుగువిధములు వానిలక్షణము లిట్లు పేర్కొనఁబడినవి- మాక్షికం తైలవర్ణం స్యాత్ ఘృతవర్ణం తు పౌత్తికమ్ విజ్ఞేయం భ్రామరం శ్వేతం క్షౌద్రం తు కపిలం మతమ్' (చూ గురు) పై అమరవ్యాఖ్యాసందర్భమున 'ఆదినా-భ్రామర వాటక పౌతి కాదిగ్రహః అని (సుధ) తేనెలుగూడ తెలుఁగున ఇట్లు పేర్కొనఁబడినవి-'పుట్టతేనియ పెరతేనె పుట్టజున్ను తొఱ్ఱతేనియ గల

వందు' (కాశ.3 68.). వీనిఁగూర్చి (సాంబ.) ఇట్లను చున్నది ' కురుజుతేనె పుట్టతేనియ పెరతేనె పువ్వుఁ దేనె జుంటితేనియ యనఁదగు సుమరసంబు' (స్థా.66).

తేనె —'తేనియ యన జు న్నన నభి ధానంబులు మధువునకు' (ఆం.శే.48 ).

చషకము —'చషకో ఽస్త్రీ పానపాత్రమ్'-అని (అమ ). పాత్రసామాన్యముగూడ దీనికి అర్థాంతరము (చూ సూ ని ) వైశ్యవర్గ మిది 'పానపాత్ర' మిది అనుట ఉచితము గాదు (అమ.) చెప్పినది శూద్రవర్గములోనిమాట.

మైనము —మడ్డి మై ము, తేటమైనము-అని ఇది రెండువిధములు. మడ్డిమైనమే సిక్థము (మధూచ్ఛిష్టము) అని (బ్రౌ.).

[చిట్టె మం చనఁగ —'చట్ట మం చనఁగను సింహాణ మై' (వావి పా.) (అపపా.) ]

గీ. శ్రీలు వెలయంగ నీపేరఁ జేయుకతనఁ
బరఁగు శాశ్వతము గ వైశ్యవర్గ' మిట్లు,
గై కొనుము దీని భక్తసంఘాభిమాని
మాతృభూతః జగత్త్రయీమాతృభూత. 281

[వ్యాఖ్యకై చూ. స్వర్గ.68.]

ఇది

వైశ్యవర్గము

---

# శూద్రవర్గము

సీ. శూద్రనామంబులు శోభిలు నాలవ
కొలమువార, లని కాఁపు లని పల్కఁ,
దద్విశేషమ్ము లై తనరుఁ గమ్మని వెల్మ,
యని రెడ్డి యని రడ్డి, యని వచింపఁ,
బనివానిపేరు గా భాసిలు నో జనఁ,
గుమ్మరవాఁ డొప్పుఁ గుమ్మరి యన,
మాలకరి, యనంగఁ బూ లమ్మువాఁ డగు
మీఱు సూసరి యన గారకాఁడు

గీ. చిప్పె, యనఁగను విలసిల్లుఁ జిప్పెవాఁడు,
చెలఁగు నంచులవాఁ డనఁ జిత్రకారి,
చికిలికాఁ, డన శస్త్రమార్జకుఁడు దోఁచు,
భూతిలసితాంగ శ్రీమాతృభూతలింగ 282

నాలవకొలమువారలు కాఁపులు—ఇవి శూద్రులకు (అవరవర్ణులకు, వృషలులకు ఇవముగుబ్బలిబిడ్డసవతితమ్ములకు, నాల్గవజాతివారికి) పేర్లు

కమ్మ, వెల్మ (వెలమ) రెడ్డి రడ్డి—ఇవి తద్విశేషములకు (శూద్రులలోని తెగలకు) పేర్లు.

ఓజు—ఇది పనివానికి (శిల్పికి కారువునకు) పేరు.

కుమ్మరి—ఇది కుమ్మరవానికి (కులాలునకు కుంభకారునకు, కుండలు చేయువానికి) పేరు

మాలకరి—ఇది పూ లమ్మువానికి (మాలాకారునకు పూలమాలెలు కట్టి అమ్మువానికి) పేరు

గారకాఁడు——ఇది సూసరికి (గచ్చుపని చేయువానికి; లేపకరునకు) పేరు.

చిప్పె——ఇది చిప్పెవానికి (సౌచికునకు; కుట్టుపని చేయువానికి; దర్జీనివాక) పేరు.

అంచులవాఁడు——ఇది చిత్రకారికి (చిత్రకారునకు; చిత్తరువు వ్రాయువానికి; ఆలేఖకునకు) పేరు

చికిలికాఁడు——ఇది శస్త్రమార్జకునకు (కత్తి మొద లగువానిని-దుడుచువానికి-మెఱుఁగుపెట్టువానికి) పేరు.

శూద్రనామములు ——వీనిని ఇతరనిఘంటువు లిట్లు పేర్కొనినవి- కలపతాల్పులు తుదికాళ్ల మునేర్పరులు కాపులు వినువాఁకతోఁబుట్టువు లన నలరును శూద్రాఖ్య'(లు) (సాంబ.మాన 3 ). ' గాఁపు వాండ్రు నా నాలవవాండ్రు నా బలిజెవాం. డ్రనఁ జను శూద్రసమాహ్వయములు' (ఆం.సం మాన 2 ). ' దివపుగుబ్బలి బిడ్డనవతితమ్ముఁడు నాలవకొలమువాఁ డన వరలు శూద్రుఁ' (డు) (వేం.మాన 27 ).

ఓజు —'అగసాలవాండ్లు'-అని అర్థ మిచ్చు చున్నది (బ్రౌ ) ఇట- 'ఔజు' అని (శ.ర. పా.) అవుజుయొక్క- (రూపాం.) ఇది అనినది (శ.ర.) (అవుజు-ఔజు వి బురద, పంకము ఆం.భా. (1 155.)- అని (సూ.ని.).

సూసరి —సున్నము పూయువాఁడు, లేపకుఁడు అని (శ.ర.). (' విలసిల్లు జప్పె వాఁడు'-అని (వావి అపముద్రి ) 'బెస్త చిప్పె కమ్మరి వడ్రంగి ' అని (హంస. 3 29 ) (చూ.సూ.ని ).

పనివాఁడు —పని-శిల్పము. శిల్పు లిట్లు పేర్కొనఁబడినారు-'తక్ష చ తన్తువాయ శ్చ నాపితో రజక స్తథా పఞ్చమ శ్చర్మకార శ్చ కారవ శ్శిల్పినో మతాః' అని (చూ. సుధ ). వీ రందఱకు సాధారణ మగుపే రిది యన వచ్చును.

సీ. తంతువాయాభిధ దనరు మగ్గరి, యన
నేఁతకాఁ, డనఁగను నేఁతరి, యనఁ,
దోఁచుఁ దద్భేదము లొగటవాఁ, డనఁగను
సాలీఁ, డనంగను సాలె, యనఁగ

సాలెవాఁ, డనఁ బట్టుసాలెవాఁ డనఁగను
　　దేంద్ర యనంగను జేంద్ర యనఁగఁ
గైకలవాఁ, డనఁగను జర్మకారాఖ్య
　　పరఁగు గోదరి ముచ్చెవాఁ డనంగ

గీ. మంగి, యనఁగను మంగ లెసంగు చుంచు
వఱలుఁ జాకి నాఁ జాకలవానిపేరు,
ఈడిగ యనంగ నీడిగవాఁడు, వెలయు
భూషితభుజంగ శ్రీమాతృభూతలింగ 283

మగ్గరి నేఁతకాఁడు నేఁతరి—ఇవి తంతువాయునకు (కువిందునకు వస్త్రము నేయువానికి) పేర్లు.

తొగటవాఁడు సాలీఁడు సాలె సాలెవాఁడు, పట్టుసాలెవాఁడు దేంద్ర జేంద్ర కైకలవాఁడు—ఇవి తద్భేదములకు (తంతువాయవిశేషములకు నేఁతకాండ్రలోని కొన్నితెగలకు) పేర్లు

గోదరి, ముచ్చెవాఁడు—ఇవి చర్మకారునికి (తోలుపనివానికి) చెప్పులు కుట్టుట మొద లగుతోలుపని చేయువానికి) పేర్లు

మంగి—ఇది మంగలికి (క్షౌరికునకు నాపితునకు మంగలివానికి) పేరు

చాకి—ఇది చాకలవానికి (రజకునికి, బట్ట లుతుకువానికి) పేరు

ఈడిగ—ఇది ఈడిగవానికి (ఈండ్రవానికి తాటిచెట్టు రో నగువానినుండి కల్లు తీసి జీవించునొకజాతివానికి) పేరు

తొగటవాఁడు —తొగట-ఎఱ్ఱనూలు-అని (చి.ని) (చూ హూ ని)

పట్టుసాలెవాఁడు —పట్టుతో వస్త్రములు నేయునొకజాతివాఁడు-అని (సూ ని) డనఁ బుట్టుసాలె ' (వావి ఆపముద్రి)

దేంద్ర —'జేంద్ర'కు (రూపాం) అని (శ ర) పొడు గైనవస్త్రముల నేయువాఁడు (అని) (బ్రౌ.) శాసనములందు జాంద్ర' అని అగపడు చున్నది-అని (సూ.ని).

చర్మకారుఁడు — పాదూకృ చ్చర్మకార స్స్యాత్' అని (అమ) ['మంగి యనఁగను మంగలవాఁ డెసంగు' (వావి అపపా.)]

సీ కమ్మరి. కనుమరి, కరుమలి, యనఁగాను
మీఱు చుండును నయస్కారసంజ్ఞ,
కమ్మర, మన నయస్కారకర్మం బొప్పుఁ,
గంచరవాఁ, డొప్పుఁ గంచరి, యన;
స్వర్ణకారాభిధ పరఁగుఁ బారసి, యగ
సాలి, సొన్నారి, కంసాలి, యనఁగ,
గ్రావకారుఁడు కాసె, కాసెవాఁ, డనఁ దగు,
వడ్లంగి, యన వడ్రవాఁ, డనంగ

గీ వర్ధకి విరాజిలుచు నుండు, వడ్ర, మనఁగఁ
బరఁగు వర్ధకికర్మంబు; గురుప, యనఁగఁ
దగును మేఁకలవానిపే, ర్తమ్మలి, యనఁ
దంబళి, యనంగ నంబి, నాఁ దనరు చుండు
దేవలునిపేరు, త్రిశిరఃపురీవిభాసి 284

కమ్మరి కనుమరి కరుమలి—ఇవి అయస్కారునకు (లోహకారునకు, ఇనుప పనివానికి) పేర్లు.

కమ్మరము—ఇది అయస్కారకర్మమునకు (ఇనుముపనికి) పేరు.

కంచరి—ఇది కంచరవానికి (కాంస్యకారునకు, కంచుపని చేయువానికి) పేరు.

పారసి, అగసాలి, సొన్నారి కంసాలి—ఇవి స్వర్ణకారునకు (కలాదునకు, నాడింధమునకు, బంగారుపని చేయువానికి కమసాలికి) పేర్లు.

కాసె, కాసెవాఁడు—ఇవి గ్రావకారునకు (జాతిపనివానికి) పేర్లు

వడ్లంగి వడ్రవాఁడు—ఇవి వర్ధకికి (రథకారునకు తక్షునకు వడ్రంగికి కొయ్యపనివానికి) పేర్లు

వడ్రము—ఇది వర్ధకికర్మమునకు (వడ్రంగమునకు కొయ్య (లుచెక్కు) పనికి) పేరు

కురుప—ఇది మేఁకలవానికి (జాబాలునకు, అజాజీవికి మేఁకలు కాచి బ్రతుకు వానికి) పేరు.

తమ్మలి, తంబళి, నంబి—ఇవి దేవలునికి (దేవలకునికి శివార్చకునికి, గుడి లోని శివునిఁ బూజించి బ్రతుకు-ఒకజాతిపూజారికి) పేర్లు

అయస్కారుఁడు — వ్యోకారో ఒయస్కారో ఒయస్కారో లోహకారస్సాన్వత్ అని (రత్నకోషము)(మా సుధ) వ్యోకారో లోహకారికః అని (అమ) ఇటగని లో నినుము దెచ్చి శుద్ధలోహము చేయుకోసలాదిదేశమందుండుప్రసిద్ధమైనలోహకార జాతివిశేషము-అని కొందఱు' అని (గురు)

పారసి —దీనిని ఈయర్థమున (శ ర) గ్రహింప లేదు ప్రయోగాంతరము లేదు-అని (సూ ని).

కంసాలి —కమసాలి (రూపాం) స్థిరవర్ణమునకు ముందు బిందువు కానఁబడు చున్నది- (భోజ 5 322) (వివరణమునకై చూ నాతో లిపలుకు (కంసాలి)

కాసె — జాతిపని' అని (శ ర)

మేఁకలవాఁడు — జాబాలస్స్యా దజాజీవీ అని (అమ)

దేవలుఁడు — దేవాజీవీ తు దేవలః' అని (అమ) దేవపూజోపజీవినః' అని (సుధ) గుడిలో దేవుణ్ణి పూజ చేసేవాఁడు' అని (బ్రౌ) (చూ దేవలుఁడు)

సీ పాచకుం డొప్పు సువారంపువాఁ డనఁ
గను బూఁటకూళ్లవాఁ డనఁగ వంట

పూఁటవాఁ,డనఁగను; బొలుపొందు శ్రీహరి
దాసుఁడు దాహరి, దాసరి, యన;
శివదాసనామంబు చెలఁగు జంగ, మనంగఁ,
దిలఘాతకుం డొప్పుఁ దెలికవాఁడు
గానుఁగవాఁ, డన, వేణుకారకుఁ డొప్పు
మేదరవాఁ డన మేదరి, యన,

గీ. నెసఁగుఁ బింజారి, నాగఁ దూదేకువాఁడు,
పరఁగుఁ గుడ్యాదికారి యుప్పరి, యనంగ,
జలగడుగువాఁడు వెలయును జాలరి, యన,
భూషితభుజంగ శ్రీమాతృభూతలింగ 285

సువారంపువాఁడు, పూఁటకూళ్లవాఁడు, వంటపూఁటవాఁడు—ఇవి పాచకునికి (వంటవానికి, వంట చేయువానికి, వల్లవునికి) పేర్లు

దాహారి, దాసరి—ఇవి శ్రీహరిదాసునకు (వైష్ణవునకు, విష్ణుభక్తునకు, విష్ణువే పరమదైవ మని ఆతనినే సేవించువానికి) పేర్లు.

జంగము—ఇది శివదాసునికి (శివభక్తునకు, శివుఁడే పరమదైవ మని, ఆతనినే సేవించువానికి, ఆరాధ్యులు ము న్నగువారికి) పేరు.

తెలికలవాఁడు, గానుఁగవాఁడు—ఇవి తిలఘాతకునకు (గాండ్లవానికి; (నువ్వులను) గానుఁగ ఆడువానికి) పేర్లు.

మేదరవాఁడు, మేదరి—ఇవి వేణుకారకునకు (వెదురుతడికలు లోనగునవి అల్లువానికి) పేర్లు

పింజారి—ఇది దూదేకువానికి (తురకలలో ఒకజాతివానికి) పేరు.

ఉప్పరి—ఇది కుడ్యాదికారికి (చెఱువులు మొదలగునవి త్రవ్వియు గోడలు ము న్నగునవి పెట్టియు జీవించువానికి) పేరు.

జాలరి—ఇది జలగడుగువానికి (బంగారురేణువులు మున్నగునవి గ్రహించుటకై ఇసుక లో నగుపదార్థములను నీటితో కడిగి శోధించు నొకజాతివానికి) పేరు

సువారంపువాఁడు — (వంటవాఁడు) అనిమాత్రము (బ్రౌ) తక్కినరెండుపదములను ఇది గ్రహింప లేదు

పూఁటకూళ్లవాఁడు —పూఁటకూళ్లు పెట్టువాఁడు- వంటపూఁటవాఁడు (వంటపూఁటవాఁడు అన్నవిక్రేత) అని ఈ (ఆం భా నే) రెండుచోట్ల ఉదాహరించు చున్నది- (సూ ని) పూఁటకూళ్లమ్మ మాత్రము గ్రహించి వెల తీసికొని వేళవేళకు అన్నము వండి పెట్టెడి వంటలక్క-అనినది (శ ర)

దాహరి — దాసరికి (రూపాం) (చూ ఆము 6 3 శ ర బ్రౌ పా)

దాసరి — విష్ణుసేవకుఁడైనశూద్రుఁడు- అని (శ ర) వాద మే మాయె నన్న భావ వరునిపక్ష పాత మాదాసరికిఁ గల్గి బ్రతికె ననెడు వాడు (ఆము 4 7) (విష్ణుచిత్తునిఁగూర్చినమాట ఇది (శ ర) చెప్పినది అర్థాంతరము (చూ సూ ని)

జంగము — కులమతవివక్ష లేనిలింగధారు లగువీరశైవులు బ్రాహ్మణదూషకులు -అని (బ్రౌ) జంగమువాఁడు (జంగమువారిలో పూజ్యుఁడైనవానిని జంగమయ్య, జంగమ దేవం' అని చెప్పుదురు-అని (శ ర) జంగమువాఁడు అనుదానిని ఇది గ్రహింప లేదు పే రెన్న బడినశ్రీబెలిదేవవేమ నారాధ్యు లాది గా నలరుజంగములు' అని (పండితా దీక్ష 5గిపం) జంగమజాతి- అర్థాంతరము (చూ సూ. ని) లింగబలిజెలు వీరని కొంద అందురు (వేణు) అ ట్లనుట లేదు- ఆలు కోమటిజాతి దక్క జంగమురాలు, బావగారిది లింగబలిజెకులమ. (99) జంగమ' శబ్దమునకు శివుఁ డర్థము వీరియందిది ఔపచారికము.

జాలరి జలగడుగువా డు — చేఁపలఁ బట్టువా డు ధీవరు డు (దీనికి జలగడగువారు' అర్థ మని కొంద అందురు) అని (శ ర) జాలరి-జలగడుగువాఁడు చేఁపలఁ బట్టువాఁడు-అని (బ్రౌ) పల్లెవాఁడు- అనువర్థము (ఆం భా) జాలరి కి వేఱు గా ఇచ్చినది- జాలరి యనంగఁ గైవర్తసంజ్ఞ పరఁగు' (1 58) కావున జలగడుగువారు' మఱియొకరే 'వాకి బోయవాఁడు జలగరి గొడగరి ఆని (విజ్ఞా ఆచా 58)

(హ సూ. ని) ఇప్పు డీపనిని సాధారణముగా ఏనాదివారు' చేయుచున్నారు. వీరితెగ ఆటవికులలోని-ఒకతెగకు చెందినది కిరాతభేదమిది (చూ. ఆం భా 2. 289).

దూదేకువాఁడు —'దూదేకులహుసేను దొమ్మరిగోపాలు (వేణు 71.)

సీ. పదవిజ్ఞుఁ డెసఁగుఁ జొప్పరి, జాడకాఁ, డన,
సంకులవాఁ డన శాంఖికుఁ డగు,
సానలవాఁడు, పూసలవాఁ, డనంగను
మణికారసంజ్ఞయై మనుచు నుండు,
మటుమాయలాఁ డన మాయదారి యనంగ
మాయలాఁ డనఁగను మతకరి యనఁ
దకటం కనంగను రవళికాఁ డనఁగఁ గై
లాటకాఁ, డనఁగను దక్కరి, యనఁ

గీ. దం కనంగను మాయావి పొంక మగును;
గటికవాఁ డన మాంసికాఖ్యలు నెలంగు,
వాగురికసంజ్ఞయౌ వలవాఁ, డనంగ,
భూరిభవభంగ శ్రీమాతృభూతలింగ 286

చొప్పరి, జాడకాఁడు—ఇవి పదవిజ్ఞునకు (పదజ్ఞునకు, అడుగులగుఱుతులు బాగుగా ఎఱిఁగినవానికి) పేర్లు

సంకులవాఁడు—ఇది శాంఖికునకు(శంఖములు బాగుచేయువానికి,శంఖపుపనివానికి) పేరు

సానలవాఁడు పూసలవాఁడు—ఇవి మణికారునకు (రత్నములను సానపట్టువానికి) పేర్లు

మటుమాయలాఁడు మాయదారి మాయలాఁడు, మతకరి, టకటంకు, రవళికాఁడు కైలాటకాఁడు టక్కరి టంకు —ఇవి మాయావికి (మాయికి, వంచకునికి; మాయలమారికి మోసగానికి)పేర్లు.

కటికవాఁడు—ఇది మాంసికునకు(కటికకు మాంసవిక్రేతకు మాంస మమ్ము వానికి) పేరు

వలవాఁడు—ఇది వాగురికునకు (ఉచ్చ లొగ్గువానికి ఉరులు పన్ని మృగముల బంధించువానికి జాలికునకు) పేరు

చొప్పరి జాడకాఁడు — ఈశబ్దములకు మార్గజ్ఞుఁ డనెడిది (అర్థాం) ఇదివఱకిచ్చినది దీనిని (ఆం భా) (చూ 2 89) (పద + విజ్ఞుఁడు) అడుగులజాడ లెఱిఁగినవాఁడు-అను నర్థమిట ఉచిత మనిపించినది (హా ని) గుఱుతు లెఱిఁగినవాఁడు అని దీనికి అర్థ మిచ్చినది పద' శబ్దమునకు నానార్థము లిట్లున్నవి పదం శబ్దే చ వాక్యే చ వ్యవసాయాపదేశయోః పాద పచ్చిహ్నయోః స్థాన త్రాణయో రఙ్క వస్తునోః (విశ్వ)

[మటుమాయలాఁడు — మిక్కిలిమాయ కలవాఁడు- అని (శ ర) మటుమాయలాఁడు హరి మీర లాతనియూఁడురూపంబు చవ్వ సేయక కన్న జగములలోన నవ్వగు' (విష్ణు ఉ 4) (చూ. శ ర) ఇట్లే మటుమాయలాడి మొ (హా ని) మటుమాయకాఁడు' ఉని క్రొత్తవ్రాఁతప్రతులపా అను చున్నది (పాఠాం)]

కైలాటకాఁడు —ధూర్తుల కింకను జాలపేర్లను (సాంబ) వచించినది (చూ మాన 9) ఇందు కొన్నిటిని సాధారణము గా కుజనులపే ర్లనినది (ఆం సం) (చూ మాన ) ఇది యొకఛాయార్థము (చూ సూ ని)

వాగురికుఁడు — ద్వే వాగురికజాలికౌ అని జీవాన్తక శ్శాకునికః' అనుచు పక్షులవేఁటకానిని వేఱు గా పేర్కొనినది (అమ) వాగురికి జాలిక' శబ్దముల వ్యాఖ్యానించుచు- ఇట (సుధ) స్పష్టము గా జాలేన మృగాన్ బధ్నతః' (ద్వే) ఉని వ్యాఖ్యానించినది ఇది గాక (అమ) వాగురా శబ్దమును వాగురా మృగబన్ధనీ అని నిర్వచించినది ఇట (సుధ) ద్వే జాలవిశేషస్య అనినది మృగయు ర్లుబ్ధకో వ్యాధో ద్వే వాగురికజాలికౌ అని (వైజ భూమి శూద్రా) అనినను- వ్యాధో మృగవధాజీవో మృగయు ర్లుబ్ధకో ఒపి సః' అని వాగురికజాలికు'లకంటె వేఱు గానే వ్యాధుని నిర్వచించినది (అమ) జాలవిశేషము-ఒక దినుసువల అదియే ఉరి ఉచ్చు' అది మృగబంధనమునకు మాత్రము ఉపయోగించును- యోగబలము లేనియొకభంగి యోగి బల్ త్రోపు లేనిమీను నేపు లేని

మృగము వలయు నురియుఁ దెగి పోవ నుఱుకంగ లేనియట్ల భవములోన నడఁగు' (భార. శాం 5 578.) (చూ శ.ర ) అమరములోని వాగురికసహచరిత మగు 'జాలిక' శబ్దము 'మైనిక' పరము గాదు వైజ. లోనిది అట్టిది గావచ్చును 'వలవాఁడు' లోని 'వల' విశేషవాచకము గా ప్రయుక్తము. మృగముల బంధించు 'ఒకదినుసువల' ను మాత్రము వచించునది ఇదియే (ఉరి. వాగుర ఉచ్చు.) 'ఉరి-పక్షిబంధమునకుఁ గూడ ఉపయోగపడు' నని (సూ ని.) శృం నై ప్రయోగమును జూపు చున్నది. ఐనను, అది యిది గాదు దానిస్వరూపము వేఱు, దీని స్వరూపము వేఱు. కావున, 'పదార్థాంతర' మన వలసిన దది (ఆ 'ఉరి' వేఱు ఈ 'ఉరి' వేఱు ). వాగుర' మృగములను పక్షులను పట్టెడి ఉరి వల-అని వాగురికుఁడు-ఉరులు వలలు పన్ని మృగములను పక్షులను పట్టెడివేఁటకాఁడు-అను చున్నవి (శ.ర బ్రౌ.). వలవాఁడు-అనుపదమును ఇవి గ్రహింప లేదు (సూ ని ) గ్రహించి దీనికి (విఙ ) వాగురికుఁడు, ఉచ్చు లొగ్గువాఁడు-అని మాత్ర మనినది ఆం భా. 'ఉచ్చ నా నురి యన నొప్పుచుండుఁ బక్షిబంధన సంజ్ఞ' (వాగురాభేదంబు చిక్క- మం చనఁగను జెలఁగు చుండు' అని యను చున్నది (చూ 2 293.) దీనినిఁ బట్టి- (శ ర బ్రౌ.) అర్థము ఆం భా కర్త కభిప్రేత మానేమో యనిపించును (అమ ) 'వాగురా మృగబన్ధనీ' అనుటకు పూర్వము వీతంసస్తూపకరణం బన్ధనే మృగపక్షిణామ్' అని ఉభయసాధారణ మగుసాధనమును పేర్కొనినది.

సీ. నటుఁ దొప్పు న, ట్టన నట్టువుం, డనఁగను;
దారి, నాఁ దగు సూత్రధారకుండు;
తాళధారి చెలంగుఁ దాళగిరి, యనంగఁ,
జనుఁ ద్రిమ్మరీఁ, డనఁ జారణుండు,
గాణ, యం చనఁగను గాయకాభిధ చెల్లు,
వీణెకాఁ, డనఁ దగు వైణికుండు,
బయకాఁ, డనంగ నుభయకారి విలసిల్లు,
నుతికాఁ, డనం జను శ్రుతివిధాయి;

గీ వెలయు దొమ్మరి యన లఘువిద్యవాఁడు
ఐంద్రజాలికసంజ్ఞ మై యలరు చుండు
గారడీఁ డన, క్షుద్రసంఘప్రశంసి
పరఁగు బవినీఁ డనంగఁ జెవ్వందిలింగ 287

నట్టు నట్టువుఁడు—ఇవి నటునకు (నట్టువకానికి నట్టువవానికి నట్టువకు, నాట్యము చేయువానికి నటకునకు) పేర్లు

దారి—ఇది సూత్రధారకునకు (సూత్రధారునకు నాటకప్రయోగమున కగుసంవిధానము నిర్వహించు ప్రధాననటునకు) పేరు

తాళగిరి—ఇది తాళధారికి (తాళము వాయించువానికి) పేరు

త్రిమ్మరీఁడు—ఇది చారణునకు (నానాదేశసంచారి యగునటునకు) పేరు

గాణ—ఇది గాయకునకు(పాట పాడువానికి, పాటకానికి గాథకునకు) పేరు

వీణెకాఁడు—ఇది వైణికునకు (వీణె వాయించువానికి వీణావాదకునకు) పేరు

బయకాఁడు—ఇది ఉభయకారికి (జంత్రగాత్రములయందు రెండిటియందును నేర్పు చూపువానికి)పేరు

సుతికాఁడు—ఇది శ్రుతివిధాయికి (సుతి వేయువానికి) పేరు [కంఠస్వరమునకు సహాయపడుతంత్రీధ్వని మొ శ్రుతి (సుతి) ]

దొమ్మరి—ఇది లఘువిద్యవానికి (దొంబరికి, గడ కట్టి ఆడెడి ఒకజాతివానికి) పేరు

గారడీఁడు—ఇది ఐంద్రజాలికునకు(ఇంద్రజాలికునకు ఇంద్రజాలము చేయువానికి,కనుకట్టువానికి ([కనుకట్టువిద్య—ఒకపదార్థమును మఱియొక పదార్థముఁగాఁ జూపువిద్య ] అది (గారడి) గలవానికి) పేరు

బవనీఁడు—ఇది శూద్రసంఘప్రశంసికి (వేషగానికి, జాతరలయందు వేషము వేసి గ్రామదేవతలకడ ఆడుచు పాడుచు పామరజనులమెప్పు లందువానికి) పేరు.

నటుఁడు —నాట్యము ఒనర్చువాఁడు-'అవస్థా యా తు లోకస్య సుఖదుఃఖసముద్భవా తస్యాః స్వముద్భవః ప్రాజ్ఞై ర్నాట్య మి త్యభిధీయతే'(స.త సి.ప సం)

సూత్రధారకుండు —(సూత్రధారి.) నాటో్యపకరణాదీని 'సూత్ర మి త్యభిధీయతే సూత్రం ధారయ తీత్యర్థే సుత్రధారీ నిగద్యతే' (చూ.మృచ్ఛ. వ్యా.) 'సూత్రధార స్తు సూచకః' అని (వైజ. భూమి శూద్రా).

చారణుఁడు —'చారణా స్తు కుశీలవాః' అని(అమ). ఇట 'వన్దివిశేషస్య' అని (సుధ.) 'దిక్కులయందు సంచరించు బట్టువవారికిఁగాని, నట్టువవారికిఁగాని పే' రని (గుసు).

ఉభయకారి —భయకారి-అని (బ్రౌ.). పదవిభాగమున పొరవడిన దన వచ్చును గాయకుఁడు అని అర్థ మిచ్చినది (శ ర.) ఇది అర్థాంతర మన వలసినది-(చూ.సూ ని.)

బవనీఁడు —జాతరయందు సుద్దులు చెప్పుచు బవిని యాడువాఁడు-అని(శ.ర.). ఇతరులను స్తోత్రము చేసి జీవించుజాతులలో ఒకతెగవాఁడు-అని (సూ ని). బవనీ-బవనీఁడు-వేషగాడుజాతరలలో వేషము వేసేమాలదాసరి ఒకవిధమగునటుడు-అని (బ్రౌ) వీని స్వరూపము కొంత వివరించినది-(శుక.) 'దుసికిల జాఱుకోరసిగ దుప్పటినీటు లలాటపట్టికం బొసఁగువిభూతిపైఁ బసుపుఁబొట్టును దొట్టినకల్లుచొక్కు వెక్కసము గనెట్టవాటి నవికారపుఁజూపులు గాఁ గనంబడన్ వెసఁ జనుదెంచె నొక్కబవినీఁడు తదీయసమీపభూమికిన్' (శుక 2.413.) 'పామరజనమును రంజింపఁ జేయుచు ఉపన్యసించువాఁడు' అని (బ్రౌ) (చూ .అను.)

[' జను దిమ్మరీఁడు- (వావి అపపా.) ]

సీ. వైతనికుండు సంబళకాఁ, డనఁగ జీత
గాఁ, డనంగను గూలివాఁ, డనఁ దగు,
భారవాహకుపేరు పరఁగు చుండును బెస్త
మోపరి బోయఁడు, బోయి, నాఁగ,

బానిసీఁ డన బంటు వరవుఁడు గుండఁడు
నాఁగ దాసాఖ్యలు గాఁగఁ దనరు,
నుడిగము, చాకిరి యూడిగం బనఁగను
దాసదాస్యములు గాఁ దనరు చుండు

గీ. వరవుడం బనఁ బను పన బానిస మన
దాస్యనామంబు లై యుండు దాసి యొప్పు
బానిస యనంగఁ దొ త్తనఁ, బాచిక యగు
బోనకత్తె యనఁగ మాతృభూతలింగ

288

సంబళకాఁడు జీతగాఁడు కూలివాఁడు—ఇవి వైతనికునకు (కర్మకరునకు భృతకునకు కూలికానికి, పని చేసి జీతము తీసికొని బ్రతుకువానికి) పేర్లు

బెస్త మోపరి బోయఁడు బోయి—ఇవి భారవాహకునకు (భారికునకు బోయీకి, బరువు మోయువానికి) పేర్లు

బానిసీఁడు బంటు వరవుఁడు గుండఁడు—ఇవి దాసునకు (సేవకునకు, పరిచారకునకు) పేర్లు

ఉడిగము, చాకిరి, ఊడిగము—ఇవి దాసునకు దాస్యమునకు (సేవకునికి సేవకు (పరిచర్యకు) -రెండి టికి) పేర్లు

వరవుడము పనుపు బానిసము—ఇవి దాస్యమునకు(సేవకు మాత్రము) పేర్లు

బానిస,తొత్తు—ఇవి దాసికి (సేవకురాలికి, పరిచారికకు) పేర్లు

బోనకత్తె—ఇది పాచికకు (వంటకత్తెకు పాచకురాలికి, వంటలక్కకు వంట చేయుస్త్రీకి) పేరు

వైతనికుఁడు —వేతనేన జీవతి- వేతనాదిభ్యో జీవతి' (4 4 12 ) ఠక్ భృతకో భృతభుక్కర్మకారో వైతనికో ఽపి సః (అమ )

జీతగాఁడు —ఆందగాఁడు-వంటిది. జీతకాఁడు-(వావి.పా.).

భారవాహకుఁడు —'భారవాహ స్తు భారికః' (అమ) 'భారవాహకస్య' అని (సుధ.).

బెస్త —'చేఁపలను బట్టుటచేతను, పల్లకి లో నగువానిని మోసికొనిపోవుటచేతను జీవించెడు-ఒకజాతివాఁడు, బోయీ' అని (శ.ర.)

[దాసదాస్యములు —దాసదాస్యము గాఁగఁ..' (వావి.అపపా)(ప్రయోగములకై చూ.సూ.ని)]

[బానిసీఁడు —'బానసీఁ డన'(వావి అపపా.).]

[చాకిరి —'చారికి' (వావి అపముద్రి.). తాలవ్య మిది-అని (శ.ర.)]

[వరవుడంబు —'వరవడంబు'-(వావి అపముద్రి)]

[' బాచిక బారిక' (వావి. అపముద్రి)]

సీ. పరఁగుఁ జండాలుండు సురియాణు, వనఁగను
మాలఁ, డనంగను మాల, యనఁగఁ;
దోటి, యనంగను దోఁచ, నా నాసాది,
గోసంగి మాదిగ, గూబరి, యన
మాతంగుఁ డగు, వానిచేత నుండెడికత్తి
కొంగవా, లనఁగఁ జెలంగు చుండు;
మాతంగసదృశుఁ డౌమనుజుండు తగు బోయ
నీఁ, డనంగను గొమ్ముకాఁ, డనంగ;

గీ. బోయ, నాఁగఁ గిరాతుఁ డౌఁ, గోయ, చెంచు,
పరికి, యేనాది, యేఁకరి పట్ర, యెఱుకు,
వేఁకరి, యెసకరి, యనఁ దద్భేదములు గఁ
బొల్చును వినంగ, శ్రీమాతృభూతలింగ! 289

47)

సురియాళువు మాలఁడు, మాల—ఇవి చండాలునకు (మాలవానికి, శూద్రునివలన బ్రాహ్మణస్త్రీకి పుట్టినవానికి) పేర్లు

తోటి తోఁచ ఆసాది, గోసఁగి మాదిగ, గూబరి—ఇవి మాతంగునకు (శ్వపచునకు, మతంగునిసంతతివానికి అంబష్ఠునివలన బ్రాహ్మణస్త్రీకి పుట్టినవానికి, మాదిగవానికి, తోలుచొక్కాలు కుట్టి జీవించెడువానికి) పేర్లు

కొంగవాలు—ఇది వానిచేత ఉండుకత్తికి (మాదిగవారు ధరించు ఒకదినుసు కత్తికి మాదిగకత్తికి) పేరు

బోయనీఁడు, కొమ్ముకాఁడు—ఇవి మాతంగసదృశుఁ డౌమనుజునకు (కొమ్ము ఊఁదుట వృత్తి గా కలమాదిగవానివంటి-ఒకజాతిమనుష్యునకు) పేర్లు

బోయ—ఇది కిరాతునికి (ఒకజాతిచండాలునకు, చండాలవిశేషమునకు, ఆటవికునకు, ఆకులు కట్టుకొని అడవియందు తిరుగుబోయవానికి, శబరునకు) పేరు.

కోయ చెంచు పరికి ఏనాది ఏఁకరి పట్ర ఎఱుకు వేఁకరి, ఎసకరి—ఇవి కిరాతభేదములకు (ప్రత్యేకము ఒక్కొకిజాతికి చెందినకిరాతులకు ఒకజాతి బోయలకు) పేర్లు.

చండాలుఁడు — చణ్డాల ప్లవ మాతఙ్గ దివాకీర్తి జనంగమాః' అని చణ్డాల మాతఙ్గ' శబ్దములను సమానార్థకములఁ గానే (అమ) పేర్కొనినది. (అం భా) వేఱుపఱచినది వీనిని అంత్యావసాయుల' ఉదాహరించుచు-అంగిరస్మృతి ఇట్లను చున్నది- చణ్డాల శ్శ్వపచః క్షత్తా సూతో వైదేహక స్తథా మాగధాయోగవౌ చైవ స ప్తైతే ఽన్త్యావసాయినః' అని చణ్డాల శ్వపచుల వేఱు గా పేర్కొను చున్న దిది ఈరెండుశబ్దములకు భేదమును (వైజ.) ఇట్లు చెప్పినది 'చణ్డాలం బ్రాహ్మణీ శూద్రాత్ (విప్రా) శ్వపచం సైవ చణ్డాలా చ్చర్మకఋచ్ఛికజీవనమ్' (చూ (భూమి మనుష్యా)

కొంగవాలు —మాదిగకత్తి, భిందివాలము-అని (శ ర) మాలమాదిగలు ధరించెడికత్తి అని (సూ ని) సురియాళుచేతి కత్తికి నరు లందఱు పేరు పెట్టినారు ధరిత్రిన్ మఱి కొంగవా లనంగను దిరుమలపై నుండు దేవదేవ ముకుందా' (దేశ్యనామార్థకోశము (చూ సూ ని)

బోయనీఁడు —ఈ పదమును (శ ర ట్రౌ) గ్రహింప లేదు. ఇట మాతంగసదృశుఁ డౌమనుజుండు తగు బోయఁ, డనఁగను గొమ్ముకాఁ డనఁగ' అని (శ.ర.పా.) (ఇది యే (ట్రౌ.పా) (చూ.సూ ని.)

కొమ్ముకాఁడు —'కొ మ్ముఁదెదుమాదిగవాఁడు'-అని (శ.ర.) ఈ-ఆం భా.ను ఉదాహరించియే ఈమాట నను చున్నది ఈ (శ ర)

తద్భేదములు —భేదాః కిరాతశబరపుళిన్దా మ్లేచ్ఛజాతయః' అని (అమ.). మ్లేచ్ఛజాతి నిఁగూర్చి సూతసంహిత ఇట్లను చున్నది-'బ్రాహ్మణ్యాం వైశ్యతో జాతః క్షత్తా భవతి నామతః అస్యా మనేన చౌర్యేణ మ్లేచ్ఛో విప్రా త్ప్రజాయతే' (చూ సుధ.). మఱి యొకవచనముగూడ ఇట్లున్నది- గోమాంసభక్షకో య స్తు లోకబాహ్యం చ భాషతే సర్వాచారవిహీనో ఽసౌ మ్లేచ్ఛ ఇ త్యభిధీయతే'-ఈరెండవవచనము, జాతివాచకశబ్ద విషయక మనిపించును

తోటి, తోఁచ —వీనికి (సూ ని) పూర్వముతో అన్వయము చెప్పి 'మాల' అర్థ మను చున్నది. (శ ర) తోఁచ-మాదిగవాఁడు, మాతంగుఁడు. తోటి-మాల, చండాలుఁడు-అను చున్నది. (ట్రౌ.) 'తోచ మాదిగవాఁడు తోటి-చండాలుడు (ఆం భా.) మాదిగ వాఁడు'అను చున్నది-(చూ.అను) (శ ర) మాల' (తోటి) అనుటకు ప్రయోగ మిచ్చు చున్నది. (ట్రౌ) ఆది అర్థాంతర మను చున్నది (సూ ని) 'తోఁచ, తోటి' దగ్గఱ పూర్వాన్వయము చేసి 'మాల' అని అర్థ మిచ్చియు 'ఆసాది' అనుదానికడ-'తోటి యనంగను దోఁచ నా సాది, గోసంగి మాదిగ గూబరి యన మాతంగుఁ డగు (ఆం భా 2 287.) అని యిచ్చి, ఈశబ్దములకు 'మాతంగుఁడే (మాదిగవాఁడే) అర్థ మను చున్నది పూర్వాపరవిరోధము లిట్టి వింకను ఇం దున్నవి. (మాదిగవాఁడు) 'చెప్పులు కుట్టువాఁడు'-అని (శ ర) మొ

[' యేకరి ' —' యాకరి..'(వావి.అపపా.) ఇట (శ ర పా) ఇట్లున్నది-'కోయ చెంచు పరికి యేనాది యేఁకరి పట్ర యెఱుకు వేఁకరి యనంగఁ జెల్లి తద్భేదములు గఁ బొల్పును'అని కనుకనే-(శ.ర) 'ఎసకరి'గ్రహింప లేదు (సూ ని.) ఎసకరి'తో- (ఆం. భా.పా.) ఇచ్చి, (శ ర పా) అను చున్నది (చూ సూ ని 'ఏఁకరి'.). ఇది యెట్లు సంగతమో

సీ. తురక యనంగను దోఁచుఁ దురుష్కుఁడు,
మెంచ, యనంగను మ్లేచ్ఛుఁ డొప్పు
వేఁటకాఁ డనఁగను విలసిల్లు మృగయుఁడు
శునకము వేఁపి కుక్కనఁగఁ దనరుఁ,
దద్భేదనామము తగు జోణఁగి యనంగ,
వనశునకంబు జేఁ చనఁగ నొప్పు
జాగిలం బనఁగను జను విశ్వకద్రువ,
యుడుపవేఁపవు బురకడ, మనంగఁ

గీ. దగును సడికియ యనఁగను శ్వగళరజ్జు
శ్వగళకాష్ఠంబు వెలయుఁ గాపంత మనఁగ
వేఁట యనఁగను మృగయాఖ్య వెలయు చుండు
భూషితభుజంగ శ్రీమాతృభూతలింగ 290

తురక — ఇది తురుష్కునకు(యవనునకు తురకవానికి) పేరు

మెంచ — ఇది మ్లేచ్ఛునకు (కామధేనువురోమకూపములనుండి పుట్టిన-ఒకజాతి వానికి)పేరు.

వేఁటకాఁడు — ఇది మృగయునకు (లుబ్ధకునకు, వ్యాధునకు మృగవధాజీవికి) పేరు

వేఁపి కుక్క — ఇవి శునకమునకు(కుర్కురమునకు, భషకమునకు గ్రామసింహమునకు) పేర్లు

జోణఁగి — ఇది శునకభేదములకు (వేఁటకుక్కలలోని-ఒకదినుసుకుక్కకు సన్నము గా ఉండి వేగము గా పరుగెత్తువేఁటకుక్కకు, జోడఁగికి)పేరు

జేఁచు — ఇది వనశునకమునకు (అరణ్యశ్వానమునకు, అడవికుక్కకు) పేరు.

జాగిలము — ఇది విశ్వకద్రువకు (వేఁటకుక్కకు) పేరు

బురకడము — ఇది ఉడుపవేఁపికి (ఉడుములను వేఁటాడెడికుక్కకు) పేరు

సడికియ—ఇది శ్వగళరజ్జువునకు (కుక్కమెడకు కట్టెడిత్రాటికి) పేరు

కాపంతము—ఇది శ్వగళకాష్ఠమునకు (కుక్కమెడకు కట్టెడికఱ్ఱకు) పేరు.

వేఁట—ఇది మృగయకు (ఆఖేటమునకు; అడవియందు వలలు లో నగువానిని ఒడ్డి మృగములు లో నగువానిని వేఁటాడుటకు (వధించుటకు) పేరు

మ్లేచ్ఛుఁడు —యవనుఁడు-మ్లేచ్ఛుఁడు-హూణుఁడు-అను చున్నది (బ్రౌ) రామాయణము కామధేనువునుండి క్రిందిజాతులు ఏర్పడినట్లు వచించు చున్నది అందు యవనులు మ్లేచ్ఛులు వేఱు గా కానవచ్చు చున్నారు తస్యా హుమ్భారవా జ్జాతాః కామ్బోజా రవి సంనిభాః ఊధస స్త్వథ సంజాతాః పహ్లవా శ్శస్త్రపాణయః యోనిదేశా చ్చ యవనాః శకృద్దేశా చ్ఛకా స్తథా రోమకూపేషు చ మ్లేచ్ఛా హారీతా స్సకిరాతకాః' (రామా 55 2,3- శ్లో)

వేఁపి —కుక్క వేఁటకుక్క-అని (సూ ని) రెం తగసులు నిచ్చినది ప్రయోగములతో దీనికి

ఊఁచ —శునకవిశేషము-(ఊఁచకుక్క)-అని (శ ర సూ ని మొ)

జాగిలము —ఇది సాధారణము గా శునకవాచక మని (సాంబ)- మొఱు గుడు జాగిలమ్ము గుక్క వేఁపి నా శునకంబు వెలయును' (తిర్య 76)

విశ్వకద్రువ —శ్వా విశ్వకద్రు ర్మృగయాదక్షః' అని (వైజ భూమి శూద్రా 39) ఇట్లె శ్వా విశ్వకద్రు ర్మృగయాకుశలః' అని(అమ.) కద్రువ నాగమాత' అని చిన్నయసూరి నిపతించి విశ్వకద్రువు'-అని ఉండుటయే ఇట న్యాయ్య మను చున్నాఁడు (అం భా) సవరించుటకు వీలుకానిది కావున, ఇట ఏ బహుళగ్రహణము'ననో దీనిని (బాలవ్యా)సాధించుకొనవలయును జాగిలం బనఁగను విశ్వకద్రువు' అని సూ ని (అం భా పా) ఇచ్చినది పైపాద మెట్టిదో ఉదాహరింప లేదు.

బురకడము —బురకఁడు-వేఁటకుక్క-అని (శ ర) శ్వగళరజ్జువు'-అని (బ్రౌ)

సడికియ —సడికియ్య-(అని) కుక్కలమెడపట్టెతాళ్లు-అని (బ్రౌ.) (చూ అను)

కాపంతము — కుక్కను గట్టెడికొయ్య -అని (శ ర) ఈ అం భా.'ను ఉదాహరించినది

వేఁట — ఇది ద్వివిధము మృగములవేఁట పక్షులవేఁట మృగములవేట త్రివిధము ఏఁదువేఁట గంటవేఁట, తెరవేఁట (పక్షులవేఁట)పాదివేట, విడివేట-అని ద్వివిధము-' అని (శర) ముంగివేఁ ఉేదువేఁట సివంగివేట యిట్టివేఁటయు గంటవేఁ పెద్ద వేఁట మొదలు గాఁ గలవేఁటలయద నెఱింగి అని (కళ 3 47) (చూ సూ ని గంటవేఁట)

సీ దొంగ, తెక్కలికాఁడు దోఁపరి ముచ్చ జా
    జరకాఁ, డనంగఁ దస్కరుఁడు వెలయు
మార్గచోరకసంజ్ఞ మనుఁ బొలపరి యనఁ
    దెరువాటుకాఁ డనఁ దేజరిల్ల
ముళ్లు విప్పెడువాఁడు ముడియవిడు పనంగ
    గండిదొంగ, గనఁ గన్నగాఁ డనంగఁ
దగు సురంగాకారితస్కరనామంబు
    బందెకాఁ, డనఁ దగు బందకారి

గీ వేసములు వేసి నమ్మించి వెనుక నాఁచు
  కొనిన దొరకోలుసన్యాసి యనఁగ వెలయుఁ
  దడికట్రదోపరి యనఁగను దనర నౌఁ గ
  వాటనోదకుఁ డనుచుఁ జెవ్వండిలింగ 29

దొంగ తెక్కలికాడు దోఁపరి ముచ్చ జాజరకాఁడు—ఇవి తస్కరునకు (చోరునకు చౌరునకు దోఁపుడుకానికి దొంగవారికి అందఱకు)పేర్లు

పొలపరి తెరువాటుకాఁడు—ఇవి మార్గచోరునకు (దారి కట్టి కొట్టి దోఁచుకొను దొంగకు)పేర్లు

ముడియవిడుపు—ఇది ముళ్లు విప్పెడువానికి (ముడులు కత్తిరించువానికి చొక్కా సంచులలో నగువానినిఁగత్తిరించి ధనము అపహరించువానికి గ్రంథిచ్ఛేదకునకు, గ్రంథిభేదకునకు) పేరు

గండిదొంగ, కన్నగాఁడు—ఇవి సురంగాకారితస్కరునకు (కన్నపుదొంగకు; కన్నము వేసి దోఁచుకొను వానికి) పేర్లు.

బందెకాఁడు—ఇది బందికారికి (బందిపోటుదొంగకు; గుంపుతో వచ్చి నిర్బంధించి దోఁచుకొను దొంగవానికి) పేరు

దొరకోలుసన్నాసి—ఇది వేసములు వేసి నమ్మించి నాఁచుకొనువానికి (వేషధారణాదులచే నమ్మించి మోసపుచ్చి ద్రవ్యాదులను అపహరించుకొని పోవువానికి) పేరు.

తడికద్రోపరి—ఇది కవాటనోదకునకు (ఉతకలు (తలుపులకుసులు) ఎత్తి ఇంటిలో ప్రవేశించి దొంగతనము ఒనరించెడివానికి) పేరు.

తస్కరుఁడు —ఆం భా. ఇచ్చినతక్కినవిశేషవాచకములు గూడ, సాధారణముగా తస్కరవాచకము లనియే విశేషవివక్ష లేక, తక్కిననిఘంటువులు-(వేంక సాంబ.ఆం.సం ) పేర్కొను చున్నవి కత్తెరదొంగ తెక్కలికాఁడు తెర(రు?)వాటు కాఁడు జాజరకాఁడు కన్నగాఁడు గడిదొంగ చేవాఁడికాఁడు దోఁపుడుకాఁడు, దొరకోలుసన్నాసి గరిడిముచ్చు లోవాఁడికాఁ డెడత్రోవ గొట్టెడివాఁడు, ముడియవిడుపు నాఁచు ముచ్చు మాయ దారి నాఁ జోరాభిధలు' (వేంక.మాన.3 .). ఇట్లే (సాంబ మాన 2 ) (ఆం సం మాన.11 ) (ఆం భా ) విశేషవివక్షతో ప్రదర్శించినవానిని సాధారణవివక్షతో ఇతరనిఘంటువులు వచించు ననుట కిట్టినిదర్శనములు చాలఁ గలవు

పొలపరి — జాడ తెలిసినవాఁడు'-అని మాత్రము (శ ర.) కేవలము దొంగ-అనునర్థము గూడ లాక్షణికము గా దీనికి తరువాత నేర్పడిన ట్లొకప్రయోగము వచించు చున్నది- 'కడఁగి కన్నముఁ బెట్ట గడియలు దీయఁ బడమి ద్రవ్యము లెత్త మూలలఁ దాఁగ నాయంత పొలపరి ' (ద్వి నల 4. 267 ) (చూ సూ ని ).

సురంగాకారి —సొరంగము(కన్నము) చేయువాఁడు ('సుఃజ్గామ్-కరోతి'-అని విగ్రహము 'సురజ్గా సూచి మాధయః' అని (అమ )

తడికద్రోపరి —తడిక ద్రోసివేసి లోపలఁ దూరెడిదొంగ-అని (శ ర ) తలుపులు ద్రోసివేసి లోపలఁ దూరెడిదొంగ- అని (సూ ని ) ఆం భా. కవాటనోదకుఁ' డనుట తడిక 'కు

ఈయర్థము కల దనుటకు ప్రమాణ మనినది గడియ విరిచి దూరే దొంగ అని (బ్రౌ) పంచ (4 255 ప) టీక గుడిసెలలో దొంగిలించే అల్పపుదొంగలు' అని అర్థము చెప్పుచున్నది. అనినది (చూ అను)

ముళ్లు — ముడి- (బ) ముళ్లు (ముడి- పి గ్రంథి)

[తెరువాటుకాఁడు — తెరవాటుకాఁ డన (వావి అపముద్రి)]

[జాజరకాఁడు — జాబరకాఁ డనంగ' (వావి ఉపముద్రి)]

[ముడియవిడుపు — ముడియవీడుపు' -అని (బ్రౌ పా) (చూ అను) (రూపాం) ముడి' కి ముదె' (రూపాం) అనవలయును ముడియవిడుప్ప' ముడియవిడుపు (ఆం సం మాన) ము చ్చెత్తుబరికాఁడు]

సీ పరఁగుఁ దెక్కలి యన బందిపోటనఁగను
గిలు బనఁగాను లంకింపు నాఁగ
దావర, మనఁగను దావా, యనంగను
ప్రుచ్చిమి యనఁగను ముచ్చిలి యన
దోఁగురు నాఁగను దోఁపడ మనఁగను
దోఁపుడు నాఁగను దోఁపు నాఁగ
దొంగటిక మనంగ దొంగతన మనంగఁ
జౌర్యంబు చెల్లు వంచన మెసంగు

గీ జుడుఁగు, కుచ్చుకు, కికురు పిక్కు జుణుఁగు మొఱఁగు
డనఁగ, గూఢవసతి పొంచడ మ్మనఁగను
నలరుఁ గికురింపు, కికురింత యనఁగఁ జెల్లు
వంచనకరణ మగుచుఁ జెవ్వందిలింగ

తెక్కలి, బందిపోటు, గిలుబు, లంకింపు దావరము, దావా, ముచ్చిమి, ముచ్చిలి, దోఁగురు, దోఁపడము దోఁపుడు దోఁపు, దొంగతికము, దొంగతనము—ఇవి చౌర్యమునకు (స్తేయమునకు; దొంగపనికి, ఒకరిసొమ్ము అపహరించుటకు) పేర్లు.

జుడుఁగు, క్రుక్కు కికురు పిక్కు, జుణుఁగు, మొఱఁగుడు—ఇవి వంచనకు (మోసమునకు) పేర్లు.

పొంచడము—ఇది గూఢవసతికి (రహస్యనివాసమునకు, దాఁగి వేచి యుండుటకు) పేరు.

కికురింపు కికురింత —ఇవి వంచనకరణమునకు (మోసము చేయుటకు; మోసగించుటకు; నమ్మించి భంగపఱచుటకు) పేర్లు.

బందిపోటు — నిర్బంధపఱిచి కొట్టి దోఁచుట- అని (శ ర.).

దావరము — ఇది ఈయర్థమున (బ్రౌ. శ ర లవే) గ్రహింపఁబడ లేదు.

దావా — దావ' అని (బ్రౌ ) (చూ ఆను ) (శ ర ) ఈయర్థమున దీనిని గ్రహింప లేదు

కికురింపు — 'మోసపుచ్చెను బిక్కచేసెను గికురించె, బమియించె నన వంచనము ఘటించె నం చనుట కెనఁగు' అని (వేంక. మాన 67 )

కికురు — కిక్కురు- (రూపాం ) కికురువెట్టు, మొ .న న్నిటు గ్గిక్కుఘవెట్టఁ జూచెదు చెలీ ' (రసి. 3 90 ) (చూ సూని )

[గిలుబన — గిలు వనఁ ' (వావి అపముద్రి ) ]

[' డనఁగ గూఢనివసతి పొంచడ మనంగ' అని (అపపా ) యతిభంగము అందులకే పై రీతిని సవరింపఁబడిన ది (సూ ని ) ఈ (అపపా ) నే ఉదాహరించినది (చూ పొంచడము ) ]

సీ. బొండ, యనంగను బో, ననఁ గూటయం
క్రాభిధానంబు గాఁ దనరు చుండు;

బందిక ల్లనఁగను బదనశిలాఖ్య యౌ
నుచ్చు, నా నురి యన నొప్పు చుండుఁ
బక్షిబంధనసంజ్ఞ వాగురాభేదంబు
చిక్కమం చనఁగను జెలఁగు చుండు
మీట నా బిస యన మీ యుత్పతనకీల
మలరును జవ యన యంత్రభేద

గీ. మేత మనఁగ ఘటీయంత్ర మెసఁగుచుండు
మో టనంగను దద్భేద మొనరుఁ జేఁద
బొక్కెన యనంగఁ దద్భేద మొప్పు చుండు
భూషితభుజంగి శ్రీమాతృభూతలింగ 293

బొండ బోను—ఇవి కూటయంత్రమునకు (మృగములు ము న్నగువానిని పట్టుటకు ఉపయోగించెడి-కపటయంత్రమునకు ఊయి అప్ప లో నగువానితో అమర్చినదానికి) పేర్లు

బందికల్లు—ఇది బదనశిలకు (బడిగల్లు అనుదానికి, ఊతిబోనునకు బంధనశిలకు పందికొక్కులు లో నగువానిని పట్టెడిదానికి) పేరు

ఉచ్చు ఉరి—ఇవి పక్షిబంధనమునకు (పక్షుల బంధించెడి- ఒకదినుసువలకు) పేర్లు

చిక్కము—ఇది వాగురాభేదమునకు (మృగముల బంధించెడి- ఒకదినుసువలకు) పేరు

మీట బిస—ఇవి ఉత్పతనకీలమునకు (ఎతప్రమాను మొద లగునవి క్రిందికి మీఁదికి ఆడుటకు ఆధార మగుచీలకు యంత్రపుకీలునకు (బెట్టునకు) పేరు.

జవ—ఇది యంత్రభేదమునకు (ఒకవిధమగు యంత్రమునకు) పేరు

ఏతము—ఇది ఘటీయంత్రమునకు(నీళ్ల ఎత్తిపోసెడి- ఒకవిధ మగుజల(పాత్ర) యంత్రమునకు, ఏతామునకు) పేరు

మోట—ఇది ఘటీయంత్రమువిశేషమునకు (కపిలెకు, ఎడ్లను కట్టి తోలి నీరు ఎత్తి పోసెడి- ఒకదినుసుఏతామునకు) పేరు

చేఁద, బొక్కెన—ఇవి తద్భేదమునకు (ఒకదినుసుఘటీయంత్రమునకు; నీళ్ల తోఁడుసాధనమునకు) పేర్లు.

బొండ — తప్పు చేసినవారికాలుసేతులకుఁ దగిల్చెడు దారుయంత్రవిశేషము ద్రుపదము (దీనిని బొండకొయ్య, బొండమ్రాను-అనియు అందురు- అవి (శ ర)

బందికల్లు —దీనిని ఎవరును నిఘంటుకారులు గ్రహింపలేదు బందిగల్లు' ప్రయోగప్రసిద్ధము బందికల్లు (టూపాం) (మి గ్రా.) ఒనవలయును బందిగ ల్లనంగను బదనశిలాఖ్య 'యా' అనుట యిట సముచిత మని పై నిఘంటువు లనుకొనిన వేమో

బదనశిల — బద-స్థైర్యే'-అనుధాతువునకు కరణాధికరణయో శ్చ (3 3 7.) అని కరణార్థమున విష్పన్న మైన ల్యుడంతరూప మిది స్థిరము గా (కదలక మెదలక(బందివి) ఉండునట్లు) ఉంచుటకు సాధన మైనశిల అనిబోను-అని అర్థము (బదనీ-శిలా బదనశిలా. పుంవద్భావము దీని కైనతత్సమము బదనశిల)

ఉచ్చు, ఉరి — మృగముల బంధించుదానికిఁ గూడ ఈపేర్లు గలవు- పెంపుడిఱ్ఱులఁ, గినుకను బెనఁచి పోయి కొమ్ము నుచ్చులఁ దగిలించుకొన్న నరిగి రాజు చూడంగఁ జెప్పంగ రానికడిమి నీటియలఁ గ్రుమ్మి నొంచిరి లేటిమగల' (యయా 2 17) ద్రౌపదీరూప మనునురిఁ దగిలి తనదు హృదయ మనుమృగ మత్తఱి నుదిలకొనుచు' (భాక విరా 2 24) మొ (మూ సూ ని) ఈభాక ప్రయోగమునే ఇచ్చి-ఈ (ఆం భా)ను ఉదాహరించినది (సూ ని) ఉరి, ఉచ్చు'- రెం డర్థములు గలవి ఈ'ఉరి వేఱు- మృగబన్ధని యగు ఆ ఉరి వేఱు కావలయును ఇక్లె- ఉచ్చు

వాగురాభేదము — వాగురా మృగబన్ధనీ' (అమ)

మీట — ఏతపుమ్రానిక్రిందియరభాగము ఏతపుమ్రానిమీఁదిఅరభాగము (మునస), బిస- యంత్రపుకీలు-) ఒని (శ ర) సూ ని బిస కద 'మీఁటు' ఒని ఈ (ఆం భా)

ఉదాహరించి, మీట' గ్రహించి, అచ్చట మీట అనియు ఈ (ఆం భా వే) ఉదాహరించు చున్నది అర్థమును ఇట్లే- ఒకచో యంత్రపుకీలు మఱియొకచో ఏతపుమ్రాను క్రిందికి మీఁదికి నాడుట కాధార మగుచీల అనినది (చూ బిస మీట) ఇట నాకు మీట అనుటయే ఉచిత మనిపించు చున్నది గీట' వంటి దిది (మీటు+అ) అర్థముగాఁ యంత్రపుకీల' (మర) అనుటయే సముచితము బిస-మీట- పర్యాయములు మృగయుండు బిస యొడ్డి సంఘటించినకాలిబోనులం బడి' (స్వా 4 37) ఇచ్చట, బిస యొడ్డి సంఘటించిన=బెట్టు పెట్టి అమర్చినటువంటి- అని టీక (చూ బ్రౌ).

బిస — (బ్రౌ) రత్నాలు పొదగడమునకై సుందర బంగారముతో చేసికొనేగూడు యంత్రభేదము (ఆం భా) అనఁగా బిస-అనినది(చూ. అను) (సూ ని (3) తనంతట తాను తిరుగుయంత్రమునకు లోపల నుండు ప్రధానావయవము(బ్రౌ) అనియు ఒక యర్థ మిచ్చినది)

బొక్కెన — (శ ర) 2 3 అర్థములను దీనికి ఇట్లిచ్చినది (2) నీళ్లు తోడి పోసెడితోలు సంచి 3 నీళ్లు చేఁదెడియినుపపాత్రము

కూటయంత్రము — ఉన్మాథః కూటయన్త్రం స్యాత్ (అమ) బోను పేట్ల గాల' మని కొందఱు -అని(గురు)

ఘటీయంత్రము — ఉద్ఘాటనం ఘటీయన్త్రం సలిలోద్వాహనం ప్రహేః (అమ) నీళ్లు తేడు రాట్నము ఏతము మొద లైనది- అని (గురు)

సీ తంతుసంతతిసముత్పాదనయంత్రంబు
రాట్న, మం చనఁగను రహికి నెక్కుఁ,
దదృద్ధసూత్రంబు తగు వడి యం చన
గిరక నా భ్రమకంబు పరఁగు చుండుఁ
దగుఁ గదు రనఁగఁ దంత్వాధారసూచిక
తూలంబు విలసిల్లు దూది, యనఁగఁ,
దూలమృదూకృతి దోఁచు నేకు డనంగ
నగుఁ దూలకణిక యే కని వచింప,

గీ. వడుకు, డనఁగను దంతుసంభవనహేతు
కక్రియ చెలంగుఁ; దంతువు గాఁ జెలంగుఁ
బోఁగు, పోఁ, చనఁగా; నదె పుత్తడియది
మను సరిగ, యనఁ గండె, నా, మాతృభూత 294

రాట్నము——ఇది తంతుసంతతిసముత్పాదనయంత్రమునకు (దూదినుండి నూలు (దారపుపోఁచలగుంపు) తీయుయంత్రమునకు, నూలు వడికెడి ఏకులరాటనమునకు) పేరు

వడి——ఇది తద్వృద్ధసూత్రమునకు (రాట్నమునకు చుట్టి కదురునకు తగిలించెడి వడిదారమునకు) పేరు.

గింక——ఇది భ్రమకమునకు (నూలిరాట్నముయొక్క చక్రమునకు) పేరు.

కదురు——ఇది తంత్వాధారసూచికకు (రాట్నమున వడికినదారము చుట్టుటకు ఆధార మైనదబ్బనమువంటిసాధనమునకు, తర్కువునకు) పేరు.

దూది——ఇది తూలమునకు (విత్తులు తీసిన పొలముపత్తికి, వస్త్రములు నేయుటకు ఉపయోగించుదానికి) పేరు

ఏకుడు——ఇది తూలమృదూకృతికి (దూదిని మెత్తగాఁ జేయుటకు, చక్కఁబఱచుటకు; విడిపోవునట్లు యంత్రముతో కొట్టుటకు) పేరు.

ఏకు——ఇది తూలకణికకు (నిడివి యైనదూదిముక్కకు, ఏకినదూదిచుట్టకు) పేరు.

వడుకుడు——ఇది తంతుసంభవహేతుక్రియకు (దూదినుండి దారము ఏర్పడునట్లు చేయుపనికి, కదురు లో నగువానినిఁ ద్రిప్పి దూదిని దారము గా ఈడ్చుటకు) పేరు.

పోఁగు, పోఁచ——ఇవి తంతువునకు (దారమునకు; దారపుపోఁచకు, సూత్రైక దేశమునకు) పేర్లు.

సరిగ, కండె—ఇవి పుత్తడిదానికి (బంగారుపోఁచకు జలతారునకు, బంగారుసీరు పోసిన నూలిపోఁగునకు) పేర్లు

తంతుసంతతి యంత్రంబు—దారము విస్తరింపఁ జేయుటను ఒనరుచుయంత్ర మనుట (వేఞ్-తంతుసంతానే- ఇత్యాదులయందు ఇట్టియర్థము సుప్రసిద్ధము తను-విస్తారే ఇత్య స్మాత్ సంపూర్వకాత్ స్త్రియాం క్తిన్ భావే (సంతతిః)

రాట్నము—రాటనము (రూపాం) అని (శ ర) రాట్టము' (రూపాం) అని (బ్రౌ) (సం రహాటము) రాటము' అనికూడ (వ్యవ) దీనికి ఒకకవి దీని నిట్లు వర్ణించి నాఁడు- వడిదారము వెవులం ద్రొక్కుడుపలకయు దండు కదురు గుంజలును ద్రొక్కుడుబొమ్మయును ద్రిప్పుడు పుడకయును గలుగురాట్నములఁ గైకొనుచుఁ' (శుక 2 210)

వడి—దారముపిరి పురిబిగువు పురిబిగువునఁ బడుచిక్కు-అనెడిఅర్థములనే ఇచ్చినది (శ ర.) (సూ ని యు) ఇట్లే (బ్రౌ) కూడ ఈయర్థము దీని కీయ లేదు.

కదురు—నూలు వడికెడిసాధనము తర్కువు- అని (సూ ని) ఈ ఆం భా.కు అర్థము చెప్పినది

దూది—ఇదివఱకు వచింపఁబడినది (చూ 2 280.) అందులకే ఇట ప్రకరణమునుబట్టి వస్త్రములచేఁత కుపయోగించు దూది'గా ఇది వ్యాఖ్యాత మైనది

కంటె—దీనికి (శ ర సూ ని) ఈయర్థమును ఈయ లెదు (బ్రౌ) ఇచ్చినది (చూ.అను).

[గిరక—'గిరుకు'(వావి అపపా)( గిఱక') (ప్రాఁతప్రపా.).]

[భ్రమకంబు — భ్రమరంబు'-(వావి అపపా)]

[పుత్తడియది — పుత్తడి యన' అనియే పాఠ మగపడు చున్నది నాచూచినంతలో అన్వ యము సరి గా లేదు పై రీతిని సంస్కరణీయ మనిపించినది

సీ. అను నాఁ జెలఁగుఁ దంత్వావర్జనాభిధ
దనరు సూత్రము నూలు దార మనఁగఁ

బురి పిరి యనఁగఁ దత్కరణవేష్టన మొప్పుఁ,
జెలఁగుఁ ద్వక్సూత్రంబు నులక యనఁగఁ,
బొలు పొందును త్రిసూత్రి మున్నూ లనంగను,
ముప్పేట, యనఁగను ముప్పిరి యనఁ
దంతుచతుష్కంబు దనరు నెన్నిక, యన,
షష్టితంతువులు పుంజ మన వెలయుఁ,

గీ దాంతవప్రతికృతిపేరు దనరి యుండు
సన్య, యనఁ దంతువేష్టనసాధనంబు
పఱఁగును బరంటె, యనఁగను బంటె, యనఁగఁ
బంట్రకోల, యనంగఁ; జెవ్వందిలింగ 295

ఆసు—ఇది తంత్వావర్జనమునకు (నేఁతపనిలో పడుగు (నిడుపునూలు) తోఁడుటకు ఉపయోగించెడిచట్టమునకు) పేరు

నూలు, దారము—ఇవి సూత్రమునకు (దారపుఁబోఁచలు కొన్ని కలసి యేర్పడినదారమునకు తంతుసమూహమునకు) పేర్లు

పురి, పిరి—ఇవి తత్కరణవేష్టనమునకు (సూత్రము గా (కొన్నిదారపుపోఁచలు కలసినదారము గా) ఒనర్చుటకై పోఁచలను పేనుటకు, పేనుటవలనిగట్టితనమునకు) పేర్లు

నులక—ఇది త్వక్సూత్రమునకు (నార పేనినదారమునకు, మంచ మల్లెడి దానికి) పేరు

మున్నూలు ముప్పేట, ముప్పిరి—ఇవి త్రిసూత్రికి (మూఁడునూలిపోఁగుల దారమునకు, మూఁడుపోఁగులు చేర్చి నేసినదారముల మొత్తమునకు) పేర్లు.

ఎన్నిక—ఇది తంతుచతుష్కమునకు (నాలుగునూలిపోఁగులదారమునకు) పేరు.

పుంజము—ఇది షష్టితంతువులకు (అఱువదిపోఁగులు గలదారమునకు) పేరు

సన్య—ఇది తాంతవప్రతికృతికి (దారములవలన ఏర్పడినబొమ్మకు) పేరు.

పరంటె పంటె పంట్రకోల—ఇవి తంతువేష్టనసాధనమునకు (సాలెవాఁడు నూలు చుట్టెడి-ఒకదినుసుకనిముట్టునకు, పంటెకఱ్ఱకు, పంటెకోలకు) పేర్లు

ఎన్నిక° —(ఎనిక-రూపాం) తంతువాయపరిభాషయందు నాలుగుపోఁగులు కొంతదేశమందు ఐదు పోఁగులు=అని (చి ని)(చూ సూ ని ఎనిక) ఎనికె-(అని) మూఁడు లేక నాలుగు పోగులు కలసినదారము-అని (బ్రౌ)

పుంజము — ముప్పదియెన్నికలనూలు అని (శ ర) పీనిని (శుక) ఇట్లు పేర్కొను చున్నది. ఎన్నికలు పట్టి పుంజంబు లేర్పరించి పంటెకఱ్ఱలు మఱి తో డుపడుగు లాఁచ కండె లొనరించి చాలించి కాఁపుటింతులు (2 424)

సన్య —ఈ పదము (సూ ని శ ర లు) గ్రహింప లేదు (బ్రౌ) గ్రహించి తాంతవప్రకృతి (ఆం భా) అను చున్నది (చూ అను)

సీ. అలరు లాక, యనంగ నరాచ్ఛభిధానంబు,
తగుఁ బడు గనఁగ నాతానసంజ్ఞ
వెలయు వితానంబు పేక యం చనఁగను,
వాయదండము నేఁతపల కనఁ దగు
తొట్టె, నాడె యనంగఁ దురిపేరు విలసిల్లుఁ,
గుంచిక తనరును గుంచె, యనఁగఁ,
బుస్తము చెరి, యనఁ బొలు పొందు, నేఁత యం
త్రము మగ్గ మనఁగను దనరు చుండుఁ

గీ దంతునిస్సరణంబు గఁ దనరు చుండు
వెలుపు డనఁ దోఁడుఁ డనఁగను, వెలయు చుండు
వ్యూతి చన నల్లిక యనంగ నేఁత యనఁగ
భూషితభుజంగ శ్రీమాతృభూతలింగ

లాక—ఇది అచ్చుకు (పడుగునం దక్కడక్కడ గ్రుచ్చెడి వెదురుబద్దకు) పేరు.

పడుగు—ఇది ఆతానమునకు(నేఁతయందలినిడుపునూలికి) పేరు.

పేక—ఇది వితానమునకు (వస్త్రపునేఁతయందలి 'అడ్డ' నూలునకు)పేరు.

నేఁతపలక—ఇది వాయదండమునకు (నేయునప్పుడు నేఁతకాఁడు పడుగు పేకలను ఉగ్గించు(వానిపోఁగులను చేర్చునట్టి) పలకకు) పేరు.

తొట్టె, నాడె—ఇవి తురికి (తంతువాయశలాకకు; నడుమ నూలికండె ఉంచి నేసెడి సాలెవానిసాధనవిశేషమునకు) పేర్లు.

కుంచె—ఇది కుంచికకు (సాలెవాఁడు) పడుగు సరిచేసెడి-ఒకవిధ మగు సాధన మునకు) పేరు.

చెరి—ఇది పుస్తమునకు (వస్త్రము, మట్టికఱ్ఱ, రత్నములు లో నగువానిశిల్పపుఁ బనికి) పేరు.

మగ్గము—ఇది నేఁతయంత్రమునకు (వస్త్రములు నేయుయంత్రమునకు) పేరు.

వెలుపుడు, తోఁడుడు—ఇవి తంతునిస్సరణమునకు(నూలు తోఁడుటకు; నూలు వెడలునట్లు చేసి, దానిని పట్టెకఱ్ఱ మొద లగువానికి చుట్టుటకు) పేర్లు.

అల్లిక, నేఁత—ఇవి వ్యూతికి (వయనమునకు, (వస్త్రాదులు) నేయుటకు) పేర్లు.

లాక —ఇది (బహు ) అని (శ ర త్నా ) ఆం ఖా. ఏకవచననిర్దేశ మొనర్చి ఏకవచనము సు గల దను చున్నది మనప్రయోగవిజ్ఞాన మసంపూర్ణ మగుటకు ఇట్టివి నిదర్శనములు. ఇట (ఏక.) నిర్దేశము అవివక్షితము వివక్షిత మగుచో ఆం ఖా. కంఠోక్తము గా వచించును 'కారంపుఁబడుగులు గండెల కప్పెర, గోలెము లాకలు నీలికడవ ' (హంస 2.11 ) ఈలాకకు అర్థనిర్దేశమునకై ఆం ఖా. ఇచ్చిన 'అర్చా' శబ్దమునకు ఈయర్థమును సం నిఘంటువులు (నా చూచినవి) వచించుట లేదు అన్వేషింపవలయును

వాయదండము — పుంసి వేమా వాయదణ్డః' అని (అమ) (గురు పా) కోకిలు నేయుతా ను
డుపలకపేళ్లు-అని (గురు)

పుస్తము — లప్పము వేయుట లో నగు శిల్పులపని' (లెప్యాదిశిల్పకర్మము) ఽని (దీనికి)
ఽర్థము-ఽని (శ ర సూ ని మొ) సాలెవాఁడు పడుగు చెయ్యడమున్ను-దీపిక-అవి
(ట్రౌ). పుస్తం లేప్యాదికర్మణి' అని (అమ) మృదా వా దారుణా వా ఽథ వస్త్రే
ణా ఽప్యథ చర్మణా లోహరత్నైః కృతం వా ఽపి పుస్త మి త్యభిధీయతే' 'లెప్పపు
పవి మొద లైనదానిపేరు సాలెవాఁడు పడుగు చేయుపనిపే రని కొందఱు' అని
(గురు)

చెరి — వస్త్రము మట్టికఱ్ఱ రత్నము-మొద లగువానితో చేయుశిల్పము-ఽని (సూ.ని)

వ్యూతి — వాణి ర్వ్యూతిః స్త్రియా తుల్యే' (అమ)

[తొఱ్ఱె నాడె — తొఱ్ఱి నాళ' అని (వావి అపపా) పరిపరియచ్చులు చరికుండ
యూడిత, చీడుదెబ్బలు దండె నాడె క్రోవి' (హంస 2 11) (చూ సూ ని)]

సీ. సూది యం చనఁగను సూచి యౌ, నది గొప్ప
యైన దబ్బన మన నలరు చుండుఁ,
గత్తెర, యనఁగను గర్తరి గనుపట్టుఁ
జిత్రము తనరారుఁ జిత్తరు, వన,
రంజన మగు రాణి, రహి రంగు, రక మన
బొమ్మ, యం చనఁగను బుత్త్రిక తగుఁ
బెట్టె పెట్టియ యనఁ బేటిక విలసిల్లు,
మంజూష దనరారు మందస, మన,

గీ నదియె చందుగు నాఁ దగు నల్ప మైనఁ,
బరఁగు స్కంధాటికాఖ్య కావడి యనంగ,
నుట్టి, యన శిక్య మొ ప్పగు, నుగ్గ, మనఁగ
భాండగళబంధరజ్జు వౌఁ, బార్వతీశ

సూది—ఇది సూచికి (గుడ్డలు కుట్టుటకు పూలు గ్రుచ్చుట కది ఉపయోగపడు సాధనమునకు; సన్నని 'ఇనుపకమ్మి'కి) పేరు.

దబ్బనము—ఇది గొప్పసూచికి (పెద్దసూచికి, గోనెలు లో నగునవి కుట్టెడి దానికి)పేరు.

కత్తెర—ఇది కర్తరికి (కత్తిరించుటకు (వస్త్రములు లో నగువానిని ఛేదించు టకు) ఉపయోగపడు 'ఆయుధము' నకు)పేరు.

చిత్తరువు—ఇది చిత్రమునకు (ఆలేఖ్యమునకు, చిత్రపటమునకు; చిత్రము వ్రాసినపటమునకు)పేరు.

రాణ, రహి,రంగు, రకము— ఇవి రంజనమునకు(రాగజనకమునకు; దర్శనాదులవ లన ప్రీతి కలిగించుదానికి, కాంతి, అందము-లో నగుదానికి) పేర్లు

బొమ్మ—ఇది పుత్త్రికకు(పాంచాలికకు, వస్త్ర దంతమృచ్ఛిలాదులతో చేయఁబడిన నరమృగాదులరూపమునకు) పేరు.

పెట్టె, పెట్టియ —ఇవి పేటికకు(సొమ్ములు లో నగునవి ఉంచుకొనుటకై ఇనుము కొయ్య-ము న్నగువానితో చేసినపేటికి) పేర్లు.

మందసము—ఇది మంజూషకు(నిడుపాటిపెద్దపెట్టెకు (ఒకవిధ మగు భోషాణ ము' నకు) పేరు.

చందుగు—ఇది అల్పమంజూషకు (నిడుపాటిచిన్న పెట్టెకు)పేరు.

కావడి—ఇది స్కంధాటికకు (భారయష్టికి;నీళ్లు మొద లైనవి మోసికొని వచ్చు టకై రెండుకొనలయందు ఉ ట్లమర్చిన వెదురుబద్దకు) పేరు

ఉట్టి—ఇది శిక్యమునకు (కావడిమట్టునకు, బరువు ఉంచుటకై కావడికి కట్టు- ఒకవిధ మగుబుట్టకు)పేరు

ఉగ్గము — ఇది భాండగళబద్ధరజ్జువునకు (చేతఁ బట్టుకొని పోవుటకు వీలు గా కడవలు లో నగువానిమూతికి కట్టుత్రాటికి) పేరు

రంజనము — ఇట (బ్రౌ) రంజనము రాణ రహి (ఆం భా) అనినది (చూ అను రంగు) ఇట్లే మంజులము, చొక్కము, చొకాటము, రంజనము, రహి రంగు-(ఆం భా) అనినది (చూ అను రకము) ఈయర్థమును ఆం భా వేఱు గా ఇచ్చినది (చూ 3 14) ఇది వేఱు అది కా దన వలయును (సూ ని) (రంగు) రంజనము రాణ (రకము) రంగు రంజనము-అని ఈ (ఆం భా) ను రెండుచోట్ల ఉదాహరించినది రహి' రాణ' అనువానికి మరల ఈ ఆం భా ను గ్రహించి అర్థము అట ఈయ లేదు రంజనము' అను శబ్దమునకు రంగువేయుట సంతోషపెట్టుట-మొ అర్థములు గల వనిన దిది రఞ్జనో రాగజనకే రఞ్జనం రక్తచన్దనే అని (విశ్వ)

బొమ్మ — పాంచాలిక, వస్త్రదంతాదులచే చేయఁబడిన ఆటవస్తువు అని (సూ ని) (చూ బొమ్మ)

పుత్త్రిక — పాఞ్చాలికా పుత్త్రికా స్యా ద్వస్త్రదన్తాదిభిః కృతా' (అమ)

మంజూష — పిటకః పేటకః పేటా మఞ్జూషా' అని (అమ) ఇచ్చట-రెండువ్యాఖ్యానములు గలవు నాలుగును పర్యాయము లని కొందఱు పిటకః పేటకః వేఱు పేటా మఞ్జూషా' వేఱు అని కొందఱు రెండవవ్యాఖ్యానమునే (ఆం భా) అనుసరించినది (వ్యాఖ్యాద్వయమునకై (చూ సుధ మొ) (గురు) రెండిటిని వేఱు గానే వ్యాఖ్యానించి అన్నియు పర్యాయము లనుట కొందఱమత మనినది

స్కంధాటికాఖ్య — బుజముపై అటు ఇటు తిరుగుచు (ఊఁగుచు) ఉండునది కావడిబద్ద (యోగరూఢమిది)

కావడి — అథ విహఙ్గికా భారయష్టిః అని ఈసందర్భమున (అమ) పేటికావిశేషమునకు కావడిపెట్టె' అని తెలుఁగువారివ్యవహారము కావడిచే కొనిపోవుటకు వీ లైన దిది యగుటచే దీనికీపేరు గలిగిన దన వచ్చును

శిక్యము (ఉట్టి) — పిడతలు లో నగునవి యుంచుటకై దారములతో అల్లి వ్రేలఁగట్టెడి యంత్ర విశేషము (శిక్యము) అని మాత్రము (శ ర) సూ ని కూడ ఇట్టియర్థమే ఇచ్చి కావడిమట్టు' అను నర్థమును ఇచ్చుట మానినది కారణ మేమో శిక్య' శబ్ద

మును 'తదాలమ్బి శిక్యం కాచః' అని స్పష్టముగా వివరించినది (అమ) ఇచ్చట (గురు)కావడిబద్దయందు వ్రేలు ఉట్టిపేళ్లు కావడిమట్టు-అను చున్నది

సీ. పాదరక్షావిధ పరఁగును జె, ప్పన
మలకడ, మ్మనఁగ సమ్మాళి, యనఁగఁ;
దద్విశేషమ్ములు తగుఁ బాయపోసు పా
పో, సూడు, వుద్దము, ముచ్చె, మెట్టు,
కవును, మోజా యనఁగా; నదె జీర్ణ మై
నపుడు పల్కఁబడు నదక, యనఁగఁ,
బావాలు, పావలు, పావకో, ళ్లనఁగను
బాదుకనామము లప్పరఁగు చుండుఁ,

గీ. బొలుచుఁ దోస్త్రాన, మనఁ దోలుపొరలతిత్తి,
కాఱు సందంశకముపేరు కా,అనంగ;
సంబళి, చెలంగు సంబెల, సమ్మెట, యన,
నల్ప మై యున్న నదె సుత్తి, యనఁ దగు, హర 298

చెప్పు మలకడము సమ్మాళి—ఇవి పాదరక్షకు (ఉపానహమునకు, పాదములకు తొడుగుకొనుచర్మపాదుకలకు (తోలుచెప్పులకు) పేర్లు.

పాయపోసు, పాపోసు, ఊడుపు ఉద్దము, ముచ్చె, మెట్ట, కవును మోజా—ఇవి తద్విశేషములకు (ఒక్కొక్కటి ఒక్కొక్కదినుసుపాదరక్షలకు) పేర్లు.

అదక—ఇది జీర్ణ మైనపాదరక్షకు (పాఁతచెప్పునకు) పేరు.

పావాలు పావలు, పావకోళ్లు—ఇవి పాదుకలకు (కొయ్యతో చేసినపాదరక్షలకు) పేర్లు.

తోస్త్రానము—ఇది తోలుపొరలతిత్తికి (అఱలు గలతోలుసంచికి) పేరు.

కాఱు—ఇది సందంశకమునకు (పట్టుకాఱునకు) పేరు

సంబెల, సమ్మెట—ఇవి శంబళికి (సంపెటకు ఇనుము సాఁగఁ గొట్టెడిపెద్దసుత్తెకు) పేర్లు

సుత్తి—ఇది అల్ప మైనశంబళికి (చిన్నసుత్తికి దాగలిమీఁద బంగారు లోనగువానిని ఉంచి సాఁగఁ గొట్టెడిదానికి) పేరు

సమ్మాళి — సమ్మాళిగలు పై వి బ.-అని (శ ర) సంబాళిగలు- (రూపాం) (చూ శ ర)

పాయపోసు — పావా లన గొడుగుపావా లనఁగఁ బాయి పోసు లనంగఁ బాపోసు లనఁగ సమ్మాళిగె లన నుద్దమ్ములు నాఁగఁ జెప్పుఁ ముచ్చె లనఁ మెట్టు లనఁ బాద రక్షాభిధల కొప్పు (వేంక మాన 68) పాయిపోసు' అను చున్న దిది పాయు కూడ నితత్పర్యాయ మను చున్నది (బ్రౌ (చూ అను) (సం పాదపోషః ప్రా పా అపోస) (చూ సూ ని)

ముచ్చె — మీఁగాలు గుడికాలుసైతము కప్పుకొని యుండెడిపాపోసు పార్ష్ణిత్ర- అని (శ ర) ఇట ముచ్చె' కు పర్యాయము గానే పాయపోసు- మొ వానిని గ్రహించి నట్లు దీనిమూలమున విశదపఱచు చున్నది (శ ర)

మోజా — మోచా' (వావి అపముద్రి)

అదక — వ్యుత్పత్తినిఁబట్టి అదుక, అని ఉండ నగు నని (సూ ని)

పావకోళ్లు — ఇట (ఆం భా పా) పావుకో ళ్లనియే కానవచ్చు చున్నది (శ ర సూ ని) పావకోళ్లు అనియే గ్రహించినవి బ్రౌ కూడ పావకోడు- పావకోళ్లు కాదన లేదు పాగ కు పావ (రూపాం) పాగ కు ప్రయోగ మి ట్లున్నది- పాగలు తొడికొని యొకయెల నాఁగయుఁ దానును సభంబునం జని ' (షడ 2 35) (పావలు+కోడు) (త పావకాల్) ఇతరనిఘంటువు లి ట్లను చున్నవి- అలరు పావాలు పావకో ళ్లనఁగ గొడుగు పావ లనఁ బావ లనఁగను బాదుకములు దనరు' (ఆం పద పరి 04) పావాలు పావకో ళ్లనఁ జెల్లుఁ బాదుకాభిఖ్యలు పాయపోసు లూడ్పులు పాపోసు లుద్దెముల్ మెట్లు చెప్పు లన గఁ బాదరక్షలకుఁ దనరు అని (సాంబ మాన 44) పావకోళ్లు' అనియే ఈనిఘంటుపార మిచ్చినది (సూ ని) (చూ సూ ని పావకోళ్లు) పావకోళ్లు అనుట కైన- అపభ్రంశ (వ్యవ) పావుకోళ్లు' అనిపించు

ను (దీనినిఁగూడ (బ్రౌ)ప్రదర్శించినది (వ్యవ) బ్రౌ కాదనదు ఇందులకే (ఆం
భా పా) పావకోళ్ల అనియే అగు నని పించి పై రీతిని పావకోళ్ల అంటిని

తోస్థానము — కృష్ణాజినప్రజింకతిత్తి, కక్షపాల (ఆం దీపి) అని తోసదానము- తోస్థానము- అనికూడ (బ్రౌ.) (మా ఆను)

సుత్తి — సుత్తె-అనియే (బ్రౌ శ ర)

[తోలుపొరలతిత్తి — తోఁకోరలతిత్తి-(వావి అపపా)]

శంబళి — శంబళము-పాథేయము పాథేయం శమ్బలో ఽత్రియాం' వైజ (భూమి శూద్రా) శంబళి-శబ్దమునకు ఈయర్థమును ఏనిఘంటువు లిచ్చినవో తెలియవలయును

సీ తనరును లోహసంతాడనాధారంబు
డాకల్లు పట్టెడ డాకలి యనఁ
బిడిసాన యనఁగను వేధనిక వెలయు,
నొరుగ ల్లనఁగ నికషోపల మగు,
సన్నెక ల్లనఁగను సన్నక ల్లనఁగను
పేషణశిలపేరు వెలయు చుండుఁ
బొత్తర మన దృషత్పుత్రంబు విలసిల్లుఁ
బత్త్రపరశుసంజ్ఞ పరఁగు చుండు

గీ నాకురాయి, యనంగ లోహాతితాప
కుండ మొప్పుచు నుండును గొలిమి, యనఁగఁ,
గొలిమితిత్తి యనంగను జెలఁగు భస్త్రి
భూషితభుజంగ శ్రీమాతృభూతలింగ 299

డాకల్లు పట్టెడ, డాకలి—ఇవి లోహసంతాడనాధారమునకు (లోహములు సాఁగఁ గొట్టుటకు అగసాలి లో నగువారు ఆధారము గా ఉంచుకొనెడి-ఇనుపదిమ్మెకు దాకలికి నిఘాతికకు) పేర్లు

పిడిసాన—ఇది వేధనికకు (కౌయ్యలకును రత్నములకును బెజ్జము వేయుటకు ఉపయోగపడు- ఒకపనిముట్టునకు) పేరు

ఒరగల్లు—ఇది నికషోపలమునకు (గీటుఱాతికి నికషమునకు బంగారు మున్నగునవి పరీక్షకై ఒర పెట్టెడి (గీటుపెట్టెడి) ఱాతికి) పేరు

సన్నెకల్లు సన్నకల్లు—ఇవి పేషణశిలకు (నూఱెడిఱాతికి సనెకల్లునకు సన్నికల్లునకు) పేర్లు

పొత్త్రము—ఇది దృషత్పుత్త్రమునకు (శిలాపుత్త్రికకు పొత్రమునకు, రుబ్బుపొత్రమునకు, నానినమినుపపప్పు లో నగువానిని ఱోటిలోరుబ్బుటకు ఉపయోగించు ఒకగుండ్రనిఱాతికి) పేరు

ఆకుఱాయి—ఇది పత్త్రపరశువునకు (ఇనుము లో నగువానినిఁ దెగఁ జేయుటకై రాచెడి—ఒకపనిముట్టునకు) పేరు

కొలిమి—ఇది లోహాతితాపకుండమునకు (కమ్మరి మున్నగువారు లోహములు కాఁచుటకై నిప్పు ఉంచెడిగుంటకు) పేరు

కొలిమితిత్తి—ఇది భస్త్రికి (కొలిమి ఊఁదెడితోలుసంచికి) పేరు

పిడిసాన — పెడసాన అని (ఆం భా పా) అను చున్న విట (బ్రౌ వావి) పిడిసాన యనఁ గను వేధిని వెలయుచు' అనియే ఇట (సూ ని పా) పార్థునకు నుత్కంపంబు వాటిల్ల దిర్దిర యంచుం బిడిసానచందమున ధాత్రీభాగముం గ్రొచ్చె నయ్యరదం బారభసంబు మానుపఁగ లేఁ డయ్యెఁగా మురారాతియుఁగా (జై భా 5 84) (చూ సూ ని) పిడిసాన అనియే (శ ర మొ.) పిడిసాన అనుటయే ఇట ఉచితమనిపించినది

వేధనిక — ఆస్ఫోటనీ వేధనికా అని (ఉమ సుధా పా) వైధనికా అని ఇట (గురు పా) ఇట వేదనిక' అని(వావి అపముద్రి) వేధిని వెలయుచు' అను (సూ ని పా) సముచితము గాఁ దోఁప లేదు వేదనిక' నే వేధనిక' అంటిని

నికషోపలము —ఇట శాణ స్తు నికషః కషః' అని (అమ) ఇట (సుధ)- 'శ్రీణి సువర్ణ పరీక్షాపాషాణస్య' ఖడ్గాదితీక్ష్ణీకరణ స్యే త్యన్యే అని వ్యాఖ్యానించినది

సన్నకల్లు — సన్నకిల్లు, సన్నికల్లు' గూడ ఉదాహరించినది (బ్రౌ) సన్నకల్లు' ఉదాహరింపక సన్నెకల్లె ఉదాహరించినది (శర) సనె సన్నె అనునవియును 'సన్నెకల్లు' అనుదానికి పర్యాయము లనినది (శర) సన్నగాలి ఇత్యాదులకు మందమారుతము' అనురీతియర్థములు ప్రయోగదృష్టములు సన్న' అల్పార్థకము సన్నకల్లు' అను దాని కైన (రూపాం) సన్నెకల్లు సనెఃల్లు నామైకదేశన్యాయమున వీని కైనపర్యాయములే సన్నె సనె' అని తోఁచినది ఏ మైనను ఆంభా గ్రహించిన సన్నకల్లు' (శర) త్రోసిరా జుటు ఉచిత మనిపించుట లేదు శర ఇట్లే (ఆంభా) గ్రహించినవి విడుచుట నిరాకరించుట జరపినది అట్టివి అచ్చ టచ్చట ఉదాహృతము లై వ్యాఖ్యాతము లైనవి

భస్త్రి — భస్త్రా చర్మప్రసేవికా అని (అమ) భస్త్రా' అనియే అనినవి వైజ మొ గూడ దీనిని అజాదిగణపఠిత మిది కావున అజాద్యత ష్టాప్ (4 1 4) అనుపాణినీయసూత్రమున దీనికి టాప్ ప్రత్యయము విహితము కావున భస్త్రా' అనుటయే సాధువు 'క' ప్రత్యయాంత మైనప్పుడు ఇత్త్వవికల్పము విహిత మగుటనుబట్టి భస్త్రిక, భస్త్రక' అనురెండురూపములును సాధువులు (చూ పాణినీయము-7 3 47) ఆంభా లో ఇట భస్త్రీ అనునది లేఖకప్రమాదమునకుఁ జెందినది భస్త్ర' అనుటవలన ఇచ్చట ఏర్పడు ప్రమాద మేమియు లేదు (సూని) భస్త్రి లనియే (ఆంభాపా) ఇచ్చి భస్త్రి అని వివరణము కూడ నొసఁగినది (చూ క్వాలిమితిత్తి) (సూని) ఇట్లు వచించియు భస్త్రి గ్రహింప లేదు భస్త్ర' అనియే పదగ్రహణ మొనర్చినది భస్త్ర, భస్త్రి' రెండును గ్రహించినది (శర) (బ్రౌ) తోపాటు భస్త్రిక' చూచి భ్రమించిన వివి అందులకే బ్రౌ భస్త్ర భస్త్రి భస్త్రిక అను చున్నది సం. పదగ్రహణమున (బ్రౌ శర లు) ప్రమాణ మనఁ గాదు చాలపట్టులందు ప్రమాదపడిన వివి

సీ త్రాసు తరాను నాఁ దనరును నారాచి
తూనికకోల నాఁ దూనుకోల
యనఁ దులాదండాఖ్య యలరును గల్లె నా
నగుఁ దులామానగుంజాదికములు,

కమ్మి యటంచనఁగా లోహలతి యొప్పుఁ
గమ్మచ్చు నాఁగఁ దత్కరణయంత్రి
మొప్పు దాయి, యనంగ నుద్ఘననామ మౌ
నౌనరు దారుచ్ఛేది యులి యనంగ

గీ. నల్ప మైన నదే సేన మనఁగ సిరవ
మనఁగ విలసిల్లుఁ దంక మొప్పగును గాసె
యులి, యనఁగ వర్ధినికి పేరు వెలయు చుండు
బాడిస యటంచనంగఁ జెవ్వందిలింగ 300

త్రాసు తరాసు—ఇవి నారాచికి (ఎషణికకు నారాచమువలె ఉండు అగసాలెవాని (ఒకవిధ మగు) త్రాసునకు) పేర్లు

తూనికకోల తూనుకోల—ఇవి తులాదండమునకు (త్రాసుయొక్క దండెకు) పేర్లు.

కల్లె—ఇది తులామానగుంజాదికములకు (బంగారు వెండి మున్నగునవి తూఁచుటకు ఉపయోగించెడి గురుగింజ మొదలగువానికి) పేరు

కమ్మి—ఇది లోహలతకు (లోహపుఁదీగకు లోహశలాకకు బంగారు వెండిలో నగువానితీగ తీసెడిపనిముట్టునకు) పేరు

దాయి—ఇది ఉద్ఘనమునకు (చెక్కెడిద్రిమానికి ఊఁత గా క్రింద ఉంచుకొనెడి దుక్క లో నగుదానికి) పేరు

ఉలి—ఇది దారుచ్ఛేదికి (వడ్రంగి కఱ్ఱ తెగఁ గొట్టుటకై ఉపయోగించెడి-ఒకవిధ మగుసాధనమునకు) పేరు

నేనము సిఁవము—ఇవి అల్పదారుచ్ఛేదికి (కొయ్య నఱకుచిన్న ఉలి'కి) పేర్లు

కానెయులి—ఇది టంకమునకు (పాషాణదారణమునకు రాయి తొలిచెడి-ఒక దినుసు ఉలికి ) పేరు

బాడిస— ఇది వర్ధినికి (బాడితకు వడ్రంగి కొయ్యలు చెక్కెడి-ఒకసాధనమునకు) పేరు.

తరాసు —తరాజు (రూపాం ) తః రాజులు రాజులా పెనుతరాజులు గాక ధరాతలంబునన్ అని (అడిదమునూరనచాటువు) (చూ సూ ని ) తూఁచెడిసాధనవిశేషము ఏషణిక' అని (సూ వి )

నారాచి — నారాచీ స్యా దేషణికా (అమ ) త్రాసుపేళ్లు' అని (గురు ) సువర్ణతులా యాః' అని (సుధ )

దాయి —ఇది దాకఁపర్యాయము అని (శ ర ) (చూ దాయి')

[సేనము —సేణము-(వావి పా ) సేనము (బ్రౌ శ ర పా ) చిన్నయుఁ బంగారు నఱకెడి యులి(అని కొందఱు) (ఇది 'సానము -అని కొన్నిచోట్ల వ్రాయఁబడి యున్నది) -అని (శ ర ) ]

సిరవము —ఇది (శ రి మొ ) గ్రహించినట్లు కాన రా లేదు

టంకము —'టఙ్కః పాషాణదారణః' అని (అమ )

వర్ధిని —వర్ధము-ఛేదనము అది కలది మత్వర్థమున ఇని' ప్రత్యయము

బాడిస — వృక్షాదనో వృక్షభేదీ అని (అమ ) కాష్ఠతనూకరణసాధనస్య' అని ఇట (సుధావ్యాఖ్య ) మ్రాఁకులు నఱుకు గొడ్డలి కత్తి ఉలి బాడిస-మొద లైనవానికి పేళ్లు-అని (గురు )

[ఉద్ఘననామ మౌ — మత్ప్రతనాఖ్య యౌ (వావి ఆపపా ) ]

సీ॥ అంప, మనంగను గ్రకచంబు, తరగంపె
యనఁ గరపత్త్రభేదాఖ్య మీఱు
దారునిర్మథనసాధనవిశేషము త్రోపు
దనఁ దటిమెన యన నలరు చుండు

మంగలకత్తి యనంగ క్షురము తగుఁ
గకపాల, యనఁగను గక్షపాల
తనరుఁ గేశోత్పాటి తండస మనఁగను
జిమ్మట యనఁగను జెలఁగు చుండుఁ

గీ దనరి యుండును వస్త్రధావనపదార్థ
సంజ్ఞ చౌకార మనఁగను సబ్బు నాఁగఁ
గమ్మనీ రన నుపజలాఖ్య గఁ జెలంగు
భూతిలసితాంగ శ్రీమాతృభూతలింగ 301

అంపము—ఇది క్రకచమునకు (కరపత్త్రమునకు మ్రానిచెక్కలు లో నగునవి కోయుసాధనమునకు) పేరు

తరంగంపె—ఇది కరపత్త్రభేదమునకు (ఒకవిధ మైనఅంపమునకు) పేరు

త్రోపుడు తఱిమెన—ఇవి దారునిర్మథనసాధనవిశేషమునకు (కఱ్ఱ ము న్నగు వానిని నునుపు చేయుటకును వానిమీఁద నకిషీ పని చేయుటకును వడ్రంగు లుపయోగించెడి-ఒకానొకపనిముట్టునకు) పేర్లు

మంగలకత్తి—ఇది క్షురమునకు (మంగలవాఁడు మంగలపనికి ఉపయోగించెడి కత్తికి) పేరు

కకపాల—ఇది కక్షపాలకు (చంకకు తగిలించుకొనెడిసంచికి, కక్కపాలకు) పేరు

తండసము చిమ్మట—ఇవి కేశోత్పాటికి (తంటసమునకు మంగలవాఁడు వెండ్రుకలు ఊడఁ బెఱికెడిపనిముట్టునకు) పేర్లు

చౌకారము సబ్బు—ఇవి వస్త్రధావనపదార్థమునకు (వస్త్రములమురికి పోఁగొట్టుటకు ఉపయోగించెడుదానికి చవుకారమునకు) పేర్లు

కమ్మనీరు—ఇది ఉపజలమునకు (చలువచేసినబట్టలు తడుపుటకు ఉపయోగించు నీలిమందునీటికి) పేరు

క్రకచము — క్రకచః కరపత్త్రస్స్యాత్' అని (అమ.)

త్రోపుడు — మ్రాను నునుపు పఱచెడువడ్లవానికొఱముట్టు చిత్రిక'-అని (శ బ్ద) (చూ చిత్రిక)

కమ్మనీరు —(బ) కమ్మనీళ్లు- చలువబట్టలు అద్దేనీలినీళ్లు'-అని (బ్రౌ) (చూ అను)

సీ. తిలయంత్రసంజ్ఞ మై యలరు గానుఁగ, యనఁ,
దిలకల్క మలరును దెలికపిండి,
యనఁ, బ్రతిబింబాఖ్య య చ్చనఁగను నీడ
యనఁ జాయ యంచన నలరు చుండుఁ,
గై వడి, కై వశి, కయివడి, కాడుపు
మాదిరి పోలిక మాడ్కి పురుడు
పోలికి యనఁగఁ బొ ల్పొందు నుపమపేరు
ప్రతి మాఱు, బదు, లనఁ బ్రతినిధి యగు,

గీ. సాటి సాటువ తరబడి సవతు, తరము
దీటు సరి, పాటి పోటి యుద్ది యనఁ బాడి,
యీ డనఁగ సదృశాఖ్య లై యెసఁగు చుండు,
భూతిలసితాంగ శ్రీమాతృభూతలింగ

02

గానుఁగ—ఇది తిలయంత్రమునకు (నువ్వు లాది నూనె తీసెడియంత్రమునకు పరంజమునకు) పేరు

తెలికపిండి—ఇది తిలకల్కమునకు (తిలపిణ్యాకమునకు, గానుఁగుఁబిండికి) పేరు

అచ్చు నీడ, చాయ—ఇవి ప్రతిబింబమునకు (ప్రతిరూపమునకు, మాఱు రూపునకు) పేర్లు

కైవడి కైవళి కయివడి కాడుపు మాదిరి పోలిక మాడ్కి పురుడు పోలిక—ఇవి ఉపమకు (సాదృశ్యమునకు సామ్యమునకు) పేర్లు

ప్రతి మాఱు బదులు—ఇవి ప్రతినిధికి (ఒకపని చేయుటకుఁ గా ఐనమఱి యొకనికి) పేర్లు.

సాటి సాటువ తరబడి సబతు తరము దీటు సరి పాటి పోటి ఉద్ది పాడి. ఈడు—ఇవి సదృశమునకు (సామ్యము-సాదృశ్యము- పోలిక గల దానికి కలవానికి) పేర్లు

గానఁగ — గాని'—(వావి అపపా)

మాదిరి, పురుడు —ఇవి సదృశార్థకములు గూడఁ గలవు- ఈడు దిటుసు సాటి మెన దొం సరి జోడు సవతు మాద్రి యుద్ది కత తరంబు వురుడు నాఁగ సదృశమున కివి యాఖ్య లౌ (ఆం సం స్థా 34) మాదిరి' కి (రూపాం) మాద్రి. ఘటికాద్రి కరుగుఁ దచ్చట ఘటికామాత్రమైన మీకుఁ గాంక్షిత మెల్లఁగా ఘటియిల్లు నెంచఁ దగు నా ఘటికాద్రికి మాద్రియద్రి గలదేజగతిఁగా (ఘటికా 2 62) (మా సూ ని)

మాడ్కి —(రూపాం మాడికి) దీనికి విధ మని అర్థ మిచ్చి ఇద్ది దేనితో నైనఁ జేరి ప్రయోగింపఁబడునుగాని వేఱు గా ప్రయోగింపఁబడదు అమ్మాడికి ఇమ్మాడికి చెప్పినమాడికి'-మొ అని (శ ర) (సమాసమందు) ఉత్తరపదముగానే దీనికిప్రయోగము సమాసమునందే ప్రయోగము గలయట్టివానినిఁ గొన్నిటిని ఆం భా ఇచ్చినది (చూ రా' మొ)

ఉపమ — ఉప మోపమానం స్యాత్ అని (అమ) యే నోపమీయతే యా చోపమితిః తయో రేతే నామ్నీ -అని (సుధ)

ప్రతినిధి — ప్రతిమానం ప్రతిబిమ్బం ప్రతిమా ప్రతియాతనా ప్రతిచ్ఛాయా ప్రతికృతి రర్చా పుంసి ప్రతినిధిః అని (అమ) ఈ అమర మందలి ప్రతినిధి శబ్దము - ప్రతిమా పరము ఇది అట్టిది కాదు

ప్రతి —సంస్కృతావ్యయము గ దీనిని గ్రహించి సదాద్యవ్యయములవలె దీనికి ప్రయోగ మెఱుంగునది' అను చున్నది (శ ర.)

సీ. తెఱఁగు చందము, పగిది విత మనంగను
మిాఱుచు నుండుఁ బ్రకారసంజ్ఞ,
బాడిగ కూలి సంబళము, జీత, మనంగ
వేతనసంజ్ఞ యై ఖ్యాతిఁ జెందు,
రోయ యనఁ బైఁడ దన రొక్క మనంగను
వేశ్యాభృతికి సంజ్ఞ వెలయు చుండుఁ,
గల్లనంగ సురాఖ్య చెల్లును, గైపు సా
రాయి సారా నాఁగ రహిఁ దనర్చుఁ

గీ. దద్విశేషంబు, తద్భృత్రి దనరు చుండుఁ
దత్తెర, యనంగఁ జెలఁగు మేదకముపేరు
పెళ్లె, మనఁగను మదసంజ్ఞ యుల్లసిల్లు
మబ్బు లాహిరి, యనఁగను మాతృభూత 303

తెఱఁగు చందము పగిది వితము—ఇవి ప్రకారమునకు (విధమునకు రీతికి) పేర్లు.

బాడిగ కూలి, సంబళము జీతము—ఇవి వేతనమునకు (సేవకులు లోనగువారు చేసినపనికి ప్రతిఫలము గా ఇచ్చినధనమునకు భృతికి) పేర్లు

రోయి పైఁడి, రొక్కము—ఇవి వేశ్యాభృతికి (భోగస్త్రీల కిచ్చుశుల్కమునకు పడుపుఁగూలికి) పేర్లు

కైపు సారాయి సారా—ఇవి తద్విశేషమునకు (ఒకదినుసుకల్లునకు) పేర్లు

తత్తెరం—ఇది తద్భృత్రికి (సారాయి పోసెడితిత్తికి) పేరు

పెళ్లెము—ఇది మేదకమునకు (మద్యము చేయుటకు అనేకవస్తువులు చేర్చి చేసిన పిండికి) పేరు

మబ్బు లాహిరి—ఇవి మదమునకు (మైకమునకు మద్యము త్రాగుటవలన కలిగినమత్తునకు) పేర్లు

బాడిగ —ఒకని యొకనిసొత్తు నుపయోగించుకొనుటకై ఆసొత్తు గలవానికిచ్చెడుధనము అద్దె' అని (శ.ర) ఇట్టివి లాక్షణికములు గా తరువాత ఏర్పడిన-అర్థము లనఁ దగినవి

రొక్కము — విత్తమునకు రూక దనము రొక్క మనంగఁదనరు' అని (సాంబ మాన 48)

కల్లు —దీనిభేదములను (బ్రౌ) ఇట్లు వచించినది- నారికేళకల్లు తాటికల్లు ఈఁతకల్లు, వేపకల్లు అత్తికల్లు క్రొవ్విరికల్లు' (అని)

కైపు — లాహిరి' అను-అర్థముమాత్ర మిచ్చి కైపు' (రూపాం) అనినది (శ ర) (సూ ని) సురాభేదము సారాయి-అని కూడ అర్థ మిచ్చి ఈ అం భా నే ప్రమాణముఁ గాఁ గొనినది

సారాయి —(సం సురా కి సారాయి త మ చారాయి.) (చూ సూ ని) దీనికి (శ ర) మద్యము మదిర, 'మధుపు' కల్లు'-అనియే అర్థ మిచ్చినది (సూ ని) మద్య విశేషము' గూడ అర్థ మని ఈ (అం భా)ను ఇందులకు ప్రమాణముఁ గాఁ గొనినది- సారాయి యొకయేఱు సరవినిఁ బాఱెఁ బాఱెఁ గల్లును నొకపావనతటిని (రం రా ఆ యో)(శ ర) అను చున్నది (సూ ని) (చూ కైపు) (బ్రౌ) ఒకచో సారా వండినకల్లు (దీపిక) అనినది అం భా కడమాత్రము-సీధువు వారుణి అర్థ మనినది విశేషవివక్ష చేయక సామాన్యవివక్షతో అనినమాట లివి-అనిపించును కల్లు-సారాయి, భిన్నములు గానే వ్యవహారమందు దృష్టములు సారా' కుఁగూడ కల్లు' అనెడి-అర్థ ముండవచ్చును అది వేఱు

తద్భృత్రి —(సూ వి వావి) ఇట్లే ఉదాహరించు చున్నవి (అం భా పా ను) తద్భృత్రు' అని ఉండవలయు ననిపించు చున్నది (చూ 2 299వ్యాఖ్య)

సీ లాహిరీవస్తువు ల్కలయఁ జేర్చినమందు
మబ్బురాయుం టన మనుచు నుండు

బంగు గంజాయి, నాఁ బరఁగుఁ గలంజాఖ్య,
యభిని, యం చనఁగ నిర్యాస మొప్పు;
ద్యూతకారాభిధ దోఁచు చుండును జూద
కాఁడు, జూదరి, పందెకాఁ, డనంగ,
సాక్షి యొప్పును సాకి, సాకిరి, కరి. యనఁ;
బూఁటకాఁ, పనఁగను బూట, యనఁగఁ

గీ. దనరు లగ్నకసంజ్ఞ, జూదం. బనంగ
నెత్త, మనఁగను ద్యూతము నివ్వటిల్లుఁ,
బందె, మనఁ బన్నిదం, బనఁ బణము వెలయు;
జట్టికాఁ, డన ద్యూతి యై చను; మహేశః 304

మబ్బురాయుంట—ఇది లాహిరీవస్తువులు కలయఁ జేర్చినమందునకు (మత్తుప దార్థములు బాగుగా చేర్చి చేసినయొకమందునకు) పేరు.

బంగు, గంజాయి—ఇవి కలంజమునకు (కైపు కలుగుటకై గంజాయిపత్రితో చేసినపదార్థమునకు) పేర్లు.

అభిని—ఇది నిర్యాసమునకు (అహిఫేనమునకు; నల్లమందునకు) పేరు.

జూదకాఁడు, జూదరి, పందెకాఁడు—ఇవి ద్యూతకారునకు (ద్యూతకృత్తునకు; జూద మాడువానికి) పేర్లు.

సాకి, సాకిరి,కరి—ఇవి సాక్షికి (ప్రత్యక్షద్రష్టకు. ఏవిషయము నైనను జెప్పఁగా వినుటగాక కన్నులతో కాంచినవానికి) పేర్లు.

పూఁటకాఁపు, పూఁట—ఇవి లగ్నకునకు (ప్రతిభువునకు; ఒకనికి మాఱుగా వానిపని నేను జేసెదననిపూనినవానికి (ఋణాదులయందు ప్రతినిధి గా ఉండువానికి) పేర్లు.

జూదము నెత్తము—ఇవి ద్యూతమునకు (జూజమునకు పాచికలాటకు) పేర్లు

పందెము పన్నిదము—ఇవి పణమునకు(గ్లహమునకు జూదము నోడగువానియందు ఓడెడువాఁడు గెలిచెడివాని కిచ్చునట్లు పంత మాడి పెట్టెడుధనాదికమునకు) పేర్లు

జట్టికాఁడు—ఇది ద్యూతికి (సభికునకు జూద మాడించువానికి) పేరు

మబ్బురాయుంట — (మబ్బు+ రాయి+ ఉంట) మత్తువస్తువులు కలిపి చేసినమందు మచ్చువగలు చేయుమబ్బురాయుంటల మేపులును' (ప్రబంధ. 78 )'అని (సూ ని )

అభిని — (వై గ్రా వి ) అని (శ ర )

నిర్యాసము —దీనికి నల్లమందు అనునర్థ మును నాచూచినవిఘంటువు లీయ లేదు

లగ్నకుఁడు — స్యు ర్లగ్నకాః ప్రతిభువః' (అమ ) ప్రతిభూ ర్లగ్నకో ఒన్తరః' అని (వైజ ) అప్పు తీసికొన్నవానికి ప్రతి గా ఉండువానికి- పూఁటపడువానికి - అని (గురు )

ద్యూతము — ద్యూతో ఒస్త్రియా మక్షవతీ తద్భేదాః పక్షికాదయః' అని (వైజ భూమి· ఖూద్రా ) కొన్నితెలుఁగుద్యూతములనామము లొకకవి యిట్లు వచించినాఁడు- స్తోకా దొప్పియు నెత్తముఁగా మొదలు గా జూదంబు లి వ్వాడున వ్వేశన్ '(జై భా 3 42 )·

ద్యూతకారుఁడు — సభికా ద్యూతకారకాః అని (అమ ) ఇట ద్వే యే ద్యూతం కార యన్తి తేషామ్' అని (సుధ ) ఆం భా ప్రయోగించిన- ఈ ద్యూతకార' శబ్దము ద్యూతం కరోతి- (కర్మణ్యణ్ 3 2 1 ) ద్యూతకారః(ద్యూతకృత్) జూద మాడు వాఁడు' అనుఅర్థము కలది ( కుమ్భకారః' అనుదానివంటిది). ఇది వేఱు

ద్యూతి — (అమ ) సభికుఁడు' అనినవానినే ( ఆం భా ) ద్యూతి అనిన దనిపించు చున్నది. ఇచ్చట ద్యూతి' శబ్దమునకు అత ఇనిఠనౌ' (5 2. 115 ) అని ఇఁ ప్రత్యయము స్వస్వామిభావసంబంధమున విహితము ద్యూతస్వామి' ఈశబ్దమునకు అర్థము ధనము గొని జూద మాడించువాఁ డనుట పర్యవసితార్థము

[సాకి — సాకె (వావి. అపముద్రి)]

[ బూట యనఁగ   బూఱ యనఁగ ' (వావి అపముద్రి)]

సీ అష్టాపదాభిధ లగుఁ జదరంగపుఁ
బలక నా నెత్తపుఁబలక నాఁగఁ,
జదరంగ మనఁగను జతురంగ మొ ప్పగు
నిష్టజనద్యూత మెసఁగు చుండుఁ
బగడసాల యనంగ భాసిల్లు చుండును
బాశె యం చన శారిఫలముపేరు
సారె, యం చన నడ్డసారె యం చనఁగను
సొగట మం చనఁగను దగును శారి

గీ పాచిక యనంగఁ గవఱ నాఁ బాశక తగుఁ
బరఁగు నేకవచనమునఁ బగడ యనఁగ,
దుగ యనఁగ రెంచ యనఁగను దోఁచు ద్విక ము
భూరిభవభంగ శ్రీమాతృభూతలింగ 305

చదరంగపుఁబలక నెత్తపుఁబలక—ఇవి అష్టాపదమునకు (ప్రతిపంక్తిని ఎనిమిది గదులు గల-ఒకవిధ మగు ఆట పలకకు) పేర్లు

చదరంగము—ఇది చతురంగమునకు (ఒకానొక ఆట కు (కరి తురగ రథ పదాతులు-అను నాలు గంగములు కలదానికి) పేరు

పగడసాల—ఇది ఇష్టజనద్యూతమునకు (నెచ్చెలులు గలసి ఆడెడిద్యూతమునకు) పేరు

పాశె—ఇది శారిఫలమునకు (జూద మాడెడి-పలకకు- లేక గుడ్డకు) పేరు

సారె అడ్డసారె సొగటము—ఇవి శారికి (జూద మాడెడుసారెకు సొగటాల పాచికకు) పేర్లు

వాచిక కవలు—ఇవి పాశకకు (పగడసాలకాయకు పావునకు) పేర్లు

పగడ—ఇది ఏకవచనమునకు (ఒకటిని చెప్పెడిదానికి జూదమునందు ఉపయోగించు-ఒకటి అనుసంఖ్యకు) పేరు

దుగ, రెంచ—ఇవి ద్వికమునకు (ద్వయమునకు జూదమునందు ఉపయోగించు రెండు అనుసంఖ్యకు) పేర్లు

అష్టాపదము — అష్టాపదం శారిఫలమ్ (అమ)

ఇష్టజనద్యూత మెసఁగు — నష్టజనద్యూత మలరు చుండు (వావి అపపా)

శారిఫలము — తద్ద్యూతాస్తరణము సొగటాలపాళీ మొదలైనది-అని (బ్రౌ)

సారె — సారె పండఁగ మేలు సమకూరు' (తారా 4 97) (టీ) సారె' అనఁగా పగడసాలకాయ' అని (బ్రౌ)

అడ్డసారె — సొగటాలపాచికలు అని (బ్రౌ)

పాశక — పణో గ్లహో దేవన స్తు పాశకో ఽక్ష ఽథ శారయః శారా స్స్యుః' అని (వైజ (భూమి శూద్రా) (గ్లహ ఏవ గ్లాహః ప్రజ్ఞాద్యణ్) పాశకము' అను దానికి చరిత్రాదిగణపాఠమున ముపర్ణకలోపము

[రెంచ — రేచ' (వావి అపపా) రెంచ (ద్వికము దుగ) అని (బ్రౌ పా) (చూ అను) రెంచ అనియే (శ ర)]

సీ తిగ ముచ్చ యనఁగను త్రికముపేరగుఁ దిగ
వంచ చౌకమ్ము, తీపంచ యుడ్డ
యనఁగఁ జతుష్కాఖ్య యగును జౌవంచ నాఁ
బంచకాభిధ గాను బరఁగు చుండు,
నిత్తిగ చ క్కన నెసఁగును షట్కంబు
సత, యన విలసిల్లు సప్తసంఖ్య
దచ్చి, యం చనఁగను దనరు నష్టకసంజ్ఞ
బార యనం దగు ద్వాదశకము

గీ నరయ నీరీతి ద్యూతసంఖ్యలు చెలంగు
కోడిపోరును మఱియును గొన్ని గలవు
అదియ పో ప్రాణవద్ద్యూత మౌ దయైక
పూరితాపాంగ శ్రీమాతృభూతలింగ 306

తిగ ముచ్చ—ఇవి త్రికమునకు (మూఁడిటికి) పేర్లు

తిగవంచ చౌకము తీవంచ ఉడ్డ—ఇవి చతుష్కమునకు (నాలుగిటికి) పేర్లు

చౌవంచ—ఇది పంచకమునకు (ఐదిటికి) పేర్లు

ఇత్తిగ చక్కు—ఇవి షట్కమునకు (ఆఱింటికి) పేర్లు

సత —ఇది సప్తసంఖ్యకు (ఏడిటికి) పేరు

దచ్చి—ఇది అష్టకమునకు (ఎనిమిదిటికి) పేరు

బారం—ఇది ద్వాదశకమునకు (పండ్రెండింటికి) పేరు [ ఈరీతి ద్యూతసంఖ్యలు చెలంగు -ఇవ్విధము గా ఇవి జూదమునందు ఉపయోగపడెడు సంఖ్యలకు పే ర్లై ఒప్పు చున్నవి కోడిపోరును మఱియును కొన్ని గలవు ఇవి ప్రాణిద్యూతములు ]

అడ్డ —( అడ్డ అని వావి సూ ని పా ) అడ్డ అని (సూ ని ) ఒక్కటియే ఈ-అర్థమున దీనిని గ్రహించినది (బ్రౌ శ ర లు ) దీనిని గ్రహింప లేదు గ్రహించిన (సూ ని ) వేఱు ప్రమాణ మేదియు చూప లేదు (సాంబ వేంక ) ఈసందర్భమున ఉడ్డ అనియే వచించు చున్నవి- నా ల్గుడ్డ తీవంచ నలు నాఁ జతుస్సంఖ్య వఱలు (వేంక మాన 52 ) 'చా యుడ్డ తీవంచ చౌకము జతుర్నామముల్ (సాంబ మాన 29 ) ఇట్లే (ఆం సం మాన 43 ) ఆం భా ద్యూతపరిభాషకుచెందిన వనిన సంఖ్యలే చాలవఱకు వచింప బడు చున్న విట ఆం భా విశేషవివక్షతో వచించినవానికి తరువాత లాక్షణికము గా ఏర్పడిన- అర్థమునకు వాచకములు గా(సామాన్యవివక్షతో) వచించుట ఈనిఘంటువుల స్వభావము ఉడ్డ (ఆం భా పా ) లను చున్నది (బ్రౌ ) (చూ అను) ఇందులకే (సూ ని పా )గ్రహింపక (బ్రౌ పా )నే నేను గ్రహించితిని సాధారణవాచకములు గాఁ గూడ ఇవి ప్రయోగములందు కానవచ్చు చున్నవి- ఎలపటనుండి చౌవంచమోములదునే

దారి (ఉ రా 8 295)(చూ సూ ని) అమరసుధాకారుఁడు- నాట్యోక్తౌ ఇత్యధికారస్య ప్రాయికత్వా దమ్బాదీనాం కేషాం చి దన్యత్రా ఽపి ప్రయోగః' అనుట యిట స్మరణీయము ఈసుధావ్యాఖ్యకు పైని నావచించినదే తాత్పర్య మన వచ్చును

సీ బొంగర మనఁగను బొమ్మర మ్మనఁగను
 భ్రమరాభిధానమ్మ పుఁగు చుండు
నక్షోపల మ్మగు నచ్చనగ ల్లనఁ
 జిఱుతనగోడు నాఁ జెలఁగు దీర్ఘ
ఖర్వకాష్ఠక్రీడ గంజనగా లన
 ఖంజపాదక్రీడ గాఁ జెలంగు
నక్షిమీలనకేళి యలరు దాఁగిలిమూఁత
 యనఁగను మూసిగం, తని యనంగఁ

గీ బరఁగు క్షేపణి పోటనబంతి యనఁగఁ
గేరు చుండును గీరనగింజ నాఁగ
రేఖికాబీజకేళి గౌరీముఖాబ్జ
ముదితదృగ్భృంగ శ్రీమాతృభూతలింగ 30~

బొంగరము బొమ్మరము—ఇవి భ్రమరమునకు (గుండ్రగా త్రిప్పుచు బాలు రాడుకొనెడి-ఒకవిధ మగు ఆటవస్తువునకు) పేర్లు

అచ్చనగల్లు—ఇది అక్షోపలమునకు (గిరియకమునకు గిరీయకమునకు (అచ్చనగాయ లాడుటకు ఉపయోగించెడిచిన్నగుండుఱాతికి) పేరు

చిఱుతనగోడు—ఇది దీర్ఘఖర్వకాష్ఠక్రీడకు (బిల్లగోడాటకు, కఱ్ఱముక్కను నిడు పైనకఱ్ఱతో కొట్టి ఆడు-ఒక యాటకు) పేరు

గంజనగాలు—ఇది ఖంజపాదక్రీడకు (కుందికాళ్లాటకు ఒకకాలు మడిచి యుంచి కుంటివానివలె మఱియొకకాలితో కుంటుచు ఆడుఒకయాటకు) పేరు

దాఁగిలిమూఁత కనుమూసిగంత—ఇవి అక్షిమీలనకేళికి (కన్నులు గప్పి ఆడెడి ఒకయాటకు) పేర్లు.

పోటనబంతి—ఇది క్షేపణికి (పుట్టచెండునకు వస్త్రము లో నగువానితో చేయఁబడి ఎగురఁగొట్టుచు ఆడెడిబంతికి) పేరు

గీరనగింజ—ఇది రేఖికాబీజకేళికి (బాలిక లాడు-ఒకవిధ మగుఆటకు గీఁతలయందు గింజ లుంచుచు-ఆడెడిదానికి పులిజూదమువంటిదానికి) పేరు

అక్షోపలము —అక్షము-బండిచక్రము దానివలె గుండ్ర నైన ఉపలము రాయి-అని (వ్యు ) కావచ్చును

[చిఱుతనగోడ — చిఱుతనగోటి అని (వావి అపపా )]

గీరనగింజ — గీరనంగింజ (రూపాం ) ( గీరణగింజ - అచ్చనకాయలు అని ఒకచో (బ్రౌ ) అచ్చనకాయలు గీరనగింజలు-వేఱు గా నగపడు చున్నవి- దినము ల్కొన్ని బొమ్మపెండ్లిండ్లు గుజ్జనగూళ్లచ్చనగండ్లు పింపిళులు కుచ్చెళ్ల గీరనంగింజ లో మనగుంటల్ కనుమూసిగంతనలు కంబాలాట లో నైనఖే లనము ల్మిగులఁగ బోట్లతో నలరె బాలారత్న మెల్లప్పుడున్' (కళా 6 202 ) (చూ శ ర అచ్చనగండ్లు )

[రేఖికా — రేకికా -(వావి అపముద్రి ) అచ్చనగండ్లవలె గచ్చకాయలవలె చింతగింజలు లో నగువానితోఆడెడి-ఆట కావచ్చు నిది వర్ణన ఇ ట్లున్నది- చారుచిరత్నరత్నమయ సౌధములం బురివైశ్యకన్యకల్ గీరనగింజ లాడుతఱిఁ గ్రిందను జిందినదివ్య రత్నముల్ పౌరులు త్రొక్కుచుం జనఁగఁ బాదుకొనన్ ధరణీపురంధ్రికిన్ వారక రత్నగర్భ యనునామము పెట్టిరి సత్కవీశ్వరుల్' (శకాం 2 19 ) (చూ శర గీరనగింజ )

గీ శ్రీలు వెలయంగ నీపేరఁ జేయుకతనఁ
బరఁగు శాశ్వతము గ శూద్రవర్గ మిట్లు
గైకొనుము దీని భక్తసంఘాభిమాని
మాతృభూత జగత్త్రయీమాతృభూత 308

[చూ వ్యాఖ్యాకై స్వర్గ 68]

ఇది

శూద్రవర్గము

ఉ రంగమహీనిషంగమధరాధరశృంగమ సహ్యజామరు
త్సంగమ హృష్యదంగమ భుజంగమరాజసుతామనోబ్జినీ
భృంగమ పాదపద్మనుతగృధ్రవిహంగమ చంద్రమఃకలా
లింగమ మాతృభూతశివలింగమ దైత్యవిభంగచంగమా 309

ద్వితీయకాండసమాప్తిని నివేదించుచు సంబోధించు చున్నాఁడు కృతి భర్తను కవి

అర్థ — రంగమహీ నిషంగమధరాధరశృంగమ - శ్రీరంగస్థలముయొక్క మిక్కిలికలయిక గల (దానికి మిక్కిలిచేరువలో నున్న అనుట) పర్వతమునకు శిఖర మైనవాఁడా (ఆకొండకుఁ జాలపైభాగమున ఉన్నవాఁడా యనుట) సహ్య జామరుత్సంగమహృష్యదంగమ - కావేరీనదినుండి వచ్చుగాలియొక్క సంస్ప ర్శనమున ఆనందపడు చున్నశరీరము(మూర్తి) కలవాఁడా భుజంగమరాజసుతా మనః + అబ్జినీ భృంగమ-సర్పరాజుయొక్క కొమార్తె యైనసుగంధికుంతలాం బయొక్క హృదయ మనెడిపద్మమునకు తుమ్మెద గా ఐనవాఁడా(ఆమెమనస్సునం దెప్పుడు పరమప్రీతితో సంచరించువాఁడా యనుట) పాదపద్మనుతగృధ్రవిహం

గమ-పద్మములవంటి (నీ) పాదములను స్తుతించు చున్నగ్రద్దపక్షి కలవాఁడా చంద్రమఃకలాలింగమ-చంద్రరేఖ చిహ్నము గాఁ గలవాఁడా (చంద్రశేఖరుఁడా యనుట). దైత్యవిభంగచంగమా-రాక్షసుల నాశనమందు దక్షుఁడా మాతృభూతశివలింగమ- (లింగాకారము ధరించిన మాతృభూతుఁ డనుశివుఁడా యనుట) (వినుము)

తా —శ్రీరంగమునకు త్రిశీర్షపురము (తిరిచినాపల్లి) చాలసమీపమందున్నది దానికి శిఖర మనునట్లు తదుపరిభాగమున నున్నాఁ డీస్వామి శ్రీరంగమునకు రెండుప్రక్కలను గావేరి ప్రవహించు చున్నది అనడుమ నున్నయొక దీవియె శ్రీరంగము. ఈయుభయకావేరీమధ్యమున వెలసియున్నస్వామియే శ్రీరంగస్వామి దీనితీరమునఁ బూగవనాదులు పరిమలములఁ గ్రుమ్మరించుచు వెలసియున్నవి ఆసువాసనలతోడి (దీని)చల్లనిగాలులు నిత్య మీలింగమూర్తిని సేవించుచు ఆదేవునకు మహానందము గలిగించు చున్నవి సుగంధికుంతలాంబ ఆదిశేషుని కొామార్తె ఆమె హృదయేశుఁ డీతఁడు తనపాదసేవచే (పశు) పక్ష్యాదులనునైత ముద్ధరించెడిదయాళు వీదేవుఁడు. త్రిపురాసురాదిమహాసురుల నెందఱనో వధించి లోకరక్షణ మొనర్చినాఁ డిస్వామి

విశే —శ్రీరంగమును శ్రీరంగేశుని కవికర్ణరసాయన' మిట్లు వర్ణించినది - ఉభయకావేరీ మధ్యంబునఁ జంద్రపుష్కరిణీతీరంబున శ్రీరంగనామధేయదివ్యగృహస్థుం డై (పీఠి 9 ) ద్వివిధోభయ దిక్ప్రవహ త్కవేరకన్యాతటోపగతపూగవనీ నవకుహళీపరిమళవహ పవనోపాస్యునకు వికచపద్మాస్యునకున్' (కవి ర పీఠి 95 ) నిషఙ్గమ (ని+ సఙ్గమ) వేలనే సఙ్గసఙ్గమౌ (వైజ) (నితరాం సఙ్గమః యస్య ) చఙ్గ- చఙ్గ శ్శోభన దక్షయోః -(విశ్వ ) సహ్యజా-సహ్యపర్వతమునుండి పుట్టినది కావేరి కులపర్వతములలో సహ్య మొకటి శేషో ఽనన్తో నాగరాజ స్సర్పరాజ స్తు వాసుకిః సర్పోద్విరసనో వ్యాలో భుజఙ్గో ఽహి ర్భుజఙ్గమః' అని (వైజ పాతా సరీ ) ఈ వైజయంతిని(బట్టి చూచిన భుజంగరాజ శబ్దము వాసుకినే వచింపవలసి యున్నది ఈ వ్యవస్థను బాటింపనికవులును జాలమంది గలరు

పృధ్వి. పటీకృతహరిత్తటీ స్ఫటికనిర్మలస్వాకృతీ
స్ఫుటీకృతగుణవ్రజా పుషితసర్వలోకవ్రజా
ఘటీకృతఝరీపయఃకణనిరన్తరార్ద్రీభవ
త్తటీభవనఖేలనా ధరణిభృత్సతీమేలనా 30

అర్థ—పటీకృత హరిత్ తటీ-(కట్టు)వస్త్రము గా ఒనర్పఁబడిన దిక్ప్రదేశములు గలవాఁడా దిస్సమొలవేల్పా (వస్త్రము లేనిమొల గలవాఁడా యనుట) స్ఫటిక నిర్మల స్వ+ ఆకృతీ- స్ఫటికమణియట్లు స్వచ్ఛము (తెల్లనిది) ఐననిజాకారము గలవాఁడా స్ఫుటీకృతగుణ వ్రజా-(లోకమునకు) బాగుగాఁ దెలుపఁబడిన సుగుణసమూహము గలవాఁడా (త్రిపుర సంహారాదులచే ఈతనిపరాక్రమాదులు లోకమునకు విశదము గాఁ దెలియనైన వనుట) పుషితసర్వలోక వ్రజా—రక్షింపఁబడిన- సమస్తలోకసముదాయము (పదునాలుగుభువనము లనుట) కలవాఁడా లోకరక్ష కాధారములగునష్టమూర్తులను ధరించినమహాదేవుడా యనుట లేదా-లోకస్థితి కాధార మైనవాఁడా అనుట.) ఘటీకృతఝరీపయఃకణనిరన్తర +ఆర్ద్రీభవత్ తటీభవనఖేలనా—కుండలు గా చేయఁబడినసెలయేళ్లయొక్క నీటి బిందువులచే ఎల్లప్పుడు తడిసినవి గా అగు చున్నవానితీరము లనెడిభవనములందు (క్రీడామందిరములందు) విహరించువాఁడా (కొండలపైఁ బాఱు చున్న సెలయేళ్లనుండి చిందిపడుతుంపరలచేఁదడిసి కుండలతో నీళ్లు చల్లి చల్లఁబఱచినట్లు చల్లఁగా ఎల్లప్పు డుండెడివానితీరములందు (చంద్రకాంతశిలాక్రీడామందిరములం దట్లు) విహరించెడివాఁడా అనుట (లేదా తీరమందలిభవనమందు (ఆలయమందు)సంతోషముతో ఉండువాఁడా అని చెప్పవచ్చును) ధరణిభృత్సతీమేలనా—పార్వతియొక్క కలయిక కలవాఁడా (సామేనఁ బార్వతిని ధరించినయర్ధనారీశ్వరా యనుట) (దీనికి పైవచనములోని ద్వితీయకాండము ఇది (సంపూర్ణము) అను దానితో అన్వయము ఇది-అనునది సమాప్తిద్యోతకము) (చూ. .169వ్యా ).

విశే — భైరవుఁడు దిగంబరుఁడు ఈతఁడు శివాంశసంభూతుఁడు ఇందువలననే శివుఁడు' భైరవుఁడు- భైరవః పుంసిశఙ్కరే భీషణేత్రిషు అని (సుధ) కాళిదాసు శివునిఁగూర్చి- 'పప్రచ్ఛురూపాహుమలక్ష్యజన్మతా దిగమ్బరత్వేన నివేదితం వసు'- అనినాఁడు- (చూ కు సం 5 72) అష్టమూర్తులతో సర్వలోకధారణ మొనరుచుచున్నట్లు శివుని వర్ణించినది కుమారసంభవము- కలితాన్యోన్యసామర్థ్యైః పృథివ్యాదిభిరాత్మభిః యేనేదం ధ్రియతే విశ్వం ధుర్యైర్యానమివాఽధ్వని' (6 72)

ఆలం — చాపకము

## గద్యము

ఇది శ్రీమత్పరమేశ్వరకరుణాకటాక్షసంప్రాప్త సర్వజ్ఞత్వాదికతిపయగుణస్వసామ్య తదితరసకలగుణనిరౌపమ్యాసేతుహిమాచలఖ్యాత మహోద్దండకవిబిరుదప్రశస్త సీతారామార్యవర్యతనూజాత శౌర్యధైర్యస్థైర్యాదిసకలగుణచిరత్నరత్నరత్నాకరాశ్రితజనశ్రీకర కోటిసమాఖ్యవంశసుధాపయోధిరాకాశశాంక ఘంటికాతురగ నీలాతపత్ర హనుమద్ధ్వజ మకరకేతన దివాదీప నవవిధభేరి కాదినిఖిలబిరుదాంక బృహదంబికాకటాక్షసంజాతసామ్రాజ్యధురంధర విమలయశోబంధుర కర్ణాటచోళపాండ్యమహీపాలాదిసంస్తూయమాన శ్రీరాయరఘునాథమహీనాథ సభాంగణబిరుదాయమానార్యనుతచర్య వేంకనార్యప్రణీతంబైన

యాంధ్రభాషార్ణవంబునందు

ద్వితీయకాండము

సంపూర్ణము

---

(ద్వితీయ) కాండము ముగించుచు స్వవృత్తాంతకథనముతోఁ గవి తత్పరిసమాప్తినిఁ గృతిభర్తకు నివేదించుకొను చున్నాఁడు (చూ- పై- గద్యవ్యాఖ్యకై- 1కాం 197-201)

ఇది

శ్రీవేంకటపార్యపుత్త్ర వేంకటసుబ్బమాంబాగర్భశుక్తి ముక్తాఫల, కావ్యకలానిధి
'మహీశూరమహారాజాస్థానమహావిద్వత్కవి శ్రీచిదంబరకవీంద్రభాగినేయ,
శ్రీపరమేశ్వరీకృపాసముపలబ్ధశాస్త్రసాహితీవైదుష్య మధురావిజయ
కాశీఖండాది సంస్కృతాంధ్రమహాకావ్యవ్యాఖ్యాన సత్కావ్య
రచనాసువిదితప్రజ్ఞావిశేష సాహిత్యాలఙ్కార'
సహస్రావధాని విద్వత్కవివతంస

**పోతుకుచ్చి సుబ్రహ్మణ్యశాస్త్రి**

విరచితం బైన

చంద్రికావ్యాఖ్యానమున

ద్వితీయకాండము

సంపూర్ణము



